# వ్యాస సాహితీ సంహిత

వేదవ్యాసుని సాహిత్యంపై

ప్రసిద్ధాంధ్ర సాహిత్యవేత్తలు

డా॥ దివాకర్ల వేంకటావధాని, డా॥ ప్రసాదరాయ కులపతి
డా॥ రత్నాకరం బాలరాజు, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి
డా॥ ఎస్. వి. రఘునాథాచార్య, డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు
డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ,
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారల

ఉపన్యాస వ్యాసమంజరి

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**VYASA SAAHITHI SAMHITHA**

A Collection of Lecture-Essays on
BHAGAVAN VEDA VYASA'S CONTRIBUTION
TO THE WORLD OF LITERATURE

By

Dr. Divakarla Venkata Avadhani, Dr. Prasadaraya Kulapati, Dr. Ratnakaram Balaraju, Dr. Dhulipala Sriramamurthy, Dr. S. B. Raghunathacharya, Dr. K. Ghanasyamlaprasadarao, Dr. P. Ramachandrudu, Sri Gunturu Seshendra Sarma, Sri Kesavapanthula Narasimha Shastry



ప్రచురణ సంఖ్య : 110
ప్రథమ ముద్రణ : జనవరి 13, 1985
ప్రతులు : 4,200
ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు
ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైద్రాబాద్.
ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైద్రాబాద్.

ప్రతులకు :
యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001

వెల : రూ. 20-00

[ప్రచురణ పూర్వ విరాళం రూ. 12/-; సాహితీ మిత్ర పథకం సభ్యులకు రూ. 10/- లకు అందజేయబడినది.]



# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికి అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలు అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరవై ఏళ్ళుగా, పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూటపది పుస్తకాలను ప్రచురించింది ఉపన్యాస మంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ, తక్కువ వెలకు ఎక్కువ విలువున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలు వెలువరిస్తున్నదేగాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకొనేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1200 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు,
జనవరి 13, 1985.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి.

# ప్రేరణ

భారతీయుల కవితా ప్రతిభకు సంకేతం వాల్మీకి రామాయణం. భారతీయుల బహుముఖీన విజ్ఞాన సంపదకు సంకేతం వ్యాసమహర్షి ప్రసాదించిన పురాణేతిహాసాలు. వాల్మీకినీ వ్యాసుణ్ణీ అధ్యయనం చేయని వాడు భారతాత్మను దర్శించలేడు. పుట్టినది మొదలు గిట్టు వరకు భారతీయుల బ్రతుకులను, ఆలోచనలను ప్రత్యక్షంగానో పరోక్షంగానో నేటికిని ఈ మహా మనీషుల సందేశాలు ప్రభావితం చేస్తూనే ఉన్నవి. ఎన్ని కథలకు, ఎన్ని నాటకాలకు. ఎన్ని జాతీయాలకు, ఎన్ని పదబంధాలకు, ఎన్నెన్ని న్యాయాలకు, ఎన్నెన్ని శబ్దాలకు ఎన్నెన్ని సంకేతాలకు పురుడు పోసినవీ మహాత్ముల రచనా సామర్థ్యాలు! పురాణాలలో లేనిది ఎక్కడా లేదు. అంతటా ఉన్నది పురాణాలలోనే ఉన్నది. అయితే వాటిని అధ్యయనం చేసి కాలానుగుణంగా వ్యాఖ్యానించుకొని అనుసరించడంలోనే ఔచిత్యం ఉంది కాని గ్రుడ్డిగా అనుకరించడంలో లేదు. అనుకరణంలో వికసితమైన వివేకం ఉండదు. అనుసరణంలో మేల్కొన్న వివేకం జాడలు కనిపిస్తాయి వాల్మీకి వ్యాసులను చదువనిదే వెయ్యేళ్ళ తెలుగు శబ్బాల పంటలు చేతికందవు నోటికందవు. మనసుకు పట్టవు. పురాణ పఠనం దేశభక్తిని పురికొల్పుతుంది. దేశాన్ని ప్రేమించే వాడు అవినీతికి దూరంగా ఉండగలుగుతాడు, నాటికీ నేటికీ చెల్లుబాటు కాగలిగిన విలక్షణములైన సందేశాలు ఎన్నో ఈ పురాణాల్లోని పాత కథలు క్రొత్తగానే కనిపిస్తాయి మానవస్వభావ పరిశీలకునికి, పురాణాలలో కనిపిస్తున్న సమాజం, అవి అందిస్తున్న విజ్ఞానం జిజ్ఞాసువులకుపాథేయాలుగా ఉపకరిస్తాయి.

ప్రాత క్రొత్తల వింగడింపుల కలతలతో 'యువభారతి'కి సంబంధం లేదు. గ్రుడ్డి నమ్మకాన్ని వదలి పరిశీలనా దృక్పథంలో మంచిదేదో చెడ్డదేదో తెలుసుకునే వాళ్ళకు మంచి ఎక్కడున్నా ఎవడు చెప్పినా కనిపిస్తుంది, ఈ సంస్కారంతో 21వ వార్షికోత్సవ సందర్భంగా యువభారతి వ్యాస సాహితీ సంహిత ఉపన్యాసమంజరీ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నది.

వ్యాసుని బహుముఖీన విజ్ఞానాన్ని తొమ్మిది విభాగాలుగా వింగడించి వాటిపై విజ్ఞులచేత ఉపన్యాసాలు ఏర్పాటు చేసి వాటిని "వ్యాససాహితీ సంహిత"గా మలచి పాఠకలోకానికి అందిస్తున్నాం. మేం చేసిన ఈ విభజన నిర్దుష్టమని మా అభిప్రాయం కాదు. మాకున్న అవకాశాలను దృషిలో పెట్టుకొని చేసిన ఏర్పాటు ఇది. ఈ కార్యక్రమంలో ఉపన్యాసకులుగా విచ్చేసి తమ ఉపన్యాసాలను వ్యాసాలమ అందించిన సాహితీ తపోమూర్తులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ ప్రసాదరాయకులపతి, డా॥ రత్నాకరం బాలరాజు, డా॥ ధూళిపాళ శ్రీ రామమూర్తి, డా॥ యస్.బి. రఘునాధాచార్యులు, డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రి. ఈ మనీషులకు మాధన్యవాద పరంపరలు, ఈ కార్యక్రమ నిర్వహణలో తోడ్పడిన భాషా బంధువులకు మా కృతజ్ఞతలు.

**ఇరివెంటి కృష్ణమూర్తి**



# వ్యాస సాహితీ సంహిత

**ఉపన్యాస మంజరి - పుస్తక ప్రచురణ**

## కార్యక్రమ వివరణ

**స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు**

తిలక్ రోడ్డు, హైదరాబాద్-500 001

**మొదటి సమావేశం**

*5 అక్టోబరు 1984 శుక్రవారం సమయం : సా॥ 6.00 గంటలకు.*

అధ్యక్షులు : **ఆచార్య బి. పద్మనాభరావు గారు**
(నిజాం కళాశాల అధ్యక్షులు)

ముఖ్య అతిథి : న్యాయమూర్తులు శ్రీ పి. కోదండరామయ్యగారు
(ఆంధ్రప్రదేశ్ హైకోర్టు)

ప్రారంభకులు : **శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు**
(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అధ్యక్షులు)

ఉపన్యాసము : **మహాభారతం-మహా కావ్యం''**
అన్న అంశము పై
ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

**రెండవ సమావేశం**

*6 అక్టోబర్ 1984 శనివారం సమయం : సా॥ 6.00 గంటలకు.*

అధ్యక్షులు : **ఆచార్య ప్రమోద్‌గణేశ్ లాలె గారు**
(సంస్కృత విభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

ఉపన్యాసం : **''దేవీ భాగవతం''** పై
డా॥ ప్రసాదరాయకులపతిగారు
(సంస్కృత విభాగం అధ్యక్షులు, హిందూ కళాశాల, గుంటూరు)

మూడవ సమావేశం

7 అక్టోబర్ : 1984 ఆదివారం సమయం : సా॥ 6-00 గంటలకు.

అధ్యక్షులు : ఆచార్య శ్రీమతి నాయని కృష్ణకుమారి గారు
(తెలుగు శాఖ అధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

ముఖ్య అతిథి : శ్రీ ఎమ్. వి. సుబ్బారావుగారు
(మాతృశ్రీ ఎడ్యుకేషనల్ ట్రస్టు అధ్యక్షులు)

ఉపన్యాసం : "వ్యాసుని స్తోత్ర సాహిత్యం-బ్రహ్మసూత్రాల" పై
డా॥ రత్నాకరం బాలరాజుగారు
(ఇనిస్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్, పుట్టపర్తి)

నాల్గవ సమావేశం

7 డిశంబర్ : 1984 శుక్రవారం సమయం సా॥ 6-00 గంటలకు.

అధ్యక్షులు : శ్రీ రాయసం వెంకట్రామయ్యగారు
(ఇన్‌స్పెక్టింగ్ అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్)

ముఖ్య అతిథి : శ్రీ సూరపనేని హరిరాధాకృష్ణారావుగారు
(చీఫ్ ట్రాక్ ఇంజనీరు దక్షిణమధ్యరైల్వే)

నూతన ప్రచురణల ఆవిష్కరణ: శ్రీ నిడుమోలు శ్రీరామమూర్తిగారు
(ఇన్‌స్పెక్టింగ్ అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్ (రిటైర్డు) )

ఉపన్యాసం : "శ్రీమద్భాగవతం" పై
డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు

ఐదవ సమావేశం

8 డిశంబర్ 1984 శనివారం సమయం : సా॥ 6-00 గంటలకు.

అధ్యక్షులు: ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు
(తెలుగు శాఖ - కేంద్రీయ విశ్వవిద్యాలయం, హైదరాబాదు)

ముఖ్య అతిథి : శ్రీ కె. వి. భాస్కరరావుగారు
(అసిస్టెంట్ జనరల్ మేనేజర్, ఆంధ్రా బ్యాంక్)

నూతన ప్రచురణల ఆవిష్కరణ: శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారు
(కమీషనర్, సాంస్కృతిక శాఖ, ఆం. ప్ర. ప్రభుత్వము)

ఉపన్యాసం : "వ్యాస సాహిత్యం - సార్వకాలికత" పై
డా॥ కొత్తపల్లి ఘనశ్యామలప్రసాదరావుగారు
(సంస్కృతోపన్యాసకులు, S. K. B. కళాశాల, అమలాపురం)

## ఆరవ సమావేశం

*9 డిశంబర్ 1984* ఆదివారం సమయం : సా॥ 6.00 గంటలకు

అధ్యక్షులు : **శ్రీ టి. యస్. ఆర్. నరసింహంగారు**
(కమీషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్ (రిటైర్డు) )

ఉపన్యాసం: **"భగవద్గీత" పై**
డా॥ ఎస్. బి. రఘునాథాచార్యగారు
(రీడర్, సంస్కృత విభాగం,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం)

## ఏడవ సమావేశం

*11 జనవరి 1985* శుక్రవారం సమయం; సా॥ 6.00 గంటలకు.

అధ్యక్షులు: **ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు**
(తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

ఉపన్యాసం; **"వ్యాసుని రచనలు - అష్టాదశ పురాణాలు" పై**
ఆచార్య శ్రీ పుల్లెల రామచంద్రుడుగారు

## ఎనిమిదవ సమావేశం

*12 జనవరి 1985* శనివారం సమయం : సా॥ 6.00 గంటలకు.

అధ్యక్షులు : **ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్‌గారు**
(హిందీ శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

ముఖ్య అతిథి : **శ్రీ సి. రామకృష్ణ**
(ముఖ్య పౌరసంబంధాల అధికారి దక్షిణ మధ్య రైల్వే)

ఉపన్యాసం : **"భారతీయ సాహిత్యంపై వ్యాసుని ప్రభావం" పై**
శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు.

## తొమ్మిదవ సమావేశం

*13 జనవరి 1985* ఆదివారం సమయం : సా॥ 6.00 గంటలకు.

అధ్యక్షులు : **ఆచార్య సి. నారాయణరెడ్డిగారు**
(అధికార భాషా సంఘ అధ్యక్షులు)

ముఖ్య అతిథి : **శ్రీ హెచ్. జె. దొర ఐ.పి యస్.**
(డిప్యూటి ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీస్)

ఉపన్యాసం : **"వ్యాసమహర్షి - ధర్మనీతి దృక్పథాలు" పై**
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు.



# ఎందరో మహానుభావులు

- వ్యాస సాహితీ సంహిత కార్యక్రమాన్ని రూపుదిద్దటంలో సహకరించిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారలు.
- మా 21 వ వార్షికోత్సవ సభలకు అధ్యక్షత వహించిన పెద్దలు శ్రీ బి. పద్మనాభరావు, శ్రీ ప్రమోద్ గణేష్‌లాలె, శ్రీమతి నాయనికృష్ణకుమారి, శ్రీ రాయసం వెంకట్రామయ్య, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు, శ్రీ T. S R. నరసింహం, శ్రీ వేటూరి ఆనందమూర్తి, శ్రీ భీమ్‌సేన్ నిర్మల్, శ్రీ సి నారాయణరెడ్డి గారలు.
- మా 21 వ వార్షికోత్సవ సభలకు ముఖ్య అతిథులుగా విచ్చేసి ఆశీర్వదించిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ పి. కోదండరామయ్య, శ్రీ యం.వి. సుబ్బారావు, శ్రీ సూరపనేని హరిరాధాకృష్ణారావు, శ్రీ కె.వి. భాస్కరరావు, శ్రీ C రామకృష్ణ, శ్రీ H. J దొర, శ్రీ P.V R.K ప్రసాద్, శ్రీ N. శ్రీరామమూర్తి గారలు.
- వ్యాస సాహితీ సంహిత ఉపన్యాసమంజరీ కార్యక్రమములలో ఉపన్యాసాలనివ్వడమే కాకుండా వ్యాసాలను కూడా సమర్పించి ఈ గ్రంథానికి రూపు కల్పించిన సాహితీ వేత్తలు డా॥ దివాకర్ల వేంకటావధాని, డా॥ ప్రసాదరాయకులపతి, డా॥ రత్నాకరం బాలరాజు, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి, డా॥ S B. రఘునాథాచార్య, డా॥ కొత్తపల్లి ఘ శ్యామల ప్రసాదరావు, డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ, శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రి గారలు-
- ''తెలుగులో స్వీయ చరిత్రలు'' గ్రంథాన్ని అందించిన డా॥ అక్కిరాజు రమాపతిరావు; ''దేశమును ప్రేమించుమన్నా'' గ్రంథాన్నందించిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి ''తెలుగు జానపద కథలు'' గ్రంథాన్ని అందించిన డా॥ జి. యస్. మోహన్, ''దశరూపక సందర్శనము'' గ్రంథానికి వ్యాసాలందించిన డా॥ P.S.R. అప్పారావు, డా॥ V.V.L. నరసింహారావు, డా॥ అమరేశం రాజేశ్వరశర్మ, డా॥ ముక్తేవి భారతి,

డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి, డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి డా॥ దివాకర్ల వేంకటావధాని శ్రీ గంగిశెట్టి లక్ష్మినారాయణ, శ్రీ P. రాజారాం దాసు, డా॥ జి వి. సుబ్రహ్మణ్యం, ''చిలకమర్తి కవితా వైభవము'' నందించిన డా॥ ముక్తేవి భారతి, ''తిక్కన రసభారతి'' గ్రంథాన్నందించిన డా॥ ఎల్లూరి శివారెడ్డి, ''కృష్ణశాస్త్రి కవితా వైభవము'' గ్రంథము నందించిన డా॥ K. రామమోహనరాయ్, "జననీ జన్మ భూమిశ్చ'' గ్రంథమందించిన డా॥ S. B. రఘునాథాచార్య, ''వ్యాస సూక్తము'' గ్రంథమందించిన డా॥ K. కమల గారలు.

* పిల్లలకై ''దేశమును ప్రేమించుమన్నా'' గ్రంథాన్ని "అశోక్‌కుమార్ సంఘీ చారిటబుల్ ట్రస్ట్" ఆర్థిక సహాయముతో వెలువరించటానికి పూనుకొన్న వదాన్యులు శ్రీ G. L. సంఘీగారు:

* మా నెలసరి ''సమాలోచనం'' సమావేశ కార్యక్రమాల్లో ''ద్విపద కావ్యమంజరి'' ఉపన్యసించిన డా॥ తంగిరాల వేంకటసుబ్బారావు; డా॥ M శివప్రసాద్: అక్కిరాజు సుందరరామకృష్ణ; డా॥ కందాడై వేంకట సుందరాచార్యులు గారలు.

* మా యువభారతి ప్రచురణలను ముచ్చటైన ముఖచిత్రాలతో తీర్చిదిద్ది, అక్షరాలంకరణము సంతరించిన చిత్రకారులు శ్రీ శీలావీర్రాజు గారు

* ప్రచురణలకు ముఖ్యసాధనమయిన తెల్ల కాగితాన్ని అందించిన వాసవీ పేపరు మార్టు, రాయలసీమ పేపరు ఏజెన్సీ, లీలా పేపర్ ఏజెన్సీ మరియు ఇతర విక్రయదారులకు.

* మా ప్రచురణలను ముద్రించిన ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, సుమనా ప్రింటర్స్, అనూరాధా ప్రింటర్స్, A. N ఆర్ట్ ప్రింటర్స్, గీతా ఆర్ట్ ప్రింటర్స్ పూర్ణకళా ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారలు

* బ్లాకుల తయారీ శిల్పులు మోహన్ ప్రాసెస్ వారు

* ''వ్యాసపాహితీ సహిత'' ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకొనడానికి దయతో అనుమతించిన ఆంధ్ర సారస్వత పరిషత్ పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, కార్యాలయ నిర్వాహకులు శ్రీ హరికిషన్‌రావు. కార్యదర్శి డా॥ కె కె రంగనాథాచార్యులు గారలు.

* మా నెలసరి ''సమాలోచనం'' కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోడానికి దయతో అనుమతించిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం నిర్వాహకులకు, విశేషించి గ్రంథాలయ కార్యదర్శి శ్రీ M.L. నరసింహారావుగారు.
* మా ప్రచురణల కొనుగోలులో ఇతోధికంగా ప్రోత్సహిస్తున్న రాజారామ్ మోహన్‌రాయ్ గ్రంథాలయ ఫౌండేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ శాఖ డెరెక్టర్, జిల్లా గ్రంథాలయాధికారులు మరియు యితర పుస్తక విక్రేతలు.
* ప్రకటనల ద్వారా ఆర్థిక సహాయాన్ని చేసిన ప్రకటనకర్తలు.
* మా యువభారతి కార్యక్రమాలు ఇతోధికంగా లోకానికి తెలియచెప్పి ప్రోత్సహించే పాత్రికేయులు, సాహిత్యశీలురు.
* మా సభలకు అవసరమైన ఫర్నిచరును సమకూర్చిన యూసఫ్ అండ్ కంపెనీవారు, విద్యుద్దీపాలంకరణ కర్తలు హనుమాన్ ఎలక్ట్రికల్స్‌వారు.
* మా సాహిత్య కార్యక్రమాలకువచ్చి "యువ భారతి" సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య స్నేహమూర్తులు సహృదయులైన తెలుగువారు.
* యువ భారతి చైతన్యము యువ భారతీయుల సమైక్య కృషి. సాహిత్యోద్యమంలో కష్టనిష్ఠూరాల కోర్చి శ్రమించిన యువ భారతి సభ్యులు, అండదండలు అందించిన "సాహితీ మిత్రులు,'' ''భారతీ మిత్రులు,'' ''భారతీ భూషణులు.''
* కార్యక్రమ నిర్వహణకు రేయింబవళ్ళు శ్రమించి కార్యక్రమాలను దిగ్విజయం చేయటంలో సహకరించిన యువభారతి కార్యాలయ సిబ్బంది.

ఎదురుగా కనపడేది ఇందరైనా, కనుమరుగున ఉండి మమ్ములను దీవించేది ఎందరో మహానుభావులు!

## అందరికీ మా వందనములు

వై. వి. వివేకానందం,

కార్యదర్శి,

యువభారతి.

# వ్యాసపీఠం

భారతీయ సాహిత్య జగత్తుకు త్రిమూర్తుల వంటివారు వాల్మీకి, వ్యాస, కాళిదాస మహాకవులు. వాల్మీకి బ్రహ్మకల్పుడు; వ్యాసుడు నారాయణ సదృశుడు; కాళిదాసు మహేశ్వర మహిమాన్వితుడు. వాల్మీకిది రసమార్గం; వ్యాసునిది జ్ఞానపథం; కాళిదాసుది శిల్పప్రస్థానం. ముగ్గురినీ కలిపి చదివితే సాహిత్య పరమార్థమైన సత్యం శివం సుందరం అనే సాధనత్రయం సార్థకమౌతుంది. జీవితంలోని పురుషార్థ సాధనను చెప్పేది సత్యం; పురుషార్థ వ్యుత్పత్తిని ప్రతిపాదించేది శివం; పురుషార్థ ప్రవృత్తిని ప్రతిపాదించేది సుందరం. సత్యాన్ని కాంతా సమ్మితంగా చెప్పేది మహాకావ్యం; జీవితగమ్యాన్ని శివంకరంగా ప్రపంచించేవి శాస్త్ర ప్రకృతులైన ఇతిహాస పురాణాదులు; జీవితానుభూతిని కళాత్మకంగా ఆవిష్కరించేవి వివిధ కావ్య ప్రక్రియలు వాల్మీకి వ్యాస కాళిదాసులు పై మూడు పద్ధతులను సాహిత్య జగత్తులో ప్రవర్తింపజేసిన ప్రజ్ఞామూర్తులు.

''కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణ ప్రభుమ్
కోహ్యన్యః పుండరీకాక్షా న్మహా భారత కృద్భవేత్?''

అని పద్మపురాణం ప్రశంసించింది. కృష్ణద్వైపాయనుడైన వ్యాసుణ్ణి సాక్షాత్ నారాయణ ప్రభువుగా తెలుసుకో. పుండరీకాక్షుడు తప్ప మరెవ్వరు భారత కర్త కాగలడు? అని ఘంటాపథంగా చెప్పింది. వ్యాసవాఙ్మయం త్రివేణీసంగమం లాంటిది. అందులో ఒక వేణి బ్రహ్మసూత్ర రచనం; మరొకవేణి అష్టాదశ మహాపురాణ రచనం; మరొకవేణి మహాభారత రచనం. వీనిలో గంగానది పురాణ సాహితి. యమున మహాభారతం; సరస్వతి బ్రహ్మసూత్ర దర్శనం.

'వేదాన్ వ్యస్యతీతి వేదవ్యాసః' అని వ్యాస శబ్దానికి వ్యుత్పత్తి. వేదాలను విభజించటంచేత వేదవ్యాసుడయ్యాడు. వ్యాసశబ్దం సంజ్ఞానామం కాదు; బిరుద నామ మని పండితాభిప్రాయం

''ఋగథర్వ యజుస్సామ్నాం రాశే రుద్ధృత్య వర్గశః
చతస్ర స్సంహితాశ్చక్రే మన్త్రై ర్మణిగణా ఇవ''

అని భాగవతం వ్యాసకృత వేద విభాగాన్ని వివేచించింది. వివిధ మణులున్న ఒక మణిరాశి నుండి పద్మరాగాది మణులను విభజించిపెట్టినట్లు, బహువిధ మంత్ర రాశి నుంచి ఋక్- యజు- స్సామ- అథర్వ వేదమంత్రాలను చతుస్సంహితలుగా విభజించినవాడు వేదవ్యాసుడు. ప్రతి ద్వాపరంలోనూ ఒక్కొక్క వ్యాసుడు వేదాలను విభజిస్తాడని సంప్రదాయం. వేదాలను విభజించి బ్రహ్మసూత్రాలను రచించిన వేదవ్యాసుడు పారాశర్యుడు, సాత్యవతేయుడు, బాదరాయణుడు, కృష్ణద్వైపాయనుడు.

వేదవర్గీకరణంవలన భారతీయ విజ్ఞానానికి వివేకసంపద చేకూరింది. బ్రహ్మసూత్ర రచనం వలన దర్శనభాగ్యం లభించింది. బ్రహ్మ సూత్రాలలోని

బ్రహ్మదర్శనం ఇతర దర్శనాలకంటె విశిష్టమైంది. ''న్యాయ వైశేషికములవలె జైన బౌద్ధములవలె బ్రహ్మసూత్ర దర్శనము కాదు. ఇది వేదాంత మీమాంసా దర్శనము. ఇది బ్రహ్మదర్శనము. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా.' ఇతర దర్శనములవలె నిది జగత్కారణ జిజ్ఞాసావ్యాపృతము కాదు. బ్రహ్మ జిజ్ఞాసా పర్యాప్తము. వానివలె నిది స్వతంత్రముగ యుక్తుల నల్లుకొని యా గూటిలో నుండదు. ఇది వేదాంత పరతంత్ర దర్శనము. ఉపనిషద్రీతుల కిష్టము చూపని బాహ్య దర్శన వాదులగు బౌద్ధాదులు ''ఔపనిదవాదము, బ్రహ్మవాదము, అద్వైత వాదము, శాంకరవాదము'' అను నామములతో వ్యవహరించిరి ఇట్లు వేదాంత వాదము బ్రహ్మసూత్రములలో నున్నది. ఇదియే యందున్నదనుటకు దర్శనాత్మక ప్రవృత్తియు నిరాకరణాత్మక ప్రవృత్తియు నిందావశ్యకమయినది. బ్రహ్మ సూత్రగ్రంథమున సాంఖ్యయోగములు. న్యాయవైశేషికములు, జైన బౌద్ధములు, పాశుపత పాంచరాత్రములు నిరాకృతములయినవి. ఉపనిషత్తులలో నంతట బ్రహ్మవాదముండుట సూచితమయినది. ''తత్తు సమన్వయా''త్తను సూత్రమున నంతట నిదియే యుండుట సిద్ధాంతితమైనది. ఇది బ్రహ్మ సూత్రార్థ బిందువు'' (శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ– శ్రీ వంగల వేంకటరామ శాస్త్రిగారి బ్రహ్మసూత్రార్థ వివృతికి ముందుమాటలో) బ్రహ్మ సూత్ర దర్శనం భారతీయ తాత్త్విక దర్శన పరమార్థం. దానిని అంతర్వాహినిగా కలది వ్యాస సాహితి.

వేదమంత్రాలు ద్రష్టలైన మహర్షుల దార్శనిత సూక్తులలోని సమన్వయ సూత్రాలు: ఉపనిషత్ తాత్పర్యాలకు శాస్త్రార్థ ప్రవృత్తులు; పురాణ వాఙ్మయం వేదార్థ ప్రపంచానికి ప్రతీకాత్మక కథా వ్యాఖ్యానం; శాస్త్ర స్మృతులను సదాచార వివరణం; ఇతిహాసం వేదధర్మాచరణకు జీవిత దృష్టాంతం. వేదం ఉపనిషత్తులచేత గమ్యం; బ్రహ్మసూత్రాలచేత దర్శితం; పురాణాలచేత వ్యాఖ్యాతం; ఇతిహాసం వలన అనుభవసాధ్యం. వేదం జ్ఞానశిఖరం నుండి స్రవించి జీవిత భూముల్లో ప్రవహించాలంటే పురాణేతిహాస వాఙ్మయం అవసరం. ఆ అవసరాన్ని గుర్తించి భారతీయులకు సాహితీ సుధాతరంగిణిని సృజించిన పరమమహర్షి, మహాకవి బాదరాయణ వ్యాస నారాయణుడు. అతని వాఙ్మయం వేదానికి స్థితి కారకమైంది; భారతీయ జీవిత తత్వానికి సంజీవనియై నిలిచింది.

పురాణాలన్నీ ఒక యెత్తు. భాగవత పురాణ మొక్కటీ ఒక యెత్తు. దానికి కారణం- వేదాంతార్థ ప్రతిపాదకాలైన బాదరాయణ బ్రహ్మసూత్రాల పరమార్థాన్ని భాగవతంలో క్రోడీకరించటం జరిగింది; అది సర్వపురాణ సార రూపంగా అవతరించింది.

''అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః
గాయత్రీ భాష్యరూపోఽసౌ వేదార్థ పరిబృంహితః
పురాణానాం సారరూపః సాక్షాద్భాగవతోదితః
ద్వాదశ స్కంధ సంయుక్తః శతవిచ్ఛేదసంయుతః
గ్రంథోఽష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః''

అని గరుడ పురాణం ఘోషిస్తున్నది. భాగవతం చదివితే బ్రహ్మసూత్ర పరమార్థం బోధపడుతుంది; భారతేతి హాసంలోని అంతరార్థం గోచరమౌతుంది. మంత్రరాజమైన గాయత్రి కది భాష్యరూపంగా పరిఢవిస్తుంది; వేదార్థాలన్నీ భాగవతంలో ఉపబృంహితమై ఉన్నాయి సర్వపురాణ సారరూపం భాగవతం. 'సర్వపురాణోత్కృష్టత్వేన సకలోపనిషత్ప్రతిపాద్య పరమ తత్త్వార్థ బృంహక త్వేన చ శ్రీమద్భాగవతం స్వయమేవ సమహర్షిః (వ్యాసః) విరచ్య య స్వసు తాయశుకాయోపదిదేశ''- అన్న చంద్రికా వ్యాఖ్యలోని వాక్యాలు భాగవత ప్రాశస్త్యాన్ని ప్రకటిస్తున్నాయి పురాణాలన్నీ వ్రాసి ఆత్మశాంతికోసం వ్యాసుడు రచించిన పురాణం భాగవతం. భగవంతుణ్ణే రస స్వరూపంగా భావించి 'రసోవై సః' అన్న సూత్రానికి లక్ష్యంగా నిర్మించిన పరతత్వ గ్రంథం భాగవతం. జ్ఞానభక్తి కర్మమార్గాల సంగమతీర్థం భాగవతం.

''నిగమ కల్పతరోర్గలితం ఫలం
శుకముఖా దమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రసమాలయం
ముహు రహో రసికా భువి భావుకాః''

''వ్యాసపీఠం'' అనే సంప్రదాయం మనదేశంలో ఉంది. ఇది పురాణ ప్రవచన సంప్రదాయానికి సంబంధించింది. జాతిని చతుర్విధ పురుషార్థ సాధన కుపయోగమైన విద్యతో జ్ఞానమయం చేయటా కి భారతదేశంలో వెలసిన సంప్ర దాయం పురాణ ప్రవచనం; అట్టి ప్రక్రియలో ఎల్లప్పుడూ పౌరాణికులముందు నిలిచే వాఙ్మయం వ్యాససాహితి. దానికి పీఠం వ్యాస పీఠం. ఇది చెక్కపీట కాదు; గ్రంథాన్ని నిలిపే దారుపీఠిక కాదు; వ్యాససాహితిని సమాజం సేవించ టానికి ఏర్పరచిన సరస్వతీ పీఠం. వ్యాస సాహితీ సమారాధనకు బహిఃప్రతీక.

పురాణాలను యజ్ఞయాగాదుల్లో చదివేవారు; మహాభారతాన్ని పర్వ దినాల్లో, పుణ్యదినాల్లో పురాణ ప్రవచనంగా సాగించేవారు ఇప్పటికీ ఈ సంప్ర దాయం మనలో ఉంది 'పురాణం' వారే మనలో వున్నారు. ఒకనాటి పురాణ ప్రవృత్తికి వీరు దృష్టాంతాలు.

పురాణాల్లో భాగవతం, ఇతిహాసాల్లో భారతం మన జీవితంలో నిత్య పారాయణ గ్రంథాలై పోయాయి.

''ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ మర్థశాస్త్ర మిదం పరమ్
కామశాస్త్ర మిదం చాగ్ర్యం మోక్షశాస్త్రం తథోత్తమమ్.
చతురాశ్రమ ధర్మాణా మాచారస్థితి సాధనమ్
ప్రోక్త మేతన్మహాభాగ వేదవ్యాసేన ధీమతా''

అని మార్కండేయం భారతాన్ని బహుధా ప్రశంసించింది. పాండవ పూర్ణ జీవితంలో వేదధర్మం అనుసరింపబడిన ఆదర్శ విధానాన్ని ఆవిష్కరించే పంచమవేదం భారతం. భారతమంతా ఒక యెత్తు. అందులోని భగవద్గీత ఒక్కటీ మరొక యెత్తు.

''అష్టాదశపురాణాని నవవ్యాకరణాని చ
నిర్మథ్య చతురోవేదాన్ మునినా భారతం కృతమ్.
భారతోదధీ నిర్మథ్య గీతాయా నిర్మథితస్యచ
సార ముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్''

అన్న వాక్యాలు గీతా ప్రాశస్త్యాన్ని ప్రకటిస్తున్నాయి. ''తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహభూతమ్'' అన్న శంకరుని వాక్యం గీతా మాహాత్మ్యానికి పతాకప్రాయం.

వ్యాస సాహిత్యం భారతీయ జీవితాన్ని, భారతీయ సాహిత్యాలను విస్తృతంగా ఆవరించింది. గీతావాక్యం చోటుచేసుకోని జీవిత సంఘటనం ఉండదు; భారత కథను ఉదహరించని జీవనవిన్యాసం ఉండదు; గోవిందనామ స్మరణం చేయని సత్సంగం ఉండదు; భాగవతార్థ స్పర్శలేని ఆధ్యాత్మిక చింతనం ఉండదు; పురాణార్థ ప్రసక్తిలేని జీవిత వ్యవస్థ ఉండదు; బ్రహ్మ సూత్రార్థ ప్రపంచనంలేని ఉపనిషద్వాక్య విన్యాసం ఉండదు; వేదాంత చర్చ ఉండదు. చతుర్వేద మంత్రాలులేని భారతీయ కర్మ ప్రవృత్తి ఉండదు. కర్మ భక్తి జ్ఞాన ప్రవృత్తులన్నీ వ్యాససాహితిలో ఉపజీవించేవే. వ్యాససాహితి కావ్యలతలకు కల్పకోద్యానం. జీవన తరంగిణులకు హిమన్నగ శృంగం; జాతి సంస్కృతికి జీవగర్ర.

యువభారతివారు అలనాడు రామాయణసుధాలహరి కార్యక్రమాన్ని నిర్వహించి వాల్మీకికి నివాళు లర్పించారు. ఈనాడు వ్యాససాహితిపై ఉపన్యాస మంజరీ కార్యక్రమాన్ని నిర్వహించి వ్యాసమహర్షికి కృతజ్ఞత లందజేస్తున్నారు. ఇక కాళిదాస కావ్య సమాలోచనం నిర్వహించి, భారత భారతీ మూర్తిత్రయాన్ని వాఙ్మయార్చన చేసే సాహితీ యజ్ఞాన్ని సాంగంగా నిర్వహించి సహృదయులకు సమర్పిస్తారని భావిస్తున్నాను.

13.1.1985 జి. వి. సుబ్రహ్మణ్యం

# అనుక్రమణిక...

# భగవద్గీత

—డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య, తిరుపతి

**1. పేరు-ప్రసిద్ధి :** జ్ఞానం శక్తి బలం, ఐశ్వర్యం, వీర్యం తేజస్సు అనే ఆరు గుణాలు పుష్కలంగా సకలంగా ఎక్కడ సన్నిధానమై ఉంటాయో ఆయనే భగవానుడు. జగత్తులను సృష్టించడం, పోషించడం, లయింపజేయడం ఆయనకు లీలలు ఈ దృశ్య ప్రపంచమంతా ఆయన విభూతిలో నాలుగోవంతు మాత్రమే. మనకు తెలియని త్రిపాద్విభూతి ఆ త్రివిక్రమునికెంతో ఉంది. వాచామగోచరుడు. బహుజన్మ తపఃఫలదర్శనీయుడు అయిన ఆ స్వామి సాధు పరిత్రాణంకోసం. అసాధుపరిమార్జనంకోసం, ధర్మసంస్థాపనంకోసం అవసరమైనప్పుడల్లా అనేక రూపాల్లో అవతరిస్తుంటాడు.

ఒకప్పుడు త్రేతాయుగంలో సత్య. ధర్మ వ్యవస్థాపనంకోసం శ్రీరామచంద్రుడై, ఇంకొకప్పుడు ద్వాపరయుగంలో శాంతి, ప్రేమలను చాటిచెప్పడానికి శ్రీకృష్ణుడై, ఇప్పుడు ఈ కలియుగంలో సత్య ధర్మ శాంతి ప్రేమలను దిగ్దిగంతాలకు వ్యాపింపజేయడానికి వేదధర్మాన్ని పరిరక్షించడానికి దివ్యావతారి భగవాన్, శ్రీ సత్యసాయిబాబాగా అవతరించాడు. ద్వాపరంలో శ్రీకృష్ణుడుగా అవతరించిన భగవాన్ ఆత్మతత్త్వాన్ని, సాధనమార్గాలను అందరికీ ఆనందంగా అందించాడు. అదే ఆ అవతారానికి విశిష్టమైన ప్రయోజనం. భగవంతునిచే గానం చేయబడింది కాబట్టి ఇది 'భగవద్గీత' అయింది.

ఉపనిషత్తుల్లో నిగూఢంగా నిలీనమైయున్న తత్త్వాలను, అర్జునుణ్ణి మిషగా పెట్టుకొని కురుక్షేత్రయుద్ధరంగంలో బుద్ధిమంతులు చక్కగా గ్రహించడానికి వీలుగా భగవాన్ ఉపదేశించారు. సమాజంలో జీవనయుద్ధరంగంలో దిగి పట్టీలు కొడుతున్న ప్రతివాడికి, వాడెదుర్కొంటున్న ప్రతి సమస్యకు భగవద్గీత పరిష్కారాలందిస్తున్నది. మృత్యుసంసార సాగరంలో మునిగిపోతూ చావు బతుకుల మధ్య వేలాడుతున్న మనకందరికీ ఈ భగవద్గీత నిజంగా అమృతోపదేశం. అందుకే అంటారు పెద్దలు–

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥

ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు- ఈ మూడింటిని ప్రస్థాన త్రయం అంటారు. అందులో మధ్యమణిస్థానాన్ని ఆక్రమించుకొన్న మహోత్కృష్టగ్రంథం భగవద్గీత. బ్రహ్మసూత్రాలకంటే తరువాత సంకలనం చేయబడినా (భ. గీ. 13 5) భగవంతుడు గానంచేసింది కావడంవల్ల అద్వితీయమైన ద్వితీయస్థానాన్ని ఆక్రమించుకున్నది. భారతజాతి జీవనానికి, సంస్కృతికి, ఆధ్యాత్మికభావనలకు సమన్వయపూర్వకంగా చక్కని రూపకల్పన చేసి, అపారమైన వాఙ్మయాన్ని అందించి అజరామరమైన ప్రతిష్ఠనందుకున్నవాడు కృష్ణద్వైపాయనుడైన వేదవ్యాసుడు. మానవజాతికి తత్త్వ-హిత-పురుషార్థాలను వ్యవస్థితంగా అందిస్తున్న వ్యాససాహితి త్యాగమధురం, పరమపవిత్రమైన ఒక ఆజ్యాహుతి. అది ఈ సనాతనధర్మ జీవనజ్యోతిని 'చిరంజీవ' అని ఆశీర్వదిస్తుందని నా ఆశ.

2. పద్దెనిమిది అధ్యాయాలు : అర్జునుణ్ణి ఒక వ్యాజంగా అడ్డం పెట్టుకుని, భగవాన్ శ్రీకృష్ణావతారంలో మానవులందరినీ ఉద్ధరించడానికి అందించిన మహోపదేశం భగవద్గీత. ఇది వ్యాసమహర్షి అనుగ్రహంతో మనకందించిన మహాభారతం భీష్మపర్వంలో అమర్చబడి ఉంది భగవద్గీతను తనలో ఇముడ్చుకున్న మహాభారతం, సకల జగాలను తనలో ఇముడ్చుకున్న జగన్నాథునిలాగా భాసిస్తున్నది. భగవాన్ అందించిన "భగవద్గీత" లాంటి అమృతోపదేశాన్ని పంచమవేదమైన మహాభారతంలో యథాతథంగా కూర్చి విశ్వమానవకల్యాణానికి దోహదం చేసిన వ్యాసమహర్షి ఈ ప్రపంచానికి ప్రాతఃస్మరణీయుడు

భగవద్గీతలో 701 శ్లోకాలు పద్దెనిమిది అధ్యాయాలుగా విభజింపబడి ఉన్నాయి. వీటి పేర్లను గురించి ఏకాభిప్రాయం లేదు. సంగ్రహంగా ఆ అధ్యాయాల విషయవిశేషాలను, రూపురేఖలను ఇక్కడ పరిశీలిద్దాం.

1. అర్జున విషాదయోగం : భగవద్గీతామహాభవనానికి ఈ అధ్యాయం పునాదిలాంటిది. మొదట కురు-పాండవ పక్షాల్లో ఉన్న దక్షులైన మహావీరులను గురించి పేరుపేరున ధృతరాష్ట్రుడికి తెలియజేస్తాడు సంజయుడు. వాళ్లంతా తరువాత సమరోత్సాహ సమన్వితులై తమ తమ శంఖాలను విజయోత్సాహంతో పూరిస్తారు. తరువాత రథి అర్జునుడు ఆదేశించగా, సారథి శ్రీకృష్ణుడు సేనా

వాహినులు రెంటి మధ్య రథాన్ని నిలబెడతాడు. హృషీకేశుని మాయనర్థం చేసుకో లేని గుడాకేశుడు యుద్ధానికి సన్నద్ధులై ఉన్న తన బంధువులనందరిని తేరి పారచూసి– ''అయ్యో! వీళ్ళనా నేను చంపాల్సింది? వీళ్ళంతా నా బంధువులే కదా!" అని మమకారాన్ని పెంచుకొని, దయార్ద్రహృదయుడై, అవసరమైతే నేనైనా చచ్చిపోతాను గాని, వీళ్ళందర్ని చంపి, నెత్తురుకూడు సంపాదించలేనని కుప్పకూలిపోతాడు. విషణ్ణుడౌతాడు. అప్పుడేర్పడింది గీతోపదేశానికి అనుకూల మైన అవకాశం.

**2. సాంఖ్యయోగం :** పెద్దల్ని, గురువుల్ని నేనెలాగయ్యా చంప గలను? అని, నీ శిష్యుణ్ణయ్యా! నన్ను సరైన మార్గంలో నడిపించు! అని అర్జు నుడు శ్రీకృష్ణుణ్ణి ప్రార్థిస్తాడు. ఆత్మతత్త్వోపదేశానికిదే అనువైన సమయమని, ఎప్పట్నుంచో దానికోసమే కాచుకొని కూర్చున్న కపట నాటక సూత్రధారి శ్రీకృష్ణుడు, క్షత్రియుడైన అర్జునుడు యుద్ధంచేసి కర్తవ్యాన్ని నిర్వహించాలనీ, నిష్కామకర్మాచరణం నీతి నిజాయితీలను పెంచుతుందనీ, స్థితప్రజ్ఞుడంటే ఇలా ఉండాలని, ఎన్నో ఆధ్యాత్మికవిశేషాలను ఇందులో చక్కగా వివరించాడు.

**3. కర్మయోగం :** కర్మ మార్గంకంటే జ్ఞాన మార్గమే శ్రేష్ఠమైందయితే నన్నెందుకు కర్మ మార్గాన్ననుసరించమని చెబుతున్నావు? అని అర్జునుడు పర మాత్మను ప్రశ్నించాడు. భగవాన్ దానికి సమాధానంగా కర్మయోగ వైశిష్ట్యాన్ని ఇలా వివరించాడు. నిష్కామ భావనతో నియత కర్మల నాచరించడమే కర్మ యోగం. ఫలాపేక్ష లేకుండా చేసే ప్రతి పని యజ్ఞమే అవుతుంది. సక్తులైన సామాన్యులెలా కర్మలను చేస్తుంటారో, అసక్తులైన అభిజ్ఞులు గూడ అలాగే లోకసంగ్రహంకోసం కర్మ నాచరిస్తారు. భగవంతుడు కూడ లోక సంగ్రహం కోసం కర్మలను చేస్తూనే ఉంటాడు. కాని ఆయనకు సంగం ఉండదు. ఆయన కర్మబద్ధుడు కాడు. ప్రకృతిగుణాలు చేస్తున్న కర్మలను, తానే చేస్తున్నట్లు అహంకార విమూఢుడైన అజ్ఞాని భావిస్తాడు. ఇంద్రియాదులు శబ్దాదిగుణాలలో ప్రవర్తిస్తున్నాయని తెలుసుకుంటూ తత్త్వజ్ఞుడు కర్మసంగాన్ని పొందకుండా ఉంటాడు. రాగద్వేషాలు లేకుండా కర్తవ్య భావనతో కర్మలనాచరిస్తే సంగ రాహిత్యమేర్పడుతుంది. ఇలా కర్మయోగాన్ని వివరించి కామక్రోధాది అంతశ్శ త్రువులను ఎలా జయించాలో ప్రతిపాదించాడు పార్థసారథి.

**4. జ్ఞానయోగం :** భగవంతుని అవతార కారణం, అవతార వైశిష్ట్యం ఇందులో చక్కగా నిరూపించబడింది. జ్ఞానులు నిర్మలమైన హృదయంతో సాధనచేసి పరమాత్మను పొందుతారని, కర్మ, అకర్మ, వికర్మ-వాటి స్వరూప స్వభావాలు వివరింపబడ్డాయి. జ్ఞానాగ్నిచేత కర్మబంధాలను దగ్ధంచేసుకోగలడు. కర్మలు చేసినా అతడికి సంగం ఉండనే ఉండదని జ్ఞాని స్వరూపం వివరింప బడింది. అనేక యజ్ఞాలు, వాటిలో తేడాలు అన్నింటిలో జ్ఞానయజ్ఞ ప్రాశస్త్యం, జ్ఞానం యొక్క ప్రభావం ఈ అధ్యాయంలో చెప్పబడింది.

**5. కర్మసన్న్యాసయోగం :** కర్మ సన్న్యాసంకంటే కర్మఫల త్యాగ రూపమైన కర్మయోగమే శ్రేష్ఠమైనదని చెప్పబడింది. సాంఖ్యయోగి, కర్మయోగి-వీరిద్దరి లక్షణాలు, వారి ప్రభావం, జ్ఞానయోగం యొక్క గొప్పదనం తెలియ జేయబడ్డాయి. శబ్దాది విషయ త్యాగం, ధ్యానం, ప్రాణాయామం, ఇంద్రియ మనోనిగ్రహం, కామ క్రోధ భయరాహిత్యం మొ॥ మోక్ష ప్రాప్త్యుపాయాలు తెలియజేయబడినాయి.

**6. ఆత్మసంయమయోగం :** దీన్ని 'ధ్యానయోగ' మని కూడా అంటారు. ఇక్కడ ఆత్మ అనే పదం శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే అర్థాలలో ప్రయోగింపబడింది. నిష్కామకర్మయోగం, యోగారూఢ లక్షణాలు, ఆత్మోద్ధరణ, ఇంద్రియ మనోనిగ్రహాలను సంపాదించిన జ్ఞాని స్వభావం, ధ్యానయోగం, దాని ప్రభావం, మనోనిగ్రహం, యోగభ్రష్టుని గతి ఇందులో నిరూపించబడినాయి.

**7. విజ్ఞానయోగం :** దీన్ని 'జ్ఞాన విజ్ఞానయోగం' అని కొందఱంటారు. ఈ అధ్యాయంలో విజ్ఞానంతో కూడిన జ్ఞాన స్వరూపం, పరాపర ప్రకృతులు, ప్రపంచంలో అన్ని పదార్థాల్లోను పరమాత్మవ్యాప్తి, అసురీభావనింద, దైవీ స్వభావ ప్రశంస, ఆర్తుడు మొ॥ నాల్గు రూపాలై భక్తుల వివరణ, ఇతర దేవతోపాసన, భగవంతుని ప్రభావం మొ॥ విశేషాలు ప్రతిపాదింపబడినాయి.

**8. అక్షరపరబ్రహ్మ యోగం :** కొంతమంది 'అక్షరబ్రహ్మయోగ' మని దీన్ని పిలుస్తారు. బ్రహ్మ, అధ్యాత్మం, కర్మ మొ॥ వాటిని గురించిన వివరణ, ప్రణవోపాసన, దాని ప్రయోజనం, సృష్టి ప్రళయ స్వరూపం, భగవంతుని స్వరూపం, భక్తిద్వారా భగవంతునిపొందే విధానం, శుక్ల-కృష్ణమార్గాల విభేదం, యోగి ప్రభావం ఇందులోని విశేషాలు.

**9. రాజవిద్యా రాజ్యగుహ్యయోగం :** ఇందులో అధ్యాత్మ విద్యా ప్రభావం, భగవత్స్వరూపం, జగదుత్పత్తి, ఆసురీ, దైవీప్రకృతి గలవారి లక్షణాలు, సకామ-నిష్కామోపాసన, దాని ఫలం, భగవంతునిపై భక్తితో నిష్కామంగా కర్మలనాచరిస్తే కలిగే ఫలం మొ॥ విశేషాలు వివరించబడినాయి.

**10. విభూతి యోగం :** భగవంతుని మహిమాతిశయం, ఆయననుంచి జీవులకు సంక్రమించే గుణాలు, భక్తి యోగఫలం, దాని ప్రభావం, స్వామి యోగ విభూతుల వర్ణనం ఇందులోని విశేషాలు.

**11. విశ్వరూప (సం) దర్శన యోగం :** విశ్వరూపాన్ని చూపించమన్న అర్జునుని ప్రార్థనను విని శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని వర్ణిస్తాడు. అర్జునుడు విశ్వరూపాన్ని సందర్శించి స్వామిని స్తుతిస్తాడు. నీవు నిమిత్తమాత్రుడివేనని భగవాన్ అర్జునునితో చెబుతాడు. ఇవే ఇందులో ప్రధానాంశాలు.

**12 భక్తియోగం :** సగుణ - నిర్గుణోపాసనలు, వాటి స్వరూప - స్వభావాలు, భక్తి వైశిష్ట్యం, భగవంతు డుపదేశించిన అనేకాధ్యాత్మిక సాధనలు, స్వామికి ఇష్టుడైన భక్తుని లక్షణాలు ఈ అధ్యాయంలో చెప్పబడ్డాయి.

**13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం :** ఈ అధ్యాయంలో క్షేత్రం, క్షేత్రజ్ఞుడు- వీరి లక్షణాలు, జ్ఞానిలో కనపడే గుణగణాలు. జ్ఞేయమైన పరబ్రహ్మ స్వరూపం, ప్రకృతి, పురుషుడు- వీరిద్దరి స్వరూపం, దాన్ని తెలుసుకోవడంవల్ల కలిగే ఫలం నిరూపించబడ్డాయి.

**14. గుణత్రయ విభాగయోగం :** జ్ఞానప్రభావం, ప్రకృతి పురుషుల ద్వారా ప్రపంచోత్పత్తి, సత్వం, రజస్సు, తమస్సు- వీటి స్వరూపం, త్రిగుణాల వల్ల కలిగే ఫలితాలు, గుణాతీతుని లక్షణం, గుణాతీతస్థితి వల్ల ప్రయోజనం ఈ అధ్యాయంలో ప్రతిపాద్యవిషయాలు.

**15. పురుషోత్తమ ప్రాప్తియోగం :** సంసార వృక్షస్వరూపం, భగవంతుని పొందడానికి మార్గం, జీవాత్మ స్వరూప విచారం, భగవంతుని సర్వవ్యాపకత్వం, ఆయన మహిమ, క్షరాక్షరపురుషులు, పురుషోత్తముడు- వీరి లక్షణాలు ఇందులో చక్కగా నిరూపించబడ్డాయి.

**16. దైవాసుర సంపద్విభాగయోగం :** దైవసంపద, అసురసంపద, దైవగుణాలు, అసురగుణాలు, వాటి రూపురేఖలు, వాటివల్ల కలిగే ఫలాలు,

అసురసంపదలో పుట్టినవారి లక్షణాలు, వారు పొందే నీచగతి, నరకద్వారాలు, శాస్త్రానుకూలమైన ఆచరణవల్ల కలిగే ఫలం- ఇవి ఇందులోని విశేషాలు.

**17. శ్రద్ధాత్రయ విభాగయోగం :** సాత్త్వికశ్రద్ధ, రాజసశ్రద్ధ, తామస శ్రద్ధ- వీటి లక్షణాలు, మూడు విధాలైన ఆహారాలు, మూడు యజ్ఞాలు, మూడు తపస్సులు, మూడు దానాలు, 'ఓం తత్సత్' వివరణ, అశ్రద్ధవల్ల కలిగే అనర్థం ఈ అధ్యాయంలో చెప్పబడ్డాయి.

**18 మోక్ష సన్న్యాసయోగం :** సాత్త్విక రాజస తామస త్యాగాలు- వాటి స్వరూపం, ప్రతి కార్యానికి ఐదు కారణాలు, ఆత్మకు కర్తృత్వం లేక పోవడం, జ్ఞానం, కర్మ, బుద్ధి, ధైర్యం, సుఖం- వీటి సాత్త్విక రాజస తామస స్వరూపాలు, నాలుగు వర్ణాలవారి జీవనధర్మాలు, బ్రహ్మసాక్షాత్కారోపాయం, జ్ఞాననిష్ఠ, భగవద్భక్తితో ఉపాసించాల్సిన నిష్కామ కర్మయోగం, శరణాగతి, గీతాప్రభావం, అర్జునుని ప్రతిజ్ఞ ఈ అధ్యాయంలో నిరూపింపబడ్డాయి.

**3 విషాదం :** మనస్సులో ప్రసాదం లోపిస్తే విషాదం చోటుచేసు కుంటుంది. ప్రసాదమంటే ప్రసన్నత్వం. ఇది సత్త్వగుణ లక్షణం. దైవీ సంపదతో ఉన్నవాడు, సాత్త్విక శ్రద్ధతో చక్కని బుద్ధితో ప్రవర్తిస్తాడు. అతని భావనలో భాషలో ప్రశాంతత ప్రతిఫలిస్తుంటుంది. చేష్టలు ఇతరులకు కష్టం కలిగించకుండా సున్నితంగా ఉంటాయి. ఈ సత్త్వస్థితి తప్పి తామస ప్రవృత్తి కలిగినప్పుడు అవివేకంతో అసలు తానెవరో, తన కర్తవ్యమేమిటో మర్చిపోయి, మత్తుతో, సోమరితనాన్ని పెంచుకుంటాడు మానవుడు. అకర్మణ్యా లక్షణం అతనిలో అచ్చుపోసినట్లు కనపడుతుంది. ప్రస్తుతం అర్జునుణ్ణి ఆవ హించిన అకర్మణ్యతకు అదే అసలు కారణం. చూడండి :

పార్థుడు నరాంశ సంభవుడు. పార్థసారథి నారాయణాంశ సంభవుడు. మహోత్సాహ తో మహా రణరంగమైన కురుక్షేత్రంలో అడుగుపెట్టాడు. శత్రు సేనలను చీల్చి చెండాడి విజయలక్ష్మిని వరించాలనే తహతహ అతడి ముఖంలో కనబడుతున్నది. నానొక మహారథినని, సవ్యసాచిననే అహంభావంతో సకల జగన్నాథుడైన శ్రీకృష్ణుని కేవలం సారథిగానే భావించి, "కురు పాండవ సేనల మధ్యలో రథాన్ని కాసేపు నిలబెట్టవయ్యా! నేనెవరితో యుద్ధం చేయాలో, ఎవరు నాతో యుద్ధం చేయడానికి సన్నద్ధులై ఉన్నారో ఒకసారి గమనిస్తా" నన్నాడు. అంత ఇకు అర్జునుడిలో రాజస ప్రవృత్తి లక్షణంగా కనబడుతున్నది. మాయా

మానుష విగ్రహుడు, మాయగోపాలుడు మనసులో నవ్వుకున్నాడు. ఒక సామాన్య సారథిలాగానే రథికుని ఆజ్ఞను శిరసావహించి, రథాన్ని క్షణంలో రణరంగ ముఖంలో కురు పాండవ సేనల మధ్య నిలబెట్టాడు. పగ్గాలను లాగిపట్టుకొని ఫల్గుణుని పరిస్థితిని పరిశీలిస్తున్నాడు.

దర్పంగా తన బలాన్ని ఒకసారి చూసుకొని, తృణీకారభావంతో శత్రు బలాన్ని ఒకసారి చూశాడు శ్వేతవాహనుడు. కన్నులు చెదిరాయి. మళ్ళా మళ్ళా చూశాడు. "ఏమిటి? భీష్ముడు, ద్రోణుడు, కృపుడు - అంతా నా గురువులు, బంధువులు, మిత్రులు, పుత్రులు, పౌత్రులు - అయ్యో! వీళ్ళనా నేను ఈ యుద్ధంలో సంహరించాల్సింది! వీళ్ళంతా నావాళ్ళే కదా? వీళ్ళను చంపి ఆ నెత్తురుకూటితో నేనేం బావుకుంటాను? యుద్ధంలో వీళ్ళనందరినీ చంపి కుల క్షయాన్ని కలిగిస్తే, వర్ణసాంకర్యం కలుగుతుంది. అందువల్ల అధర్మమే కదా, అభివృద్ధి పొందుతుంది! కాబట్టి నాకీ యుద్ధమూ వద్దు. రాజ్యమూ వద్దు" అని విషణ్ణ మనస్కుడై వైకుంఠుడు చూస్తుండగానే గాండీవాన్ని కిందదేసి కూలబడి పోయినాడు.

సమాజంలో ఎక్కడికైనా ఇది సహజమైందే. ముందు ఆరంభ శూరత్వంతో ప్రతివాడు పని మొదలుపెడతాడు. కొంచెం దూరం జరిగిన తరువాత అజ్ఞానంలో ఏవేవో ఆలోచనలు వస్తాయి. అంతే అసలు నాకీపనే అక్కర్లేదు; ఇది లేక పోతే నేను బ్రతకలేనా? అని అస్త్రసన్న్యాసం చేసేస్తాడు. ఇలాంటివాళ్ళ ప్రతి నిధే ఇక్కడ పార్థుడు. అసలు శ్రీకృష్ణుని అవతారానికి పరమ ప్రయోజనం గీతోపదేశం. ఉపదేశానికి ఉచితమైన కాలం కావాలి. అనువైన అవసరం ఏర్పడాలి. యోగ్యుడైన వ్యక్తి కావాలి. ధర్మోద్ధరణ కోసం, అధర్మవినాశం కోసం అవతారాలేర్పడతాయి. ఆ అవతార పురుషుల చేష్టలన్నీ లోకకల్యాణాన్నే ఉద్దేశిస్తాయి. వేచివేచి యుద్ధరంగంలో విషాదగ్రస్తుడైన అర్జునుణ్ణి మిషగా పెట్టు కున్నాడు శ్రీకృష్ణుడు. ఆత్మతత్త్వాన్ని ఆదిదేవుడు ఆవిష్కరించడానికి ఉప యోగపడిన విషాదం కాబట్టి అర్జున విషాదం యోగమైంది. గీతోపదేశ మహా భవనానికి అది పునాది అయింది. ఆత్మతత్త్వామరద్రుమావిష్కరణకు విషాదమే బీజమైంది. సంసార సాగరంలో మునుగుతూ తేలుతూ కొట్టుమిట్టాడుతూ కొన ఊపిరితో మిగిలిన జీవులందరికీ దాన్ని తరించడానికి ఉపయోగించే ఈత, ఈ భగవద్గీత.

**4. కర్మయోగం :** కర్మలను వదిలివేయకుండా బంధహేతువైన కర్మ ఫలాన్ని మాత్రం ఆపేక్షించక చిత్తశుద్ధితో కర్తవ్యభావనతో కర్మల నాచరించ డాన్నే కర్మయోగమంటారు. ఇలా కర్మనిష్ఠకలవాళ్ళను యోగులని యోగేశ్వరుడు వివరించాడు. వీళ్ళల్లో దేహాభిమానం పూర్తిగా పోదు. బుద్ధి కుశలత్వం, విమర్శ ఎక్కువ కనపడదు. ఈ యోగంలో మొదట భోక్తృత్వాభిమానం నశించి, క్రమంగా అదే కర్తృత్వాభిమానాన్ని కూడా నశింపజేస్తుంది. పరమ మహత్స్వ రూపుడైన పరమాత్మ వ్యక్తస్వరూపమైన ఈ ప్రపంచాన్ని నిష్కామ కర్మతో వీళ్ళు సేవిస్తారు అంశాంశిభావంతో ఆయనతో ఏకత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటారు.

ఏ పనీ చేయకుండా ఎవ్వడూ ఉండలేడు : ఏ పనీ చేయకుండా ఊరికనే కూర్చున్నంత మాత్రాన నైష్కర్మ్యం ఎన్నటికీ సిద్ధించదు. అయినా, ఏ పనీ చేయకుండా కూర్చోటం కూడా సాధ్యంకాని పని. ఎందుకనంటే, ప్రకృతి గుణాలైన సత్త్వం, రజస్సు, తమస్సు ప్రతివాడిచేత ప్రతిక్షణం ఏదో ఒక పనిని చేయిస్తూనే ఉంటాయి. కర్మేంద్రియాలను అణచిపెట్టి పైకి విరాగిలాగా కనపడుతూ, మానసికంగా విషయ సుఖాలననుభవించేవాడు గొప్ప మోసకారి. జ్ఞానేంద్రియాలను, మనస్సును నిగ్రహించి, సంగం లేకుండా కర్మేంద్రియాల ద్వారా కేవలం కర్తవ్యభావనతో కర్మలాచరించేవాడు నిజమైన కర్మయోగి. అతడికే నైష్కర్మ్యసిద్ధి కలుగుతుంది.

ఫలాపేక్ష లేకుండా కర్తవ్య భావంతో ఏదో ఒక పని చేసి తీరాలి. అలా చేయకుండా ఊరికే కూర్చొనే సోమరిపోతులకు శరీరయాత్ర ఎలా గడుస్తుంది? ఏ పనీ చేయకుండా సోమరితనంతో ఉసూరుమని కూర్చోడంకంటే, ఏదో ఒక పని చేయడం ఎంతో మంచిది. ఫలాసక్తిలో చేసే ప్రతి పనీ మనల్ని బంధిస్తుంది. అనాసక్తియోగంతో కర్మలనాచరించిన జనకాది రాజర్షులు సిద్ధిని పొందారు. ఫలాసక్తి లేకుండా కర్తవ్యభావంతో చేసేపని ఎన్నటికీ ప్రతిబంధకం కాదు సరికదా, పరమపదాన్ని సంపాదిస్తుంది. అదే కర్మయోగం. వినండి, భగవాన్ ఉపదేశం-

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 3-19.

**ఎందుకాదర్శంగా ఉండాలి?** : కర్మయోగంలో సిద్ధిని పొందినవాళ్ళు కూడా లోకానికి 'సరైన మార్గం ఇది' అని తెలియజేయడానికి కర్మలను ఆచరించాల్సిందే. లోకం ఎప్పుడూ గొప్పవాడు నడచిన మార్గంలోనే పోతూ ఉంటుంది. వాడు దేన్ని ప్రమాణంగా తీసుకుంటే దాన్నే అనుకరిస్తుంది. అందుకనే చుట్టూ ఉన్న సమాజం మంచిగా ఉండాలంటే ముందు తాను మంచిగా ఉండాలి. భగవంతుడు లౌకిక వ్యవహారాలు చేసి సంపాదించాల్సింది ఏదీ లేకపోయినా కర్తవ్యభావంతో కర్మల నాచరిస్తూనే ఉంటాడు. అలా కాకపోతే; మానవులు కూడా అంత గొప్పవాడు, అవతార పురుషుడు, ఆయనే చేయలేదు. మనమెందుకు చేయాలి? అని సోమరులై, కర్మభ్రష్టులై పోతారు. సాంకర్యం ఏర్పడి చివరకు ఈ లోకాలే నశించిపోతాయి. కనుక కర్మఫలాన్ని భగవంతుడికి అర్పించి, కర్తవ్యభావనతో నిస్సంగంగా కర్మల నాచరించాలి.

**5. జ్ఞానయోగం** : ఆత్మను ఇతర తత్త్వాలకంటే భిన్నమైన తత్త్వంగా గ్రహించి, బుద్ధితో విచారణ చేసి తాము ఆత్మస్వరూపులమని జ్ఞానులు గ్రహించగలుగుతారు. వాళ్ళకు కర్తృత్వాభిమానముండదు నేను సాక్షి మాత్రుడననే ఎరుక ఉంటుంది. కర్తృత్వాభిమానం లేకపోవడంవల్ల భోక్తృత్వాభిమానాన్ని, ఫలాసక్తిని కూడా వాళ్ళు తేలికగా పోగొట్టుకోగలుగుతారు. ఈ జ్ఞానయోగాన్ని ఉపాసించే జ్ఞానులు, బాహ్య ప్రపంచం జోలికి పోకుండా, అంతర్యామిగా హృదయంలో ఉండే పరమాణుస్వరూపుడైన పరమాత్మపై ధ్యాన్యాన్ని నిలిపి సిద్ధిని పొందుతారు.

అంతశ్శత్రువులను అణచివేసి భగవంతుణ్ణే ఆశ్రయించి ఎప్పుడూ ఆయన్నే ధ్యానిస్తూ ఉండే జ్ఞానులు కూడా మోక్షాన్ని పొందుతారు. భగవంతుణ్ణి కర్మలు బంధించవని, ఆయనకు కర్మఫలాసక్తి లేదని తెలుసుకొన్న జ్ఞానులకెన్నటికీ కర్మబంధం ఉండదు. జ్ఞాని చేష్టలన్నీ రాగవాసనా రహితాలుగానే ఉంటాయి. అతడి కర్మబంధాలన్నీ వివేకాగ్నిచ్ఛటలలో మాడి మసైపోతాయి. ఫలాసక్తి లేకుండా, కర్తృత్వ భోక్తృత్వాభిమానాలు లేకుండా, దేహాభిమానరహితుడై ఎప్పుడూ తృప్తితో, ఎవ్వరినీ ఆశ్రయించకుండా ఉండే జ్ఞాని ఊరికే కొన్ని కర్మలు చేసినా కర్మబంధం ఉండదు కాబట్టి అవి చేయనట్లే. ఇతడు ఆశ లేకుండా, ఎవరి దగ్గరా ఏమి తీసుకోకుండా, మనస్సును, ఇంద్రియాలను జయించి లోకవ్యవహారం చేస్తుంటాడు. ఏ వాసనలు లేని ఆ జ్ఞాని మనస్సు

కర్తృత్వాభిమానాన్ని చంపుకొన్న తరువాత ఏ పని చేసినా, అవన్నీ అకర్మలే అవుతాయి. ఈ జ్ఞానమార్గంలో ఉండేవాడు సంగం అహంకారం లేకుండా, జ్ఞాననిష్ఠతో తను చేసే క్రియలన్నీ భగదారాధనమేనని, లేక కర్తవ్యమని, లేక త్యాగమని భావిస్తాడు. జ్ఞానయోగంలో సిద్ధిని పొందినవాడు మళ్ళా మోహంలో పడనే పడడు. అతడు లోకంలోని జీవరాసులనన్నింటిని తనలోను, పరమాత్మ లోను చూడగలుగుతాడు

ఎన్ని పాపాలు చేసినవాడైనా ఈ జ్ఞాననిష్ఠను పొందగలిగితే అగ్ని హోత్రుడు కట్టెలను కాల్చివేసినట్లు వాటినన్నింటిని జ్ఞానంతో నశింపజేసుకో గలుగుతాడు. వినండి భగవాన్ విశిష్టోపదేశం-

యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ 4-19.

ఈ లోకంలో జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువేదీలేదు. భగవంతుని పైన, గురువుపైన, శాస్త్రాలపైన శ్రద్ధకలవాడు, జితేంద్రియుడు ఈ జ్ఞానాన్ని తప్పక పొందుతాడు. దానిద్వారా పరమశాంతిని కూడా సాధిస్తాడు.

6. భక్తియోగం : ఎవరు నిరంతరం భగవంతునిపైనే మనస్సును లగ్నంచేసి, శ్రద్ధతో ఉపాసిస్తారో వారే భక్తులు. వారనుష్ఠించేదే భక్తియోగం. భక్తిమార్గ లో ఉన్న సాధకులు అన్ని కర్మలను భగవంతునికే అర్పిస్తారు. ఎంతో ఆసక్తితో ఏకాగ్రచిత్తంతో ఆయన్నే ధ్యానిస్తారు. మనస్సును తనలోనే లయింపజేసిన ఆ భక్తులను భగవంతుడే ఈ సంసార సాగరాన్నుంచి ఉద్ధ రిస్తాడు.

''మనస్సును నాపైనే స్థిరంగా నిలబెట్టు. నీ బుద్ధిని నాలోనే విలీనము చెయ్! నీవు నాలోనే నివసిస్తావు. అలా మనస్సును నా పైన నిలబెట్టడం నీ వల్ల కాకపోతే అభ్యాసయోగంతో నన్నే పొందాలని కోరుకో! అలా అభ్యాసం చేయడం కూడా చేతకాక పోతే వాచికంగా, శారీరకంగా నా పనులు చెయ్. అలా కూడా నా పనులు చేయడానికి నీకు వీలు కుదరకపోతే మనోనిగ్రహంతో నీవు చేసే ప్రతిపనికి సంబంధించిన ఫలితాన్ని నాకు త్యాగం చెయ్. లోకంలో వివేకం లేకుండా చేసే సాధనలకంటే జ్ఞానం మంచిది. జ్ఞానంకంటే ధ్యానము యోగ్యమైంది. ధ్యానంకంటే కూడా సర్వకర్మఫలత్యాగం గొప్పది. ఈ

త్యాగంకంటే దీనివల్ల లభించే మనశ్శాంతి చాలా గొప్పది" అని భగవంతుని ఉపదేశం.

**భక్తుడెలా ఉంటాడు ?** భక్తియోగంలో నిష్ఠను పొందినవాడు ఏ జీవిని ద్వేషించడు. దయతో స్నేహంతో చూస్తాడు. అహంకార మమకారాలను పోగొట్టుకొని, ఓర్పుతో సుఖదుఃఖాలను సమానంగా భావిస్తాడు. సంతృప్తితో, మనోనిగ్రహంతో, దృఢనిశ్చయంతో జీవితాన్ని గడుపుతూ మనస్సును, బుద్ధిని భగవంతుని కర్పిస్తాడు. కామక్రోధాలనే అంతశ్శత్రువులను జయించటంవల్ల లోకానికి అతడివల్ల ఎలాంటి భయమూ ఉండదు. సమబుద్ధి కలిగి ఉండటంవల్ల ఎలాంటి ఒడిదుడుకుల్లోను అతడు లోకాన్ని చూచి భయపడడు. సంతోషం, కోపం, భయం, ఉద్రేకం- వీటి ప్రభావం ఇతడిమీద కనపడదు. ఏ అపేక్షలేకుండా శుచిగా ఉంటూ, సమర్థుడై ఉంటాడు. అన్ని పరిస్థితుల్లోను ఉదాసీనంగా ఉండటంవల్ల నిశ్చింతగా ఉండి, తనంతట తాను ఏ పని ప్రారంభించకుండా కర్తవ్యాన్ని మాత్రం నిర్వహిస్తూ ఉంటాడు.

భక్తియోగాన్ని సాధించినవాడిలో సంతోషం, ద్వేషం, దుఃఖం, కాంక్ష- ఇవ్వేవీ కనపడవు. పుణ్య పాపకర్మలను రెంటినీ భగవంతునికే సమర్పిస్తాడు. ఇతడు మిత్రులు, శత్రువులు, మానావమానాలు, శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, నిందాస్తుతులు మొ॥ ద్వంద్వాల విషయంలో సమబుద్ధితో ఉండి, సంగంలేక, అప్రయత్నంగా లభించినదానితో సంతృప్తిపడి, మౌనంగా ఉంటూ, ఒకేచోట స్థిరంగా ఉండకుండా, స్థిరబుద్ధితో ఉంటాడు. ఇలాంటి భక్తుడంటే భగవంతుని కెంతో ఇష్టం.

**7. మూడు గుణాలు :** ప్రతి జీవిలోను, సత్త్వం, రజస్సు, తమస్సు అని మూడు గుణాలున్నాయి. ఈ మూడు గుణాలు ప్రకృతివల్ల పుడుతుంటాయి. వీటిద్వారానే ప్రకృతి జీవులందర్నీ వాళ్ళవాళ్ళ దేహాలలో బంధించివేస్తున్నది. ఈ మూడు గుణాల స్వరూప స్వభావాలు భిన్నభిన్నంగా ఉంటాయి.

**సత్త్వగుణం :** సత్త్వగుణం ప్రకోపించినప్పుడు దేహమంతా కాంతి మయంగా భాసిస్తుంది మానవుడు వివేకంతో ప్రవర్తిస్తుంటాడు. అప్పుడతడికి జ్ఞానాన్ని సంపాదించాలని, సుఖాన్ని పొందాలనే సంగం ఏర్పడుతుంది. ఇలాంటి సాత్త్వికస్థితిలో చనిపోయినవాళ్ళు గొప్పజ్ఞానులు పొందే నిర్మలమైన పైలోకాలను

పొందుతారు. సత్త్వగుణంతో ప్రవర్తించేవాడు ఎప్పుడూ నిండుగా, నిబ్బరంగా ఉంటాడు. సత్కార్యాల నాచరిస్తాడు. ధార్మిక జీవితాన్ని గడపగలుగుతాడు. మానవుడిలో సత్త్వగుణ ప్రభావం ఉన్నంతవరకే అతడికి చక్కని జ్ఞానం కలుగుతుంది.

రజోగుణం : రజోగుణం ప్రకోపించినప్పుడు జీవికి లోభం పుట్టుకొస్తుంది. అన్నీ తనకే కావాలంటాడు. అందుకోసమే అన్ని పనులూ చేయాలనే ప్రవృత్తి ఏర్పడుతుంది. ఫలప్రాప్తి కలగకపోతే అశాంతి అలుముకుంటుంది. రజోగుణంవల్ల మానవుడిలో అనేకానేకాభిలాషలు పుడుతున్నాయి. ఆ అభిలాషల వల్ల ఎన్నో ఆశలు అల్లుకుంటాడు. ఆసక్తిని పెంచుకుంటాడు. అవన్నీ తనవేనని తన్నుకుంటాడు. ఆ తృష్ణవల్ల అతృప్తి మిగులుతుంది. ఈ గుణం మనకు కర్మలపైన నిరంతరాసక్తిని కలిగిస్తున్నది. అందుబాటులో లేనిదాన్ని అభిలషించడమే తృష్ణ. అందుబాటులో ఉన్నదాన్ని అభిమానించడమే సంగం. ఈ రజోగుణం ప్రకోపించిన దశలో చనిపోయినవాడు కర్మాసక్తికి కట్టుబడిపోయే మానవజాతిలోనే మళ్ళీ పుడతాడు. వీడినే రాజసుడంటారు. ఈ రాజస ప్రవృత్తి గలవాడు దురాశోపహతుడై దుఃఖాభాజనుడౌతాడు; భూలోకంలోనే తిరిగి తిరిగి పుడుతుంటాడు.

తమోగుణం : తమోగుణం ప్రకోపించడంవల్ల మనిషి కళాకాంతీ లేకుండా చెడిపోతాడు. వీడినే తామసుడంటారు. ఏ పని చేయాలన్నా వీడికి ఇష్టముండదు శుద్ధ సోమరిపోతుగా తయారౌతాడు. ఏ విషయాన్నీ తెలుసుకోవాలని ఉండదు. అజ్ఞానంతో అసందర్భంగా మాట్లాడటం, ముఖం మాడ్చుకోవడం, రుసరుసలాడటం, అన్నింటికీ అనుమానపడటం-అలాంటివాడికి సహజ లక్షణాలౌతాయి. తమోగుణం తలమీద కూర్చున్నప్పుడు మరణించినవాడు మంచీ చెడూ తెలియని పశుపక్ష్యాదుల్లో పుడతాడు. తమోగుణం అజ్ఞానాన్ని భ్రాంతిని, నిద్రను, జ్ఞానాన్ని ఆవరిస్తూ, అజాగ్రత్తను, పొరపాట్లను కలిగించి ఆత్మను శరీరంలో బంధిస్తుంది. తామసగుణం కలవాడు అధోలోకాలైన నరక పాతాళలోకాలకు పోతాడు.

సత్త్వగుణం దృఢంగా ఉన్నప్పుడు రజోగుణాన్ని, తమోగుణాన్ని అణచివేసి అదే ప్రవర్తిస్తుంది. అలాగే రజోగుణం సత్త్వ – తమోగుణాలను, తమోగుణం సత్త్వ-రజోగుణాలను అణగద్రొక్కి ప్రవర్తిస్తుంటాయి.

**గుణాతీతస్థితి రావాలి :** ప్రకృతినుంచి పుట్టిన సత్త్వరజస్తమోగుణాలే మనం చేసే ప్రతి పనికి కర్త. అంటే త్రిగుణాత్మకమైన మనస్సు కర్త. అంతేగాని ఆత్మకు కర్తృత్వం లేదు. సాక్షిమాత్రుడు మాత్రమే. ఇలా వివేకంతో త్రిగుణాలకంటే వేఱే కర్త లేరని తెలుసుకొని, ఆత్మగుణాతీతుడని తెలుసుకో గలిగితే భగవంతునితో సారూప్యాన్ని పొందవచ్చు దేహంవల్ల పుట్టిన సత్త్వ, రజస్సు, తమస్సు అనే ఈ మూడు గుణాలకు అతీతుడైనవాడు జననం, మరణం, జర, దుఃఖమనే బాధలనుంచి విముక్తుడై, అమృత స్వరూపుడౌతాడు.

**గుణాతీతుడెలా ఉంటాడు ? :** సత్త్వంవల్ల కలిగిన సుఖాన్ని, రజస్సు వల్ల కలిగిన ప్రవృత్తిని, తమోగుణంవల్ల కలిగిన అజ్ఞానాన్ని గుణాతీతుడు ద్వేషించడు. ఆ గుణకార్యాలు కలగకపోతే వాటిని కోరడు. అన్నిటికి తటస్థుడై ఉండి, గుణాలు ప్రవర్తిస్తున్నాయని మాత్రమే భావిస్తూ, ఏ ఒడుదుడుకుల్లోను చలించకుండా ఉంటాడు. సుఖదుఃఖాలలోను, మట్టిగడ్డ, రాయి, బంగారం మొII వాటిల్లోను, ఇష్టానిష్ట విషయాల్లోను, మానావమానాల్లోను, మిత్రుల విషయంలోను, శత్రువుల విషయంలోను సమభావన కలిగి ఉంటాడు. అన్ని కార్యాల్లోను కర్తృత్వభావాన్ని వదులుకొని ధీరుడై, బ్రహ్మనిష్ఠుడై ఉంటాడు. అలాంటి గుణాతీతుడు అనన్యభక్తియోగంతో భగవంతుణ్ణి సేవిస్తే సాయుజ్యాన్ని పొందుతాడు.

కనుక ముందు రజోగుణాన్ని, తమోగుణాన్ని, సత్త్వగుణ - ప్రభావంతో అణచివేసి, చివఱకు దాన్నికూడా పోగుట్టుకొని, గుణాతీతస్థితిని పొంది, పరబ్రహ్మసాయుజ్యాన్ని పొందడానికి ప్రతివాడు ప్రయత్నం చేయాలి.

**8. దైవీ సంపద; ఆసురీ సంపద :** లోకంలో వారి వారి వృత్తులను, ప్రవృత్తులనుబట్టి మానవులను రెండు రకాలుగా విభజించుకోవచ్చు. మొదటిది దైవీసంపద, రెండోది ఆసురీసంపద. ఈ రెండు వర్గాల్లో తేడాలు కొట్టవచ్చినట్లు కనబడుతుంటాయి.

**దైవసంపదను ఎలా నిర్ణయించాలి? :** మానవుల స్వరూపస్వభావాలను పరిశీలిస్తే వాళ్ళు ఏ వర్గానికి సంబంధించిన వాళ్లనే విషయం మనకు స్పష్టమౌతుంది. దైవ సంపదలో పుట్టినవాళ్లు సత్త్వగుణంతో ఉంటారు. వివేకం, నిర్భయం, దానం, ఇంద్రియనిగ్రహం, భగవంతుణ్ణి సదా ఆరాధించడం, స్వాధ్యాయం, తపస్సు, ఋజువుగా ఉండటం, అహింస, సత్యం, కోపం లేక

పోవడం, వితరణగుణం, శాంతి, ఇతరులను తప్పు పట్టకుండా ఉండటం, భూత దయ, ప్రాపంచిక విషయాలపై ఆసక్తి లేకపోవడం, మృదువుగా ఉండటం, చాపల్యం లేకపోవడం, తేజస్సు, ఓర్పు, ధైర్యం, పరిశుద్ధి, ఎవరికీ ద్రోహం చేయకపోవడం, దురభిమానం పెంచుకోకపోవడం మొ॥ లక్షణాలు ఎవరిలో ఉంటాయో వాళ్ళు దైవసంపదలో పుట్టినవాళ్ళని గుర్తించాలి.

**ఆసురసంపద నెలా గుర్తించాలి?** : ఆడంబరం, పొగరుబోతుతనం, దురభిమానం, కోపం, పరుషభాషణ ఇవి అసురసంపదలో పుట్టినవాళ్ళకు ఆజన్మసిద్ధమైన లక్షణాలు అసురసంపదలో పుట్టినవాళ్ళకు లోకంలో సంసారంలోకి పోయే ప్రవృత్తిమార్గం, తిరిగి భగవంతుని చేరే నివృత్తిమార్గం అని రెండు మార్గాలున్నాయని తెలియదు వాళ్ళల్లో పరిశుభ్రత, మంచినడవడి, సత్యనిష్ఠ మచ్చుకైనా కనపడవు ఈ ప్రపంచం మిథ్య అని, సృష్టికర్త అయిన భగవంతుడు లేడని, కామతో స్త్రీ పురుషులు కలవడంవల్లనే సృష్టి జరుగుతున్న దని, అంతకంటే వేరే ఏ కారణమూ లేదని వారి వాదం.

ఇలాంటి పిచ్చిపిచ్చి భావాలతో మనస్సులు నాశనం చేసుకొని, నీచబుద్ధులతో హద్దుపద్దులేని దుష్కర్మలతో ప్రపంచాన్ని నాశనం చేస్తుంటారు. ఎంత కాలానికీ సంతృప్తిలేని కామానికి బానిసలై, ఆడంబరం, గర్వం, మదం మొ॥ దుర్గుణాలతో అసత్య వాదాలను నమ్మి, అవినీతి మార్గంలో సంచరిస్తుంటారు. అనేక రకాల దిగుళ్ళతో జీవితాంతం, కామపురుషార్థమే చాలా ముఖ్యమైందని భావిస్తారు అనంతాలైన ఆశాపాశాలకు బద్ధులై, కామక్రోధాలకు బందీలై, భౌతిక సుఖాలకు కావలసిన ధనాన్ని అన్యాయంగా, అక్రమంగానైనా సంపాదిస్తుంటారు.

"ఈ రోజు ఇంత సంపాదించాను. రేపింత సంపాదిస్తాను. వీడు నా శత్రువు. వీణ్ణి నేనే నాశనం చేశాను. ఇంకా మిగతా వాళ్లను కూడా నాశనం చేస్తాను. నేనే ప్రభువును, భోగిని, సిద్ధుణ్ణి, బలవంతుణ్ణి. నేనెంతో సుఖపడుతున్నాను. నాలాగా ఇంత గొప్ప వంశంలో పుట్టినవాడింకెవ్వడూ లేడు. దాన ధర్మాలు, యజ్ఞాలు చేసి సుఖపడతాను" అని అజ్ఞానంతో పేలుతూ, అతిచంచలమైన మనస్సుతో, కామోపభోగాలలో తగుల్కొని చివరకు నరకం పాలౌతారు. అహంకారంతో, బలంతో, దర్పంతో, కామంతో, క్రోధంతో అంతర్యామిగా ఉన్న భగవంతుణ్ణి తన శరీరంలోగాని, ఇతరుల శరీరాల్లోగాని తెలుసుకోలేక

దేవుడున్నాడా? ఉంటే ఏడీ? కనపడడేం? అని దూషిస్తారు. అలాంటివాళ్లు తిరిగి తిరిగి ఆసురవర్గంలోనే పుడుతూ ఉంటారు. చివరకు ఎంతో నీచమైన గతిని పొందుతారు.

సమాజంలో ఇలాంటి బాపతే నూటికి తొంభైమంది అని వేతే చెప్పక్కర్లేదు. దైవసంపదను వెతికి వెతికి తెలుసుకోవాలి కానీ ఆసురసంపద విశ్వవ్యాప్తంగా ఎక్కడైనా దర్శనమిస్తుంది. అంగరంగవైభవాంతో ఉన్న ఆసురీసంపదను అభ్యాసంతో అణచివేసి దయనీయంగా ఉన్న దైవసంపదను అందరిలోను ఉద్ధరించాలి

**మూడు ద్వారాలు :** నరక లోకానికి పోవడానికి ముఖ్యంగా మూడు ద్వారాలున్నాయని భగవాన్ ఇలా చెబుతున్నారు : "ఆత్మవినాశాన్ని కొని తెచ్చే కామం, క్రోధం. లోభం అనే మూడు నరకానికి వెళ్ళడానికి మూడు ద్వారాలు వీటిల్లో ఒక్కదాంట్లో ప్రవేశిస్తే చాలు, నరకం నాలుగడుగుల్లో ఉంటుంది వివేకం గలవాడు వీటిని దూరంగా పెట్టి, శ్రేయోమార్గాన్ని అనుసరించి, లోకకల్యాణాన్ని సాధించి, ఉత్తమగతిని పొందుతాడు."

**9. మూడు శ్రద్ధలు :** మానవుని స్వభావాన్నిబట్టి వాడి శ్రద్ధను తెలుసుకోవచ్చు. శ్రద్ధే మానవుణ్ణి తీర్చిదిద్దుతుంది. నిజంగా చెప్పాలంటే, మానవుడు శ్రద్ధాస్వరూపుడే. లోపలి విశ్వాసాన్ని బట్టే బాహ్యప్రవృత్తి ఏర్పడుతుంటుంది. అంటే, విశ్వాసమే శ్రద్ధ అని భావార్థం. మానవుడిలో స్వభావసిద్ధంగా సంక్రమించే ఈ శ్రద్ధలు సాత్త్విక శ్రద్ధ, రాజస శ్రద్ధ, తామస శ్రద్ధ, అని మూడు రకాలు.

**సాత్త్విక శ్రద్ధ కలవాళ్ళెలా ఉంటారు ? :** సాత్త్విక శ్రద్ధ కలవాళ్ళు దేవతలను ఆరాధిస్తారు. చమురుతో చేయబడి, బాగా ఆకలిని తగ్గించే మధురమైన, రుచికల ఆహారాలను వాళ్ళు ఇష్టపడతారు. 'ఇది నా కర్తవ్యం' అనే భావంతో మనస్సమాధానంతో ఫలాకాంక్ష లేకుండా శాస్త్రోక్తంగా వాళ్ళు యజ్ఞాలను చేస్తారు. త్యాగభావంతో చేసే ప్రతిఆరాధన యజ్ఞమే అవుతుంది. నియమనిష్ఠలతో ఫలాభిలాషలేకుండా కాయిక-వాచిక- మానసిక తపస్సులు చేయడం వాళ్ళకు సహజం. మంచిక్షేత్రంలో మంచి పర్వకాలంలో యోగ్యుడైన వానికి, ఇంతవరకు తనకు ఏ ఉపకారం చేయనివానికి హృదయపూర్వకంగా సంకల్పించి వాళ్ళు దానం చేస్తారు.

**ఎవరు రాజసశ్రద్ధ కలవాళ్లు?** : యక్షరాక్షసులను ఆరాధించేవాళ్ళు రాజస శ్రద్ధ కలవాళ్ళు బాగా ఉద్రేకాన్ని కలిగించేవి, కడుపులో మంటపుట్టించేవి, దాహాన్ని కలిగించేవి, ఉప్పు, పులుపు, కారం ఎక్కువగా ఉండేవి, చేదైనవి, వేడిచేసేవి అయిన ఆహారాలమీద వాళ్ళకు మోజు అధికం. ఏదైనా ఫలాన్ని కోరిగాని, ఆడంబరంకోసంగాని వాళ్ళు యజ్ఞాలు చేస్తుంటారు. ఇతరుల సత్కారాలకోసం, గౌరవంకోసం, అట్టహాసంగా తపస్సు చేస్తుంటారు. అది క్షణికమైందేగాని శాశ్వతమైందికాదు. ఇంతకుముందు పొందిన ఉపకారానికి ప్రత్యుపకారం చేయాలని గాని, ఏక వేరే ఫలాన్ని అభిలషించిగాని, లోలోపల బాధపడుతూ వీళ్ళు దానాలు చేస్తుంటారు.

**తామసశ్రద్ధకలవాళ్ళనెలా గుర్తించడం?** : తామసశ్రద్ధకలవాళ్ళు ఎప్పుడూ భూత-ప్రేత-పిశాచాలను పూజిస్తుంటారు. ఎప్పుడో వండింది, రుచి చెడిపోయింది. నిలువ ఉండి పాసిపోయింది వాసన కొట్టేవి, ఎంగిలిది, అపవిత్రమైంది అయిన ఆహారమంటే వాళ్ళకు ఎంతో ఇష్టం. వాళ్ళు చేసే యజ్ఞానికి శాస్త్రప్రమాణమేదీ ఉండదు. అందులో సరైన మంత్రోచ్చారణంగాని, దక్షిణలివ్వడంగాని, అన్నదానంగాని ఉండదు సరిగదా, ఏ పనిలోను శ్రద్ధ కనపడనే కనపడదు. మూర్ఖంగా, పిచ్చి పట్టుదలతో శుష్కోపవాసాలు చేస్తూ తన శరీరాన్ని బాధించుకుంటూ ఇతరులను నాశనం చేయాలనే సంకల్పంతో ఘోరమైన తపస్సులను కూడా చేస్తారు. అపవిత్రమైన ప్రదేశాల్లో, నిషిద్ధమైన కాలాల్లో, గౌరవం లేకుండా అవమానిస్తూ అపాత్రులకు వీళ్ళు దానం చేస్తుంటారు.

**తపస్సులు మూడు** : ఇంద్రియమాలిన్యాలను బాగా కరిగించి, పోగొట్టుకోవటానికి చేసే సాధనకే తపస్సని పేరు. దీనివల్ల శమ దమాలు సిద్ధిస్తాయి. త్రికరణాలు పరిశుద్ధమౌతాయి. అందుకే ఇది శారీరక-వాచిక - మానసిక భేదాలతో మూడు రకాలు.

**శారీరక తపస్సు** : కరణమంటే సాధనం. మానవుడు ప్రవర్తించటానికి శరీరం, మాట, మనస్సు మూడు సాధనాలుగాబట్టి అవి త్రికరణాలు. అందులో శరీరం చాల ముఖ్యమైంది. అందుకే కాళిదాసు "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అని అన్నాడు. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పరిశుద్ధిగా ఉండటం, మనస్సును, మాటను అనుసరించి ఋజువుగా ఉండటం, బ్రహ్మచర్యాన్ని, అహింసను పాటించటం శరీరంతో చేసే తపస్సు.

**వాచిక తపస్సు :** ఇతరులకు బాధ కలిగించకుండా, సత్యం, ప్రియం, హితమైన మాటను మాట్లాడటం, తన వేదశాఖను, వేదాంతాన్ని, పురాణాలను అధ్యయనంచేసి అభ్యాసం చేయడం వాచిక తపస్సు.

**మానసిక తపస్సు :** మనస్సును నిర్మలంగా ప్రసన్నంగా ఉంచుకోవడం, శాంతస్వభావం ఎల్లప్పుడు భగవద్భావనతప్ప ఇతరభావనలు రాకుండా చూసుకోవడం, ఇంద్రియాలవెంట పడిపోకుండా మనస్సును నిగ్రహించడం, మంచిభావనలతో ఉండటం మానసికతపస్సు.

అశ్రద్ధతో ఏ పని చేసినా అది వ్యర్థమే అవుతుంది. అశ్రద్ధతో చేసే పూజలు, యజ్ఞాలు తపస్సులు, దానాలు బూడిదలో పన్నీళ్లే. వాటివల్ల ఈ లోకంలో గాని పరలోకంలో గాని ప్రయోజనం శూన్యం. అందుకనే ప్రతి పనీ శ్రద్ధతో చేయాలి. అందులోను సాత్త్వికశ్రద్ధతో చేయటానికి అభ్యాసం చేయాలి.

**10. సామాజిక దృక్పథం :** మోకాళ్లు పట్టుకుపోయి మోక్షార్థులైన వాళ్లకు మాత్రమే భగవద్గీత ఉపయోగిస్తుందని ఎవరైనా అనుకుంటే అది అజ్ఞానంతో అనేమాట అని అనకతప్పదు. ఈనాటి సమాజంలో సహస్రాధిక సమస్యలతో సతమతమయ్యే సగటు మానవుడికికూడా గీతామాత తన సందేశాన్ని అందిస్తున్నది. ఇక్కడ ఈ లోకంలోనే, మనం చక్కని సమ సమాజాన్ని నిర్మించుకోవటానికి భగవద్గీత భవ్యమైన ఉపదేశం చేస్తున్నది. ఆ మహోపదేశాన్ని చెవిలో వేసుకుంటే మనం తృప్తితో జీవించవచ్చు; ఈ సమాజాన్ని శాంతితో జీవించ నియ్యవచ్చు. ఎన్నో సందర్భాల్లో భగవద్గీతలో అలాంటి మహోపదేశాలు కనపడుతున్నాయి. అయినా మచ్చుకు కొన్ని మాత్రం ఇక్కడ ఉదాహరిస్తాను-

సమాజంలో ప్రతివాడికి ఎన్నో కష్టనష్టాలు; సుఖదుఃఖాలు ఏర్పడుతూనే ఉంటాయి. సంసారంలో అది చాలా సహజమైన విషయమే. కానీ మానవుడు కష్టాలకు కుంగిపోతాడు; సుఖాలకు ఉబ్బితబ్బిబ్బులౌతాడు. గీతామాత అలా కాకూడదని చెబుతుంది. ఎలాంటి ఉద్రేకాలకు గురికాకుండా స్థిరబుద్ధితో వివేకంతో ఉండమని ఇలా ఉపదేశిస్తుంది :

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసంమూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః॥ 5-20

ఎన్ని చదువులు చదివినా, ఎన్ని దేశాలు తిరిగినా, ఎంత వయస్సు వచ్చినా, సమ సమాజ స్థాపనకోసమే అవతరించామని గొంతులు ఎంత చించుకున్నా సమాజంలో ప్రతివాడిని తనతో సమానంగా చూడటం కొద్దిమందిలో కూడా కనపడదు. ఎవరికైనా కష్టం వస్తే- అది తనకే వస్తే తనెంత బాధ పడతాడో, ఇతరుల సహాయంకోసం ఎంతగా ఎదురుచూస్తాడో; అలాగే ఇతరుడికి కూడా ఉంటుందని భావించి అతణ్ణి ఆదుకోవాలి. ఆదరించాలి ఇతరులకు కష్టం కలగకుండా జాగ్రత్తగా అందరూ ప్రవర్తిస్తే, ఎవరికీ ఏ బాధలూ ఉండవు. అలాంటివాడే భగవానుడికి ప్రీతిపాత్రుడు. చూడండి :

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!

సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 6-32

నీ ప్రవృత్తి చుట్టూ ఉండేవాళ్ళను భయపెట్టేటట్లు ఉండకూడదు అలాగే ఈ లోకాన్ని చూసి నీవూ భయపడకూడదు సంతోషం, కోపం, భయం- ఈ మూడింటి ఉద్రేకాలు నీ మనస్సును తల్లకిందుచేయకూడదు. అప్పుడే నీవు భగవంతుడికి ప్రేమపాత్రుడౌతావు. అబ్బ! ఎంత గొప్ప సాధన! ప్రతి వ్యక్తి ఇలా సాధన చేయగలిగితే సమాజం ఎంత శాంతితో ఉంటుంది !

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।

హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః॥ 12-15

ఎక్కడికోపోయి ముక్కుమూసుకొని కొంగజపం చెయ్యక్కర్లేదు. ఈ సమాజంలో ఎక్కడ ఉన్నా, ఏ వృత్తిలో ఉన్నా, ఏ పని చేస్తున్నా ప్రతివాడు వాచిక తపస్సు తప్పకుండా చెయ్యవచ్చు. వాచిక తపస్సంటే ఏమీలేదు; అవతలవాడు ఆవేదనపడేటట్లు మాట్లాడకూడదు. సత్యాన్ని హితాన్ని ప్రియంగా చెప్పాలి. ఆధ్యాత్మిక సాహిత్యాన్ని చదువుతూ, చెబుతూ ఉండాలి ఇంతే. ఇదే మాటద్వారా మనంచేసే తపస్సు. ఇలాచేస్తే మాటను మన ఆధీనంలో పెట్టుకోవచ్చు. అలా సమాజంలో ప్రతి వ్యక్తి అభ్యాసం చేస్తే తగాదాలు, గిల్లికజ్జాలు, పరదూషణలు, ప్రతిదూషణలు ఎలా ఏర్పడతాయి ? అందరు ఎంత ఆనందంగా ఉంటారు ! భగవద్గీత ఈ అంశాన్ని ఎంత చక్కగా ఉపదేశిస్తున్నదో చూడండి :

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।

స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 17-15

సమ సమాజాన్ని చక్కగా తీర్చిదిద్దుకోవడానికి, బ్రతికినంతవఱకు శాంతితో సుఖంగా తాను బ్రతికి ఇతరులను బ్రతకనివ్వడానికి మానవు డనుస రించవలసిన సమాజ కల్యాణ సూత్రాలను ఇంకెన్నింటినో భగవద్గీత చక్కగా తెలియజేస్తున్నది సమాజాన్ని సన్మార్గంలో పెట్టి, తద్వారా లోకానికి శాంతిని పంచిపెట్టాలని తహతహలాడే మహాత్ములకు భగవద్గీత ఒక మహిమాన్వితమైన సాధనం.

**11. ధార్మిక దృష్టి :** ఈ జగత్తు స్థితికి, గమనానికి మూలసూత్రం ధర్మం. పుడమిలో పుట్టిన ప్రతి పురుషుడు ఎలాగైనా సాధించాల్సినవి నాలు గున్నాయి అవే ధర్మం, అర్థం, కామం, మోక్షం. ప్రతి జీవి కోరుకొనేవి కాబట్టి వీటిని పురుషార్థాలు అంటారు. అర్థకామాలు ధర్మాన్ని అతిక్రమించకుండా ఉంచే అతడికి మోక్షం సులభమౌతుంది. అర్థకామాలు ధర్మాన్ని తోసిరాజని విజృంభిస్తే మానవుడు దానవుడై ఎన్నో అనర్థాల పాలౌతాడు. మోక్షం లభించదు సరిగదా, మోహ మహోదధిలో మునిగిపోతాడు. మోహ క్షయమే మోక్షమని గదా భగవాన్ భవ్యోపదేశం! అందుకే ప్రతివాడికి ధార్మికదృష్టి కావాలి. మన జీవితాల్లో ధార్మికదృష్టి పెరగాలని ధర్మం కేంద్రస్థానంగా సమాజం చక్కని రూపుదిద్దుకోవాలని ఆర్ష సంస్కృతికి చెందిన ప్రతివాడు ఆశిస్తాడు. 'ధర్మమూల మిదం జగత్' కాని, 'ధనమూల మిదం జగత్' కాదు అని గట్టిగా విశ్వసిస్తాడు.

ధర్మం అడుగంటిపోయి అధర్మం అగ్రాసనాధిపత్యం వహించినప్పుడే అవతారాలు ఏర్పడతాయి. అవతారపురుషుల అమృత సందేశవాహినులు మన గుండెలపై అలుముకున్న అధర్మకాలుష్యాన్ని క్షాళనం చేస్తాయి. అలాంటి ప్రయ త్నమే భగవద్గీతలోనూ జరిగింది. ఈ సమాజంలో ధార్మికదృష్టి ఎలా కలుగు తుందో పరమపురుషుడు భగవద్గీతలో పదేపదే నిరూపించాడు. అందులో కొన్నింటిని మాత్రం ఉదాహరణకు ఇక్కడ పేర్కొంటున్నాను—

**ధార్మిక జీవితా న్నెలా గడపడం? :** "నాకు అది కావాలి, ఇది కావాలి, అంత కావాలి, ఇంత కావాలి" అనే కోరికలు లేకుండా భగవదనుగ్రహంవల్ల గాని, సుఖ ప్రారబ్ధంవల్లకాని అప్రయత్నంగా లభించినదాంతో సంతృప్తిపడాలి. అందులోనే ఆనందం ఉంది. శీతోష్ణాదిద్వంద్వాల ప్రభావానికి లొంగిపోకూడదు. అందరికి కలిగే మంచిని చూసి ఆనందపడాలేగాని, అసూయపడకూడదు. చేపట్టిన కార్యం సిద్ధించినా సిద్ధించకపోయినా చెక్కుచెదరకుండా సమబుద్ధితోనే

ఉండాలి. ఇలా నిస్సంగంగా, ధార్మికంగా జీవించేవాడికి కర్మబంధం ఉండనే ఉండదు. వినండి- పార్థసారథి పరమోపదేశం :

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ 4-22

**ఎవరిని పూజించడం మంచిది? :** శ్రద్ధాభక్తు తో నీ ఇష్టదైవం ఎవరైనా సరే, వాళ్లను పూజించు ! నీవు ఎవరిని పూజిస్తున్నావనేది కాదు ముఖ్యం. ఎంత శ్రద్ధగా, ఎంత భక్తితో పూజిస్తున్నావనేది ముఖ్యం. సనాతన ధర్మం సహనానికి పెట్టింది పేరు. నీ కిష్టమైన దేవుణ్ణి నీవు పూజించు ! కాని ఇతరుడు చేస్తున్న పూజ నిష్ఫలమని నిందించకు! "నీ వేరూపాన్ని పూజించినా సరే, నీకారూపంలోనే శ్రద్ధ కలిగేటట్లు నే ననుగ్రహిస్తా"నని భగవాన్ ప్రతిజ్ఞ. అందువల్ల విష్ణువును పూజించేవాళ్లు శివుణ్ణి, శివుణ్ణి పూజ చేవాళ్ళు విష్ణువును, ఈ ఇద్దఱు శక్తిని దూషించనక్కఱలేదు. వారి ఇష్టదేవతను పూజించడంలో శ్రద్ధను, భక్తిని పెంచుకుంటే చాలు. వర్షం ఎక్కడపడ్డా, అది చేరేది సముద్రంలోకేనని మరచిపోకూడదు. భగవాన్ ఏమంటున్నారో వినండి :

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ 7-21

**నేనుండగా నీకెందుకు భయం? :** "నీవే తప్ప నితఃపరంబెరుగ" నని అనన్య భక్తితో ఆయన్ను ఆరాధిస్తే మన యోగక్షేమాలను తప్పక ఆయనే ఆలోచిస్తాడు. ఇది ఊరికే చెప్పేమాటకాదు; భగవంతుడు ఘంటాపథంగా చేసిన ప్రతిజ్ఞ. అలా శరణాగతి చేసినవాడికి ఆయన అభయం ఎప్పుడూ ఉంటుంది. అసలు సిసలు ప్రతిజ్ఞను ఆలకించండి :

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 9-22

**పత్రి ముఖ్యమా? భక్తి ముఖ్యమా? :** మీ అధికారాలకు, భోగభాగ్యాలకు నేను లొంగను! భక్తితో నాకంకితమైన మీ హృదయానికి లొంగుతాను అంటారు భగవాన్. ఎన్ని పుట్లు పత్రి తెచ్చి పూజించినా, పంచభక్ష్యపర మాన్నాలను అర్పించినా, భక్తి లేకపోతే అదంతా వ్యర్థమే. ఏ ఆకునో, ఏ పువ్వునో, ఏ పండునో, చివఱకు కాసిని నీళ్ళనైనా సరే, భక్తితో సమర్పిస్తే

చాలు; భగవంతుడు తప్పక పరిగ్రహిస్తాడు. కాబట్టి పూజలో బాహ్యాడంబరాలు కాదు కావలసింది, అంతశ్శుద్ధి కావాలి చూడండి, స్వామి ఎలా చెబుతున్నారో-

పత్రం పుష్పం ఫలంతోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః॥ 9-26

ఇలా ధార్మిక జీవితాన్ని గడిపేవాళ్ళు సాగించాల్సిన సాధనను సహజ సుందరంగా, సమన్వయపూర్వకంగా అందిస్తున్నది భగవద్గీత.

**12. ఆధ్యాత్మిక భావన:** 'నేను చేస్తున్నాను,' 'నా వల్లనే ఇదంతా జరుగుతున్నది,' 'నేను లేకపోతే ఏదీ జరగదు' అనే భావనలు మనలో బుసలుకొడుతున్న అహంకారానికి అందమైన రూపాలు. అహంకారంతోనే అందరు చెడిపోతారు. నిజమాలోచిస్తే, నీవు పుట్టకముందే ప్రపంచం ఉంది. నీవు పుట్టకముందే సూర్య చంద్రు లుదయిస్తున్నారు. నీ తరువాత కూడా ప్రపంచం ఉంటుంది; సూర్య చంద్రులు ఉదయిస్తూనే ఉంటారు. మరి నీ పాత్ర ఏమిటి? నీ ప్రారబ్ధంకొద్దీ నీకు జన్మ వచ్చింది. ఈ జగన్నాటక రంగస్థలం మీద నీ పాత్రను నీవభినయిస్తావు. అది పూర్తి అయిన మరుక్షణం తెరమరుగైపోతావు. నీవు నమ్మినా నమ్మక పోయినా ఇది సగ్నసత్యం. కాబట్టి నీవొక నిమిత్తమాత్రుడివేనని; విధి చేతిలో కీలుబొమ్మవని వివేకంతో గ్రహించాలి. నిర్మలంగా తీర్చిదిద్దుకున్న నీ జీవిత కుసుమాన్ని సృష్టి స్థితి లయకారకుడైన భగవానుని పవిత్ర పాదపద్మాల ఆరాధనానికి అంకితం చేయాలి. ఈ దృక్కోణంలో భగవంతుని ఆణిముత్యాల్లాంటి సందేశాలనందిస్తున్నది భగవద్గీత- చూడండి:

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ! మదర్పణమ్॥ 9-27

'నీ వేపని చేసినా, దేన్ని తింటున్నా, దేన్ని త్యాగం చేస్తున్నా, ఏ దానం చేస్తున్నా, ఏ తపస్సు చేస్తున్నా. అదంతా నాకు సమర్పించు! వాటి ఫలాన్ని ఆపేక్షించకు, అంటున్నాడు ఆ దేవుడు. మనం కర్తవ్యభావనతో ప్రతిపని శ్రద్ధగా చేసి భగవంతుని పాదపద్మాలకు దాన్ని సమర్పించాలి. భగవాన్ ఫలప్రదాత కాబట్టి, ఎలాంటి ఫలాన్ని అనుగ్రహించినా అది ఆయన ప్రసాదమనే భావించాలి నీవు ఏ వృత్తి చేస్తున్నా, దాన్ని భగవదర్పణ బుద్ధితో చేయాలి. ఆహా! ఎంత ఉదాత్తమైన భావన!

**సులభమైన మార్గం :** ''ఏమి స్వామీ! కర్మలు చేయాలన్నావు. కర్మ సన్న్యాసం చేయమన్నావు. బుద్ధియోగమే బుద్ధిమంతులకు మంచిదన్నావు. భక్తి యోగం భవబంధాలను తుంచివేస్తుందన్నావు. ఏదని చేయను? ఎలా తరించను? నీ అనుగ్రహ మెలా కలుగతుంది? ఈ పాపపంకిలం ఎలా పటాపంచలౌతుంది? దీనికి సులభమార్గమేదీ లేదా స్వామీ?'' అని అధ్యాత్మమార్గనిష్ఠుడైన సాధకుడు వాపోతున్నాడు. మందస్మిత వదనారవిందుడైన మాధవుడు, మానవుని బల హీనతకు జాలిపడి ఇలా అన్నారు: ''ఏమీ బాధపడకు! ఇవన్నీ నీకక్కరలేదు. నీకొక సులభమైన మార్గాన్ని చెబుతాను, విను! నన్నొక్కడినే శరణు పొందు! జన్మజన్మాంతరాలలో చేసిన పాపాలన్నింటినుంచి నిన్ను విడిపించి, శాశ్వతా నందాన్ని నీకు సమకూరుస్తాను.''

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ!
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥ 18-66

అనన్య భక్తితో ''నేను నీవాడని''ని శరణాగతి చేయడమే సంసార బంధాలనుండి విముక్తి పొందడానికి సులభమైన మార్గం. స్వామి చెబుతారు- ''సంశయగ్రస్తుడైనవాడు ఆత్మవినాశాన్నిదప్ప దేన్నీ సాధించలేడు. 'సంశ యాత్మా వినశ్యతి' అని గదా ఆయన మనకందిస్తున్న అష్టాక్షరి! కాబట్టి విశ్వాసంతో విశ్వరూపుణ్ణే ఆశ్రయించాలి. అందుకే ''మీ విశ్వాసం ఎంత దృఢంగా ఉంటే, నా అనుగ్రహం అంత పెద్దదిగా ఉంటుంది. మీ విశ్వాసమనే పునాదిపైన నా అనుగ్రహ మహాభవనాన్ని నిర్మిస్తాను'' అంటారు భగవాన్.

**13. విశ్వజనీన సందేశం :** భగవద్గీత మన కందించే సందేశం ఏదో ఒక దేశానికో, ఏదో ఒక కాలానికో పరిమితమైంది కాదు. ఈ విశాలవిశ్వంలో ఉన్న మానవజాతి కంతటికి సంబంధించింది. ఎందుకంటే, మానవుల కందరికి కొన్ని సమానమైన సమస్యలున్నాయి. అవి ఏ దేశంలో పుట్టినా, ఏ కాలంలో పుట్టినా మారేవికావు. వాటిని పరిష్కరించుకోవాలంటే సాధన కావాలి. ఆ సాధనను సమగ్రంగా వాళ్ళకు వాళ్ళకు తగినట్లు సమన్వయిస్తూ నిరూపిస్తున్నది భగవద్గీత. అందుకే గీతాసందేశం విశ్వజనీనసందేశం. అది లోకకల్యాణానికి ఉద్దేశింపబడిన మహోపదేశం!

రాగద్వేషాలతో రగిలిపోతున్న ఈ విశ్వమానవాళికి గీతామాత మంద హాసాలే శాంతిప్రేమ సందేశాలు. మనస్సులో, మాటలో, మనుగడలో ఏకరూపత

లేని ఏకైక మానవజాతికి సత్యధర్మాలే దయతో ఆమె నిత్యమూ అందించే అపాంగ వీక్షణాలు.

**మరణం మానవుడిచేతిలో లేదు :** మరణభీతితో మజీచెడిపోతున్నాడు మానవుడు. తను ఎన్నాళ్ళు బ్రతుకుతాడో ఖచ్చితంగా ఎవడూ చెప్పలేడు. ఇది విశ్వంలో అందరికీ సమస్య. అలాంటి మరణాన్ని గురించి భగవద్గీత ఇస్తున్న సందేశం ఏమిటి? చూడండి :

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 2-22

సరదాగా కొత్తగుడ్డలు కుట్టించుకున్నాం. కొన్నాళ్ళకు అవి పాతబడిపోతాయి. వాటిని వదిలిపెట్టి వేరేగుడ్డలు తొడుక్కుంటాం. కాని, పాతగుడ్డలను వదిలేశామని ఎవరన్నా ఏడుస్తున్నారా ? లేదు. మన ఆత్మకూడా అలాగే శిథిలమైపోయిన శరీరాన్ని వదిలిపెట్టి ఇంకోశరీరంలో ప్రవేశిస్తుంది. ఆత్మ శరీరాన్ని వదిలిపెట్టడమే మరణం. ఇంకో శరీరాన్ని పొందడమే జన్మ. మానవుడు వద్దన్నా ఇది ఆగేదికాదు. కనుక చనిపోతామని ఏడవడం ; లేక ఎవడో చనిపోయాడని ఏడవడం శుద్ధఅవివేకం. అలాగే అశాశ్వతమైన ఈ శరీరాన్ని శాశ్వతమనుకొని, దాని కోసం రాగద్వేషాలలో, అహంకారంతో జీవితాన్ని పాడు చేసుకోకూడదు. ఇది మానవజాతికంతటికి గీతామాత అందించే దివ్యోపదేశం.

**సమభావమే సర్వదా ఉండాలి :** కార్యసిద్ధి కలిగితే కన్నూ మిన్నూ కానకుండా ఎగరటం, కార్యం సిద్ధించకపోతే జావగారిపోవడం మానవులందరి లోను కనపడే లక్షణం. అది సరైన ప్రవృత్తికాదు. సుఖం కలిగినా దుఃఖం కలిగినా, లాభం వచ్చినా. నష్టమే సంభవించినా, జయం సిద్ధించినా, అపజయమే ఏర్పడినా, రెండు సందర్భాల్లోను సమభావన చాలా అవసరం. పని జరగలేదు కదా అని అన్ని పనులు మానేయడం మంచిదికాదు. ఫలాపేక్షలేకుండా శ్రద్ధతో 'ఇది నా కర్తవ్యం' అనే భావనతో నీ బాధ్యతలను నీవు నిర్వహించాలి. ఫలం భగవాన్ అనుగ్రహంవల్ల లభిస్తుంది. ఏది లభించినా సంతోషంతో స్వీకరించ డానికి సన్నద్ధంగా ఉండాలి. అప్పుడు కర్మలవల్ల ఏదోషమూ నీకు అంటదు. కర్తవ్యాన్ని శ్రద్ధగా నిర్వహిస్తున్నాననే తృప్తి ఉంటుంది. జీవిత సమరాని

ధైర్యంగా సాగించడానికి మానవులందరికీ సనాతనసారథి, పార్థసారథి అందిస్తున్న **అమృతోపదేశం** ఇది. అందుకోండి :

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥ 2-38.

**14. భగవద్గీత అందరికోసం :** విభిన్న సంస్కృతులు, విభిన్న సంప్రదాయాలు, అనేక పంథాలు, అనేకానేకాభిరుచులతో ఈ సమాజం చిత్రవిచిత్రంగా రూపుదాలుస్తుంటుంది. నిరంతరం పరిణామాన్ని చెందుతుంటుంది. ఒకరికి ఇంకొకరి అభిరుచి నచ్చదు కొంతమందికి ఇంకొకరి సంప్రదాయం మీద గౌరవముండదు. ఒక పంథావారికి ఇంకొక పంథా అంధకూపంలాగా, అజ్ఞానవిలసితంగా కనపడుతుంది. ఇక అందరికీ ఇతరుల సంస్కృతుల్లో, సంప్రదాయాల్లో, పంథాలలో, అభిరుచుల్లో మంచి ఏమైనా ఉంటుందేమో! దాన్ని గ్రహిస్తామనే సదవగాహన ఉండనే ఉండదు. సహనం మాట సరేసరి; అది గగనారవిందం. ముందు మానవుడు వేసుకున్న పైముసుగులన్నీ దూరంగా పెడితే, ఈ విశ్వంలో మిగిలేది శుద్ధమైన మానవత్వం ఒక్కటే. ఆ నిత్యమైన సత్యాన్ని విస్మరించాడు పీఠనపడ్డ నేటి మానవుడు. తనకు తోచినట్లు మాట్లాడటం అలవాటు చేసుకున్నాడు. వివేకం, విచారణ వింటానికి కూడా కరువైనాయి

సన్న్యాసులకే భగవద్గీత : కొందరంటారు- ''జీవితాన్ని గడపటం చేతకాకనో, పెళ్ళాం నోటికి భయపడో, నిప్పులు కురిపించే అప్పులవాళ్ళ బాధలు పడలేకనో, ఒక శుభముహూర్తంలో కాషాయం వేసుకొని, శిష్యవ్యూహాన్ని ఎన్నుకొని, సన్న్యాసులమైనామనుకొనే సన్న్యాసులు భగవద్గీత చదువుకోవాలి. భక్తిగీతాలు పాడుకోవాలిగాని, మాకెందుకండీ భగవద్గీత ! మేమేదో గుట్టుగా మా కాపురాలు మేం చేసుకుంటున్నాం. మమ్మల్నెందుకండీ ఈ వేదాంతం రొంపిలోకి దించుతారు?'' అని.

ముసలివాళ్ళకే భగవద్గీత : ముసలి లక్షణాలను మూసిపెట్టుకొంటూ కూడా, మా యౌవనానికేం లోటు? అని మిడిసిపడే మిడిమేలపు యువకులు, నిజమైన యౌవనంవల్ల కలిగిన శక్తియుక్తులను సమాజసేవ కంకితం చేయాలని చెప్పేవాళ్ళు లేక, ఎవరన్నా చెప్పినా వినక, తాము చెడిపోవటంకాక సమాజాన్ని తమ దురహంకారంతో చెడగొడుతున్న కొన్ని చత్వరవృషభాలు ఇలా అభిప్రాయపడతాయి. ''మాకా? భగవద్గీతా? అయ్యో! రామా! కాళ్ళు కీళ్ళు బాగా పని

చేస్తున్నాయి. కళ్ళు కనపడుతున్నాయి, చెవులు వినపడుతున్నాయి. లక్షణంగా ఉద్యోగాలు చేసుకుంటున్నాం, మా చదువులు మేం చదువుకుంటున్నాం, లోకాన్ని ఉద్ధరిస్తున్నాం. దాన్ని కాటికి కాళ్ళు చాచుక్కూచున్న ఆ ముసలాళ్ళను చదువుకోమనండి!"

**రోగిష్టివాళ్ళకే భగవద్గీత :** "ఆరోగ్యంగా ఉండి, అంతో ఇంతో సుఖంగా ఉన్న మాకోసంటండీ భగవద్గీత ? దీర్ఘవ్యాధులతో కుంగి కృశించిపోయేవాళ్ళను చదువుకోమనండి! మా ఆరోగ్యానికి, ఆయుష్యానికి ఇప్పట్లో ఏం ఢోకాలేదని జ్యోతిష్కులు గూడా బల్లగుద్ది చెపుతున్నారు" అని ఎంతో ఆరోగ్యంగా, ఇంకెంతోకాలం తప్పకుండా బ్రతుకుతామనుకొనే ఆశాజీవుల వాదం.

**భగవద్గీత మేం చదవచ్చా?** "ఏమోనండీ! ఎవరో చెప్పారు-భగవద్గీత అందరూ చదవకూడదని. అసలు ఆ పుస్తకమే ఇంట్లో ఉండకూడదట గదా! ఎంతో అరిష్టంట గదా! అందుకే, మా తాతగారు వదిలిపెట్టిపోయిన పాత భగవద్గీత పుస్తకమొకటి మా ఇంట్లో ఈ మధ్య కనపడితే చిత్తు కాగితాలవాడికి పడేశాం" అంటారు కొందరు అతి తెలివితేటలు ప్రదర్శిస్తూ.

ఇలా ఇంకెందరో ఈ సమాజంలో ఎన్నో రకాల, వాళ్ల అజ్ఞానాన్ని ఆరబోసుకుంటారు. కానీ భగవద్గీత సన్న్యాసులకు, ముసలివాళ్లకు, రోగిష్టివాళ్లకు మాత్రమే పనికొచ్చే ఆలోచనలను ప్రతిపాదిస్తుందే ఈ వాదనలన్నింటినీ అంగీకరించవచ్చు. గార్హస్థ్యానికి, సన్న్యాసానికి, యౌవనానికి, ముసలితనానికి, ఆరోగ్యానికి, అనారోగ్యానికి అతీతమైన ఆత్మకు సంబంధించిన తత్త్వాన్ని, సృష్టికీ, భగవంతునికి సంబంధించిన స్వరూపాన్ని ఆవిష్కరిస్తున్నది భగవద్గీత, అందుకే, అందుకే భగవద్గీత మానవుడై పుట్టిన ప్రతివానికి ప్రతి వయస్సులోనూ కావాలి. తన జీవితాన్ని మహితమైన ఆదర్శాలతో చక్కగా తీర్చిదిద్దుకొని, ప్రతివాడు సాధనతో మాధవాభిముఖంగా సాగాలంటే అందరికీ భగవద్గీత కావాలి. అది కొందరి కోసం కానేకాదు; అందరికోసం. సృష్టిలో ప్రతి వ్యక్తి చక్కగా జీవించే మార్గాన్ని, చేయవలసిన సాధనను పరమపురుషార్థమైన పరమపదాన్ని చేరే త్రోవను చూపిస్తుంది భగవద్గీత. అందువల్లే భగవద్గీత అందరికోసం.

**15. మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు :** కేవలం మోక్షం కోసమే భగవద్గీతను చదవాలా? లేక దానివల్ల ఇంకేమైనా ప్రయోజనా

లున్నాయా? అని చాలా మందికి సందేహం. ''అయ్యా! ఈ లోకంలో సంసారాల్లో పడే బాధలకు అంతం లేకుండా ఉంది. తెల్లవారి లేస్తే సమాజంలోని సగటు మనిషి ఎదుర్కోవల్సిసిన సమస్యలు ఇన్నీ అన్నీ అని చెప్పడానికి వీల్లేదు. ఈ దైనందిన సమస్యల్ని పరిష్కరించుకోవడానికి ఇరవై నాలుగు గంటలు సరిపోక సతమతమౌతున్నాడు ఈనాటి సమాజంలో ప్రతివాడు. అలాంటప్పుడు-తమరేమిటి బాబూ భగవద్గీత, భగవద్గీత అంటారు. అదేమైనా అందరి సమస్యల్ని ఆరుస్తుందా? తీరుస్తుందా? ''అంటారు కొందరు సోదరులు.

వాళ్ళందరికీ ఒకే ఒక సమాధానం, ప్రతి మానవుడు ఈ జీవితంలో నిబ్బరంగా, నిండుగా నిలబడి తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించడానికి, జీవితాంతంలో శాశ్వతానందాన్ని అనుభవించడానికి సుగమమైన మార్గాన్ని అందిస్తున్నది భగవద్గీత. సమస్యల్ని ఎదుర్కోవడానికి స్థైర్యం కావాలి. అసలు సమస్యలెలా పుట్టుకొస్తున్నాయో! లోపమెక్కడుందో! ఏం చేస్తే సమస్య లుత్పన్నం కాకుండా పోతాయో! అథవా ఏవో కొన్ని సమస్యలు అప్పటికి ఎదురైనా వాటిని ఎదిరించి ఎలా నిలబడాలో! వీటి నన్నింటిని భగవద్గీత భవ్యమైన మార్గంలో మనకందిస్తున్నది. కానీ, మనమే దాన్ని నిర్లక్ష్యం చేస్తున్నాం. పూజా మందిరాల్లో పెట్టి పూలతో పూజిస్తున్నామేగాని, అవతార పురుషుడైన ఆది దేవుని ఆ అమృతోపదేశాన్ని హృదయ మందిరాల్లో నిలుపుకోలేకపోతున్నాం. అది జరిగినప్పుడే మానవ హృదయారవిందాలు ప్రేమ మకరందాలను చిందించి, శాంతి నిలయాలుగా రూపొందుతాయి. ఇక్కడ మచ్చుకు ఒకటి రెండు సమస్యలను, భగవద్గీత వాటిని పరిష్కరించే తీరును ప్రతిపాదిస్తాను.

**సమస్య :** ఇందాకటిదాకా ఇద్దఱం కలిసే ఉన్నాం, ఎన్నో ఊహలు, ఎన్నెన్నో ఊహాగానాలు, మఱెన్నో భవిష్యత్ప్రణాళికలు, ఏదో చెయ్యాలని ఆరాటపడ్డాం. చేయగలమని గట్టిగా తలంచాం. ఎవరింటికి వాళ్ళం వచ్చేశాం. ఇంతలో పిడుగుపాటు వార్త. ఆకస్మికంగా అతడు గతించాడు. అతను నాకెంతో ఆప్తమిత్రుడు ఆరోగ్యంగా ఉన్నాడు. ఇంతలో విధి ఇలా వక్రిస్తుందని ఎవ్వరూ ఊహించనేలేదు. హతాశుణ్ణయ్యాను. చాలా కుంగిపోయాను. ఎంత ప్రయత్నించినా అతణ్ణి, మా స్నేహాన్ని మరచిపోలేకపోతున్నాను. ఇప్పుడేమిటి చెయ్యటం? ఇది ఎలా జరిగింది? ఏమిటీ జనన మరణాలు?

**పరిష్కారం** : ఎందుకలా కుంగిపోవడం? అది ఏనాటికైనా, ఎవరికైనా తప్పేది కాదు. భగవాన్ జనన మరణాలను గురించి ఏమిటి చెపుతున్నారో విను! నిశ్చలంగా ఆలోచించు!

**దేహినోఽస్మిన్** యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥ 2-13

ఆ క్షణంలో ఈ విశాల విశ్వంలో అతనితోపాటు ఎందరో మరణించారు. వాళ్ళను గురించి నీవేమీ బాధపడటంలేదే! మరి ఇతణ్ణి గురించి నీవెందుకింత బాధపడుతున్నావో తెలుసా? ఇతడు నా ఆప్తమిత్రుడనుకున్నావు కాబట్టి. ఈ లోకంలో నీ వాళ్లు, పరాయివాళ్ళు నీకు ఎవరూ లేరు. అదంతా నీవు పెంచుకున్న మమకారబంధం. ఆ బంధంవల్లనే నీకంత బాధ కలుగుతున్నది.

అసలు పుట్టడమేమిటో? చనిపోవడమేమిటో? ఎప్పుడైనా ఆలోచించావా? జీవితంలో మనకు ముందు బాల్యం వస్తుంది. కొన్నాళ్ళు గడిచాక అది పోయి యౌవనం వస్తుంది. 'అయ్యో! బాల్యం పోయింద'ని ఏడుస్తున్నావా? లేదు. బాల్యంలో మిసమిసలాడే శరీరం పోయిందని దిగులుపడుతున్నావా? లేదు. ఆలాగే మన ఆత్మ ఈ శరీరాన్ని వదిలిపెట్టి ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. అందులో కొంతకాలముండి దాన్ని వదిలిపెడుతుంది. ఆత్మ శరీరాన్ని వదిలిపెట్టడమే మరణం. ఇంకో శరీరంలో ప్రవేశించడమే జననం. ''ఈ శరీరమే నేను'' అనుకోవడం వల్లనే మానవుడు మరణభయాన్ని పొందుతున్నాడు. అదే దేహభ్రాంతి. మిత్రుడెవరైనా ఇంకో ఊరు వెడితే ఏడుస్తామా? లేదు. ఇది కూడా అంతేనని వివేకంతో ఆలోచించుకొని వైరాగ్యాన్ని పెంచుకొని స్థైర్యంతో నిలబడమని భగవత్సందేశం.

**సమస్య** : ఎన్నాళ్ళ నుంచో కొన్ని పనులు చేయాలని నాలో ఎంతో ఆరాటం. ఎలాగైతేనేం అనుకున్నవన్నీ చేసేశాను. మంచి ఫలితాలు కలిగాయి. కష్టపడి సాధించావన్నారు అందరు. ఏమిటో, నేనూ అలాగే అనుకున్నాను. అహం తొంగిచూసింది. నేను సాధించలేనిదేముంది? అనుకున్నాను. తరువాత వరుసగా కొన్ని ప్రయత్నాలు విఫలమైనాయి. చాలా కుంగిపోయాను. అహంకారం అధఃపాతాళానికి పోయింది. ఎందుకీ బతుకనిపించింది. ఛీ! ఛీ! ఏమిటీ పనికిరాని లోకం అన్నాను. దేవుడున్నాడా? అని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.

ఉంటే నా పనులు నెరవేరాలి కాబట్టి 'లేనే లేడని' సిద్ధాంతం చేసుకున్నాను. జీవితంలో ఇక ఏ పనీ చేయనే చేయకూడదనుకున్నాను. నన్ను నిరాశ, నిస్పృహలు ఆవరించినాయి. హతమారుస్తున్నాయి. ఇప్పుడు నేనేం చేయాలి? అసల పొరపాటెక్కడుంది? నా ఆలోచనావిధానంలోనా? నా ప్రయత్నంలోనా?

**పరిష్కారం :** దిక్కుతోచక, ఏమిటి కర్తవ్యమని బాధపడుతున్న మిమ్మల్ని భగవద్గీత ఆణిముత్యాల జల్లులాంటి సమాధానాలతో చల్లబరుస్తూ మీకొక చక్కని వెలుగుబాటను చూపిస్తున్నది. చూడండి :

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మ ఫలహేతుర్భూః మాతే సంగోఽస్త్వకర్మణి॥ **2-47**

మీ ఆలోచనావిధానమే తప్పు. ఒక పని నెరవేరాలంటే మీ ప్రయత్నం ఒక్కటే కారణమనుకొని, గొప్పగా సాధించానని అహంకారపడ్డారు. ఇతరుల పొగడ్తలకు ఉబ్బితబ్బిబ్బులై పోయారు. మీకంటే గొప్పవాళ్ళు లేరనుకున్నారు. దేవుడితో నాకేం పనుంది? అనుకున్నారు. అదే మరి, పని జరగకపోయేసరికి, మీ అసలు సంగతి బయటపడింది. ఫలితం సాధించడంలో మీ పాత్ర చాలా చిన్నదని తెలిసిపోయింది. నిలువునా కుంగిపోయారు. మిమ్మల్ని, మీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని, దేవుణ్ణి, అందర్నీ దూషించారు. అది కేవలం మీ మానసిక బలహీనత అలా మీరు దూషించినందువల్ల మీకు ఒరిగేది కాని, ఇంకొకళ్ళకు తరిగేది గాని ఏమీలేదు.

ఫలితం ఎంత వస్తుంది? ఎప్పుడు వస్తుంది? అనే ఆలోచనలు లేకుండా 'ఇది నా కర్తవ్యం' అనే భావనతోనే పనులు చేయాలి. అంతవరకే మీకున్న అధికారం. ఫలాన్ని భగవదర్పణం చేయాలి. భగవాన్ మనకెంత ఫలాన్నిచ్చినా అది ఆయన ప్రసాదమని భావించడానికి సిద్ధంగా ఉండాలి. ఇంత కావాలి, అంత కావాలని ఆశలే పెట్టుకోగూడదు. ఫలితం సంగతి తెలియదు గదా! అని కర్తవ్యాన్ని వదలిపెట్టి కర్మరహితులై సోమరిపోతులు కూడా కాకూడదు. మీకు రావలసినదాన్ని భగవంతుడెలాగూ తగిన సమయంలో ఇచ్చితీరతాడు. భౌతికమైన ఫలితాల నాశించి, ఆరాటాన్ని పెంచుకొని శాంతిని నాశనం చేసుకోగూడదు. ఇలా భారమంతా భగవాన్‌పై వేసి ఫలాన్నాశించకుండా కర్తవ్య భావనతోనే పనులు చేస్తూ ఉంటే మీ మంచి చెడ్డల్ని ఆయనే గమనిస్తాడు. మీరు ఆయనవైపు ఒక్క అడుగువేస్తే, ఆయన మీ వైపు నూరు అడుగులువేసి మీకు

చేయూతనందిస్తాడు. మీ జీవితం శాంతిమయమౌతుంది. సమాజ జీవనం కూడా ప్రశాంతంగా సాగుతుంది.

ఇలా వ్యక్తిగతమైన సమస్యలతో గూడా సతమతమౌతున్న మనకు భగవద్గీత ఆశ్రయమిచ్చి, సమస్యల్ని విశ్లేషించి పరిష్కారాల నందిస్తున్నది. సమాజంలో సభ్యతతో, సంస్కారంతో, సహనంతో జీవించి, మానవులంతా ప్రశాంతిని అనుభవించడానికి కావలసిన సదుపదేశాలను సమకూరుస్తున్నది. ఇంకా ఇలాంటి సమస్యలకు భగవద్గీత అందించే పరిష్కారాలను వివరంగా తెలుసుకోవాలంటే నా రచన ''మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు'' (ప్రచురణ : తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి) చదవండి.

# వ్యాసకృత బ్రహ్మసూత్రములు, స్తోత్ర సాహిత్యము

—డా॥ రత్నాకరము బాలరాజు

ఓం సచ్చిదానందరూపాయ కృష్ణాయాఽక్లిష్టకర్మణే।
నమో వేదాంతవేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే॥
వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥

సర్వమతధర్మములకు శాస్త్రములు (Scriptures) ప్రధానము, ఆవశ్యకము, ప్రమాణభూతమునైనవి. తత్త్వసాక్షాత్కార సంపన్నులగు మహాత్ముల దర్శనములే శాస్త్రములు. శాస్త్ర మిట్లు నిర్వచింపబడినది.

**శాస్త్ర నిర్వచనము:**

"ప్రవృత్తిర్వా నివృత్తిర్వానిత్యేన కృతకేనవా।
పుంసాంయేనోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే॥ (భామతి. I. 1.4)

ఈ శాస్త్రములు మత ధర్మములను స్థిరీకరించి, మార్పును వినాశమును బొందకుండ వానికి రక్షకములు కాగలవు. మార్గదర్శకమైన శాస్త్రము లేని మత విశ్వాసము అనేకములైన మార్పులకు, గురియై, తుదకు శైధిల్యమును బొంది తన వ్యక్తిత్వమును గోల్పోగలదు. కాలహేతుకములైన వైపరీత్యములకు, ఉపద్రవములకు కొట్టుకొనిపోకుండ నిలిచియుండుటకు, ప్రపంచ మతముల కన్నిటికిని ఆయా పవిత్ర గ్రంథములే పరమాధారములు.

**ప్రస్థాన త్రయము:**

భారతీయులకు పరమ ప్రమాణ పవిత్ర గ్రంథములు వేదములు. 'వేదోఽఖిల ధర్మమూలమ్,' 'సకల దేవతానాం ధర్మస్య బ్రహ్మతత్త్వస్యచ ప్రతిపాదకం వేదమ్. నిశ్వసిత తమస్యవేదాః,'— వేదములు పరమ పురుష నిశ్వాస రూపములగుటచే, అపౌరుషేయములని భారతీయుల విశ్వాసము. కాని భారతీయ జనసామాన్యము, వేద గ్రంథములెట్టివో యెఱుగదు. తిలలందు తైలమువలె వేదములందు ఉపనిషత్తులు, వేదాంతములు- ప్రతిష్ఠితములని చెప్ప

బడినది. "తిలేషు తైలవద్వేదే వేదాంతః సుప్రతిష్ఠితః." (ముక్తికోపనిషత్తు1-9). ఉపనిషత్తులు, వేదముల సారరూప సిద్ధాంత భాగములు. చివరి భాగము లగుచే వేదాంతములని ప్రసిద్ధి కాంచినవి. ఉపనిషద్గీతా బ్రహ్మసూత్రములకు ప్రస్థానత్రయమని పేరు. ప్రస్థానమనగా మార్గము (Path) ఇచ్చట దర్శనము లేక శాస్త్రమని అర్థము. సాంఖ్యాది శాస్త్రములన్నియు ప్రస్థానభేదములే. ఉపనిషత్తులు శ్రుతిప్రస్థానము, గీత స్మృతిప్రస్థానము, బ్రహ్మసూత్రములు న్యాయ ప్రస్థానము. ప్రస్థాన త్రయము హిందువులకు పరమ ప్రమాణశాస్త్ర సంపుటి. ఉపనిషద్వేద్యమగు బ్రహ్మజ్ఞానము, పరావిద్య "అథపరా, యయాతదక్షర మధిగమ్యతే" ఇది వస్తుతంత్రజ్ఞానము, (Knowledge of Reality as It is); పురుషతంత్రజ్ఞానము (Knowledge depending on the person) కాదు. బ్రహ్మవిద్యకు గీత భగవత్ప్రతిపాదిత చిరంతన భాష్యము. బ్రహ్మసూత్రములు వేదముల శిఖరసందేశమగు ఉపనిషద్బోధయొక్క క్రమబద్ధమగు సారసంగ్రహము.

**బ్రహ్మ సూత్రములు :**

ప్రస్తుత విషయము బ్రహ్మసూత్రములు. ప్రతి దర్శనమునకును, తత్ప్రతిపాదక మూల సూత్ర గ్రంథములు కలవు బ్రహ్మసూత్రములకు వేదాంత సూత్రములనియు, భిక్షు సూత్రములనియు పేర్లుగలవు; బ్రహ్మ (ఉత్తర) మీమాంస, శారీరక మీమాంస, అనియు బ్రహ్మసూత్రకృతి ప్రసిద్ధి గాంచినది * శారీరకో జీవఃతస్య బ్రహ్మత్వవిచారో మీమాంసా'—(రత్నప్రభ). శరీరవాసి శారీరకుని-(జీవుని) బ్రహ్మత్వ విచారమగుటచే, దీనికి శారీరక మీమాంస యనిపేరు. వైదిక కర్మ కాండ వివరణమగు పూర్వ మీమాంసకు కర్త జైమిని మహర్షి. బ్రహ్మసూత్ర కృతి జగజ్జీవేశ్వరుల స్వరూప నిర్ణయ మొనరించుట వలన, నిర్ణాయక శాస్త్రమనియు ప్రసిద్ధిగాంచినది దీనికర్త బాదరాయణ మహర్షి, లేక వేదవ్యాసర్షి. 'వ్యాసుడు' అను నామము ఒక సామాన్యమైన బిరుదము కావచ్చును; కూర్పరి, గ్రథనకర్త (compiler or Arranger) అని దీని యర్థము.

---

*సకల ప్రపంచము ఈశ్వరుని శరీరమనియు, శారీరకుడు ఈశ్వరుడనియు, ఈశ్వరస్వరూప విచారమగుటచే నిది శారీరక మీమాసంసయని, బలదేవుడను బ్ర. సూ. భాష్యకర్త వివరించును.

బ్రహ్మసూత్ర కర్త కాలము; ప్రతి ద్వాపరమందును, భగవంతుడు, వ్యాసరూపమున నవతరించి, కలసిపోయిన వేదరాశిని మరల ఋగ్యజుస్సామాథర్వములుగ విభజించునని చెప్పబడినది. (వివ్యాసైకం చతుర్ధాయో వేదం వేదవిదాంవరః) వర్తమాన కల్పమున, గత అష్టావింశతి తమ (28 వ) ద్వాపర యుగమందలి వ్యాసుడు కృష్ణద్వైపాయన వ్యాసుడు; సత్యవతి పరాశరుల పుత్రుడు. 'అపాంతర తము' డను వేదాచార్యుడు భగవన్నియోగము వలన, కలి ద్వాపర సంధియందు అధికారిక పురుషుడుగ కృష్ణద్వైపాయనుడుగ జన్మించెనని, శంకరుడు బ్ర. సూ. భాష్యమున (III.3.32) తెలుపును (...అపాంతరతమా నామ వేదా చార్యః పురాణర్షి ర్విష్ణునియోగాత్ కలిద్వాపర యోఃసంధౌ కృష్ణద్వైపాయనః సంబభూవేతి స్మరంతి.) "వ్యాసం వసిష్ఠ నప్తారం"— అను ధ్యానశ్లోక మీ మహర్షి ఆభిజాత్యము (Nobility of birth)ను, వ్యాఖ్యానించును. బదరికాశ్రమమున చిరకాలము తపమొనరించుటచే బాదరాయణుడనియు, కృష్ణవర్ణుడు, ద్వీపమున జన్మించినవాడును నగుటచే, కృష్ణద్వైపాయనుడనియు, ఈ మహర్షి ప్రసిద్ధిగాంచెను. ఈ ముని, భగవద్విభూతియని, గీత వివరించును. (మునీనా మప్యహం వ్యాసః— మునీనాం మనన శీలానాం సర్వపదార్థజ్ఞానినా మప్యహం వ్యాసః॥-గీత-శంకర-భాష్యము X.37) అశ్వత్థామ, బలి, హనుమంతుడు, విభీషణుడు, కృపుడు, పరశురాముడు, వేదవ్యాసుడు చిరంజీవులని భారతీయ సంప్రదాయము. వ్యాసర్షి, జ్ఞానశక్త్యవతారమూర్తియని భామతీ-భాష్యకారుడు వాచస్పతి మిశ్రుడు స్తుతించును.

బ్రహ్మసూత్రకృతే తస్మై వేదవ్యాసాయ వేధసే ।
జ్ఞానశక్త్యవతారాయ నమో భగవతే హరేః॥' (భామతి-ఉపోద్ఘాతము)

భాష్యకారులందఱు, బ్ర. సూ. కర్తయగు బాదరాయణుడు వేదవ్యాసుడని స్థాపింతురు. శంకర భాష్యము వలన నిది స్పష్టముగా తెలియకున్నను, వాచస్పతి ప్రకాశాత్ముల ద్వారా మనకందుచున్న అద్వైత సంప్రదాయము, వ్యాసుడే బాదరాయణుడనుటను స్థాపించును. రామానుజ మధ్వాచార్యుల మతమును నిదియే. "శ్రీమద్వ్యాసపయోనిధిర్నిధిరసౌ" అని ఆనందగిరి బ్రహ్మ సూత్రములను వర్ణించును.

భారతీయ కాలపరిగణనము ననుసరించి, కృష్ణద్వైపాయన వ్యాసర్షి (బాదరాయణముని)యు,తచ్ఛిష్యులగు పైల వైశంపాయన జైమిని సుమంతులును,

క్రీ. శ. కు పూర్వము 3146 కాలమున (కలి ద్వాపర సంధి) నున్నట్లు సిద్ధాంతము. సంప్రదాయానభిజ్ఞులగు ప్రాచ్య పాశ్చాత్య పండితుల నిర్ణయములు విషయమున పరస్పర విరుద్ధ భావాశ్రయములగుటచే, వాని నిష్ఫలత్వము, నిస్సారత ద్యోతకమగుచున్నది. కాలనిర్ణయమున భ్రమ ప్రమాద దూషితములై, పరస్పర విరుద్ధములగు వీరి నిర్ణయములు పరిత్యాజ్యములు. సంప్రదాయ కాల పరిగణనమే సమాదరణీయము. మహాభారత యుద్ధకాలము క్రీ. పూ. 3137, కలియుగారంభము (శ్రీకృష్ణ పరినిర్వాణము) క్రీ. పూ. 3102.*

**గీత యొక్క ప్రాచీనత:**

బ్ర. సూ. రచనా కాలము భగద్గీతా (భారత) రచనా కాలమునకు తరువాతిదే. బ్ర. సూ. లందు గీత పలుచోట్ల (8 సూత్రము లందు) నిర్దేశింపబడినది. బ్ర. సూ. II. 3. 45. IV. 2. 21 సూత్రములందు అసందిగ్ధముగా గీత నిర్దేశింపబడినది. అపి చ స్మర్యతే (II. 3. 45) అను సూత్రము జీవుడు పరమాత్మ యంశమని స్మృతి చెప్పుచున్నదని గీతను (XV. 7) నిర్దేశించును. గీత యందును ''బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః'' (XIII.4) అని బ్ర. సూ స్పష్టముగ పేర్కొనబడినవి. గీతయందు బాదరాయణకృత బ్రహ్మసూత్రములే నిర్దేశింపబడినవని అంగీకరించినచో, రెండింటి కాలమును బట్టి విరోధము గల్గును. గీత, బ్రహ్మసూత్రముల కంటె ప్రాచీనము, పరంపరాగతముగ స్థాపింపబడినది. కాన, గీతయం దుల్లేఖింపబడిన 'బ్రహ్మసూత్రములు' బాదరాయణ కృత సూత్రములు కావని తెలియవలయును. బాదరాయణ సూత్రములు పూర్వులగు వేదాంత ప్రవర్తకుల నెనిమిది మందిని స్మరించును. వారు - ఆత్రేయ, ఆశ్మరథ్య, ఔడులోమి, కాశకృత్స్న, కార్ష్ణాజిని, జైమిని, బాదరి, వామదేవులనువారు. ఉపనిషత్తుల స్వతంత్రముగా వ్యాఖ్యానించి రచించిన వీరి బ్రహ్మ విషయకములగు సూత్రములు పూర్తిగ కాని, పాక్షికముగ కాని మనకు లభ్యము కాకపోయినను, లభ్య

* See : Indian Chronology - (By Dr. D. S. Trivedi- dedicated to Dr. S. Radha Krishnan and published by Bharatiya Vidya Bhavan-1963.

ములైన వానినన్నిటిని, బాదరాయణ ముని తన బ్రహ్మ సూత్రములందు కూర్చు కొన్నాడనుట వినిశ్చితము. గీతాచార్యుల మనస్సున ఈ సూత్రములలో నేవి యుండి యుండెనో మన మెఱుగము. కాని, ఇవి యన్నియు పరమార్థ విషయ స్థాపనమున హేతుమంతములు, వినిశ్చితములనుటలో సందియము లేదు.

బ్రహ్మ సూత్రము లందు నాల్గధ్యాయములు గలవు ప్రతి అధ్యాయము 4 పాదములుగ విభజింపబడినది. ప్రతి పాదము నందున అనేక అధికరణములు గలవు. అధికరణమున ఒకటి, లేక అంతకు మించి సూత్రములున్నవి. శంకరు ననుసరించి ఇందు 192 అధికరణములు, ౕౕ౬ సూత్రములు గలవు. విషయము, విశయము (సంశయము), పూర్వపక్షము (ఆక్షేపము), సిద్ధాంతము, సంగతి (వివిధ అధికరణముల యోజన) అని ప్రతి అధికరణమునకును 5 అంగములు కలవు. నాలుగు అధ్యాయముల నామములు క్రమముగ సమన్వయము, అవిరోధము, సాధన, ఫలము, సూత్రము. అనవసర పునరుక్తుల పరిహరించి అల్పాక్షరములతో అసల్పము, విశ్వతోముఖమునగు నర్థమును స్ఫురింపజేయును.

**సూత్ర నిర్వచనము :**

'లఘూని సూచితార్థాని స్వల్పాక్షర పదానిచ ।
సర్వతః సారభూతాని సూత్రాణ్యాహు ర్మనీషిణః ॥'
'అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్ ।
అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥'

సూత్రములు భాష్యరహితముగ బోధపడవు. బోధయొక్క 'Short notes' వంటివి సూత్రములు. సూత్రశైలి, తత్త్వదర్శన రచనలు, తదితరములైన గృహ్యాకర్మ వ్యాకరణ ఛందశ్శాస్త్ర రచనయందును స్వీకరింపబడినది.

**సమన్వయము :**

పుష్పముల వలె వేదాంత వాక్యము లిందు కూర్పబడినవి. "వేదాంత వాక్య కుసుమ గ్రథనార్థత్వాత్ సూత్రాణామ్" (శం. భా. I.1.2) ఉపక్రమోపసంహారాలు, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి- అను షడ్లింగములననుసరించి భాష్యకారులు, సూత్రతాత్పర్య నిర్ణయమునకు ప్రయత్నించిరి. మొదటిదగు సమన్వయాధ్యాయమున, వేదాంత (ఉపనిషద్) వాక్యముల పరమ తాత్పర్యము, అద్వయతత్త్వమగు బ్రహ్మమేయని నిరూపింపబడినది. ఉపనిషద్వాక్యములలో సాధారణముగ స్పష్టముగ, బ్రహ్మమును నిర్దే

కింపను శబ్దములు ప్రయోగింపబడినవి. ఉదా:, సంభావ్యమగు అత్తి-(ప్రకరణాచ్చ 1-2-10; వాక్యాన్వయాత్- 1.4.10-) ఈ శబ్దముల అర్థము, ఆత్మ, లేక బ్రహ్మమని నిర్ణయింపబడినది. ఉదాహరణమునకు: 'ఆకాశస్తల్లింగాత్'-(1.1-22) సూత్రమందలి "ఆకాశ" శబ్దము ఛాందోగ్యోపనిషత్తు (1 9.1) నందలిది. బ్రహ్మలక్షణముల పేర్కొనుట వలన శ్రుతియందలి ఈ శబ్దము భూతాకాశమునకు అన్వయింపక పరబ్రహ్మమునకే యన్వయించునని సూత్రము స్థాపించును. అట్లే ఛాం. ఉ. 1-10.9; 1.11 4-5, నందలి 'ప్రాణ' శబ్దము - (సర్వభూతములు దీనిలో లయించునని చెప్పబడుట వలన) భౌతిక ప్రాణతత్త్వమున కన్వయింపక పరబ్రహ్మమునకే యన్వయించునని (అత ఏవ ప్రాణః 1.1-23) బ్ర.సూ. స్థాపించును. అట్లే "మనోమయ" (ఛాం. ఉ. III. 14-1-2) జ్యోతిః (ఛాం ఉ. III.13-7) అత్తా (భక్షకుడు) (కఠోపనిషత్తు- 1-2-26) ఇత్యాది శబ్దములు సాధారణార్థమున కాక, బ్రహ్మలక్షణ నిర్దేశకములగుటచే, విశ్వమూలమగు బ్రహ్మమున కన్వయించునని సూత్రములు స్థాపించుచున్నవి (సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ 1-2-1; జ్యోతిశ్చరణాభిధానాత్ 1.2-24) బ్రహ్మము సచ్చిదానంద స్వరూపము, ఉపాసనా (ధ్యాన) విషయము; ముక్తాత్మలు పొందవలసిన గమ్యము, ముక్తోపసృప్యవ్యపదేశాత్॥ (1-3-2)

**మహాద్రష్ట:**

వ్యాసర్షి (బాదరాయణ ముని) అద్వయ బ్రహ్మద్రష్టయగు మహాత్ముడు.

'వేదాఽహమేతం పురుషం మహాంతమ్।
ఆదిత్య వర్ణం తమసఃపరస్తాత్,
తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి
నాఽన్యః పంథా విద్యతేఽయనాయ॥ (శ్వేతాశ్వతరోపనిషత్ III.8)

అని స్వీయానుభూతిని ప్రకటించిన ఉపనిషద్ద్రష్టవంటి ద్రష్ట. పూర్ణుడగు పరమాత్మ దర్శనమునవే పూర్ణానందాఽద్వితీయ బ్రహ్మాత్మ పరిజ్ఞానము వలననే- పరమ పురుషార్థ- మోక్ష ప్రాప్తి. చర్మము వలె ఆకాశమును చుట్ట గల్గినపుడు మాత్రమే, పరమాత్మజ్ఞానము లేకుండ త్రివిధ దుఃఖోప శాంతి ('యదా చర్మవదాకాశం వేష్టయిష్యతి మానవాః।

తదా దేవమ విజ్ఞాయ, దుఃఖస్యాంతో భవిష్యతి ॥(శ్వే.ఉ. vi.20)
'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః'-అను, భగవల్లక్షణ సంపన్నుడు బాదరాయణ మునీంద్రుడు; విశ్వమునకు ఉపాదాన నిమిత్తకారణమైన పరబ్రహ్మమును- పరమేశ్వరుని ప్రకటింపని దర్శనముల దోషముల ఖండించి, వాని యందలి సత్యాంశముల స్వీకరించిన పరమర్షి.

**బ్రహ్మముయొక్క జగత్కారణత్వము :**

కాన, విశ్వమూలము-కారణము-అచేతన ప్రకృతి, లేక, 'ప్రధానము' అని స్థాపించు సాంఖ్య దర్శనమును సమన్వయాధ్యాయముననే కొంతవఱకు పూర్వపక్షమొనరించి నిరసించెను. సాంఖ్య దర్శనము, శ్రుతుల ఉపదేశమునకు విరుద్ధము. 'ప్రధానము' అనుమాన ప్రమాణ సాధ్యము మాత్రమే (అనుమానికమ్-I-4-1) శ్రుతులందు 'ఈక్షణ' ధర్మము కారణ తత్త్వమునకొసగబడినది. (ఈక్షతేర్నాఽశబ్దమ్ I-1-5) కాన అచేతన త్రిగుణాత్మక ప్రధానము, జగత్కారణముకాదు. ఉపనిషద్వాక్యములందు ప్రయుక్తములైయున్న 'అవ్యక్తము' 'మహత్తు' ఇత్యాదులు, సాంఖ్యదర్శన ప్రోక్తతత్త్వముల నిర్దేశింపవు. శ్వే. ఉ. (iv-5) నందలి లోహిత శుక్ల కృష్ణవర్ణమగు 'అజ' సైతము సాంఖ్యదర్శన ప్రోక్తమగు 'ప్రధానము'ను నిర్దేశింపదు; తేజోబన్న (అగ్నిజలపృథ్వీ) స్వరూపమగు-పరమేశ్వరాధీనమగు భూతప్రకృతిని నిర్దేశించును. ఇది ముక్తాత్మలచే త్యాజ్యమనియు చెప్పబడినది. (జహాత్యేనాంభుక్త భోగామజోఽన్యః) జగత్కారణము బ్రహ్మమనియు, తన్నిష్ఠగలవానికే మోక్షమనియు ఉపనిషదుపదేశము అచేతన తత్త్వమునెడల భక్తి (నిష్ఠ) యే సర్వ దుఃఖ కారణము. కాన 'ప్రధానము'ను పరిత్యజించి, జగత్కారణమగు పరబ్రహ్మమును బొందవలయును.

ఇట్లు బాదరాయణ ఋషి శ్రుతుల శిఖర సందేశము, పరబ్రహ్మమే పరమ సత్యమని నిరూపించును. బ్రహ్మేతరము జగత్కారణమను 'ప్రధానాది' సిద్ధాంతములు దుష్టములు. 'ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః॥ (I.4.28)'

**సాంఖ్యదర్శన నిరాసము :**

'అవిరోధ' మనబడు ద్వితీయాధ్యాయము, వేదాంత సిద్ధాంతమునకు విరుద్ధములైన వాదములన్నింటిని విచారించి నిరాకరించును. సాంఖ్య దర్శనవాది ముఖ్య పూర్వ పక్షి. యోగదర్శనము సైతము, పరమేశ్వరుని జగదుపాదాన

నిమిత్తకారణత్వము నంగీకరింపనందున, నదియు నిందు నిరస్తము. 'ప్రధానము' వంటి జగత్పరిణామ కారణమను వాదము తర్కసహము కాదు. విశ్వమున క్రమ బద్ధమగు రచన (Design) ద్యోతక మగుచున్నది. 'ప్రధానము' వంటి అచేతనమగు నాద్యకారణము, సృష్టిని, క్రమతాబద్ధమైన జగన్నిర్మాణమును వివ రింపజాలదు. ఆశ్చర్యకర వైచిత్రితో, క్రమబద్ధ నిర్మాణముతో వెలయుచున్న ఈ జగమును, అచేతన తత్త్వము ఎట్లు సృజింపగలదు ? కుంభకారుడున్ననే మృత్తికనుండి పాత్ర రచన జరుగును. అట్లే అచేతన ప్రధానము సైతము, చేతనాధిష్ఠానమున మాత్రమే పరిణామమందగలదు.

'రచనాఽనుపపత్తేశ్చనాఽనుమానమ్' (II.2-1; II.2-1-6) ప్రధాన వాద నిరాకరణము చేతనే శిష్టులంగీకరింపని సిద్ధాంతములన్నియు నిరస్తములు- 'ఏతేన శిష్టాఽపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః॥'

**సాంఖ్య యోగ దర్శనము లందలి సత్యాంశములు :**

కాని, తాను జీవుడను భ్రాంతిలేని పురుషుని లక్షణములు వర్ణించిన సాంఖ్య దర్శన పద్ధతి గమనించినచో[1] అద్వితీయుడు, పావనుడు, పరిపూర్ణునగు నొక్క పురుషునే అంగీకరించినట్లు కాగలదు. ఈ విషయము వ్యాసర్షికి సమ్మతమే. మహాభారత శ్లోకార్థముతో సాంఖ్యదర్శన మేకీభవించుచున్నది.

'ఆత్మా క్షేత్రజ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతై ర్గుణైః।
తై రేవతు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః॥
(మ. భా. శాంతి. 187-23)

'ప్రధానము' యొక్క జగత్కారణత్వమును నిరసించినను, సాంఖ్య ప్రోక్త పురుష స్వరూపము, తత్త్వాభ్యాసము, యోగానుష్ఠానము ముముక్షువుల కుపాదేయములగుట వలన, బ్ర. సూ. కర్త వ్యాసర్షి, యోగ దర్శన భాష్యమును రచించినాడు.[2]

1 చూడు : సాంఖ్యసూత్రము - 'సుషుప్త్యాద్యవస్థా సాక్షిత్వాత్॥ (I-148) అక్ష సంబంధాత్ సాక్షిత్వాత్; నిత్యముక్తత్వమ్; ఔదాసీన్యంచేతి॥ (I. 162-163)

2. న చ బ్రహ్మ సూత్ర కృతావ్యాసేన, యోగో నిరాకృత ఇతి శంక్యయమ్। ప్రకృతి స్వాతంత్ర్య చిద్భేదాంశమాత్రస్య నిరాకరణాత్। నతు భావనా విశేషరూపయోగస్య। భావనాయశ్చ సర్వ సమ్మతత్వాత్। తాం వినా సుఖస్యాప్య సంభవాత్॥ (హఠయోగ ప్రదీపిక - బ్రహ్మానంద కృత జ్యోత్స్నావ్యాఖ్యా.)

పరమాణువులు, అదృష్టము (The atoms and the unseen potency) జగత్కారణమను వైశేషిక (పరమాణు) దర్శనము, దానియందలి దోష నిరూపణచే నిరాకరింపబడినది. పరమాణువాదము తర్కసహము కాదు. అదృష్టము పరమాణువుల యందున్నదా? లేక, జీవులయందున్నదా? పరమాణు చలనమెట్లు సంభవము? అవి చలింపగల్గిననే కదా జగన్నిర్మాణము సాధ్యము? అదృష్టము సైతము పరమాణువుల వలెనే అచేతనము. అది యెట్లు పరమాణు చలన హేతువు కాగలదు? ఈ అణువులు రూప వర్ణయుక్తములనియు చెప్పబడినది. అట్లయిన నవి నిరవయవములును నిత్యములును కాజాలవు. వేదవేత్తలెవరును పరమాణువాదము నంగీకరింపరు. ఇది ముముక్షు జనాఽపేక్ష్యము కాదు. (అపరిగ్రహచ్చాఽత్యంతమనపేక్షా॥ (II. 2-17).

**బౌద్ధక్షణిక వాద ఖండనము :**

ఇట్లే బౌద్ధ సర్వాస్తివాద విజ్ఞానవాద శూన్యవాదములను బాదరాయణముని పరిశీలించి నిరాకరించును. బౌద్ధమతమునందలి ఈ శాఖలు, బాదరాయణునికి తరువాతివి కదా! వీనిని బ్ర. సూ. కర్త సూత్రించి, నిరాకరించుట యెట్లు పొసగునన్నచో, బౌద్ధమత సంప్రదాయము లన్నియు, అతి ప్రాచీన కాలము నుండి ఉండియున్నవే. ఇవి బుద్ధుని అనంతరము రచనాకృతి గాంచినవని విజ్ఞుల మతము. పరమాణువులు కారణముగా గల భూత భౌతిక సముదాయము (External aggregate) పంచస్కంధములు కారణముగా గల చిత్తచైత్త సముదాయము (Internal aggregate). ఈ యుభయ సముదాయములు (చేరికలు) జగన్నిర్మాణ కారణములని సర్వాస్తి వాద (Bouddha Realist) సిద్ధాంతము. క్షణిక వాదమును ఇందలిదే యగుటవలన, ఈ సముదాయము (చేరిక) లెట్లు సిద్ధించును? బౌద్ధుల ననుసరించి, వ్యావహారిక జగత్తు, కార్యకారణ శ్రేణిబద్ధము, ఈ పరంపరయందు పూర్వాపరసంబంధ మంగీకరించినను, ఉత్తర క్షణము (క్షణికమగు కార్యము) పుట్టుచుండగనే, పూర్వక్షణము (క్షణికమగు కారణము) నశించుటవలన కార్యకారణ సంబంధమసంభవము (II 2-18 నుండి). బౌద్ధ విజ్ఞాన వాది (Bouddha Idealist) బాహ్య జగత్తు అసత్యమనియు, కేవలము విజ్ఞానములు (Ideas or cognitions) మాత్రమే సత్యమనియు వాదించును. బాహ్య పదార్థముల ఉపలబ్ధి-అనుభవము-లేనిచో, వాసనల (సంస్కారముల) ఉనికి సంభవింపదు. బాహ్య పదార్థదర్శనము వాసనల

(సంస్కారముల) కనురూపముగ నెట్లు వివరింపగలము ? ఈ క్షణిక విజ్ఞానము లను భాసింపజేయుటకు ఏకస్వరూపము, నిత్యము, స్వప్రకాశమునగు ఆత్మను ఇవి (ఈ క్షణిక విజ్ఞానములు) అపేక్షించుచున్నవి. కాన, ఈ క్షణిక విజ్ఞాన వాద మసంగతము. క్షణిక వాదమున వాసనలకు ఆశ్రయ మసంభవమగుట వలన, విజ్ఞాన సంస్కారములకు ఉనికి కూడ సంభవింపదు. ఇట్లు సర్వ విధ ముల దోషయుక్తమగుటవలన, బౌద్ధదర్శనముపపన్నముకాదు; శ్రేయస్కాముల కాశ్రయణీయము కాదు. (సర్వథాఽనుపపత్తేశ్చ॥ II-2. 28-32)

**జైనమత నిరాకరణము :**

జైన దర్శనము ఒకే వస్తువునందు, నిత్యత్వము, పరిణామము, ఏకత్వము, భేదమునను విరుద్ధ ధర్మముల విశ్వసించును. పరస్పర విరుద్ధ ధర్మము లొకేయొక వస్తువు నందుండజాలవు కాన, జైనమత మసంగతము. (నైకస్మిన్ సంభవాత్ II-2-33) అనిర్ధారిత రూపమగు జ్ఞానము ప్రమాణము కాజాలదు. జైనుల ననుసరించి ఆత్మకు పరిమాణము కలదు. పరిమాణ ధర్మము కలటి యేదియైనను, భౌతికము, అనిత్యము కాగలదు. (II 2-33-36).

ఈశ్వరుని కేవల నిమిత్త కారణత్వమునే యంగీకరించి తదుపాదాన కారణత్వము నంగీకరింపని మతములను సైతము బ్ర. సూ. కర్త నిరాక రించును. (పత్యురసామంజస్యాత్. II. 2-37)

**కార్యకారణముల అభిన్నత్వము :**

జగము ఈశ్వరుని లీల. లోకమునందువలెనే, బ్రహ్మమునకు సృష్టి కేవలము క్రీడామాత్రము. (లోకవత్తు లీలాకైవల్యమ్ II. 1-33) జగమునకు బ్రహ్మము, ఉపాదానము, నిమిత్త కారణమును ఈశ్వరుడు (బ్రహ్మము), సృష్టి యందు బ్రహ్మ సాధనసామగ్రి నపేక్షింపదు. ఏకస్వరూపమగు బ్రహ్మము, వివిధ శక్తుల కలిమివలన, క్షీరమువలెనే, అనేక కార్యములుగా తోపగలదు. (ఉపసంహార దర్శనాన్నేతిచేన్న క్షీరవద్ధి. II. 1-24) సంవేష్టితమైన (ముడువ బడిన) వస్త్రము, ప్రసారితమైనపుడు, మునుపటికంటె, భిన్నము కానట్లు కార్యము, కారణభిన్నము కాదు. కారణమున అవ్యక్తముగనున్నది; కార్యమున వ్యక్తమగుచున్నది (పటవచ్చ. II. 1-19) వాస్తవమున జగము బ్రహ్మమున కంటె భిన్నముగాదు. కార్యము కారణాఽభిన్నము. మఱొక విధమున చెప్ప వలెనన్న, కారణమొక్కటే, పరమార్థము. వాస్తవమున బ్రహ్మము వికారముల

బొందదు. వికారము దృశ్యమాత్రమే. వ్యవహారాభిప్రాయమున సత్యమగు దృశ్య ప్రపంచ సంబంధమున, బ్రహ్మము సముద్రమనియు, జగము తరంగములనియు చెప్పబడినది. సగుణోపాసన మవసరమై యున్నంతవరకు బాదరాయణ ముని, పరిణామము నంగీకరించును.* (తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః II. 1-14)

**జీవుడు ఈశ్వరాంశము :**

జగము, బ్రహ్మము యొక్క కేవల వివర్త పరిణామమైనచో, (Apparent modification), జీవ బ్రహ్మముల సంబంధ మెట్టిది? జీవుడు ఉత్పాద్యమగు వికారమా? (Product, modification) సూత్రకర్త జీవుని ఉత్పత్తిని నిరాకరించును. (ఉత్పత్త్య సంభవాత్. II. 2.42) జీవుడు పరమేశ్వరుని ప్రతిబింబము-అంశము. (బుద్ధియందలి ఆత్మ ప్రతిబింబమే జీవుడు). (ఆభాస ఏవచ II. 3-50). అవిద్యావస్థయందు, జీవునకు పరమాత్మయు, కర్మాధ్యక్షుడు, సర్వభూతాధివాసుడు, సాక్షి, సర్వచైతన్య హేతువునగు పరమేశ్వరుని యాజ్ఞవలననే, కర్తృత్వ భోక్తృత్వ లక్షణమగు సంసారము సిద్ధించుచున్నది. తదనుగ్రహ హేతుకమగు విజ్ఞానము చేతనే, మోక్షసిద్ధి, (పరాత్తు తచ్ఛ్రుతేః II. 3-41) పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్య బంధవిపర్యయౌ. (III 2-5).

**మోక్షసాధన :**

తృతీయాధ్యాయమున, మోక్షసాధన నిరూపింపబడినది. జీవునకు దేవయాన పితృయాన మార్గముల ద్వారా, పరలోక గమన నిరూపణముచేత, సంసార దోషముల వెల్లడించి, వైరాగ్యమీ యధ్యాయము నిరూపించును. దేహ వ్యతిరిక్తముగ, ఆత్మలేదను చార్వాకవాదము దుష్టము. మరణించిన తరువాత, దేహమున్నను, చైతన్యము లేకపోవుట వలన దేహమునకంటె ఆత్మ, దేహాది జ్ఞానములలెనే వ్యతిరిక్తము. ఉపాసనను కాని, కర్మమును గాని, అనుష్ఠింపని

* సూత్రకారోపి పరమార్థాభిప్రాయేణ తదనన్యత్వమిత్యాహ, వ్యవహారాభిప్రాయేణ తస్యాల్లోక వదితి మహాసముద్రాది స్థానీయతాం బ్రహ్మణః కథయతి, అప్రత్యాఖ్యాయైన కార్యప్రపంచం పరిణామ ప్రక్రియాంచా శ్రయతి, సగుణోపాసనేషూపయోక్షత ఇతి॥ (శంకర భాష్యము II-1-14).

పాపకర్ములు జనన మరణ చక్రమున క్షుద్రజీవులై పరిభ్రమించుచుందురు. ద్వితీయ పాదము బ్రహ్మముయొక్క గుణవిచార మొనరించి, తద్విషయమున సాధకులకు గాఢోత్కంఠను గల్గించుచున్నది. యోగులు పరమేశ్వరుని సంరాధన కాలమున (పరిపూర్ణ ధ్యానమున, భక్తిధ్యాన ప్రణిధానాద్యనుష్ఠానమునందు) చూడగలరు. (అపిచ సంరాధనే ప్రత్యక్షాఽనుమానాభ్యామ్ III. 2-24) తృతీయపాదము శ్రుతులందలి వివిధోపాసనలను, వానియందలి సమానాంశము లను, భిన్నాంశములను పరిశీలించి, సర్వవేదాంతములందును చెప్పబడుచున్న ఉపాసనయంతయు నేకరూప మని స్థాపించును. చతుర్థ పాదము, మోక్షము జ్ఞాన ఫలమా, కర్మఫలమా, లేక జ్ఞానకర్మ సముచ్చయ ఫలమా,- అనుటను విచారించును. బ్రహ్మజ్ఞానము స్వతంత్రము, కర్మతంత్రము కాదని స్థాపించును. చతుర్థాశ్రమమగు సన్యాసాశ్రమమును, ఇతరాశ్రమములవలెనే, శ్రుతి విధించుచున్నదని నిరూపించును. (ఊర్ధ్వరేతస్సుచశబ్దేహి. III. 4-7) **బాదరాయణ ముని సన్యాసాశ్రమ మవశ్యముపాదేయమని తలచును.** (III. 4-19) జ్ఞాన ప్రాప్తికి, శమదమాదు లవశ్యానుష్ఠేయములు (III. 4-27).

బ్రహ్మ విద్యయొక్క బహిరంగ సాధనలగు ఆశ్రమ ధర్మ యజ్ఞ దానాదులను, అంతరంగ సాధనలగు శమదమ నిదిధ్యాసనాదు లిందు నిరూపింప బడినవి. ఆశ్రమ రహితులైనవారు సైతము, జపోపవాస దేవతారాధనాది ధర్మ విశేషములచేతనే, జ్ఞానమును బొందవచ్చును. (III. 4. 38)

**బ్రహ్మవిద్యా ఫలము :**

చతుర్థమగు ఫలాధ్యాయము ముఖ్యముగ, బ్రహ్మజ్ఞాన ఫలమును విచారించును. జ్ఞానప్రాప్తి పర్యంతము, ఆత్మధ్యానము పలువు లనుష్ఠింపవలయును. ఉపాసకుడు, బ్రహ్మమును తన ఆత్మగా భావింపవలయును (ఆవృత్తిరసకృదుపదేశాత్॥; ఆత్మేతి తూపగచ్ఛంతి. గ్రాహయంతిచ॥ IV. I. 1, 3) '**తత్త్వమసి**' **యను పరమార్థ జ్ఞానమును, వేదములు దర్శించినపుడే, ఆత్మజ్ఞానము, పరిపూర్ణమై పరిసమాప్తిని పొందినది** సర్వజ్ఞానమునకును పరమావధి ఈ పరిపూర్ణమగు ఏకత్వ సిద్ధియే. ఇది పరమ నిశ్శ్రేయసము; **అభయత్వసిద్ధి.** (**ఇతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం సఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి ఛాం. ఉ.** VI)

నిలచికాని, పరుండిగాని కాక ఆసీనుడై యే ధ్యానింప వలయును. చిత్తై కాగ్రత కనుకూలించు నేకాలముననైనను, నే ప్రదేశముననైనను, ధ్యాన మాచరింపవచ్చును. (IV-1-7-11) ఉపాసనా వృత్తిచేత, పరమేశ్వరుని - (పరబ్రహ్మమును)- సాక్షాత్కరించుకొని, పుణ్య పాపాఽలేప లక్షణమగు జీవన్ముక్తి బొందవలయును. మరణ సమయమున జీవుని ఉత్క్రాంతి ప్రకారము ఈ యధ్యాయమున వివరింపబడినది. కాని, నిర్గుణ బ్రహ్మవేత్తయొక్క భూతసూక్ష్మములు, ఇంద్రియములు, నిరవశేషముగ బ్రహ్మమున లయించునని (అవిభాగో వచనాత్. IV. 2. 16) చెప్పబడినది.

సగుణ బ్రహ్మవిదులు, దేవయాన మార్గమున బ్రహ్మలోకమున బొందుదురు; ప్రాకృత ప్రళయమున, కార్య బ్రహ్మలోకము విలయమందగా, తదధ్యక్షుడగు హిరణ్యగర్భునితో గూడ పరబ్రహ్మమును బొందుచున్నారు. ఇది క్రమ ముక్తి. నిర్గుణ బ్రహ్మవిదుడు పరంజ్యోతిని బొంది, స్వస్వరూపమున కైవల్యమును బొందుచున్నాడు. [1]బ్రహ్మవేత్త యొక్క ఇంద్రియములు, భూతములు, బ్రహ్మమునందే లయించుచున్నవి. బ్రహ్మవిదుని కళలకును-సూక్ష్మశరీరమునకును, బ్రహ్మమునకును భేదముండదు. బ్రహ్మవేత్త విషయమున, భూత సూక్ష్మముల విలయము నిరవశేషమైనది. సామాన్యుని విషయమున నిది, యిట్టిది కాదు. భూత సూక్ష్మములు, బీజావస్థయందుండి, భావి పునర్జన్మ హేతువగుచున్నవి. బ్రహ్మవిదుని విషయమున సమ్యగ్జ్ఞానము అవిద్యను నశింపజేయుటచే, దాని కార్యములు, పునరావిర్భావమును కవకాశము లేకుండ పరబ్రహ్మమునందే నిరవశేషముగ లయించుచున్నవి. ముక్తాత్ముడు పూర్ణానందాత్మ స్వరూపమును బొందునని భావము.[2]

---

1. సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్ (IV 4-1)
   కేవలేనైవాత్మనావిర్భవతి, న ధర్మాంతరేణేతి. (IV. 4-1. శం.భా)
2. పోల్చు : యత్ర యత్ర మృతో జ్ఞానీ యేనకేనాఽపిమృత్యునా!
   యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయంగతః॥ (ఉత్తరగీత II-6)
   'ఇదంతు పారమార్థికం కూటస్థం, నిత్యం వ్యోమవత్ సర్వవ్యాపి, సర్వ విక్రియారహితం నిత్యతృప్తం నిరవయవం, స్వయం జ్యోతిః స్వభావం యత్ర ధర్మాఽధర్మౌ సహకార్యేణ కాలత్రయంచ, నోపావర్తేతే తదశరీరం మోక్షాఖ్యమ్॥' (I. 1.4 శం. భా) అని శంకరుడు మోక్షావస్థను వర్ణించును.

కాని మోక్షానుభవము, సశరీరస్థితియందా? లేక అశరీరస్థితి యందా? అను ప్రశ్నకు సమాధానముగా, అది **ఉభయ విధముల నుండ**వచ్చునని బాదరాయణ ముని స్థాపించును. (IV-4.12). ముక్తాత్ములు, సంకల్పానుసారము శరీర వంతులుగను, శరీరరహితులుగను, **ఉభయ** విధములనుండగలరని **సూ**త్రకారుడు నిర్ణయించును. ("బాదరాయణః **పునరాచార్యోఽత** ఏవోభయలింగ శ్రుతి దర్శనాదుభయ విధత్వం సాధుమన్యతే; యదా సశరీరతాం సకల్పయతి, తదా సశరీరో భవతి. యదా త్వశరీరతాం తదా త్వశరీరః ఇతి సత్య సంకల్పాత్ సంకల్పవైచిత్ర్యాచ్చ... "శం. భా) ఉభయవిధ మోక్షానుభవములు సత్యములే యని సూత్రకార భాష్యకారుల దర్శన మనుట **సిద్ధాంత**ము. **ముక్తాత్ము**లకు, జగత్సృష్ట్యాది వ్యాపారము తప్ప, నితరమగు **నణిమాద్యైశ్వర్య**ము లన్నియు నుండును. పరమేశ్వరునితో, వీరికి **భోగ**మాత్ర సామ్యముండును. ముక్తులకు **పునరావృత్తిలేదు**. సమ్యగ్దర్శనముచే, మానసిక తమస్సంతయు, అవిద్య నంతయు నశింపజేసిన వారికి నిత్య **సిద్ధ** నిర్వాణ పరాయణులకు అనావృత్తి సిద్ధమే "సమ్యగ్దర్శన విధ్వస్త తమసాంతు నిత్యసిద్ధ నిర్వాణ పరాయణానాం, సిద్ధైవాఽనావృత్తిః॥ (అనావృత్తిః శబ్దాత్-IV. 4.22)

**పూర్వులగు వేదాంతాచార్యులు :**

ఇట్లు వేదాంత సూత్రములందు క్రమబద్ధమగు ఉపనిషత్సారోపదేశమును గాంచగలము. బాదరాయణ ఋషికి **పూర్వులైన** వేదాంతాచార్యులలో **ఆశ్మరథ్యుడు** (I 4-20) జీవపరమాత్మల విషయమున **భేదాఽభేద సిద్ధాంత**మును ప్రతిపాదించును. దేహేంద్రియాది సంఘాతము **నుండి** బయలువెడలునపుడు, మోక్షావస్థయందు, జీవుడు పరమాత్మతో అభిన్నుడగుటవలన జీవబ్రహ్మముల అభేదము ఉపపన్నమని, **ఔడులోమి** (I. 4-21) తలచును. బద్ధావస్థయందు భేదము, ముక్తావస్థయందు అభేదము ఈ ముని **సిద్ధాంత**ము **కాశకృత్స్నుడు** (I. 4-22) **తత్త్వమసి** యను శ్రుతి **దర్శన**మును స్థాపించును. కర్మశేషము వలననే జీవుడు ఇహలోకమునకు దిగివచ్చునని **కార్ష్ణాజిని** (III 1-9) మతము. కర్మశేషమే భూలోకమున నూతన జన్మకారణమని **బాదరి** (III. 1-11) మతము **వామదేవుని** (I. 1-30) మతమును అద్వైతమే. దేవయాన మార్గమున పొందునట్టిది సగుణబ్రహ్మమే యని, సర్వగతమగు నిర్గుణబ్రహ్మము కాదని **బాదరి** (IV 3-7) బోధించును. ప్రాదేశమాత్ర పరిమాణమగు హృదయమున,

పరమేశ్వరోపాసనమును గూర్చి, ఉపాసనార్థము పరమేశ్వరునికి ప్రాదేశమాత్ర సంపత్తి (కల్పన) ఉపపన్నమే యని ఆశ్మరథ్య బాదరి జైమిన్యాచార్యుల యుపదేశము. (I. 2-29, 30, 31). జైమిని వేదాంతమునకును (IV. 4-5) పూర్వ మీమాంసకును ఆచార్యుడై యుండినట్లు బ్రహ్మసూత్రములవలన తెలియుచున్నది. బాదరాయణుని (వ్యాసుని) మతము అద్వైతమే. ఉపనిషద్రహస్యము నెఱుగుటకు బ్రహ్మసూత్రము లత్యావశ్యకములు. ఆత్మానాత్మ వివేకమును (II. 3-1-53) పరమేశ్వరోపాసనమును, నీతివిద్యను, ఆధ్యాత్మిక జీవనమును, సమగ్రముగ బోధించు ఈ వేదాంతశాస్త్రము సకలశాస్త్ర మూర్ధన్యము. ఇతర శాస్త్రములన్నియు దీని శేషభూతములు మాత్రమే. ఉపనిషత్తులవలెనే పరమార్థమగు అద్వైతమును నిది బోధించినను, కారిభేదము ననుసరించి మోక్షసాధన దశలనన్నిటిని నుపదేశించుచున్నది.

బ్ర సూ. లందు 555 సూత్రములున్నను, మొదటి నాల్గు సూత్రము లత్యంత ముఖ్యముగా భావింపబడినవి. సంపూర్ణోపదేశము యొక్క సారభూతమీ చతుస్సూత్రి. ఇతర సూత్రములు వీని వాఖ్యాన రూపములు.

**చతుఃసూత్రి :**

I. **అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా॥** (I. 1-1) (తరువాత, ఈ కారణమున బ్రహ్మవిచారము కర్తవ్యము). శ్రుతి గమ్యమగు బ్రహ్మతత్త్వము సందిగ్ధముగా నుండుటవలన, తత్సాక్షాత్కారమువలన, అనర్థ నివృత్తి లక్షణమగు మోక్షము సిద్ధించుటవలన సాధనచతుష్టయ సంపన్నుడైన యధికారికి, బ్రహ్మపరోక్షజ్ఞానమునకు వేదాంతవాక్య విచారము కర్తవ్యము.

II **జన్మాద్యస్యయతః॥** (I 1-2) (దీని( జగము) యొక్క జన్మాదులు దేనినుండి గల్గుచున్నవో అది బ్రహ్మము) బ్రహ్మముయొక్క జగత్కారణత్వము నిది స్థాపించును. విశ్వమున కుపాదాన నిమిత్త కారణములు రెండును బ్రహ్మమే

III **శాస్త్రయోనిత్వాత్॥** (I 1-3) (శాస్త్రయోని యగుటవలన) (i) శాస్త్రయోనిః - శాస్త్రస్యయోనిః - ఋగ్వేదాది వేదములకు కారణమగుటవలన బ్రహ్మము (పరమేశ్వరుడు) సర్వజ్ఞుడు (ii) శాస్త్రయోనిః - శాస్త్రంయోని కారణం, ప్రమాణం యశ్యశాస్త్రము దేనికి ప్రమాణమో అది బ్రహ్మము. జగత్తు

యొక్క జన్మస్థితి విలయములకు బ్రహ్మము కారణమని శాస్త్రము (శ్రుతి) వలననే మనకు తెలియుచున్నది.

IV. **తత్తుసమన్వయాత్॥** (I. 1-4) - శ్రుతి వాక్య సమన్వయము వలన బ్రహ్మమే ప్రతిపాద్యము. ఉపక్రమోప సంహారాది షడ్లింగములచే[1] సర్వవేదాంత (ఉపనిషద్) వాక్యములకు పరమ తాత్పర్యము, సర్వజ్ఞము, జగదుత్పత్తిస్థితి లయకారణమునగు బ్రహ్మమే. శ్రుతివాక్యములందలి భేదములు కేవలము బాహిరములు, సర్వవేదాంతములు. అఖండ నిత్యశుద్ధబుద్ధమగు పర బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. (ఇతి చతుస్సూత్రీ).

శంకరునికి పూర్వమే బ్ర సూ. లకు భాష్యములున్నట్లు తెలియుచున్నది. అవి ప్రస్తుత మలభ్యములు. శంకరు డుపవర్షుని పేర్కొనును. ఈ ఉపవర్షునే రామానుజుడు, తదనుయాయులు బోధాయనుదన్నారు. ద్రవిడ, టంక, భర్తృ ప్రపంచ, భారుచి, కపర్ది, బ్రహ్మనంద, గుహదేవులను వారి భాష్యములు అలభ్యములు. శంకరుని తరువాతి భాష్యకారులు భాస్కరుడు, యాదవ ప్రకాశుడు, రామానుజుడు, మధ్వుడు, నింబార్కుడు, శ్రీకంఠుడు, శ్రీపతి, వల్లభుడు, శుకుడు, విజ్ఞానభిక్షువు, బలదేవుడు మొదలగువారు.

సర్వసారభూతమగు ఈ వేదాంత శాస్త్రమును జనులందరు పఠించి అభ్యుదయ నిశ్శ్రేయసముల బొందవలయును బ్రహ్మసూత్ర కృతి సంపూర్ణ[2] మగు ఆధ్యాత్మిక జీవన తత్త్వశాస్త్రము. (Integral philosophy of spiritual life).

## వాసర్షికృత స్తోత్ర వాఙ్మయము

బ్రహ్మసూత్రములు, వ్యాసర్షి, ప్రజ్ఞా పారమ్యమును నిరూపించుటను కొంతవరకు పరిశీలించితిమి. భక్తి జ్ఞానకర్మయోగములా మహాత్ముని హృదయమున,మహత్తర సమన్వయ సిద్ధిగాంచినవనుటను,మహర్షి కృత భారత భాగవతము లందును, తదితర పురాణముల యందును ప్రోతములై వ్యాపించియున్న స్తోత్ర

1. ఉపక్రమోపసంహారౌ అభ్యాసోఽపూర్వతాఫలమ్।
అర్థవాదోపపత్తీచ, లింగంతాత్పర్యనిర్ణయే॥
2. అనంతశాస్త్రం బహువేదితవ్యమ్, అల్పశ్చకాలోబహువశ్చవిఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యం,హంసోయథా క్షీర మివాంబుమిశ్రమ్॥

రత్నావళులు, ఉజ్జ్వల దీప్తులతో నిరూపించుచున్నవి. అతి విస్తృతమైయున్న ఆ స్తోత్రవాఙ్మయమును సమీక్షించుట ఈ వ్యాసమున సాధ్యపడదు కాన; అందులో కొన్ని వేదాంత సారభూతములగు స్తోత్రములను మాత్రమే పరిశీలింతము. బ్ర. సూ. లందు భగవద్భక్తిని, ఉపాసనను గూర్చి మహర్షి సూత్రించియున్నాడు. ఆ విద్యావస్థయందు జీవునకు పరమాత్మయు, కర్మాధ్యక్షుడు, సర్వభూతాధి వాసుడు, సాక్షి, సర్వచైతన్య హేతువునగు పరమేశ్వరుని ఆజ్ఞ వలననే, కర్తృత్వ, భోక్తృత్వ లక్షణమగు సంసారము సిద్ధించుచున్నది. తదనుగ్రహ హేతుకమగు విజ్ఞానము చేతనే, మోక్షసిద్ధియని బ్ర. సూ. లు స్థాపించును. (II. 3. 41), జీవుడు ఈశ్వరాంశము. పరమేశ్వరోపాసన వలన (ధ్యానము వలన) అంతర్హితమైయున్న జీవుని ఈశ్వరత్వము అభివ్యక్తి నందును. జీవుని బంధమోక్షములు పరమేశ్వరాధీనములు. (II. 3-43, 44, 50; III. 2.5) భక్తి ధ్యాన ప్రణిధానాద్యనుష్ఠానమువలన, భగవత్సాక్షాత్కారము సిద్ధించునని శ్రుతి స్మృతుల ఉపదేశము. 'అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్॥ (II. 2-24) పరమేశ్వర సాక్షాత్కారమునకు తన్నిరంతర స్మరణము ముఖ్య సాధనము. "ఆవృత్తిరస కృదుపదేశాత్॥ (IV. 1-1). భక్తి ఉపాసనా రూపము. ఉపాసనా నిదిధ్యాసనము లేకార్థకములని, ఆవృత్తిరూపములని, శంకరుడు భాష్యమున వివరించును.[1] ఇట్టి ఉపాసన, దర్శన పర్యవసానమనియు శంకరుడు వివరించును.

ప్రోషిత భర్తృకయగు సాధ్వి, తన ప్రియతమ నాథుని సోత్కంఠయై నిరంతరము స్మరించును. ఇట్టి అవిచ్ఛిన్న ప్రవాహరూప స్మరణము సిద్ధించినచో హృదయ గ్రంథులు భిద్యములగును. (స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః॥ ఛాం. ఉ. VII. 26.2) ఇట్టి స్మరణము దర్శనము వంటిదే. భగవద్దర్శనము వలన, హృదయ గ్రంథులు భిన్నములై, సర్వసంశయములతో పాటు కర్మము లన్నియు నశించును. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యో, నిది ధ్యాసి తవ్యః"॥– అని చెప్పు బృహదారణ్యక శ్రుతి (II. 4-5) సైతము నిది

1. అపి చోపాసనం నిదిధ్యాసనం చేత్యంతర్ణీతావృత్తిగుణైవ క్రియాఽభిధీయతే తథా ధ్యాయతి ప్రోషితనాథా పరిమితియా నిరంతర స్మరణా పతింయతే। ప్రతి సోత్కంఠాసైవమ భిధీయతే. (బ్ర. సూ. V. 1-1. శం. భా.) తత్ర ప్రత్యయైకతానతాధ్యానమ్ (యోగదర్శనము III-2).

ధ్యానము (ఉపాసన లేక ధ్యానము) దర్శనముతో సమానమని చూపుచున్నది దర్శనతుల్యమగు నిరంతర స్మరణముగల సాధకుడు పరమాత్మకు ప్రియుడు లేక వరణీయుడు. అట్టి వానికే పరమాత్మ ప్రాప్యుడై స్వానుభవము నను గ్రహించుచున్నాడు. (యమేవైషవృణుతే తేన లభ్యస్త స్యైష ఆత్మా వివృణుతే తనూంసామ్- ముం. ఉ. III. 2-3).

కావున అనుస్మరణము దర్శన పర్యవసానమని శంకరాది ఆచార్యుల నిశ్చయము. భగవన్నామ జపము. స్తోత్రాదులు, నిరంతర భగవత్స్మృతికి పరమ సాధనము. **"నామవ్యాహరణం విష్ణోః యత స్తద్విషయామతిః"**- అని భాగవతము వచించును. సర్వలోకహితరతుడును, వేదాబ్జ భాస్కరుడునగు వ్యాసర్షి, భక్తి సాధన కనురూపములగు మహా స్తోత్రముల నసంఖ్యాకముగ రచించెను. మహాభారతమందలి విష్ణు సహస్ర నామస్తోత్రము ముఖ్యమైనది. పద్మపురాణమందును విష్ణు (వాసుదేవ) సహస్ర నామస్తోత్రము గలదు. ఇది శివప్రోక్తము. ఇట్లే శివసహస్ర నామస్తోత్రము మ భా. న, కలదు. బ్రహ్మాండ పురాణమందలి లలితా సహస్ర నామస్తోత్రము ప్రసిద్ధము. వ్యాసర్షి, అష్టాదశ పురాణములకు గ్రథన కర్తయను భారతీయ సంప్రదాయము విశ్వాస యోగ్యమైనది. శ్రీమద్భాగవతము నందును, నారాయణ కవచాది స్తోత్రములనేకములున్నవి. నామస్తోత్ర జపము, జపయజ్ఞమని, యజ్ఞములలో నుత్తమోత్తమమని, భగవద్విభూతియని చెప్పబడినది. "యజ్ఞానాంజపయజ్ఞోఽస్మి" (గీత. X. 25). తత్ప్రశక్తి కారణమును శంకరుడు తన విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యమున నిట్లు వివరించును: భూతహింస లేమి చేతను, పురుషాంతర ద్రవ్యాంతర దేశ కాలాది నియమముల నపేక్షింపకుండుట చేతను, జపయజ్ఞము ఉత్కృష్టతమము.[1] స్త్రీ పుం వివక్షారహితము మానవులందరకును ఇది అనుష్ఠింపదగినది.[2] యుధిష్ఠిరుడు భీష్మనిట్లు ప్రశ్నించును.

1. "అస్యస్తుతి లక్షణస్యార్చనస్య ఆధిక్యేకిం కారణమ్ ? ఉచ్యతే-హింసాది పురుషాంతర, ద్రవ్యాంతర, దేశకాలాదినియమాఽనపేక్షత్వం అధిక్యే కారణమ్ ॥

2. ఆనింద్యయో న్యధిక్రియతే, పారంపర్యాత్ సామాన్యవత్ । సంసార దుఃఖజిహాసాయా అవిశేషాత్ ॥ సంసార దుఃఖ విముక్తి పొందవలెనను ఆకాంక్ష సర్వజన సామాన్య మగుటచే అందఱును భక్తికిని, ఆత్మజ్ఞానమునకును అధికారులే.

పోల్చు :- అపివర్ణావకృష్టస్తు నారీ వాధర్మ కాంక్షిణీ । తావప్యేతేన మార్గేణ గచ్ఛేతాం పరమం పదమ్ ॥ (మ భా. శాంతి. 240.34.)

కిమేకం దైవతంలోకే కివాప్యేకం పరాయణమ్ ।
స్తువంతః కం కమర్చం తః ప్రాప్నుయు ర్మానవాః శుభమ్ ॥
కోధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జపన్ ముచ్యతే జంతు ర్జన్మసంసారబంధనాత్ ॥

సర్వ ధర్మములలో ప్రకృష్టమైన ధర్మమును గూర్చి ప్రశ్నించిన యుధిష్ఠిరునకు భీష్ముడిట్లుపదేశించును:

జగత్ప్రభుం దేవదేవయనంతం పురుషోత్తమమ్ ।
స్తువన్ నామ సహస్రేణ పురుషః సతతోత్థితః ॥
తమేవ చార్చయన్ నిత్యం భక్త్యా పురుష మవ్యయం ।
ధ్యాయన్ స్తువన్ సమస్యంశ్చ యజమానస్తమేన చ ॥
అనాదినిధనం విష్ణుం స్వలోక మహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్ నిత్యం సర్వదుఃఖాతి గోభవేత్ ॥
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూత భవోద్భవమ్ ॥
ఏషమే సర్వధర్మాణాం ధర్మో ఽధికతమో మతః ।
యద్భక్త్యా పుండరీకాంక్షం స్తవైరర్చే న్నరస్సదా ॥
పరమం యో మహత్తేజః, పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ, పరమం యః పరాయణమ్ ॥
పవిత్రాణాం పవిత్రం యో మంగళానాంచ మంగళమ్ ।
దైవతం దేవతానాంచ, భూతానాం యోఽవ్యయో పితా ॥
యతః సర్వాణి, భూతాని భవం త్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాంతి, పునరేవ యుగక్షయే ॥
తస్యలోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామ సహస్రం మే శ్రుణు పాపభయావహమ్ ॥
యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మ నః ।
ఋషిభిః పరిగీతాని* తాని వక్ష్యామి భూతయే ॥

* యజుర్వేదమందలి రుద్రాధ్యాయము సహస్ర నామస్తోత్రమువంటి సుప్రసిద్ధవేదస్తోత్రము. ప్రప్రథమున సహస్రనామ స్తోత్రములను సంభావించిన ఋషులకు ఈ దివ్యస్తోత్రము సూచనమై యుండవచ్చును. భారతమందలి ఈ విష్ణు సహస్ర నామస్తోత్రము, ఇట్టి స్తోత్రములలో ప్రాచీనతమము స్తోత్రరూపమున నున్న సాధనశాస్త్రము.

ఇట్లు యుధిష్ఠిరు డడిగిన ఆఱు ప్రశ్నలకును భీష్ముడు పరమార్థ సారసంగ్రహ రూపమగు సమాధాన మొసగి, 107 శ్లోకములలో సహస్ర నామావళి నుదాహరించును; ఉపసంహారమున (ఉత్తర పీఠిక యందు) 22 శ్లోకములలో భగవన్మహిమను తత్సహస్రనామ స్తోత్ర ప్రభావమును కీర్తించును.

ఈ నామములన్నియు భగవత్తత్త్వ నిరూపకములు; తద్గుణ సంబంధములు. మంత్ర ద్రష్టలగు ఋషులచే కీర్తింపబడినవి. ఈ నామజపము చతుర్విధ పురుషార్థదాయకము. భీష్ముడిట్లు స్తోత్రాంతమున మరల నుపదేశించును: "చంద్ర సూర్య నక్షత్ర మండితమగు ద్యులోకము, ఆకాశము, భూమి, మహాసముద్రములు, సర్వాత్ముడగు వాసుదేవుని ప్రభావమునే ధరింపబడియున్నవి. దేవాసుర గంధర్వ యక్షోరగ రాక్షస యుక్తమగు నీ చరాచర జగత్తంతయు, భగవంతుని యధీనమందున్నది. జ్ఞానకర్మేంద్రియములు, మనోబుద్ధులు, సత్త్వము, తేజస్సు, బలము, ధైర్యము, క్షేత్ర క్షేత్రజ్ఞులు - ఇవియన్నియు వాసుదేవాత్మకములే.

**సర్వవేదములకు ఆచారము ముఖ్యము (ఆచారము, శీలము, చారిత్రము సమానార్థకములు, పర్యాయపదములు)** [1] ధర్మము ఆచారజన్యము. ధర్మమునకు అచ్యుతుడే (షడ్భావ వికార శూన్యుడగు పరమేశ్వరుడే) ప్రభువు ఋషులు, పితృదేవతలు, దేవతలు, పంచ మహా భూతములు, సప్త ధాతువులు, స్థావర జంగమాత్మకమగు విశ్వమున కంతకును నారాయణుడే కారణము. యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్యాశిల్పాది కర్మములు, వేదములు, శాస్త్రములు, సకల విజ్ఞానము అన్నియు జనార్దనుని (అభ్యుదయ నిశ్శ్రేయస లక్షణమగు పురుషార్థము కొరకు జనులచే యాచింపబడువాడగు పరమేశ్వరుని) వలననే కలుగుచున్నవి. మహాభూతమగు విష్ణువొక్కడే త్రిలోక వ్యాపకుడై వివిధ భూతముల రూపమున నున్నాడు. భూతాత్మగా సర్వము ననుభవించుచున్నాడు కాని, యే వికారమును బొందని అవ్యయుడా పరమాత్మ.

1. చూడు : బ్ర.సూ. III-1-9 శం.భా., "చరణం చారిత్ర మితిహ్యాచారః శీలమితిచ పర్యాయాః —" (భాష్యార్థ రత్నమాల), "**అద్రోహః సర్వభూతేషు, కర్మణా, మనసా, గిరా। అనుగ్రహశ్చ జ్ఞానంచ శీలమేతద్విదుర్బుధాః" — (రత్నప్రభ).**

వాసుదేవ భక్తులగు పుణ్యాత్ములకు క్రోధమాత్సర్య లోభగుణములును, అపవిత్ర మతియు నుండవు. వాసుదేవా శ్రయులు, వాసుదేవ పరాయణులు నగు మర్త్యులు, సర్వపాప విశుద్ధాత్ములై సనాతనమగు బ్రహ్మమును బొందుచున్నారు. వారెన్నడును అశుభమును బొందరు. జన్మ మృత్యు జరా వ్యాధి భయము వారికి లేనే లేదు. నిత్యము నామ సహస్రముచే, భక్తితో పురుషోత్తముని కీర్తించు పురుషుడు సంసార హేతు జాతములగు సకల దుర్గుణములను తరించగలడు శ్రద్ధాభక్తి సమన్వితుడై ఈ స్తోత్రమును పఠించువాడు, ఆత్మ సుఖశాంతులను, సంపదను, ధైర్యమును, స్మృతిని, కీర్తిని పొందును. ధర్మార్థకామ పుత్రార్థులైన వారు, వారి వారి మనోభీష్టముల బొందుదురు. వ్యాసకీర్తితమగు నీ స్తవము శ్రేయస్సును, శుభములను బొందగోరు పురుషునిచే పఠితవ్యము. జగత్కారణుడును ప్రభువునైన విష్ణుని భజించు వారెన్నడును పరాభవమును బొందరు. ఇది ఈ స్తోత్ర భావము.

మహాభారతము మోక్షశాస్త్రము, ఉపనిషత్తనియు వర్ణింపబడినది. (ఉపనిషదం పుణ్యామ్). వేదితవ్యములలోనిది యాత్మవంటిది (ఆత్మైవవేదితవ్యేషు). గీత, సహస్రనామ స్తోత్రము- ఇవి రెండును ఈశ్వరయమైన భక్తి జ్ఞానములకు ప్రకాశాత్మకములైన దివ్యశిఖరములు. గీతాశాస్త్రసారమే సహస్రనామ స్తోత్రము మానవుల ఆకాంక్షలకు స్పందించి, అనుగ్రహించు ఆపరతత్త్వము, సగుణము, నిర్గుణము కూడ. ఆ తత్త్వము శూన్య, తత్త్వ, విశ్వ, ఆత్మాది శబ్దములతో వర్ణింపబడినది. వేయి పేర్లు, ఆ పరమాత్ముని స్వరూపమును మనోజ్ఞముగ వర్ణించుచున్నవి. వ్యాసర్షి యొక్క భక్తి, జ్ఞాన, యోగ, విజ్ఞాన సంపదకు ఈ స్తోత్రము పరమ నిధానము. ఇది ఉపనిషత్సారము కూడ. పరమేశ్వరుని సర్వాతీతత్వ, సర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వ, సర్వాత్మత్వ, సర్వోత్పత్తి స్థితిలయ హేతుత్వ, సర్వలక్ష్యనియంతృత్వ, సర్వశరణ్యత్వ, సర్వసంరక్షకత్వ, సర్వదోష వినాశకత్వ, సర్వపాప భయహరత్వ, సర్వధర్మమూలత్వ, మోక్ష ప్రదత్వముల నీ స్తోత్రము ఉపదేశ పూర్వకముగా కీర్తించుచున్నది. సకల శాస్త్రముల మూలభూతమగు సారోపదేశమిదియే. విష్ణు సహస్ర నామస్తోత్రము నామ పారాయణ ఫలమాత్రమే కాక, సాధకులకు బ్రహ్మజ్ఞాన సాధన భూతమగు వేదాంత గ్రంథముగ నున్నది.

మహాభారతమున శివ సహస్రనామ స్తోత్రము. (అనుశాసనిక 17 అ), భీష్మస్తవరాజము (శాంతి. 47. అ), తండికృత మహాదేవస్తుతి (అనుశాసనిక. 16 అ.), అర్జున కృత దుర్గాస్తుతి (భీష్మ-23.అ) గీత యందలి (XI-25-31; 36-46) అర్జున కృత విశ్వరూప స్తోత్రము- ఇవన్నియు పరమార్థతత్త్వ రత్న మంజూషలు. విస్తరభీతిచే ఈ వ్యాసమున వీనిని వివరింపజాలను. సుదీర్ఘమైన భీష్మస్తవరాజమున పరతత్త్వ ప్రతిపాదకమగు వేదాంత సిద్ధాంతము, అవతార సిద్ధాంతము, భక్తియోగము మనోజ్ఞ శబ్దార్థభరితముగ వ్యాఖ్యానింపబడినది.

("యస్మిన్ విశ్వాని భూతాని తిష్ఠంతిచ విశంతి చ।
గుణభూతాని భూతేశే సూత్రే మణిగణా ఇవ॥
వాసుదేవత్వ మాగమ్య యదోర్వంశ సముద్భవః॥
భూ భారహరణం చక్రే తస్మై కృష్ణాత్మనే నమః॥")

తండిమహాదేవస్తుతియందు, శివు నిట్లు నుతించును.

"యచ్చైతత్ పరమం బ్రహ్మ, యచ్చతత్ పరమం పదమ్।
యాగతిః సాంఖ్యయోగానాం, స భవాన్ నాఽత్రసంశయః॥"
సేయ మాసాదితా సాక్షాత్ త్వద్భక్తిః జన్మభిర్మయా।
భక్తానుగ్రహకృద్దేవో, యంజ్ఞాత్వాఽ మృత మశ్నుతే॥"

పరతత్వము శివాఽభిన్నముగా ఇందు వర్ణింపబడినది.

భీష్మపర్వమందలి అర్జునకృత దుర్గాస్తుతి ప్రసిద్ధము.

"త్వం బ్రహ్మవిద్యవిద్యానాం, మహానిద్రాచ దేహినామ్।
స్కంధమాతర్భగవతీ దుర్గే! కాంతారవాసినీ॥
స్వాహాకారః, స్వధాచైవ, కలా, కాష్ఠా, సరస్వతీ
సావిత్రీ, వేద మాతా చ తథా వేదాంత ఉచ్యతే।" ఇత్యాది. ఇందు, తుష్టి, పుష్టి, ధృతి, దీప్తి- ఇవియన్నియు దుర్గాదేవి రూపములని వర్ణింపబడినది. ఈ స్తోత్రము మార్కండేయ పురాణమందలి సప్తశతికి, బ్రహ్మాండ పురాణమందలి, లలితా సహస్రనామస్తోత్రమునకు, లలితా త్రిశతికి బీజరూపము. విష్ణుసహస్ర నామస్తుతి ఇతర సహస్రనామస్తోత్రములకు ఆదర్శరూపము (Model).

శ్రీమద్భాగవతాంతర్గత స్తోత్ర వాఙ్మయ మనంతము.రసనిర్భరము.అందలి భీష్మకృత శ్రీకృష్ణస్తుతి, నారాయణ కవచము, ప్రహ్లాదకృత నృసింహస్తుతి,

గజేంద్రకృతస్తుతి, నారదునకు నారాయణ మహర్షి యుపదేశించిన శ్రుతిగీతలు, దశమస్కంధమందలి వివిధ స్తోత్రములు పరమ రమణీయములును, పరమార్థ గర్భితములునై వ్యాసర్షి ప్రజ్ఞాపారమితను వ్యాఖ్యానించుచున్నవి. ఇవియన్నియు స్తోత్ర రూపమునఁనున్న వేదాంత శాస్త్రములే.

**దేవీభాగవత కర్తృత్వ విచారము :**

శ్రీ మద్దేవీ భాగవతము వ్యాసకృతము కాదు. అష్టాదశ పురాణములందలి భాగవతము, శ్రీ మద్భాగవతమనియే, తద్భాష్యకారులైన శ్రీధరాదుల సిద్ధాంతము. ఇందలి ఆద్యశ్లోకము "జన్మాద్యస్యయతోన్వయాది తరతః" అనునది గాయత్రీ మంత్రార్థద్యోతకమై, జగత్కారణమగు పరతత్త్వముయొక్క తటస్థ స్వరూప లక్షణముల నుపదేశించుచున్నది. శ్రీ మద్భాగవతము బ్రహ్మసూత్రములకు వ్యాసర్షి, స్వయముగా రచించిన భాష్యరూపమని విజ్ఞుల మతము. వ్యాస కృత భాగవతము దేవీ భాగవతమే కాని, శ్రీమద్భాగవతము కాదనియు శ్రీమద్భాగవతకర్త బోపదేవుడనియు శాక్తేయుల యభిప్రాయము. ఆంధ్రలిపియందు తొలుత భాగవతమును ముద్రించిన వారీ విషయమును సంపూర్ణముగ పరిశోధించి సవిస్తరముగ సిద్ధాంత చంద్రికయను వ్యాసమును రచించి, భాగవతమునకు పీఠికగా చేర్చియున్నారు. శ్రీ మద్భాగవత కర్త, వ్యాసర్షియని అందు నిరూపింపబడినది. బోపదేవుడు 12 వ శతాబ్దముననున్న హేమాద్రిమంత్రికి మిత్రుడు. ఆయన ప్రీతికై, 'శ్రీమద్భాగవతాధ్యాయసార' మను గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. ఒక మంత్రి ప్రీతికై శ్రీమద్భాగవతము వంటి సంహితను రచించుట లౌకికుడైన కవికి అసాధ్యము.

**శ్రీమద్భాగవతాధ్యాయ సారోహ్యత్ర నిరూప్యతే।**
**విదుషాబోపదేవ్యే మంత్రిహేమాద్రితుష్టయే॥**

బోపదేవుడు క్రీ. శ. 1182 సం॥న నుండెను. శ్రీమద్భాగవతము, ఆధునిక చరిత్రకారుల ననుసరించి క్రీ. శ. 4 వ శతాబ్దమునకు చెందినదిగా చెప్పబడిన మత్స్యపురాణమున ప్రస్తావింపబడినది. **ప్రసిద్ధుడగు అరబ్బీ పండితుడు ఆల్బెరుని**, శ్రీమద్భాగవతమును (**వైష్ణవ భాగవతమును**) తన గ్రంథమున **నుల్లేఖించియుండుటచే** శ్రీమద్భాగవత **కర్త బోపదేవుడను వాదము** నిస్సారమై **నిరస్తమైనది.** వాసుదేవుడు భాగవతమున స్తుతింపబడినాడని

అల్బరుని (Albaruni) నిర్దేశించును. (See: Albaruni's India. PP 131) అల్బరుని పండితుడు క్రీ. శ. 1030 సంవత్సరము నాటివాడు. దేవీభాగవతము క్రీ. శ. 12 వ శతాబ్దమున మత్స్యాది పురాణములలోని భాగవత వర్ణనము ననుసరించి ప్రయత్నపూర్వకముగా రచింపబడిన గ్రంథమని పండితులు స్థాపించియున్నారు. తత్కర్త, వంగదేశీయుడగు స్మార్తశాక్త బ్రాహ్మణుడు. చిరకాలము వారణాసియందు నివసించి, వివిధ మత శాఖలకు చెందిన వ్యక్తుల హృదయములను శాక్తభావ ప్రభావితము చేయుటకు దీని రచించెనని పండితుల నిర్ణయము. (See. The Upapuranas-The Cultural Heritage of India-Vol-II. 1962 PP-281). ఇందలి దేవీగీత, విశ్వరూప సందర్శనము భగవద్గీతకు అనుకరణములు. కర్త ఎవరైనను దేవీభాగవతము వేద విరుద్ధమైన శాక్తతంత్రభావములను సమర్థింపక, వేద విరుద్ధముకాని తంత్ర భావములను మాత్రమే స్వీకరించినది. మణిద్వీపవాసినియైన భువనేశ్వరి, పరమాత్మ లేక పరబ్రహ్మమే, సృష్టియందు గుణములను గ్రహించి ప్రకృతి పురుష ద్వంద్వభావమును బొందుచున్నది. దుర్గాదిరూపములలో తోచునది ఆ పరతత్వమే. జ్ఞానము భక్తియొక్క పరమావస్థయే. ఇందలి దేవకృత భగవతీస్తుతి రమణీయము. వేదసూక్తార్థగర్భితము.

తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం
వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।
దుర్గాం దేవీం శరణ మహం ప్రపద్యే
సుతరసి తరసే నమః॥ (దే. భా. VII. 39 అ.) ఇత్యాదులు.

ఇందలి (XIIస్కంధము) గాయత్రీ కవచము, గాయత్రీహృదయము, గాయత్రీ స్తోత్రము, గాయత్రీ నామసహస్రము కేనోపనిషత్కథ ఇత్యాదులు భక్తికి, ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానమునకు నిధానములు.

దేవీ భాగవతము వ్యాసర్షి కృతము కాదని స్థాపింపబడినను, యువభారతి ఉపన్యాసమంజరి కార్యక్రమమున, ఆ గ్రంథమును వ్యాసకృతముగ చేర్చి యుండుటచే, ఇంత వివరింపవలసి వచ్చినది.

అష్టాదశ పురాణములోని బ్రహ్మాండ పురాణాంతర్గతమగు అధ్యాత్మ రామాయణమునను, అనేక స్తోత్ర రత్నములున్నవి. అవి యన్నియు భక్తి జ్ఞాన ప్రబోధములై అద్వైత జ్ఞానమున పర్యవసించుచున్నవి. అద్వయుడగు పరమే

శ్వరునకు సహస్రనామములెందుకు? ఏకత్వమున, బహుత్వమును, బహుత్వమున నేకత్వమును గాంచుట భారతీయ మానసము యొక్క విశిష్టధీశక్తి. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అనునది వేదముల పరమార్థ దర్శనము.

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం బీజం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥ (కఠ. ఉ. V. 12)

అద్వయుడగు పరమాత్మను, హృదయస్థుని, గాంచు వివేకశాలులు, నిత్యమును ఆత్మానందలక్షణమునగు సుఖమును గాంతురు. వ్యాసర్షి జ్ఞానమయ ప్రదీపమును ప్రజ్వలిత మొనరించి, దేవతా ద్వైతమును స్థాపించి, మానవుని దివ్యత్వమును, శాశ్వతమగు ధర్మ స్వరూపమును ప్రబోధించియున్నాడు. ఆ మహర్షి యుపదేశ మగు ధర్మము, భక్తి తత్త్వజ్ఞానము ననుష్ఠించినచో, మరల సత్యయుగము ప్రాప్తించును. ఆత్మజ్ఞానులు, అహింసకులు, సర్వభూత హితరతులు నైనవారు, జగమున నిండి ఆశీఃకర్ములు (స్వార్థబుద్ధితో కర్మముల నాచరించువారు) జగమున లేకపోవుటచే మరల కృతయుగము ప్రాప్తించునని, వ్యాసర్షియే మహాభారతమున చెప్పియున్నాడు.

అహింసకై రాత్మవిద్భిః సర్వభూతహితే రతైః।
భవేత్ కృతయుగ ప్రాప్తిః ఆశీః కర్మవివర్జితా॥
(మ. భా. శాంతి. 348-63)

ధర్మానుష్ఠాన ప్రాధాన్యమును గూర్చి మహర్షి, భారత సావిత్రియం దిట్లుపదేశించెను :

నజాతు కామా న్నభయా న్నలోభా
ద్ధర్మం త్యజే జ్జీవితస్యాఽపి హేతోః,
నిత్యో ధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః॥
(మ. భా. స్వర్గారోహణ. V. 63)

కామభయలోభాదులతో జీవితార్థమై, ధర్మమును త్యజింపగూడదు. జీవితమున సుఖదుఃఖము లనిత్యములు. జీవుడు నిత్యుడు. శారీరకములైన ఉపాధు లనిత్య

ములు. అనిత్యముల కొఱకు నిత్యమగు ధర్మమును విసర్జింపరాదు. ఈ యుప దేశమే వ్యాసర్షికృత స్తోత్ర సాహిత్యమును సర్వత్ర ధ్వనించుచున్నది.

అద్వితీయ తత్త్వవేత్తయు, అవ్యయజ్ఞాన పయోనిధియనగు వ్యాసర్షి ప్రభావము, నేటికిని సజీవముగనే యున్నది. అమృతాత్మకమగు ఆ పరమర్షి ప్రజ్ఞాపరిమళము, భూమండల మంతట వ్యాపించుచునే యున్నది. సత్పురుషుల పుణ్యకర్మముల సౌరభ్యము గాలికెదురుగా వెళ్ళి, దిగంతములందు మాత్రమే కాక, స్వర్గపర్యంతము వ్యాపించుట యుక్తమే.

"యథావృక్షస్య సంపుష్పితస్యదూరాద్గంధో వాత్యేవం పుణ్యస్యకర్మణో దూరాద్గంధోవాతి"— (నారాయణీయ యాజ్ఞిక్యుపనిషత్ 11-1)

"ఓం తత్సత్"

# శ్రీమద్భాగవతము

—డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి

1. జన్మాద్యస్య యతోఽన్వయాదితరత శ్చార్థే ష్వభిజ్ఞ స్వరాట్
తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే ముహ్యంతి యత్సూరయః
తేజో వారి మృదాం వినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం మత్యం పర ధీమహి॥

2 ధర్మ ప్రోజ్ఝితకైతవోఽత్రపరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర శివదం తాపత్రయోన్మీలనం
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వాపరైరీశ్వరః
సద్యోహృద్య వరుధ్యతేఽత్ర కృతిభి శ్శుశ్రూషిభి స్తక్షణాత్॥

3. నిగమ కల్పతరోర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సమ్మితమ్
పిబత భాగవతం రసమాలయమ్
ముహు రహో రసికా భువి భావుకాః॥

శ్రీమద్భాగవతమునకు మోక్షశాస్త్రమని ప్రసిద్ధి. అందునను శ్రవణ మాత్రముననే ముక్తి నిచ్చు గ్రంథ మని ప్రసిద్ధి.

పరీక్షితునకు శమీకపుత్రుడు తక్షక విషాగ్నిచే నేడు దినములలో మరణింతువని శాపము పెట్టెను. రాజునకు విరక్తి కల్గెను. సప్త దినములలో తాను చనిపోవును. కాని, మరల జన్మ కలుగరాదు. తాను మోక్షము పొందవలెను. ఋషులందరును వచ్చిరి. ఆయన సంప్రశ్నమును విచారించిరి. వారిలో వారికి తెగలేదు. శ్రీ శుక మహర్షి వచ్చెను. రాజునకు భాగవతము చెప్పెను.

రాజ ప్రశ్న మిది:

అతః పృచ్ఛామి సంసిద్ధిం యోగినాం పరమం గురుమ్
పురుషస్యేహ యత్కార్యం మ్రియమాణస్య సర్వదా

మరణవేళ జనులు ముక్తిపొందుటకు చేయవలసినదేమి యని. భాగవత మంతయు నీ ప్రశ్నమునకు సమాధానమే.

ఏతన్నిర్విద్య మానానా మిచ్ఛతోఽకుతోభయమ్
యోగినా నృప నిర్ణీతం హరేర్నామానుకీర్తనం.

విరక్తులై భయరాహిత్యమును కోరువారు, యోగ మవలంబించి హరినామ కీర్తన చేయవలయునని శుక మహర్షి సమాధానము. ఇది గ్రంథమున కుపక్రమము. భయ మనగా మరణభయమే. దానికి మించిన భయము లేదు. ఆ భయము పోవలెను. అది ఎట్లు పోవును? హరినామ కీర్తనవలన పోవును. ఎవరికి పోవును? విరక్తులైన వారికి, యోగులకు, వైరాగ్యముతో కూడిన భక్తియోగము మరణ భయమును పోగొట్టునన్నమాట. మరణము వట్టి భయమే. సత్యము కాదు. ఉపసంహారమున కూడ శుకుఁ డిదియే చెప్పును:

త్వంతురాజన్ మరిష్యేతి పశుబుద్ధి మమాం జహి
నజాతః ప్రాగ్భూతోద్య దేహవత్త్వం ననంక్ష్యసి.

దశంతం తక్షకం పాదేలేవిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ విశ్వంచ పృథగాత్మనః
ఏతత్తే కథితం తాత యథాత్మా పృష్ఠవాన్నృప.

రాజా! చనిపోవుదునన్నది పశుబుద్ధి. దీనిని జయింపుము. పుట్టినది నీవు కాదు. కావున మరణించునదియు నీవు కాదు. పుట్టిన దేదో యది మరణించును. నీ వడిగిన దానికిని సమాధాన మిది. కాటువేయు తక్షకుఁడు, కాటుపడ్డ శరీరము, దృశ్యమాన మగు లోకము నాత్మ స్వరూపమే. ఆత్మకంటె భిన్నములుకావు అని. పరీక్షితుఁ డనును.

సిద్ధో స్మ్యనుగృహీతోస్మి భవతాకరుణాత్మనా
శ్రావితో యచ్చమే సాక్షా దనాదినిధనో హరిః
భగవంస్తక్షకాదిభ్యో మృత్యుభ్యో నబిభీ మ్యహం
ప్రవిష్టో బ్రహ్మ నిర్వాణ మభయం దర్శితం త్వయా
అనుజానీ హిమాం బ్రహ్మన్ వాచం యచ్ఛామ్యధోక్షజే
ముక్త కామాశయం చేతః ప్రవేశ్య విసృజాం మ్యసూన్
అజ్ఞానంచ నిరస్తంమే జ్ఞాన విజ్ఞాన నిష్ఠయా
భవతా దర్శితం క్షేమం పరం భగవతః పదమ్.

మహర్షి ! అనుగ్రహింపబడితిని. సిద్ధుడనైతిని. ఆద్యంతహీనుఁడైన శ్రీహరి శ్రవణము చేసితిని. నీవు ప్రదర్శించిన యభయ స్వరూపమగు బ్రహ్మనిర్వాణమును ప్రవేశించితిని. తక్షకాది మృత్యువులవలన నాకిప్పుడు భయము లేదు. ఈశ్వరుని యందు మనస్సు నిలిపి ప్రాణములను విసర్జించెదను. జ్ఞాన విజ్ఞాన నిష్ఠచే అజ్ఞాము నశించినది. ఉత్కృష్టము భద్రమునైన ఆత్మపదము నాకు చూపితివి.

ఇవి ఉపక్రమోపసంహారములు. దీనినిబట్టి యీ గ్రంథము నందు ప్రస్తుతమైనది యాత్మ విద్యయే యని నిశ్చయమగుచున్నది. ఈ యాత్మ వ్యష్టియందు సమష్టి యందు నేకరూపము. వ్యష్టి జీవుఁడు. సమష్టి విశ్వము. విశ్వాత్మ హరి హర భావన యనగా ఆత్మభావనమే 'ఉపక్రమోపసంహారౌ అభ్యాసోఽపూర్వతా ఫలం అర్థవాదో 'పపత్తీ చ లింగం తాత్పర్య నిర్ణయే. తాత్పర్య నిర్ణాయకములైన షల్లింగముల చేత తక్కిన గ్రంథమునందంతటను విస్తరింపబడినదీ విషయమేనని స్పష్టపడుచున్నది.

పరీక్షితుఁ డేమడిగినాడు? మరణించువాడు చేయదగినదేమి యని. శుకుఁడు చెప్పిన దేమి? నీవు మరణించుటయన్నదే లేదని. ఏది పుట్టునో యది మరణించును. శరీరము పుట్టినది కావున మరణించునది యదియే. శరీరము పుట్టక పూర్వము నీవు లేవనుట కుదురదు. ఇప్పుడు శరీరముతో నశింతువనుటయు కుదురదు. కావున శరీరము వేరు. నీవు వేరు శరీరము నశించిన నీవు నశింతువనుకొనుట పశుబుద్ధి అనగా అజ్ఞానము. అనగా నిచ్చట రెండు పదార్థములున్నవి. ఒకటి ఆత్మ. రెండవది శరీరము శరీరము నందాత్మ భ్రాంతియే అజ్ఞానము. ఈ భ్రాంతి తొలగినచో నాత్మ యాత్మగా ప్రకాశించును. అప్పుడు భ్రాంతి యన్నది లేదు. ఉన్నది జ్ఞానస్వరూపమే. భ్రాంతి యన్నది లేదు కావున భేదబుద్ధియు నుండదు. ఎందుచేత? విశ్వమంతయు భ్రాంతి స్వరూపమే కాబట్టి. కావున భాసించు అనాత్మ పదార్థములన్నియును మిథ్యాభూతములే. అవి యన్నియు యథార్థమునకు ఆత్మ స్వరూపములే.

జ్ఞానస్వరూపమఖిలం జగదేతద బుద్ధ యః
అర్థ స్వరూపం పశ్యంతః భ్రామ్యంతే మోహసంప్లవే

అని విష్ణుపురాణము చెప్పుచున్నది. ఇది యుపనిషత్సిద్ధాంతము. ఇదియే వ్యాస సాహిత్యము నంతటను ప్రపంచితమైనది ప్రపంచితమైన తీరు మాత్రము వేరు. ఔపనిషదికమైన సిద్ధాంతమును చెప్పినచో గ్రంథమునకు వైశిష్ట్యమేముంటుంన

వచ్చును. ఉపాయ వైశిష్ట్యమునుబట్టి గ్రంథారంభ ముపపన్నమగునని చెప్ప వలెను. ఆ వైశిష్ట్యము శ్రవణ మాత్రముననే సిద్ధి గల్గుట.

వ్యాసమహర్షి ఔపనిషదిక తత్త్వమును వ్యాకరించుచు బ్రహ్మసూత్రము లను రచించెను. వానిలో మొదటి సూత్రముతో నీ భాగవతమును ప్రారంభించెను. 'జన్మాద్యస్యయతః' అని మొదలై మొదటి శ్లోకము 'సత్యం పరం ధీమహి' అని ముగియును. కావున నిది శాస్త్రగ్రంథమనియు గాయత్రీ మంత్రార్థ స్వరూప మనియు చెప్పినట్లైనది. రెండవ శ్లోకమునందుపనిషదిష్టమైన విషయ ప్రయోజ నాధికార సంబంధములు వివృతములైనవి. ఫలాభిసంధిరహితమైన ధర్మము అనగా భక్తి యుపాయముగా నిందు ప్రస్తుతము. అధికారి నిర్మత్సరుడైన ముముక్షువు. పరమార్థ భూతమైన వస్తువు వేద్యవిషయము. వాస్తవ మనగా పరమార్థ భూతమనియే గాక వస్తుసంబంధమైనది యనికూడా యర్థము. అవి మూడు. వస్త్వంశము జీవుడు, వస్తుకార్యము జగత్తు. వస్తుశక్తి మాయ. ఈ యన్నియు వస్తువే. వేరుగాదు. అదియే యాత్మస్వరూపము. సిద్ధవస్తువన్న మాట. దాని యెఱుకవల్ల అనర్థములు తొలగును. సుఖము చేకూరును. ఇది ప్రయోజనము. ఎవరికి? నిర్మత్సరులైన సత్పురుషులకు. సత్పురుషులనగా మాయా దంభ విరహితులు 'తేషామేవ బ్రహ్మలోకం ఏషాన్న మా యానదంభశ్చేతి!' కావున నట్టి వాడధికారి. వానికి వినుకలి వల్లనే ఈశ్వరుడు హృదయమునందు నిలుచును. అనగా ఆత్మస్వరూపము ప్రకాశితమగును. మఱియొకటి ఈ భాగవ తము వేదములన్న కల్పతరువు నుండి రాలిన పండు. శుకము నుండి జాఱినది. ఆత్మయందు లీనమగునంతవరకు రసనీయమైనదే. అంతయు నమృత ద్రవమే తొక్కు, టెంక, పీచు మొదలయినవేవియు లేవు భక్తి ధర్మమున్నచో చాలును. ఆస్వాదించుచూ కూర్చుండుటయే. మోక్షము సహజముగా నుప భ్యమాన మగును. అది విశేషము. కావుననే పరీక్షన్మహారాజు విన్న తరువాత చేసినది లేదు. అతడన్నదేమి? తక్షకాది మృత్యువులవల్ల నాకు భయము లేదు. నీవు చూపిన భయరహితమైన బ్రహ్మనిర్వాణమునందు నేను ప్రవేశించితినని.

ఘటేభిన్నే యధాకాశ ఆకాశస్యాత్ యధాపురా
ఏవందేహే మృతే జీవో బ్రహ్మసంపద్యతే పునః

ఘటాకాశమనగా ఘటములోనున్న యాకాశము. ఘటము ఆకాశమునకు నుపాధియన్నమాట. ఇట్టియుపాధిలేని యాకాశము మహాకాశము ఘటము భిన్న

మైన ఆకాశము భిన్నమనవచ్చునా ? భిన్న మైనది. ఘటముగాని యాకాశముగాదు. ఆకాశమేమైనది? మహాకాశములో కలిసినది. అనగా ఘటమున్నప్పుడును కలిసియే యున్నది. విడిగా నున్నట్లు కన్పించినది ఘటము భిన్న మైనప్పుడు కలిసినట్లు కన్పించినది. ఇట్లే దేహసద్భావమున జీవుడు వేరన్నట్లు భాసించును. తత్వ జ్ఞానముచే నీదేహము విలయమందిన నాత్మ నాత్మలో కలిసిపోవును.

బ్రహ్మనద్యాః సర్వస్వత్యా ఆశ్రమః పశ్చిమేతటే
శమ్యాప్రాస ఇతిప్రోక్తం ఋషీణాం సత్రవర్ధనః
తస్మిన్ ముఖ్యాశ్రమే వ్యాసో బదరీ షండ మండితే
ఆసీనోప ఉపస్పృశ్య ప్రణిధ్యౌ మనః స్వయం

భక్తి యోగేన మనసి సమ్యక్ప్రణిహితేஉమలే
అపశ్యత్పురుషం పూర్ణం మాయాంచ తదుపాశ్రయమ్

యయా సమ్మోహితో జీవ ఆత్మానాం త్రిగుణాత్మకమ్
పరోపి మనుతేనర్థం తత్కృతంచాభి పద్యతే

అనర్థోపశమం సాక్షాద్భక్తి యోగ మధోక్షజే
లోకస్యాజనతోవిద్వాం శ్చక్రే సాత్వత సంహితాం

యస్యాం వైశ్రూయ మాణాయాం కృష్ణే పరమపూరుషే
భక్తి రుత్పద్యతే పుంస శోక మోహ భయాపహా

బ్రహ్మనదియైన సరస్వతీనది పశ్చిమతటమున శమ్యాప్రాసము గలదు. ఇది వ్యాసమహర్షియాశ్రయములలో ముఖ్యమైనది. రేగుచెట్లతో నిండినది. ఈ యాశ్రమమున గూర్చుండి జలోపస్పర్శజేసి వ్యాసమహర్షి మనస్సును నిశ్చలము గావించెను. భక్తియోగముచే స్థిరమైన నిర్మలమైన మనస్సునందు ఈశ్వరదర్శనము పొందెను. ఈశ్వరాధీనమైన మాయను దర్శించెను. మాయవల్ల వచ్చిన జీవ సంసారమును గాంచెను. జీవుడు సత్త్వరజస్తమోగుణములకంటె పరుడైనను మాయచేత సమ్మోహితుడై తాను త్రిగుణాత్మకుడనని భావించి కర్తృత్వ భోక్తృత్వరూపమైన యనర్థమును పొందుచున్నాడు. ఇదియే సంసరణము ఈ యనర్థము తొలుగుటయెట్లు ? ఇది ఈశ్వరునియందు భక్తియోగమువలన తొలగునని గమనించినాడు. ఈశ్వరుని యధీనమైన మాయవలన నీయనర్థము వచ్చినది కావున నీశ్వరానుగ్రహమువలననే తొలగిపోవునన్నమాట. ఇది యంతయు

గ్రహించి వ్యాసుఁడీ యర్థమెఱగని లోకముకొరకు సాత్వత సంహితయైన శ్రీమద్భాగవతమును చెప్పెను. ఈ భాగవతమును వినుచుండగనే పరమ పురుషుఁడైన కృష్ణునియందు భక్తి కల్గును. కల్గి యేమి చేయును? శోకమోహభయములను తొలఁగించును వినుచుండగనే కల్గుననగా విన్నచో చెప్పనేల? శ్రవణకాలమునందే ఫలప్రాప్తి. పైనుదాహరించిన గ్రంథమునందు భాగవతార్థము సంక్షేపముగా చెప్పబడినది. ఈశ్వరుఁడు నిత్యావిర్భూత పరమానంద స్వరూపుఁడు. సర్వజ్ఞుడు. సర్వశక్తి మాయానియంత. ఈశ్వరమాయచేత సమ్మోహితుఁడైనవాడు జీవుఁడు. తిరోభూతస్వరూపుఁడు అల్పజ్ఞుడు. అల్పశక్తి. ఇట్టి జీవున కీశ్వరభక్తిచే జ్ఞానము కల్గును. జ్ఞానముచే మోక్షము.

సఈశోయద్వశేమాయా సజీవోయస్తమార్దితః
స్వావిర్భూత పరానందః స్వావిర్భూత సుదుఃఖ భూః
స్వాదృగర్థ విపర్యాస భవ భేదజ భీశుచః
యన్మాయయాజుషన్నాస్తే తమిమం నృహరింనమః

మాయ వశమునందున్నవాఁడు ఈశ్వరుడు. మాయచే బాధింపబడువాడు జీవుఁడు. నిరతిశయానంద స్వరూపుఁడు ఈశ్వరుడు దుఃఖానుభవముగలవాడు జీవుడు. జీవున కీశ్వరునితో విపర్యాసము. శోక మోహ భయసంకులమైన సంసారమునందు జీవుఁడు మగ్నుడైనాఁడు. భాగవతమున కుపక్రమ మిది. జీవునికి సంసారబంధము భ్రాంతి. అనగా బంధము లేదన్న మాట ఉన్నదన్నచో భావన చేసివలసినది లేదని తెలుసుకొనుటయే. ఈ తెలివియే జ్ఞానము. ఈ జ్ఞానము ఈశ్వర భక్తిజన్యమవి భాగవత నిష్కర్ష.

అంబరీషశుకప్రోక్తం నిత్యం భాగవతం శృణు
పఠస్వ స్వముఖేనాపి యదీచ్ఛసి భవక్షయం.

వినుటయో, చదువుటయో అంతే. చేయవలసిన దేమియు లేదు. మోక్షము సిద్ధించును. కాబట్టి భాగవతము సర్వశాస్త్రముల కంటె శ్రేష్ఠమైనది. అంతియే గాదు. సర్వశాస్త్రములకును ఫలరూపమైనది కూడ. అనగా రసనీయమన్న మాట. ఫలమే ఫలరూప మందినది. త్యక్తవ్యమైన యంశము లేదు. 'రసోవైసః రసగ్ హ్యే వాయంలబ్ధ్వానందీభవతి. రస మనగా నిజమున కీశ్వర స్వరూపమే. ఈశ్వర స్వరూపానుభవ మేకొంచెమో స్పర్శగా నుండుటచేతనే విషయాదులందు సుఖానుభూతి పొందుచుంటిమి. రసానుభూతి యనగా ఈశ్వరానుభూతియే.

అచ్చమైన అనుభూతి స్వరూపుడే ఈశ్వరుడన్నమాట. 'యత్సాక్షాదపరోక్షా ద్బ్రహ్మేతి' అని శ్రుతి. ఇట్టి అచ్చమైన అపరోక్షానుభూతి భాగవత శ్రవణ సమకాలమున కల్గునని యభిప్రాయము. ఇంతకంటే మోక్షమేమున్నది? భక్తి వలన జ్ఞానము. దాని వలన మోక్షము. ఈ సరణి వేరు. భాగవత శ్రవణమే అపరోక్షానుభూతి యనుట వేరు. ప్రథమ సరణిచే సంసార పతితులకు భాగవతమునందు ప్రవృత్తి కలుగవచ్చును. కాని ముక్త పురుషులకు గూడ భాగవతమునందు ప్రవృత్తి కలుగుచున్నది గదా! అందుచేత రెండవ సరణి.

ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వంత్యహైతుకీం భక్తిం ఇత్థం భూతగుణో హరిః.

ఆత్మానుభూతితో మునిగి యజ్ఞాన రహితులై యున్న మునులు నివృత్తి నిరతులు. నిర్హేతుకమైన భక్తి చేయుచున్నారు. ఇందు ప్రయోజన మేమున్నది? హరి గుణములట్టివని చెప్పవలయును. శుక మహర్షి యట్టివాడు. వ్యాసుడాయనకీ భాగవతము చెప్పెను.

హరేర్గుణాక్షిప్తమతిః భగవాన్బాదరాయణిః
అధ్యగాన్మహదాఖ్యానం నిత్యం విష్ణుజన ప్రియః

శుకమహర్షికి భాగవతము నిత్యపాఠము. ఆయనకు ప్రయోజనము లేదు. మఱి యేల పాఠము చేయుట? 'హరేర్గుణాక్షిప్తమతిః' యన్నదే సమాధానము. హరి గుణముల రసనీయత అది. హరి రస స్వరూపుడు. ఇది భాగవత గ్రంథ విశేషము.

ఈ భాగవతమునకు సాత్వతసంహిత యని కూడ పేరు. 'లోకస్యా జానతో విద్వాంశ్చక్రే సాత్వతసంహితాం.' సచ్ఛబ్దేన సత్యమూర్తి ర్భగవానభి ధీయతే స ఉపాస్యతయా విద్యతే యేషామితి సత్వంతో భక్తాఃతతఃస్వార్థేఽణ్ రాక్షసవాయ సాదివత్ తస్యచాశ్రవణమార్షం తదేవసాత్వత ఇతి. తేషాంపతిః పాలకః. సచ్ఛబ్దమునకు సత్యమూర్తి యగు భగవంతుడని యర్థము. ఆయన యుపాస్యుడుగా గలవాడు. సత్వంతుడు. సత్వత్ శబ్దమునకంటె స్వార్థమున ఢణ్ ప్రత్యయము వచ్చి సాత్వతః అని యగును. బహువచనము సాత్వతాః యని కావలసియుండును. కాని 'సాత్వతః' యని యే మూలమునందున్నది. అందుచేత అణ్ ప్రత్యయాశ్రవణమార్షము. సత్యమూర్తి యన్న శబ్దమునకు రెండు విధముల విగ్రహము. సత్ + త్వమ్ + మూర్తిః. 'త్వ' యన్నది

తద్ధిత ప్రత్యయము. సచ్ఛబ్ద మువలక్షకము. సచ్చిదానందపరము. సచ్చిదానంద స్వరూపుఁడనే యర్థము. 'సత్వంమూర్తిః యస్య.' సత్వమనగా సత్వగుణము. మూర్తి యనగా నుపలబ్ధి స్థానమని యర్థము. సత్త్వగుణము శరీరముగాగల వాఁడని, సత్త్వగుణమునందు దొరకువాఁడనియు నర్థము. ఇట్లు రెండర్థములీ శబ్దమునకు చెప్పవచ్చును. మొదటి యర్థము తత్వపరము. సిద్ధవస్తు ప్రతిపాదకము. రెండవ యర్థ ముపాసనాపరము. ధర్మ ప్రతిపాదకము. ఈ సాత్వత మతమునకే భాగవతమని ప్రసిద్ధి.

వదంతితత్తత్వ విదస్తత్త్వం యజ్ఞానమవ్యయం బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితిధ్వఁతే.

అవ్యయమైన జ్ఞానమే తత్త్వము. ఔపనిషదులు బ్రహ్మమనియు, హైరణ్యగర్భులుపరమాత్మనియు, సాత్వతులు భగవంతుడనియు దానినే వ్యవహరింతురు. ఔపనిషదుల బ్రహ్మమే సాత్వతుల భగవంతుడు. భాగవతమునకు ప్రియమైన పదము మరియొకటి వాసుదేవుఁ డనునది.

యేనైవాహం భగవతో వాసుదేవస్యవేధసః
మాయానుభావ మవిదం యేనగచ్ఛతి తత్పదం.

సత్వం విశుద్ధం వసు దేవ శబ్దితం
యిదీ యతేతత్ర పుమానపావృతః
సత్త్వేచ తస్మిన్భగవా న్వాసుదేవో
హ్యధోక్షజో మే నమసా విధీయతే.

విశుద్ధ సత్వమంతఃకరణం సత్త్వగుణో వసుదేవ శబ్దితం వసుదేవశబ్దే సూత్త్రం, కుతః యత్ యస్మాత్ తత్ర తస్మిన్ సత్త్వే పుమాన్ వాసుదేవ. అపావృతః అపగత మావృతం యస్మాత్సః అయమర్థః - వాసుదేవే భగవతి ప్రతీయత ఇతి వాసుదేవం పరమేశ్వరః ప్రసిద్ధః సచవిశుద్ధే సత్త్వేయీయతే ప్రతియతే అతః ప్రత్యమార్థేన ప్రసిద్ధేన ప్రకృత్యర్థే నిర్ధార్యతే తతశ్చవాసయతి దేవమితి వ్యుత్పత్యాహ వసత్యస్మి న్నితివా వసుః దీవ్యతే ద్యోత్యత ఇతి దేవః. వసు భిః పుణ్యైర్దీవ్యతే ప్రకాశత ఇతి వాసుదేవ శబ్దవాచ్యం శుద్ధసత్త్వం. తతః కిమిత్యత ఆహ. సత్త్వేచ తస్మిన్ మే మయా నమస్కారేణాను విధీయతే ఆశ్చర్యతే ఇత్యర్థః.

వాసుదేవ శబ్దమునకు విశుద్ధమైన యంతఃకరణము అనగా సత్త్వగుణ మని యర్థము. సత్త్వ గుణమునందావరణముతొలగి వాసుదేవుఁడు, ప్రకాశించును. కాబట్టి వాసుదేవ శబ్దమున కీయర్థమును చెప్పదగును. వాసుదేవుఁడు వసుదేవ శబ్దము పైన వచ్చిన తద్ధిత ప్రత్యయము వలన నేర్పడినది. వసుదేవ శబ్దము ప్రకృతి. ప్రత్యయార్థము ప్రసిద్ధమైనది. భగవంతుఁడని యర్థము. ఈ భగవంతు డెచట ప్రతీయమానమగునో యది ప్రకృత్యర్థము. భగవంతుఁడు పరి శుద్ధమైన యంతఃకరణమునందు ప్రతీయామానుఁడగును. కావున దానినే వసు దేవశబ్దము చెప్పుననుట యుచితము. దేవునికి వాసమైనది దేవుఁడు వసించునట్టిది యనిగాని వసువులచేత యనగా పుణ్యములచేత దీపించునట్టిదియనిగాని వ్యుత్పత్తిని చెప్పి శుద్ధతత్త్వమని యర్థము చెప్పవచ్చును. తేలిన సారాంశమిది. భగవంతుఁ డెచటనో లేఁడు. మన మనస్సులోనే యున్నాఁడు. ఉన్నను భాసించుటలేదు. ఎందు చేత? అది పరిశుద్ధముగాలేదు గావున నిర్మలముగా నున్నచో మన మనస్సులోనే పరమేశ్వరుడు భాసించును. నిర్మలముగా నుండుటయన మనస్సు పరమేశ్వరాభి ముఖముగా తిరుగుటయే. బహిర్ముఖమగుటయే మనోమలము అంతర్ముఖమగు టయే నైర్మల్యము బహిర్ముఖముగా నున్నపుడు దీనికి మనస్సు అని పేరు. దీనిని తిరుగవేసిన 'నమస్సు' అగును. అందుచేత సత్వేచయే భగవాన్వాసుదేవో హ్యధోక్షజోమే 'నమసా' విధీయతే యనుట.

ఈ భాగవత సంప్రదాయము మూఁడు విధములుగా నున్నది. (1)సంగ్రహ భాగవతము (2) కించిద్విస్తర భాగవతము (3) అతివిస్తర భాగవతము.

పరమేశ్వరుఁడు చతుర్ముఖునకుపదేశించినది సంక్షిప్త భాగవతము. ఇది భాగవతము ద్వితీయస్కంధము నందున్నది.

అహమేవాసమేకోఽగ్రేనాన్యద్యత్సదసత్పరం
పశ్చాదహం యదేతచ్చయోఽవశిష్యేతసోఽస్మ్యహమ్
ఋతేఽర్థం యత్ప్రతీయేత నప్రతీయేతచాత్మని
తద్విద్యాదాత్మనోమాయాం యథాభాసో యథాతమః
యథా మహాంతి భూతాని భూతే షూచ్చావచేష్వను
ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథాతేషు నతేష్వహమ్
ఏతావదేవ జిజ్ఞాస్యం తత్వ జిజ్ఞాసునాఽఽత్మనః
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా.

సృష్టికి పూర్వము నే నొక్కడనే యుంటిని. సదసత్తులు అనగా స్థూల సూక్ష్మ ప్రపంచములుగాని, వానికి కారణమగు ప్రకృతిగాని మఱియొకటి నా కంటె వేరైనది లేదు. సృష్టి నశించిన తరువాత మిగులునదికూడ నేనే. ఈ కనిపించు విశ్వమంతయు నేనే. లేని యర్థము తోచుటకు, ఉన్న యర్థము తోచకుండుటకు కారణము నా మాయ యని తెలిసికొనుము. మొదటిదానికి ద్విచంద్రాదికము, రెండవదానికి రాహువు దృష్టాంతములు. మహాభూతములు భౌతిక పదార్థములందు ప్రవిష్టములైనను అప్రవిష్టములైనట్లు భూత భౌతిక పదార్థములందు నేను వ్యాపించియుంటిని. అన్వయ వ్యతిరేకములవలన సర్వదేశ కాలములందు నేది యుండునో అదియే యాత్మ స్వరూపమని తెలిసికొనవలయును.

అన్వయమనగా కార్యములందు కారణరూపమున అనువర్తించి యుండుట. వ్యతిరేక మన కారణావస్థయందు వానికంటె వ్యతిరేకముగా నుండుట. మృత్తు ఘటాదులందు వ్యాపించి యున్నది. ఘటాది వ్యతిరిక్త స్థలములందు కూడ నున్నది. ఇట్లే ఆత్మ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల యందు సాక్షి రూపమున నున్నది. దానికి వ్యతిరిక్తమైన సమాధ్యాదులందున్నవి. ఘటాదులందు సత్యమైన వస్తువు మృత్తు. ఘట నామము, ఘట రూపము నసత్యములు. అట్లే కార్య మసత్యము. కారణము సత్యము. కార్యము సృష్టి. కారణమాత్మ. సృష్టి యనగా నామ రూపములే. వీనిని వదలి యాత్మపదార్థమును పట్టుకొనవలయును. ఆత్మయే భూత భౌతిక కార్యజాతముగా ప్రతీత మగుచున్నది. ఎందుచేత? 'తద్విద్యాదాత్మ నోమాయాం' ఆత్మ మాయవలన, మాయ వలన సృష్టి. ఉన్నది ఆత్మయే. ఇది తెలియుట తత్త్వ విజ్ఞానము. ఇది ఎట్లు కల్గును? 'తద్దైవత్వ విజ్ఞాన మస్తుతే మదనుగ్రహాత్' పరమేశ్వరుడు బ్రహ్మతో నన్నమాట. ఈ మాయ ఎవనిదో వాని యనుగ్రహమువలన తొలగును. ఈశ్వరానుగ్రహము వలననే తత్త్వజ్ఞానము కల్గునన్నమాట. దీనికి ప్రయోజనమేమి? ఇది ప్రయోజనము:

ఏతన్మతం సమాతిష్ఠ పరమేణ సమాధినా
భవాన్కల్ప వికల్పేషు నవిముహ్యతి కర్హిచిత్.

ఇది నా మతము. భగవంతుని మతము భాగవతము. దీని నేకాగ్రచిత్తముతో లెస్సగా ననుష్ఠానము (సాధన)చేయుము. నీవు కల్ప వికల్పరూపమైన సృష్టు లందు విమోహము పొందవు. కాబట్టి కావలసిన దీశ్వరానుగ్రహము. అది ఎట్లు

కల్గును? ఈశ్వరభక్తి వలన కల్గును. మనసు నీశ్వర ప్రవణము చేయుట ఈశ్వర భక్తి. ఈశ్వరాభిముఖీనము చేయుట. అద్దము పదార్థమును ప్రతిబింబించును. దాని వెనుక కళాయి లేనిచో ప్రతిబింబించదు. దీనిని సూర్యుని వంకకు త్రిప్పితిమి. సూర్యుఁడందు ప్రతిబింబించును. ఇది భక్తి. ఎంతకాలము ప్రతిబింబించును? సూర్య ప్రతిబింబ గ్రహణము వలన దాని వెనుకనున్న కళాయి జారిపోవును. అప్పుడది సూర్య ప్రతిబింబమును గ్రహించదు. అనగా సూర్యుని తేజస్సు దానిమీద ప్రసరించదని కాదు. అచ్చట నది సూర్యుని తేజస్సుతో నేకమై భాసించును. అప్పుడెటు త్రిప్పినను దానికి ప్రతిబింబ గ్రహణ ముండదు. దానిగుండా ప్రసరించునది సూర్యాలోకమే. ఇది భక్తి మహిమ. నీ మనస్సును 'నమస్సు' సు చేయవలయును. అనగా నీశ్వరాభిముఖీనము చేయ వలయు నంతే. ఇది సంక్షిప్త భాగవతము. పరిపక్వమనస్కుల కిది చాలును.

**కించిద్విస్తర భాగవతము:-** భాగవత లక్షణములను గ్రహించుట కించిద్విస్తర భాగవతము. తక్కిన పురాణములు పంచ లక్షణములు కాగా భాగవత పురాణము దశలక్షణ లక్షితము.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణి చ
వంశానుచరితంచేతి పురాణం పంచలక్షణం.

మఱి భాగవతమునకు చెప్పిన దశలక్షణము లివి:

అత్రసర్గోవిసర్గశ్చ స్థానం పోషణమూతయః
మన్వంత రేశానుకథా నిరోధో ముక్తిరాశ్రయః
దశమస్య విశుద్ధ్యర్థం నవామామిహలక్షణమ్
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థే న చాంజసా.

ఈ లక్షణములలో ప్రధానమైనది ఆశ్రయము.

ఆభాసశ్చ నిరోధశ్చ యతస్స్వధ్యవసీయతే.
సాశ్రయః పరబ్రహ్మ పరమాత్మేతి శబ్ద్యతే.

ఆభాసమనగా సృష్టి. ఈ రెండూ దేనివలన సంభవించి ప్రతీతమగుచున్నవో యది యాశ్రయము. బ్రహ్మయని, పరమాత్మయని చెప్పబడునట్టిది. ఈ యాశ్రయ పదార్థము అనగా నాత్మ తత్వము స్పష్టముగా తెలియుటకు (తత్వ మెరుగుటకు) తక్కిన తొమ్మిది లక్షణములు చెప్పబడినవి. కావున నిది లక్ష్యము. తక్కిన తొమ్మిది లక్షణములు.

భూతమాత్రేంద్రియ ధియాం జన్మసర్గ ఉదాహృతః
బ్రహ్మణో గుణవైషమ్యా ద్విసర్గః పౌరుషః స్మృతిః
స్థితిర్వైకుంఠ విజయః పోషణం తదనుగ్రహః
మన్వంతరాణి సద్ధర్మా ఊతయః కర్మవాసనాః
అవతారానుచరితం చేతి హరే రస్యానువర్తినాం
పుసాంచ సత్కథాః ప్రోక్తాః నానాఖ్యానోపబృంహితాః
నిరోధస్యాను శయన మాత్మాన స్సహశక్తిభిః
ముక్తిర్హిత్వాన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః.

1. **సర్గము:-** ఆకాశాది పంచ మహా భూతములు. శబ్దాది పంచ తన్మాత్రలు. ఏకాదశేంద్రియములు. మహదహంకారములు. ఇది స్వర్గము. పరమేశ్వరుఁడు, త్రిగుణముల యొక్క పరిణామము వలన వీనిని సృష్టించెను.

2. **విసర్గము:-** పౌరుషము - పురుషుఁడనగా వైరాజుఁడు చతుర్ముఖుడు. ఆయన సృష్టి చరాచరాత్మకమైనది, విసర్గము.

3. **స్థానము:-** స్థాన మనగా స్థితి. వైకుంఠ విజయమే స్థితి. అనగా భగవంతుఁ డవతరించి జగత్పాలనము (సృష్టములకు దత్తనర్మ్యాదాపాలనముచే నుత్కర్ష కలిగించుట) చేయుట యని యర్థము.

4. **పోషణము:-** స్వభక్తులను భగవంతుఁ డనుగ్రహించుట పోషణము.

5. **ఊతులు:-** ఊతులనగా కర్మ వాసనలు.

6. **మన్వంతరములు:-** మన్వంతరాధిపతుల ధర్మములు.

7 **ఈశానుకథలు :-** పరమేశ్వరునికి అవతారానుచరితములు తదను వర్తులగు మహానుభావుల చరిత్రములు.

8. **నిరోధము:-** పరమేశ్వరుఁడు యోగనిద్రాగతుఁడు కాగా జీవుడు పాధులతో గూఁడ లయము పొందుట.

9. **ముక్తి:-** అవిద్యాకృతమైన కర్తృత్వ భోక్తృత్వాద్యన్యథా రూపమును విడిచి స్వరూపమగు బ్రహ్మస్థితినందుట ముక్తి.

ఈ లక్షణములన్నిటిని లెస్సగా భావించినచో, ఆశ్రయస్వరూపము, ఆత్మతత్వము కరతలామలకమగును. ఇదియు చాలనివారికి అతి విస్తర భాగవతము

**అతివిస్తర భాగవతము:-** పూర్వోక్తమైన చతుశ్శ్లోకి భాగవతమును నారాయణుడు బ్రహ్మకు చెప్పెను. దానినే బ్రహ్మ నారదునకు కొంచెము విస్తరించి దశలక్షణ లక్షితముగా చెప్పెను. నారదుఁడు వ్యాసునకు చెప్పెను. ఇది యొక సంప్రదాయము.

రెండు - శేషుడు సనత్కుమారాది మహర్షుల కీ భాగవతము నతి విస్తార రూపమున చెప్పెను. సనత్కుమారుఁడు సాంఖ్యాయనున కతడు పరాశర బృహస్పతులకు చెప్పెను. పరాశరునకు పులస్త్యుఁడు పురాణ సంప్రదాయ ప్రవర్తకుఁడ వగుమని వరమిచ్చినాఁడు. శక్తి మహర్షి కుమారుడు పరాశరుడు. శక్తిని రాక్షసుఁడు భక్షించెను. పరాశరుడు కోపించి రాక్షస సత్రమారంభింప వసిష్ఠ దతనిని నివారించెను. తన సంతతి రక్షింపబడుటచే పులస్త్యుఁడు సంతోషించి పరాశరున కట్టివరమిచ్చెను. పరాశరుని వలన వ్యాస మైత్రేయులు ఈ భాగవత మహాపురాణము నతి విస్తర రూపమున నుపదేశము పొందిరి.

పూర్వము చెప్పిన దశ లక్షణములు తృతీయాది ద్వాదశ స్కంధ పర్యంతము నొక్కొక్క స్కంధమున నొక్కొక్క లక్షణము బాగుగా విస్తరించి వర్ణింపబడినది ఇట్లు రెండు విధముల ప్రవర్తిల్లిన భాగవత సంప్రదాయము వ్యాసమహర్షియందు సంక్రమించినది.

ఇట్టి మహాభాగవత శ్రవణమువలన నాత్మతత్త్వము తెలియక పోవుట యన్నదిలేదు. ఎల్లరకును తెలియునన్న మాట. 'లోకస్యాజానతో విద్వాంశ్చక్రే సాత్వత సంహితామ్'. వ్యాసమహర్షి దీని నిట్లు వ్రాసెను. భక్తి మహిమ యట్టిది.

**భక్తియోగము:-** 'భక్తి' యన్న మాటకు పలు నిర్వచనములు గలవు. పర్యవసానమున వీని యన్నింటి తాత్పర్య మొక్కటే. శంకరులు చెప్పినట్టిది 'స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే. ఇది సమంజసమైన నిర్వచనము. 'స్వస్మిన్ స్వస్య ఈశ్వరస్య రూపానుసంధానం భక్తిః'. ఆత్మయందు ఈశ్వర రూపము నారోపించుకొనుట ఉపాసన యన్నమాట. హృదయమున నీశ్వరనామ రూపగుణ భావన చేయుట భక్తి. ఇది నవ విధములు.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యా మాత్మనివేదనం.

నామ రూపగుణ భావనలో నీ నవ విధములలో నేయొక్కటియో ప్రధాన ముగా నుండును. ఇట్లు విషయ భేదముచే భక్తి తొమ్మిది విధములు. వీనిలో పూర్వముకంటె నుత్తరోత్తర ముత్కృష్టతరము. మరల ఫల సంకల్ప భేదమును బట్టి భక్తి నవ విధములుగా విభజింపబడినది.

భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యతే,
స్వభావగుణమార్గేణ పుంసాంభావో విభిద్యతే।
అభిసంధాయ యద్ధింసాం దంభం మాత్సర్యమేవచ
సంరంభీ భిన్నదృగ్భావం మయి కుర్యాత్స తామసః।
విషయానభిసంధాయ యశ ఐశ్వర్య మేవచ
అర్చాదావర్చయేద్యోమాం పృథగ్భావః సరాజసః॥
కర్మనిర్హారముద్దిశ్య పరస్మిన్వాత దర్పణం
యజేద్యష్టవ్యమితి వాప్పృథగ్భావః ససాత్వికః।
మద్గుణశ్రుతిమాత్రేణ మయిసర్వ గుణాశ్రయే
మనోగతి రవిచ్ఛిన్నా యథాగంగాంభ సోఽబుధౌ!
లక్షణం భక్తి యోగస్య నిర్గుణస్య హ్యుదాహృతం
అహైతుక్య వ్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే
సాలోక్య సార్ష్టిసామీప్య సారూప్యై కత్వమిత్యుత
దీయమానం నగృహ్ణంతి జనామత్సేవనం వినా
సఏవ భక్తియోగాఖ్య ఆత్యంతిక ఉదాహృతః
యేనాతివ్రజ్య త్రిగుణాన్ మద్భావాయోపపద్యతే।

తామసభక్తి ముప్ఫ్విధము. విషయ యశ ఐశ్వర్యముల నుద్దేశించి భేదదృష్టితో నర్చించుట.

సాత్వికభక్తి త్రివిధము దురితక్షయము కొరకో, పరమేశ్వరార్పణము గనో, విధి యగుటచేతనో భేదదృష్టితో నర్చనము.

ఇట్లు గుణత్రయయుక్తమైన భక్తి నవ విధములు. పూర్వోక్త నవ విధ శ్రవణాదిరూప విషయము భేదముచే నీ సగుణభక్తి యిరువదియొక్క విధములు. కాని భాగవతమునందు ప్రస్తూయమానమైనది యీ సగుణ భక్తి కాదు. ప్రధాన మైనది నిర్గుణ భక్తి. ఏక విధమైనది. సర్వగుణాశ్రయుడైన పరమేశ్వరుని

యందు గుణశ్రవణ మాత్రమున సముద్రములో గంగాప్రవాహమువలె అవిచ్ఛిన్నమై లీనమగునట్టి మనఃప్రకృత్తి నిర్గుణభక్తి. ఇందు భేదదృష్టి లేదు. ఫలాభిసంధిలేదు ఇది అహేతుకమైన భక్తి. ఇట్టి నిర్గుణ భక్తులు పంచవిధముక్తులతో సాలోక్య సమానైశ్వర్య సామీప్య సారూప్య సాయుజ్యములో సంగినను స్వీకరింపక ఈశ్వర సేవయందే మగ్నులగుదురు. ఇది యాత్యంతికమైన భక్తి. భక్తి యోగమని దీనికి పేరు. దీని కిదియే ఫలము. ఇట్టి భక్తి యోగముచే త్రైగుణ్యము నిరస్తమై బ్రహ్మభావ మతి సహజముగా కల్గును. బ్రహ్మభావ మందుట పరమఫలమైనను భక్తి యోగమున కది యానుషంగికమే.

ఏకాంతినో యస్యనకించినార్థం వాంఛంతియేవై భగవత్ప్రపన్నాః
అత్యద్భుతం తచ్చరింతం సుమంగళం గాయంత ఆనంద సముద్రమగ్నాః

బ్రహ్మభావముకంటె భక్తి యోగమే యుత్కృష్టమన్న మాట. ఇట్టి భక్తి భాగవతమునందే యుపదిష్టమైనది. పరమ భాగవతుల పట్టికలో ప్రహ్లాదుడు మొదటివాడు. నారదుడు ద్వితీయ స్థానము. నారదునికి శిష్యుడైన ప్రహ్లాదునికే ప్రథమ గణ్యత. 'నారదునికో శిష్యాదిచ్చేత్పరాజయమ్' భాగవతమునందతి ప్రధానమైనది, అతి ముఖ్యమైనది ప్రహ్లాద చరిత్రము.

భాగవతమునకు దశలక్షణములనియు, అందులో ఆశ్రయ రూపమైన దశమము లక్ష్యమనియు, తక్కిన తొమ్మిది లక్షణము లనియు, తృతీయ స్కంధమునుండి నీ దశలక్షణములు దశమస్కంధములలో వర్ణితమైనవని చెప్పితిని. ఈ తొమ్మిది లక్షణములలో సరిగా మధ్యనున్నది ఊతులన్నది. ఇది సప్తమ స్కంధమున వివృతమైనది. సప్తమ స్కంధము గ్రంథమధ్యము. అందు వర్ణితమైనది ప్రహ్లాద హిరణ్యకశిపుల చరిత్ర.

ఊతులనగా కర్మవాసనలు. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు వైకుంఠమున హరి ద్వారపాలకులు. వారికి సనక సనందనాదుల కోపమువలన దైత్యగర్భమున జన్మ గల్గినది. ఇది అశుభవాసన. విష్ణు ద్వేషరూపమైనది. దైత్య గర్భములోనున్న ప్రహ్లాదునకు నారదుని యనుగ్రహమువలన శుభవాసన, విష్ణు భక్తి రూపమైనది. ఈ శుభాశుభవాసనల సంఘర్షణము సప్తమస్కంధముననే చరిత్రగా రూపొందినది. కర్మానుసారమైన వాసనలకు మానవ జీవితముపై నెట్టి యధికారముండునో తెలియజేయు ఘట్టమిది మన జీవితము తీర్చిదిద్దుకొనుటకు కావలసిన సామాగ్రి యంతయు నిందు లభించును. జీవలక్షణము, తత్వస్వరూపము.

ఇవి యన్నియు చక్కగా నిందు విమర్శింపబడినవి. ఈ ప్రహ్లాదుని చరిత్ర యందు వివృతమైన భక్తి యెట్టిది ? అది నిర్గుణ భక్తి. ప్రహ్లాదుఁ డూరక భక్తి చేయును కాని, భగవంతుని కోరినదేమియులేదు. తన్ను బహూపాయముల రాక్షసులు హింసించుచున్నప్పటికిని వారినుండి కాపాడుమనియైనను కోరలేదు. మరి నృసింహమూర్తి యావిర్భవింపనేల ? నృసింహమూర్తి ఆవిర్భవించినది 'హరి సర్వోపగతుఁడని' ప్రహ్లాదుడన్న మాటను నిరూపించుటకు. మఱియును విచారించి నచో హిరణ్యకశిపుని రక్షించుటకొరకుగాని ప్రహ్లాదుని రక్షించుటకొరకుగాదు. అతనికి తాపత్రయములున్నగదా-రక్షించుటకు! సముద్రమునందు పడిన గంగ నీరు సముద్రపు నీరే యగునుగాని గంగనీరని వెలికి తీయుటకు వీలుండునా ? ప్రహ్లాదుడు వేరు లేడు రక్షించుటకు. లేదు, ప్రహ్లాదుని శరీరము రక్షించెనందురా? అట్లన్నను అది ప్రహ్లాదుడు కోరినదికాదు. కావున నిచట నిరూపితమైన దహేతుకమైన భక్తి. తొలుత 'ధర్మః ప్రోజ్ఝితకైతవః' యన్న భక్తి. వేద్యం వాస్తవ మంత్ర విషయః అన్న సార్వాత్మ్యము.

సర్వత్ర ఈశ్వరసద్భావము, జీవబ్రహ్మైక్యము, తాపత్రయ రాహిత్యము, విషయ ప్రయోజనాధికారలక్షణములు ఆదిమధ్యాంతములందు లెస్సగా నిట్లు నిరూపితములైనవి. కావున నీ గ్రంథమున ప్రతిపాదితమైన భక్తి నిర్గుణ భక్తియే. మరియును నృసింహమూర్తి యావిర్భావము ప్రస్తుతమైనది సప్తమస్కంధము నందే ఈశ్వరుని యవతారములన్నింట నృసింహావతారమునకు ప్రత్యేకత గలదు. తక్కిన అవతారముల కుద్దిష్టప్రయోజనములు పలువిధములుగా నున్నవి. అన్నింటను భక్తపాలన మున్నదిగాని, అది ఆనుషంగికము. నృసింహావతారమునకు భక్త పాలన మొక్కటియే ప్రయోజనముగా కన్పించును. సంసార పతితుఁడై యాక్రోశించుచున్న జీవుని నుద్ధరించి యాత్మసాత్కృతము గావించునట్టి దైవము శ్రీ నృసింహమూర్తి. శ్రీ శంకరుల లక్ష్మీ నృసింహ స్తోత్రము సంసారోత్తరణమునకై నృసింహమూర్తిని చేసిన ప్రార్థన. భాగవతమునందు ప్రధానదైవమే నృసింహమూర్తియని నాకు తోచును. శ్రీ లక్ష్మీ నృసింహస్వామి యనుగ్రహ మేకాంచమైనను లేనిచో భాగవత గ్రంథ మర్థము కాదని నాకు తోచును.

వ్యాసో వేత్తి శుకో వేత్తి రాజా వేత్తి వానవా
శ్రీధరః సకలం వేత్తి శ్రీ నృసింహప్రసాదతః.

మఱి భాగవతమనగా శ్రీకృష్ణచరిత్రమే యన్నంత రూఢికెక్కినదిగదా! శ్రీకృష్ణుని చరిత్ర భాగవతమునందు ప్రధాన మనవచ్చును గదా యన్నచో శ్రీకృష్ణచరిత్రమునకున్న ప్రాధాన్యము, దానియందున్న మాధుర్య లక్షణమును బట్టి యాప్యాయతనుబట్టి సంక్రాంతమైనది. దశమస్కంధమునందు వర్ణితమైన భాగవత లక్షణము నిరోధము. నిరోధమనగా లయము. ఇది నాల్గు విధములు. ప్రాకృతి నిత్యనైమిత్తికాత్యంతములన్నని. ప్రకృతి యందీ బ్రహ్మాండ సృష్టి లయమగుట ప్రాకృత ప్రళయము. శరీరమునందవస్థా భేదములవలన కల్గునట్టిది నిత్య ప్రళయము. సుషుప్త్యాది రూపమైనది బ్రహ్మ సృష్టి విరమించి దివసావసానమున నిద్రాగతుడుకాగా గల్గు లోకత్రయి ప్రళయము నైమిత్తికము. జ్ఞానము చేత నవిద్యను ఛేదించి స్వరూపావస్థితి నొందుట ఆత్యంతిక ప్రళయము. ఈ చతుర్విధమైన నిరోధముతో బాటు ధర్మగ్లానికారణమైన దుష్టజన్యుల నిరోధముకూడ శ్రీకృష్ణుని చరిత్రమునందు వర్ణితమైనది. ఇది యిట్లుంచి నిరోధము తరువాత చెప్పబడిన లక్షణము ముక్తి. నిరోధము పై సోపానము ముక్తియన్నమాట. నిరోధము లేనిది ముక్తి లేదు. కావున నిరోధ మనగా మనోనిరోధమని యర్థము. మనస్సు ఈశ్వరునియందు లయము పొందిన గాని ముక్తి లభ్యము గాదు. సమాధి యనగా నిదియే 'యోగశ్చిత్తవృత్తి నిరోధం'. బహిర్ముఖమైన మనస్సు నంతర్ముఖముగా త్రిప్పుట యోగము. అధః ప్రసరణశీలమైన ప్రవాహమును కొండపై కెక్కించుట వంటిది. యోగమునకు వశముగాని చిత్తము భక్తియోగమునకు వశమగును. శ్రీకృష్ణ చరిత్రము మనస్సు నిరోధించుటకు ప్రకృష్టమైన యుపాయము. కృష్ణశబ్దమునకు 'కర్షణాత్ కృష్ణః' అయస్కాంతము వలె నాకర్షించువాడని యర్థము. శ్రవణ మాత్రముననే కృష్ణచరిత్రము మనస్సును లీనమొనర్చును. ఇది అచ్చమైన నిరోధము. కావున కృష్ణచరిత్రమునకు ప్రాముఖ్యము. ఈ కారణమున కృష్ణచరిత్రము దశమస్కంధమున విస్తారముగా వర్ణింపబడినది. సిద్ధమనస్కులు శ్రవణ మాత్రము చేతనే ఈశ్వరునితో నైక్యము భజింతురు. వారికి ఈశ్వరుడు, అవతారములు, తాము, ఇతరులు అన్న భేదభావము లేదు. కృష్ణావతారమువలె నృసింహావతారమున కొక చరిత్రలేదు. శ్రీకృష్ణుడు, వసుదేవునిచే దేవకియందు జన్మించినట్లువలె, బృందలో పెరిగినట్లువలె, గోపికలతో క్రీడించినట్లువలె వెలయించినాడు. ఇట్టి వెలయించుటకే లీలయనిపేరు. శ్రీకృష్ణచరిత్రమంతయు లీలామయము. నృసింహ మూర్తి కిట్టిలీల యెట్టిది? ఆయన అచ్చమైన వెలుగు స్వరూపము. భావనచేత

యావిర్భవించినమూర్తి. శ్రీకృష్ణచరిత్ర మన యందరికి, మన మనస్సులను కట్టి వేయుటకు. నృసింహమూర్తి నిర్గుణయోగులకు. ఇది గ్రంథ నిర్మాణమునుబట్టి చెప్పినది. న్యాయమునకు నృసింహమూర్తియే శ్రీకృష్ణమూర్తి. శ్రీకృష్ణమూర్తియే నృసింహమూర్తి అవతారభేదము తప్ప వస్తుభేదము లేదు. ప్రకారభేదము తప్ప గ్రంథమునందు ప్రాతిపద్యభేదము లేదు.

వ్యాసమహర్షి వైదికమతమునకు తీర్పరి. వైయ్యాసిక్యమైన వైదికమతమును మన మనుసరించుచున్నాము. వేదములు కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండయని మూడు విభాగములుగా గోచరించును. న్యాయమున కివి రెండే విభాగములగువచ్చును. కర్మజ్ఞాన కాండలని. కర్మయన్నది సాధ్యము. కర్తృతంత్రము. జ్ఞానమన్నది సిద్ధము. వస్తుతంత్రము. ఈ దృష్టితో చూచిన ఉపాసన కూడ సాధ్యము. కర్తృతంత్రమునగుట కర్మయేయని చెప్పవలెను. మఱియు నుపాసనయన్నది యుత్తమమైన కర్మగాబట్టి నిత్యనైమిత్తిక రూపమైన కర్మ కంటే దానికి ప్రత్యేకత కల్పించబడినదని చెప్పవలెను. శంకరులు గీతాభాష్యమునందు కర్మజ్ఞాన యోగములని రెండు విభాగములనే చెప్పిరి. భక్తిని కర్మకంటే భిన్నముగా చెప్పలేదు. కాని మధుసూదన సరస్వతి మొదలైన వ్యాఖ్యాతలు భక్తిని వేరుగా చెప్పిరి. రెండుగా చెప్పినను, మూడుగా చెప్పినను కర్మ భక్తి జ్ఞానయోగములు మూడును భిన్న మార్గములు కావు. మూడు నొకే మార్గము. భిన్న మార్గములైనచో శాస్త్ర భేదము సంభవించి వేదమున కప్రామాణ్యము కల్గును. కాబట్టి కర్మయోగమువలన మనశ్శుద్ధి. మనశ్శుద్ధివలన జ్ఞానము, జ్ఞానమువలన మోక్షమునని సరణి. జ్ఞానమువలన మోక్షమనుట, అట్టి జ్ఞానమునకు కర్మ భక్తి యోగములు హేతువులనుట సర్వులకు నంగీకార్యమే. ఇది వైయ్యాసిక్యమతము. అధికారి భేదమును బట్టి మనుష్యుడు తత్తదుచిత ధర్మమును శ్రద్ధతో దంభమాత్సర్యములు లేక ననుష్ఠించుటవలన (ఉపాసన) భక్తియోగమునందు ప్రవేశము కల్గి, తదనుష్ఠానమున జ్ఞానయోగమున పరినిష్ఠితుడగును. జీవుడు చూచుచున్నది ఈశ్వరునే ఈశ్వరునే చూచుచు ప్రపంచమనుకొనుచున్నాడు. జీవేశ్వరులిద్దరూ ద్రష్టృస్వరూపమే. పర్యవసాన మొక్కటే. ఈ స్థితి రావలెను. దానికి చేయవలసినదేమి? విశ్వమునం దీశ్వరభావన. ఈ ఈశ్వర భావనయే దేశకాల కాయిక నియమములతో కూడియున్నచో నది కర్మ యోగము. అట్టి నియమములు తగ్గి ట్టి మానసికమైన భావన యధికమైనచో నది భక్తియోగము. దీనివలన భగవత్తత్త్వ విచారముగల్గుట జ్ఞానయోగము.

'భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః' కావున మొదటి నుండియు కర్మ భక్తి జ్ఞాన యోగములు మూఁడును ఈశ్వరారాధన స్వరూపమే. అంతరువులు వేరు. మూఁడు నీశ్వరుని విడిచిలేవు. ఇది వైయ్యాసిక్య మతము. ఇట్లుండగా, భాగవతమునందు వ్యాస మహర్షి యీ మార్గమునందు వైశిష్ట్యమును కల్పించినాఁడు. శ్రుతీ స్మృతీతిహాసాదులిందు నతిలంఘిత మర్యాదులకు పాతిత్యమే తప్ప యుద్ధరణము లేదు. అధర్మాచరణమువలన నెట్టివానికిని పతనము తప్పదు. భాగవతము మాత్రము అతిలంఘితమర్యాదులైనను భక్తులకు ధర్మిష్ఠుల కంటె శ్రేయస్త్వము చెప్పబడినది.

త్యక్త్వా స్వధర్మం చరణాంబుజం హరేః
భజంనపక్వోఽధపతేత్ తతో యది
యత్రక్వవా భద్రమభూ దముష్య కిం
కోవార్థ ఆప్తో భజతాం స్వధర్మతః.

స్వధర్మమును త్యజించి భక్తుఁడు పతనమైనను దానివలన నతనికి కల్గు కీడేమి? ఆ భక్తునకు స్వధర్మాచరణమువలన కల్గు లాభమేమి?

ధర్మస్వనుష్ఠితః పుంసాం విష్వక్సేన కథాసుయః
నోత్పాదయేద్యది రతిం శ్రమయేవహి కేవలం

ధర్మము చక్కఁగా ననుష్ఠించినను ఈశ్వర భక్తి పుట్టనిచో నది వట్టి శ్రమయే. ధర్మమే కాదు. జ్ఞానము నంతియేనట.

శ్రుతమ ప్యోపనిషదం దూరే హరికథామృతాత్
యన్నసంతి ద్రవచ్చిత్త ప్రేమాశ్రుపులకోద్గమాః

ఉపనిషత్తుల నెంత విన్నను, విచారించినను, హరికథామృత ప్రవాహమగు భాగవతముతో తుల్యము కావు అందు చిత్త ద్రవ ప్రేమాశ్రుపులకోద్గమములు లేవు కదా! కావున భక్తి లేనిచో అటు కర్మయోగమునకు గాని, ఇటు జ్ఞాన యోగమునకు గాని చరితార్థత లేదు. కావుననే పంచమ స్కంధమునందు స్వనుష్ఠితధర్ములైన భక్తపాలనము చెప్పి వెంటనే నతిలంఘిత మర్యాదులైన నజామీళుని చరిత్రము చెప్పబడినది. పరమపాపిష్ఠుడైన నజామీళుఁ డంతకాలమున సకృన్నారాయణ శబ్దోచ్చారణమువలన నుత్తమ గతి పొందెను.

సాంకేత్యం పారిహాస్యం వాస్తోభం హేళనమేవవా
వైకుంఠ నామ గ్రహణ మశేషాహ హరం విధుః।

ఇంతియేగాదు, ఏ భావమైనను ఈశ్వర విషయకమై ముక్తి కారణ మగును. ఒక భక్తిచేతనేగాదు, ద్వేషాదులచేతను ముక్తి పొందవచ్చునని హిరణ్యకశిపు వృదంతము నిరూపించును.

గోప్యః కామా ద్భయా త్కంసో
ద్వేషా చ్చైద్యాదయో నృపాః।
సంబంధా ద్వృష్ణయః స్నేహాద్యూయం
భక్త్యా వయం నృప।

నారదాదులు భక్తివలన తరించినట్లు, కామమువలన గోపికలు, భయము వలన కంసుడు, ద్వేషమువలన శిశుపాలాదులు, చుట్టరికమువలన యాదవులు, మైత్రివలన పాండవులు తరించిరి. ఈశ్వరునియం దేదో భావముండుట ప్రధానము. తరణోపాయము. ఏ భావము లేనివానికి సంసార భ్రమణము తప్పదు అని భాగవతము నిరూపించుచున్నది మరియు భక్తికి పరమ ప్రయోజనము భక్తియే. దానికి వేరు ప్రయోజనమున్నది లేదు. ఉన్నచో నది యానుషంగికమే యని కూడ భాగవతము నిరూపించును.

ఇంతవరకును భాగవత విషయ పరామర్శమును యథాశక్తిగా చెప్పితిని. దీనిని విడిచి, కథాకథనము, రచనాప్రౌఢి, వర్ణనాచాతుర్యము మొదలైన బహ్యాంశములు వివరింపవలసి యున్నది. భాగవతమును గుఱించి చెప్పుటకు శేషుడు కావలయును. అస్మదాదుల మేమి చెప్పగలము? కావున చెప్పనెంచుటయే యపచారము. ఈ యపరాధమున కెట్లును నొడిగట్టితిని గాన యథామతి మరికొంచెము చెప్పుదను.

భాగవతమునం దెక్కడ పట్టిన నక్కడ నీగుణములన్నియు పరాంకోటి నంది యుండును. కథాకథనమునకు ప్రహ్లాదుని కథయే మధ్యమ మణి. ఈ కథ యందూతి లక్షణము వ్యాకృతమైనదంటిమి.

జంతువులన్నింట మానవసృష్టి విచిత్రమైనది. దీనివలన మానవ తిర్యక్ స్థావరములలో పుణ్యాధిక్యముచేత దేవజన్మ, పాపాధిక్యము చేత తిర్యక్ స్థావరజన్మ కల్గును. పుణ్య పాపములు సమానముగా నున్న మానవ జన్మ కల్గును. సమాన మనగా మితిలో నుండుట. పుణ్యము డెబ్బదిశాతము, పాపము ముప్పది శాతము. ఈ పరిధిలోపల పుణ్య పాపముల లెక్కతో మానవజన్మ యేర్పడునని మనమనుకొనవచ్చును. కాబట్టి మానవులలో పుణ్య పాపముల సంస్కారములు

పరస్పరము సంఘర్షించుచుండును. ఈ వాసనలను పెంచుకొనుట, తగ్గించుకొను టకు మానవునికి స్వాతంత్ర్యమున్నది మానవునికి భోక్తృత్వమేగాక కర్తృత్వము కూడ నున్నది. తిర్యక్ స్థావరములకు భోక్తృత్వమేగాని కర్తృత్వములేదు. దేవతలకు గూడ భోక్తృత్వమే. కర్తృత్వము లేదు. మానవేతరమైన జన్మలు అనుభవ జన్మలు. 'క్షీణేపుణ్యే మర్త్య లోకం విశంతి'. జీవునిలో నున్న యీ కర్మ వాసనలను క్షాళన చేసికొనుటకు మానవజన్మయందే వీలు. కాని మానవులలో నరుదుగా తప్ప దీనిని సద్వినియోగము చేయువారు లేరు. వారికి వివేకము లేక కాదు. ఉన్న వివేకము ఉపయోగింపరు. కారణమేమి? ఏ యొకనికో యుప యోగించును వాడు ముక్తి పొందును దీనికి కారణము పైన చెప్పిన శుభా శుభవాసనలు. మహాత్కృపమున శుభవాసన, మహదనుగ్రహము వలన శుభవాసన కావున జీవితము చరితార్థము చేసికొనవలయునన్న మహాత్ముల సేవ కావలయును. వట్టి వివేకము చాలదు. ఈ యంతరార్థముతో నీ గ్రంథమున వ్యాసమహర్షి నిక్షిప్తము గావించెను.

జయ విజయులు వైకుంఠమున ద్వారపాలకులు. పంచవిధముక్తులలో సాలోక్య, సార్షి, సామీప్య, సారూప్య ముక్తులు వారికి లభించినవి. సాయుజ్యము మాత్రము లేదు. అనగా భేదదర్శనము వారికి నిరస్తము కాలేదు. కావుననే చతుస్సనులను వారడ్డగించినారు. చతుస్సనులకు కోపము వచ్చినది. చతుస్సను లకు కోపము వచ్చుట యేమి? వారభేద దర్శనులు గదా? యన్నచో వారికి కోపము వచ్చినది జయ విజయులపైన గాదు. భేద దర్శన హేతువైన వారి యందున్న రజస్తమస్సులపైన.

ఆశపన్ కుపితా ఏవం యువాం వాసం నచార్హథః
రజస్తమోభ్యాం రహితే పాదమూలే మధుద్విషః
పాపిష్ఠా మాసురీం యోనిం బాలిశౌ యాత మాశ్వతః

ఇట్లు శపించగనే వారు క్రిందికి పడిపోవుచుండిరి వెంటనే దయగలిగి మూడు జన్మలలో మరల తిరిగి మీరిక్కడకు వత్తురని శాపావసాన మనుగ్రహించిరి.

శప్తౌ స్వభవనాత్ పతంతౌ తైః కృపాళుభిః
ప్రోక్తౌ పునర్జన్మభి ర్వాం త్రిభిర్లోకాయ కల్పతాం

ఈ ఘట్టమును విచారించినచో చతుస్సనుల శాపము జయ విజయులలో రజస్త మోగుణములను తొలగించి వారికి మేలు కల్గించుటకే యని స్పష్టమగును. జయ

విజయులలో రజస్తమస్సులు మిగిలియున్నవి. వానిని తొలగి చుకొనవలె నన్న వారు మర్త్యలోకమున పుట్టవలయును. శాపమీరజస్తమస్సులను విస్తరింపజేసినది. దైత్యగుణములు విస్తరించుటచే వారికిదైత్య జన్మ. విష్ణుద్వేషము. ఇది ముడి. జీవ సంపుటి యందలి ముడి.

మఱి వారి వివేక మెట్టిది? హిరణ్యాక్షుడు చనిపోయినప్పుడు హిరణ్యకశిపుఁడు తల్లికి, తక్కిన బంధువులకు నోదార్పుకై చెప్పినమాటలు త్రిమతాచార్యులు వ్యాఖ్యానించినట్టివి. సృష్టిరహస్యమునకు, జగజ్జీవేశ్వరతత్త్వమున కా మాటలు నిదానములు. మఱి యామాటలు చెప్పినతరువాత అతఁడు చేసినపని యేమి? తపోయజ్ఞ స్వాధ్యాయ వ్రతనాశము, గోబ్రాహ్మణ దేవర్షిహింస. వాని వివేకము వానికుపయోగించదు. అది పరోపదేశమునకే. ఇది దైత్య లక్షణము.

ఇట్టివాని కడుపున ప్రహ్లాదుడు పుట్టినాడు. ప్రహ్లాదుడు దైత్యగర్భమున జన్మించుటచేత, అతనియందు తదుచితమైన దైత్యగుణములు, రజస్తమస్సులు విస్తరించి యుండవలెను కాని యట్లు లేవు. ఎందువలన? నారదుని యనుగ్రహము వలన గర్భస్థుడై యుండగానే భక్తిజ్ఞాన వైరాగ్యము లేర్పడినవి. అనగా సత్త్వగుణోద్రేకము కల్గి రజస్తమో మలములు వినష్టములైనవి. కావున ప్రహ్లాదుని వివేకము స్వోత్తీర్ణతకును, పరతారణమున కుపయోగించునది. జ్ఞాన మిద్దరి యందు సమానమే. హిరణ్యకశిపునియందు ద్వేషమున్నది. ప్రహ్లాదుని యందు భక్తి యున్నది. హిరణ్యకశిపుఁడు భేదదర్శి. ప్రహ్లాదుఁ డభేదదర్శి. భక్తి మహిమ యిట్టిది.

నాలంద్విజత్వం దేవత్వ మృషిత్వం చాసురాత్మజాః
ప్రీణనాయ ముకుందస్య నవృత్తం నబహుజ్ఞతా
నదానం నతపోనే జ్యా న శౌచం న వ్రతానిచ
ప్రీయతేఽ మలయాభక్త్యా హరిరన్యద్విడంబనం,
ఏతావానేవ లోకేస్మిన్ పుంసః స్వార్థః పరః స్మృతః
ఏకాంత భక్తిర్గోవిందే యత్సర్వత్ర తదీక్షణం,

ఇది భక్తియందలి రహస్యము. రెండు విరుద్ధగుణముల కిట సంఘర్షణము విస్తరించినాడు మహర్షి. ఈ సంఘర్షణమునుండి నృసింహమూర్తి యావిర్భవించినాఁడు. ఆవిర్భవించి యేమి చేసినాఁడు? స్వభక్త పక్షపాతేన తద్విపక్ష విదా

రణం' ఇదిసామాన్యదృష్టి. 'స్వభక్తంచ సదాిష్ఠ ద్విషంత మపి రక్షతి.' ఇది విశేషదృష్టి. ఈశ్వరునకు స్వపక్షపరపక్షములు లేవనుట రహస్యము.

యథా వైరానుబంధేన మర్త్య స్తన్మ యతామియాత్
నతథా భక్తియోగేన త్వితిమే నిశ్చితామతిః!
వైరేణపూత పాప్మాన స్తరూపు రనుచింతయా
కామాద్ద్వేషాద్భయాత్ స్నేహాత్ యథా భక్త్యేశ్వరే మనః
ఆవేశ్యత దఘింహిత్వా బహవ స్తద్గతింగతాః!

ఇది మానవజన్మ కలుగుటకు తరించుటకు, కీలకము. ఒక్కమాటతో సృష్టి రహస్యమంతయు నీకథలో మప్పిచెప్పినాడు మహర్షి.

మఱి రచన గుఱించి చెప్పవలెనన్న నొక్కమాట చెప్పిన చాలును. శ్రవణ మాత్రముననే ఈశ్వరుఁడు హృదయమున బంధితుఁడగునని మహర్షి తొలుదొల్తనే ప్రతిజ్ఞ చేసినాఁడు గదా! ఆ ప్రతిజ్ఞను శత సహస్ర గుణితముగా చెల్లించుకొన్నాఁడన్నచో చాలును. ఆ మాట నూటికి నూరుపాళ్ళు యదార్థమైన మాట. ఇది విన్న పరీక్షితుఁడు ముక్తుఁడైనాఁడు. అనగా గ్రంథమంతయు భక్తి జ్ఞాన వైరాగ్యమయమని యర్థము.

నివృత్తతర్షైరుపగీయమానాత్
భవౌషధాత్ శ్రోత్ర మనోభిరామాత్
క ఉత్తమశ్లోకగుణానువాదాత్
పుమాన్ విరజ్యేత వినాపశుఘ్నాత్.

జీవులు మూఁడు విధములు. ముక్తులు, మోక్షేచ్ఛులు, బద్ధులనని. ఈ ముగ్గురికి గూడ నీ గ్రంథముపసేవ్యమే. శ్లోకము నందలి మొదటి రెండు చరణములీ ముప్విధముల జీవులను ప్రతిపాదించుచున్నది. మొదటి రెండు చరణములందు ప్రతిపాదితమైన భక్తిలక్షణము చెప్పను. రెండవ చరణమున 'భవౌషధాత్' యన్నమాట జ్ఞాన వైరాగ్య సంపత్తిని ప్రతిపాదించును. తక్కిన భాగము రసావేశ వైశద్యమును మాధుర్యగుణ సంపత్తిని ప్రతిపాదించును. మఱి యీ గ్రంథమునందు విముఖు లెవరుందురు? 'వినాపశుఘ్నః' కసాయివాడు తప్పి. ఆ మాటరు కసాయివానికి కోపము వచ్చును. పశుఘ్నుఁడనగా అజ్ఞానము నిరసించువాఁడని యర్థమున్నది గదా! కావున భాగవతమునుందు రుచిలేక

పోవుట యేమి? అని. కావున 'అపశుఘ్నః' యని పదవిభాగము చేయవలయును. అపశుక్ + హంతి. 'అపశుక్' బహువ్రీహి సమాసము. అపగతాశుక్ యస్మాత్. దేనినుండి శోకము తొలగినదో యది. ఆత్మయని యర్థము. 'తంహంతి' ఆత్మ ఘాతుకుఁడని యర్థము. ఆత్మఘాతకునికి భాగవతమునం దాభిముఖ్యముండదని యర్థము కాని తానాత్మ ఘాతకుఁడనని యొప్పుకొను వాడెవ్వడు? కావున వానికిని భాగవతమున రమణముండ వచ్చును. ఉన్నచో చాలును. వాఁడాత్మఘ్ను డెట్లగును? ఆత్మవేత్తయే యగును. కావున 'పశుఘ్నః' యన్నమాట మనుష్య మాత్రునికే చెల్లదు మఱి యా పశువును చంపు నాయుధము న్నదే- గొడ్డలిగాని కత్తిగాని- యది యర్థమన్నచో బాధ లేదన్నమాట. ఈ గ్రంథ రచన యింత ప్రౌఢమైనది. రచన యంతయు వికటాక్షర బంధము. నారికేళపాకము. గూఢార్థ గంభీరభావ సంయుతము. శాస్త్ర గ్రంథమునందువలె పదజాలమంతయు యుద్ధ సన్నద్ధములైన చతుర్దంత దంతావళములవలె సన్నద్ధములై వ్యూహము తీర్చి నట్లుండును.

'విరరామతన్మహదూభ్రతం నభోలింగ మలింగమైశ్వరం'
'విశోకో బ్రహ్మ సంపత్యా సంఛిన్నద్వైత సంశయః'
'లీనప్రకృతినైర్గుణ్యా దలింగత్వా దసంభవః
'నత్రయభూయః పఃవర్త ఉగ్రః'
'అస్కందితవ్రతః' 'భీరపి యద్బిభేతి'
'క్షుభితస్యయథాపరే', స్వరబ్రహ్మ విభూషితాం'

ఇట్టి పదబంధముతోడనే రచన యంతయు నడచును. కాని యీ దృశ్యమైన రచనయందు పరిపక్వత మరియొక గ్రంథమున కానరాదు. అది యట్లుంచి నిరవధికమైన మాధుర్య గుణము భాగవతమునందు వెల్లివిరియు చుండును. అలంకారిక వ్యవస్థనుబట్టి గుణములు రసధర్మములు. మాధుర్య మిచట వ్యంగ్యమగుచున్న భక్తిరసమునందు నిష్ఠమైయున్న గుణములుగా చెప్పవలెను. రస గంగాధరమునుబట్టి గుణములు అక్షరసంపుటిచే గూడ వ్యంజ్యా మానమగును. వికటాక్షర బంధము మాధుర్య గుణ వ్యంజక యనుటకు వీలలేదు. కాని, భాగవత గ్రంథమునందట్లు కాదనుటకు వీలులేదు. 'శుకముఖా దమృత ద్రవ సమ్మితమ్' అని గదా ప్రతిజ్ఞ! కావున వికటాక్షర బంధమును మాధుర్య గుణ వ్యంజకముగా మహర్షి మఁచినాఁడనుట యిందలి వైశిష్ట్యము.

మాట ప్రౌఢికేగాదు భావప్రౌఢికిని నీ గ్రంథముదాహరణమే. భక్తికి రూప చిత్రణ ముపాయము. 'స్వస్వరూపానుసంధానం భక్తిః.' ఇందు మహర్షి చేసిన రూపసౌందర్యోన్మీలన మెట్టి చిత్రకారుడును చేయలేడు.

కృష్ణః కదంబ మధిరుహ్యతతోతి తుంగ
మాస్ఫోట్య గాఢరశనోఽభ్యపతద్విషోదే
'తద్వాయనం రూపమ వర్షతాద్భుతం'
'అన్వధావత దుర్ధర్షో మృగేంద్రా ఇవయూథపం'
మీమాంసమానస్య సముద్ధితో గ్రతో
నృసింహరూపం తదలం భయానకం
ప్రతప్త చామీకర చండలోచనం
స్ఫురత్సటా కేసరజృంభితాననం
కరాళదంష్ట్రం కరవాల చంచల
క్షురాంత జిహ్వాం భ్రుకుటీ ముఖోల్బణమ్-ఇత్యాది.

బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీం చమాలాం
రంధ్రాన్వేణో రధరసుధయా పూరయ న్గోపబృందైః
బృందారణ్యం స్వపద రమణం ప్రావిశద్గీత కీర్తిః.

ఒకటి రెండు మాటలలో రూప సౌందర్యము నాలోచనా గమ్యమును చేయుట, విస్తరించి వర్ణించుటలో కళ్ళ యెదుట రూపు కట్టించుట రెండు విధము లైన పద్ధతులందు ప్రౌఢివెలార్చుట మతి పదగుంఫన మున్నది. దానికి గ్రంథ మంతయు నుదాహరణమే.

అంధః పురైవ బధిరో మందబుద్ధిశ్చ సాంప్రతం
ఆత్మాచ జరయాగ్రస్తో పరగేహ ముపాసతే.

ఇట్టి పొడి పొడి మాటలు, విశ్లథమైన రచన. దీని యందును మహర్షి ప్రౌఢి సాధించెను.

యత్రోద్యతః క్షితి తలోద్ధరణాయ బిభ్రత్క్రోడీంతనుం సకల యజ్ఞ
మయీ మనంతః
అంతర్మహార్ణవ ముపాగత మాది దైత్యం తందంష్ట్రయాద్రిమివ వజ్ర
ధరోధరార

'ద్వారిద్య్వ సద్యా ఋషభః కురూణాం మైత్రేయ మాసీన మగాధ బోధం'

మొదటి దానిలో శబ్దాలంకారము లేదు. రెండవ దానిలో శబ్దాలంకారము, కాని ప్రౌఢబంధము సమానమే. గ్రంథ మెక్కడ పట్టికొన్నను ఈ ప్రౌఢి పరాంకోటి నందుకొనియుండును. ఇది వర్ణనీయాంశమునందు వైముఖ్యము కలుగకుండ పాఠకుని బుద్ధికి చమత్కార విశేషమును సంధానించును. అక్షర మాధుర్యమునను సంధానించియున్నచో 'యథాపిండఖర్జూరైరుద్వేజితస్య తింత్రిణ్యామభిలాషః' యన్నట్లుండును. అట్లు మొగము మొత్తుట యుండుండదు. రసావేశవైశద్యమును ప్రధానముగా రాసపంచకమునందు చూడవచ్చును. ఉద్ధవ గీత చూడవచ్చును. భ్రమర గీతలు చూడవచ్చును. ఒక్క మాటలో నీ గ్రంథము సంతతటను తొలినుండి చివరిదాక ప్రత్యక్షరము నొక దీపమై మన హృదయములందు దీప్తి వెలార్చుచుండును. ఆ దీప మధ్యాత్మ దీపము. దాని పేరు విష్ణువు. 'విష్ణురధ్యాత్మ దీపః'.

వ్యాస మహర్షి యా యా కథాసంవిధానములందు బహుస్తోత్రములను వ్రాసెను. ఈ స్తోత్రములన్నియు నాయాకథలతో చదువుకొన్నప్పుడు వానితో సంపదించి యుండును. విడిగా చదువుకొన్నచో పాఠకునికి సంబంధించి యుండును. ఈ స్తోత్రములన్నియు నార్తిమయములు, జ్ఞాన విజ్ఞానమయములు, నుత్తాల భావనామయములు. పఠన మాత్రము చేతనే పాఠకుల హృదయములను భక్తి జ్ఞాన వైరాగ్య పరిపుల్లములను గావించును. కుంతీస్తుతి, భీష్మస్తుతి, ప్రహ్లాదస్తుతి, గజేంద్రస్తుతి - యీ మొదలైనవన్నియు బహు ప్రసిద్ధములైనవి. ఇందలి కథలు, ఘట్టములు నిష్ఠగా పారాయణము చేసినచో అశుభములు నివర్తించి భద్రములు కలుగును. రుక్మిణీ కళ్యాణము పారాయణము చేత వివాహప్రాప్తి, కుచేలోపాఖ్యానము చేత దారిద్ర్య విముక్తి, గజేంద్రమోక్షముచే భయ విముక్తి, ప్రహ్లాద చరిత్రచే భవపాశ విముక్తి. గ్రంథమంతయు పారాయణ, శ్రవణముల వలన బ్రహ్మరాక్షస విముక్తి కైవల్యప్రాప్తి ఫలితములుగా సభియుక్తులు చెప్పుదురు. వ్యాసమహర్షి వ్రాసిన గ్రంథములలో నిది యుత్కృష్టతరమని చెప్పదగియున్నది. వ్యాసమహర్షి తన ప్రౌఢినంతయు, తన విజ్ఞానము, వివేకము, తన సర్వశక్తులు నీ గ్రంథమునందలి ప్రత్యక్షరమునందును వెల్లిగొల్పెను. ఇందలి ప్రత్యక్షరములు తేజఃపుంజములు వెలార్చుచుండును. ఎంత జుట్టు

కొన్నను తృప్తికల్గదు. దీని లోతునకు నంతులేదు. దీని పరిణాహమునకు పారము లేదు.

ఇది యన్ని విద్యలకు, నన్ని శాస్త్రములకు చివరిమాట. తీర్పరి. 'విద్యావతాం భాగవతే పరీక్షా' యని ప్రసిద్ధి. ఇంతటి యీ మహాగ్రంథమునుండి శ్రీ శంకరులొక్క యుదాహరణమేని యీయలేదు. దీని శైలియే వేరు. వ్యాసుని యితర గ్రంథముల శైలికంటె మిక్కిలి భిన్నమైన శైలితో నీ గ్రంథము రచితమైనది. అందుచే నిది వ్యాసప్రోక్తము కాదని కొందరి భావన. వ్యాసమహర్షి యిట్లు వ్రాయును, యిట్లు వ్రాయడని చెప్పట దుస్సాహసము తప్ప వేరుగాదు. ఆయన సరస్వతీ మూర్తి. భారతీయమైన సంస్కృతి యంతయు నా మహర్షి నోట జాలు వారినది. ఆయన సారస్వత ప్రౌఢికి గ్రంథము విజయ పతాక !

# సంస్కృత భారతం - ధర్మనీతిదృక్పథాలు

—శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి

శ్లో. యథా సముద్రో భగవాన్ యథా మేరు ర్మహాగిరిః
ఉభౌఖ్యాతౌ రత్ననిధీ తథా భారత ముచ్యతే. (ఆదిపర్వం)

పరమపవిత్రమైన సముద్రమూ మహోన్నతమైన మేరుపర్వతమూ సర్వ రత్నములకూ నిధులైయున్నట్లే మహాభారతం సర్వగుణ రత్నాలకు ఆకరమై ఉన్నది. పదునెనిమిది పర్వాలలో విభక్తమైయున్న శ్రీ మహాభారతం "శత సహస్రీ సంహితా'' అని పేర్కొనబడియున్నది ప్రస్తుతం మనకు ఉపలబ్ధమైన గ్రంథములలో ఎనుబది నాలుగువేల నుండి తొంబదివేల శ్లోకములు (84000-90000) మాత్రమే యున్నవి. కనుక కొందరు విమర్శకులు హరివంశముతో కలిపి ఇది లక్ష శ్లోకపరిమితమైన మహా గ్రంథమై యుండునని భావించు చున్నారు. కాని ఆదిపర్వంలో సూతుడు ''ఏకం శత సహస్రంచ మ యోక్తం వై నిబోధత'' అని పలుకుట చేతను, అనేక స్థలములలో ''వైయాసక్యాం శత సహస్ర్యాం సంహితాయాం'' అని ఉల్లేఖింపబడి యుండటంచేతను, మహాభారతం లక్ష శ్లోకాత్మకమేయన్న ప్రసిద్ధి అవ్యాహతంగా ఉంది. శ్లోకసంఖ్య సరిగా లేనప్పటికీ హరివంశ ప్రసక్తి లేని కేవల భారతమే లక్షశ్లోక పరిమితమై యుండె ననియు, అదే వ్యాసుని అభిప్రాయమనియు మనం గ్రహింపవలసియున్నది. శ్లోక సంఖ్య తగ్గటానికి తగిన కారణం చెప్పలేము.

పరంపరా ప్రాప్తమైన మహాభారతం కల్పిత కావ్యం కాదనీ, జయమని పేర్కొనబడుతున్న ఇతిహాసమనీ, ''జయేనామేతిహాసోఽయమ్'' అన్న భారత వాక్యంవల్లనే స్పష్టపడుతున్నది. కనుక ధర్మాచరణధురీణులు, నీతికోవిదులు అయిన పాండవు లొకానొక కాలమున భారతభూమి నధివసించి యుండరనీ, వారి జీవితము నాధారము చేసికొని వ్యాసమహర్షి మానవ జాతికి సకల సద్గుణ సంహితముగా పురుషార్థ చతుష్టయములను సాధించు మార్గములను ఉపదేశించుటకే ఈ మహా కావ్యమును మహోన్నతముగా భావించి శ్రీ గణాధిపతిచేత వ్రాయించి

విశ్వవ్యాప్తంగా ప్రకటించినాడనీ మనం విశ్వసించవలసియున్నది. "ఇతిహాసః పురావృత్తం." పూర్వకాలాన నిజంగా జరిగిన విషయమే ఇతిహాసం. మనం మాత్రమే తెలుగులో ఇతిహాసాన్ని 'చరిత్ర' అంటున్నాము. చరిత్ర అంటే ఒక వ్యక్తికి సంబంధించిది మాత్రమే. ఉదాహరణకు "ధృవ చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, నల చరిత్ర" మొదలయినట్టివి. కనుక పంచపాండవులు మన పూర్వ భారతీయులు.

ఈ మహాగ్రంథంలో మన ప్రాచీన భారతీయుల యొక్క అనేక ఇతిహాసాలు, చరిత్రలు బహుళంగా విస్తరింపబడినవి. ఆఖ్యానోపాఖ్యానముల ద్వారా ఎన్నో విషయాలు తెలుపబడ్డాయి. వర్ణాశ్రమాది వ్యవస్థ, సామాజిక క్రమ శిక్షణ, భూగోళ వివరాలు, ధర్మశాస్త్రాల రహస్యాలు, జ్యోతిర్విషయక విజ్ఞానం, లోకరీతులు, ధర్మస్వరూప నిరూపణం, నీతిశాస్త్రం, కుటిల నీతి లక్షణాలు మొదలయిన అనేక విషయాలు పరః సంగ్రహంగా మహర్షి వ్యాసునిచేత ప్రతిపాదింపబడ్డవి. ఏయే వ్యక్తికి యేయే జ్ఞానం అవసరమో అట్టి జ్ఞానం యిందులో లభిస్తుంది. కనుకనే వైశంపాయనుడు జనమేజయునితో ఆదిపర్వంలో,

శ్లో. ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్॥

రాజా! మానవు డపేక్షించే ధర్మరహస్యాల విషయంలోగానీ, కామపురుషార్థ సంబంధములోగాని, మోక్షసామ్రాజ్య మార్గంలోగాని తెలిసికొనదగిన విజ్ఞానం ఈ గ్రంథంలో ఏది ఉన్నదో అదే ఇతర వాఙ్మయంలో ఉంది. ఇక్కడ యేది లేదో అది యే గ్రంథంలోను లేదు అన్నాడు. కనుక భారత ఖండంలో పుట్టి భారతీయుడైన మానవుడు భారత గ్రంథం చదివి, లేదా సమగ్రంగా విని, విషయ గ్రహణం చేస్తే అతనికి పురుషార్థ చతుష్టయ సాధనలో సందేహమే ఉండదనీ అలా చెయ్యాలనీ వ్యాసుని సందేశం. మహాభారతం కేవలం ఇతిహాసం మాత్రమే కాదు, నన్నయభట్టారకుడు చెప్పిన "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని" అన్న పద్యంలోని అన్ని దృక్పథాలలో ఒక్కొక్క దృక్పథంతో పరిశీలిస్తే ఆయా మార్గాలలో అది సంపూర్ణ మహాగ్రంథంగా గోచరిస్తుంది. కావ్య లక్షణాలన్నీ ఉన్న మహాకావ్యం అది. అందుకే ఆనందవర్ధనుడు వ్యాసుని మహాకవిగా పేర్కొన్నాడు.

వ్యాసభగవానుని నామధేయం బాదరాయణుడు. వ్యాసుడు, సాత్యవతేయుడు, కృష్ణద్వైపాయనుడు, పారాశర్యుఁడు, కృష్ణుఁడు అన్నవి పర్యాయ పదాలు. 'వివ్యాసవేదాన్ యస్మాత్స తస్మాత్ వ్యాస ఇతి స్మృతః' అన్న ప్రమాణముచేత వేదములను విభజించి ధర్మ కార్యోపయుక్తములుగా చేసినందున ఆయనకు వచ్చిన పౌరుష నామం వ్యాసుఁడు. యుగక్రమానుసారంగా వచ్చిన వ్యాసులు ఇరవైయెనిమిది మంది, వారిలో ఈ చివరి వ్యాసుడు బాదరాయణుడు. ఈ విషయమును దేవీ భాగవతం ఇలా స్పష్టపరిచింది :

శ్లో. ద్వాపరే ప్రథమే వ్యస్తాః స్వయం వేదాః స్వయంభువా
ప్రజాపతి ర్ద్వితీయేతు ద్వాపరే వ్యాస కార్యకృత్,
తృతీయే చోశనా వ్యాసః చతుర్థేతు బృహస్పతిః
పంచమే సవితా వ్యాసః షష్ఠే మృత్యుస్తు ద్వారురే,
మఘవా సప్తమే ప్రాప్తే, వసిష్ఠశ్చాష్టమే స్మృతః,
సారస్వతశ్చ నవమే, త్రిధామా దశమే తథా,
ఏకాదశేచ త్రిల్పషో, భారద్వాజ స్తతః పరే.
త్రయోదశే చాంతరిక్షో, ధర్మీ చాపి చతుర్దశే.
త్రయ్యారుణః పంచదశే, షోడశేతు ధనంజయః
మేధాతిథిః సప్తదశే, వ్రతీహ్యష్టాదశే తథా,
అత్రి రేకోనవింశేఽథ, గౌతమస్తు తతః పరే
ఉత్తమశ్చైక వింశేఽథ హర్యాత్మాయశ్చకీర్తితః
వేనో వాజస్రజాక్షస్తు సోమో న్యూషాయణ స్తథా,
తృణబిందు స్తథా వ్యాసో, భార్గవస్తు తతః పరే
తతః శక్తిర్జాతు కర్ణో కృష్ణ ద్వైపాయన స్తతః
అష్టావింశతి సంఖ్యేయం కథితాయా మయా శ్రుతా!

మహారాశిగానున్న వేదములను కర్మోపయుక్తములుగా చేసుకొనుట యందు కృతయుగ త్రేతాయుగముల మానవులకు క్లేశము లేకుండెను. ద్వాపర యుగ జనులు స్వయంగా వేద విభాగమును చేసుకోలేనందున ప్రతి ద్వాపరము నందును వ్యాసుఁ డవసరమగుటచేత పై వారందరును వ్యాస ధర్మమును నిర్వర్తించినారు. అయితే, ఇరవై యెనిమిది మందిలోను కృష్ణద్వైపాయనుఁడైన మన వ్యాసుడు సర్వోత్కృష్టుఁడని, శ్రీకృష్ణుఁడు "ద్వైపాయనోస్మి వ్యాసా

నామ్'' (వ్యాసులలో నేను ద్వైపాయనుఁడనని) భగవద్గీతలో పేర్కొన్నాడు. ఈ బాదారాయణ వ్యాసుడు ఈ కలియుగం కంటె పూర్వపుదైన ద్వాపర యుగంలో జన్మించినాఁడు. ఈయనకు సుమంతు, జైమిని, వైశంపాయన, పైలులు శిష్యులు. తనచే విభక్తమైన వేదములో ఋగ్వేదమును పైలుడు, యజుర్వేదమును వైశంపాయనుడు, సామవేదమును జైమిని, అధర్వవేదమును సుమంతుడు అధ్యయనం చేశారు. పంచమవేదమని ప్రసిద్ధమందిన తన రచన మహాభారతమును జనమేజయ మహారాజునకు వినిపించినవాఁడు వైశంపాయనుడు మహాభారత మునేకాక బ్రహ్మ పురాణాద్యష్టాదశ మహా పురాణములను, బ్రహ్మ సూత్రములను, అధ్యాత్మ రామాయణమును వ్యాసుఁడు రచించెను. ఇన్ని గ్రంథముల నొక వ్యక్తి రచించుట సంభవమా? అని సందేహము కలుగవచ్చును. ఇచ్చట రచన అంటే ఆయన చెప్పుట, భాషాకోవిదులైన గణపతి ప్రభృతులు లిఖించుటయే. కనుక విష్ణు సన్నిభుఁడైన వ్యాసుని కర్తృత్వమునందు సంశయింప బని లేదు. సముద్రములోని తరంగములు, ఆకాశమునందలి నక్షత్రములు అసంఖ్యేయములైనట్లే వ్యాస రత్నాకరము నందలి విజ్ఞాన రత్నములు బహుళసంఖ్యాకములని మనము విశ్వసింపవలెను.

**ధర్మము :-** మహనీయము విపులార్థము మానవజాతికి అభ్యుదయ నిశ్శ్రేయసములను చేకూర్చునదియునైన ధర్మము సత్క్రియా రూపము. పాణిని మహర్షి అష్టాధ్యాయిలోని ఉణాది సూత్రములలో ''ధర్మః'' అను సూత్రము ద్వారా ధర్మ శబ్దరూపమును ప్రతిపాదించినాడు. ధృఞ్ = ధారణే అను ధాతువు నుండి యేర్పడిన ఈ శబ్దానికి సమస్త విశ్వమును నిలుకడగా నుంచునది యను అర్థము వాచ్యమై, జగత్తుకు అబాధితంగా నిలువతగిన ఆధారమనే అభిప్రాయం వ్యక్తపరుస్తున్నది ఈ యభిప్రాయం వేదసమ్మతమని ఈ క్రింది యజుర్వేద మంత్రం స్పష్టపరుస్తున్నది.

''ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా, లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి, ధర్మేణ పాప మపనుదతి, ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్, తస్మా ద్ధర్మం పరమం వదంతి.''

ఇది ధర్మం, ఇది అధర్మం అని చెప్పగలిగిన అధికారం స్వయంగా ఉద్భవించి ''విధానం'' అని మనుస్మృతిలో పేర్కొనబడ్డ వేదానికే ఉన్నదని ధర్మజ్ఞుల అభిప్రాయం. అదే విధంగా ''ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప

బృంహయేత్" అన్న సూక్తి ననుసరించి వేదోక్తములైన ధర్మాలను ఆధారం చేసికొని భారత రామాయణాది గ్రంథాలలో వ్యాస వాల్మీకి ప్రభృతులైన మహర్షులు, మహాకవులు కథారూపంగాను, ఉపాఖ్యానరూపంగాను చెప్పిన ఉపదేశ వాక్యాలు కూడా ధర్మ స్వరూపములే. ప్రత్యక్ష ప్రమాణం ద్వారా కాని, అనుమాన ప్రమాణంద్వారా కాని, హేతువాద నాస్తిక వాదాలవల్ల గాని ధర్మ స్వరూపం తెలియదు. శబ్ద ప్రమాణమూర్ధన్యమైన వేదం ద్వారా, తదర్థ బోధక ములైన స్మృతి పురాణేతిహాసాదుల ద్వారానే తెలుసుకోవాలి. అందుకే పెద్దలు యిలా అన్నారు :

శ్లో. "ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూ పాయో న బుధ్యతే,
ఏనం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా।"

అభ్యుదయ నిశ్శ్రేయస సాధనమైన ధర్మ స్వరూపమును తెలుసుకొనుటకు తగిన ఉపాయం ప్రత్యక్షానుమాన ప్రమాణాలద్వారా తెలియబడదు గనుక వేదం ద్వారానే దాన్ని విజ్ఞులు తెలుసుకొంటున్నారు. అదే వేదానికున్న వేదత్వం అని శ్లోక భావం. వేద శబ్దానికి తెలియజేయునది అని అర్థం. (వేద యతీతి వేదః అని వ్యుత్పత్తి). అయితే ఆయుర్వేదము, నాట్యవేదము, ధనుర్వేదము మొదలయిన వాటిలో ఆయుః, నాట్యం, ధనుః అన్న పూర్వ పదాలవల్ల ఆయాశాస్త్రాలను తెలుపునవి అన్న అర్థం సుబోధ్యంగా వుంది. మరి నిరుపపదంగా నున్న వేదశబ్దం దేన్ని తెలుపుతుంది? అన్న సంశయం మనకు కలగటం సహజం. ఆ సంశయం తీర్చేటందుకే పై శ్లోకం (ప్రత్యక్షేణానుమిత్యావా) పుట్టింది.

ధర్మ మోక్షములు అతీంద్రియములు. మానవుల బుద్ధికి గోచరించేవి గావు. నాట్య గాంధర్వాదులు గోచరిస్తాయి. అలాంటి ధర్మ మోక్షముల స్వరూపమునూ తత్సాధనలైన నిత్యనైమిత్తిక కర్మలనూ, దేవతోపాసనా యాగాదులనూ, జ్ఞాన యోగాదులనూ ఉపదేశించు మహా గ్రంథమే వేదము. స్వర్గమోక్షాది రూపమైన ఇష్టప్రాప్తికిగాని, దుఃఖనరకాది రూపమైన అనిష్టపరిహారమునకుగాని కావలసిన ఉపాయములు ప్రత్యక్షానుమాన ప్రమాణాముల ద్వారా లభింపవు అవి, విహితకర్మ, ఉపాసనా, జ్ఞాన యోగరూపములైన అలౌకికోపాయములు. వాటిని బోధించునది వేదము. శ్రీ విద్యారణ్యస్వామి యజుర్వేద భాష్య భూమికలో "ఇష్టప్రా ప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యోగ్రంథో వేదయతి స వేదః, అలౌకిక పదేన ప్రత్యక్షానుమానే వ్యావర్త్యేతే" అని స్పష్టం చేసినారు.

అట్టి వేదస్వరూపమే ధర్మం. ధర్మవిరుద్ధములైన అర్థకామములు గూడ వేద రూపములే. ఈ విషయాన్ని వ్యాసభగవానుడు శాంతిపర్వంలో ఇలా అభివర్ణిం చాడు:

శ్లో. యశ్చదండః సద్దృష్టోవో వ్యవహారః సనాతనః
వ్యవహారశ్చ దృష్టోయః సదవే ఇతి నిశ్చితమ్
యశ్చ వేదః సవైధర్మో యశ్చధర్మః సత్పథః"

ధర్మాపరపర్యాయమైన వేదమునకు "విధానం" (శాశ్వతమైన చట్టము) అని కూడా పేరున్నది. ఆ చట్టమునకు అర్థము చెప్పగలవాడు ఒక్క మనువు మాత్రమేయని ఋషులు ప్రార్థించినట్టు మనుస్మృతిలోని మొదటి అధ్యాయం, మూడవ శ్లోకం వివరిస్తుంది.

శ్లో. ''త్వమేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః
అచింత్యస్యా ప్రమేయస్య కార్యతత్త్వార్థవి త్ప్రభో.''

వైదిక లౌకిక కర్మలను విధించునది కనుక వేదమునకు విధానమను పేరు సార్థకత. ధర్మము యొక్క యదార్థ స్వరూపమును చెప్పగలది వేదమే యన్న విషయం సర్వపండిత సమ్మతమైయున్నది. నేటి లెజిస్లేటివ్ అసెంబ్లీ లను ''విధాన సభలు'' అని పేరు పెట్టినవారికి పై విషయము తెలిసియే యుండె నని మనము భావింపవచ్చును.

ఇలాంటి ధర్మముయొక్క స్వరూపం యేది? అది మనకు ఏ విధంగా అనుసరణీయం? అన్న మన జిజ్ఞాసకు సదుపదేశం ఇది - ధర్మముయొక్క అసలు రూపం 'ఫలప్రదమైన సత్‌క్రియాచరణం.' ఆ చరణం అంటే action. ఒక సత్ఫలము నుద్దేశించి, వేదస్మృతీతిహాసాదులు మానవునికి బోధించిన విషయ మును ఆచరించుటయే ధర్మం. లోకంలో ప్రతి action కు ఒక reaction. ఉంటుందన్న విషయం మనకు అనుభవసిద్ధమే కదా! అట్లే ధర్మాచరణ రూప మైన క్రియకు స్వర్గ మోక్షాదులు, అంటే అభ్యుదయ నిశ్శ్రేయసముల ఫలం. ఇక్కడ కొంచెం లోతుగా ఆలోచించి తెలుసుకోవాలి. ''పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు'' అనేది ద్రవ్య పద వాచ్యములని తర్కశాస్త్రం చెపుతుంది. ద్రవ్యమంటే గుణక్రియలకు ఆశ్రయ మైన పదార్థం (గుణక్రియాశ్రయత్వం ద్రవ్యత్వం). మూర్తద్రవ్యమునకు లేదా ద్రవ్యమునకు క్రియకు కలిగే సంబంధానికి సమవాయ సంబంధమని పేరు.

సమవాయం నిత్యసంబంధం. కాగా ఆత్మకు ధర్మక్రియకు కలిగే సంబంధం నిత్యమై ఆది ఆత్మ యొక్క దేహాంతరమునందు (మరియొక జన్మలో), దేశాంతరము (స్వర్గనరకాదులందు) నందు సంస్కార రూపమై ఆత్మ నంటివుంటుంది. తన్మూలమున ఆ క్రియాఫలము ఆత్మకు లభిస్తుంది. దానికే అదృష్టమని పేరు. వేదార్థ చర్చారూపమైన మీమాంసాశాస్త్రము దాన్ని "అపూర్వం" అని పేర్కొన్నది. ఆయపూర్వాపరపర్యాయమైన అదృష్టమే ధర్మపదం చేత నిర్దేశింపబడుతున్నది. కాగా ఫలసహితమైన సత్క్రియాచరణంవల్ల కలిగే సంస్కారమే మానవుని ఆత్మకు నిత్య సంబంధంచేత లగ్నమై కాలాంతర, దేశాంతర, దేహాంతరములలో భోగ్యమైన ఉత్తమ ఫలమును చేకూరుస్తుంది. కనుక "సత్యం వద, ధర్మం చర, మ హింస్యాత్ సర్వభూతాని" అని చేయదగిన కర్మలను, "నానృతం వదేత్ నపరదారాం గచ్ఛేత్" అని చేయకూడదని పనులను చెప్పే వేదవాక్యాచరణమే ధర్మమని, తద్విరుద్ధాచరణమే అధర్మమనీ మనం గ్రహించాలి. "ఆచారప్రభవో ధర్మః" అని గీతలో శ్రీకృష్ణవాక్యంగా వ్యాసభగవానుడు ఆచరణవల్లనే ధర్మం పుడుతుంది అని బోధించాడు.

మానవుడు సత్క్రియాచరణం వల్ల అభ్యుదయ నిశ్శ్రేయసములచే అనంత సుఖభోగములను, దుష్క్రియాచరణంవల్ల దురంత క్లేశ భూయిష్టములైన దుర్గతి నరకాదులను పొందునని పంచమ వేదమైన మహాభారతంలో వ్యాసుడు సుహృత్సహితంగా అనేక కథలు ఉపాఖ్యానములు వ్రాసి ధర్మబోధ చేసియున్నాడు. ధర్మమును విడిచి అర్థకామములను సాధింపకూడదన్నాడు.

శ్లో. "ఆచారలక్షణోధర్మః సంతశ్చాచార లక్షణాః
సాధూనాంచ యథావృత్తమే తథాచారలక్షణం."

(అనుశాసనిక పర్వం)

ఒక వ్యక్తి ధర్మాత్ముడనుటకు అతని నడవడియే గుర్తు. సత్పురుషులంటే సదాచారపరులే. అలాంటి సత్పురుషులయొక్క నడవడి, వారు చేయుపనులు ఆచార స్వరూపం. వాటిని మన మనుసరించుటయే మన ధర్మాభిరతికి నిదర్శనము.

"పునతి సాధవః పుత్రాః" అను ధర్మ సూత్రం ప్రకారము కులశీల సంపన్నురాలైన కన్యను వివాహమాడి ఆమె ద్వారా కన్న కుమారుడు సాధు పుత్రుడు అంటే శ్రేష్ఠమైన కుమారుడు. అతడు తండ్రికి పూర్వులైన పది

తరముల వారిని, తరువాతి వారైన పది తరముల వారిని నరకములనుండి ఉద్ధరించి పవిత్రులను జేయును అన్న సందర్భమున వ్యాసుడా పాపస్వరూప పరిహా లను ఇలా చెప్పాడు.

శ్లో. ''ప్రతి నరకస్యాఖ్యాదుఃఖంచ నరకం విదుః
ప్రవి త్రాణాత్తతఃపుత్రి మిహేచ్ఛంతి పరత్రచ''

'పుత్' అని ఒకరకమైన నరకంపేరు. నరకం మహాదుఃఖం. ఆ నరకంనుంచి రక్షించడంవల్ల కుమారునికి పుత్రుడనే సార్థక నామం కలిగింది కనుక జీవిత కాలంలోను మరణానంతరంకూడా పుత్రుడు కావాలని అతడు ఆనంద దాయకుడనీ ధర్మజ్ఞులు కోరుతారని శ్లోక తాత్పర్యం. అయితే ఆ పుత్రుడు ధర్మార్థకామ మోక్షములనబడే పురుషార్థములలో ధర్మబద్ధమైన యేయొక్క దానియందైనా ఆసక్తిగల నడవడి కలవాడై ఉండాలి. లేకపోతే వాని జన్మ అజాగళ స్తనమువలె నిరర్థకం అంటాడు.

శ్లో. ధర్మార్థకామమోక్షాణాం యస్యైకోపి న విద్యతే।
అజాగళ స్తనస్యేవ తస్యజన్మ నిరర్థకమ్॥

అంతేకాదు. ఒకమాదిరి వ్యక్తిత్వం కలిగిన పిమ్మట గృహదీపంగా ఉన్న కుమారుడు తన వర్తనను చక్కదిద్దుకోవాలి. తాను అనుభవించే సుఖంలోకాని, తాను సంపాదించే ధనం విషయంలోకాని తాను చేసే యేపనిలోనైనా ఇతరులకు ఎలాంటి మేలూ కలుగక, వారు అసహ్యించుకోవడంవల్ల తనకు లజ్జ కలుగుతుందో అట్టి పనిని చెయ్యకూడదని బోధించాడు.

శ్లో. యదన్యేషాం హితం నస్యాత్ ఆత్మనః కర్మపౌరుషమ్।
అపత్రపేత వాయేన నతత్కుర్యాత్ కథంచన॥

బ్రహ్మచారికి (విద్యార్థికి) లేదా గృహస్థునికి (కుటుంబవంతునికి) ప్రతిదినము ప్రతి సంఘటనలోను ఏదో విపరీతం వస్తూవుంటుంది. తనతో పనివున్న మనిషి క్రోధం ప్రకటిస్తాడు లేదా లోభిగానో దురాశాపరుడుగానో ఉండవచ్చు. ఆయా సందర్భాలలో ఆయా వ్యక్తులను తనకుపయోగించు వారినిగా చేసుకొని సుఖంగా తన కార్యం సిద్ధింపచేసుకోవలసిన మార్గం ఇదీ అని తెలిపాడు వ్యాసుడు.

శ్లో. అక్రోధేన జయేత్ క్రోధం అసాధుం సాధునా జయేత్
జయేత్కదర్యం దానేన జయేత్సత్యేనచాఽనృతమ్॥

ఎదుటివ్యక్తి కోపంగా మాట్లాడుతున్నప్పుడు తాను శాంతం వహించి బదులు పలికితే వాడు చల్లబడుతాడు. ఇతరుడు దుష్టప్రవర్తన గలవాడై తనకు దాప రించినప్పుడు తాను సత్ప్రవర్తన గలవాడైతే వాడు దారికి వస్తాడు. ఎదుటి వాడు లోభియై తనతో వ్యవహారం చేస్తున్నప్పుడు వానికి ఇంతో అంతో దానం చేయడం మేలు. అబద్ధాలు అసత్యవచనాలు పలికేవ్యక్తిని సత్యవచనాలతోనే జయించాలి అని శ్లోకభావం. మహాభారతం శాంతిపర్వంలో ధర్మసూక్ష్మాన్ని గురించి యిలా వివరించాడు.

శ్లో. యో యథావర్తతే యస్మిన్ తస్మిన్నేవం ప్రవర్తయన్।
నాऽధర్మం సమవాప్నోతి నచాऽశ్రేయశ్చ విందతి ॥

ఒక వ్యక్తి మరియొక వ్యక్తి విషయంలో ఏవిధంగా, అంటే ధర్మ మార్గంలో కాని, అధర్మ మార్గంలో కాని ప్రవర్తించినా అట్టి వానిని యెదుర్కొనుటలో వా డనుస రించిన మార్గంలోనే ప్రవర్తించినవాడు అధర్మమును పొందడు.

ఆ శ్రేయస్సును గూడా పొందడు అని భావం. కాగా కుటిల మార్గంలో అధర్మము నాశ్రయించి పాండవులకు హానిచేసిన దుర్యోధనుని నిర్జించుటలో ధర్మ రాజు ఆశ్రయించిన పద్ధతి, ద్రోణభీష్మాదుల విధానంలో అనుసరించిన మార్గమూ అధర్మమూ అశ్రేయస్కరమూ కాదని తాత్పర్యం. సామోపాయంచేత సాధ్యపడని దుర్యోధనుని వంటి మూర్ఖుని విషయంలోకాని, వానికి తోడ్పడుతున్న యితరుల విషయంలోకాని వాడనుసరించిన కుటిల మార్గమునే అనుసరించి ''అశ్వత్థామా హతః కుంజరః'' అని పలికిన ధర్మరాజు అధర్మాత్ముడు కాడని మనంకూడా అట్లుచేయుటతప్పుకాదని వ్యాసుని భావం. ఈ భావమునే యీ క్రింది ధర్మసూత్రం కూడా వివరిస్తున్నది:

సూత్రం : ''యస్మిన్‌యథావర్తతే యోమనుష్యః తస్మిన్‌తథా
వర్తితవ్యం సధర్మః మాయాచారోమాయా
యా బాధితవ్యః సాధ్వాచారః సాధునాప్రత్యుపేయః''

అయితే మానవుడు తాను మాత్రం సదా ధర్మపరుడుగానే ఉండాలి. అలాంటివాడు ఏంచెయ్యాలన్న సందేహం ఈ విధంగా తీర్చాడు.

శ్లో. సర్వేషాం యస్సుహృన్నిత్యం సర్వేషాంచ హితేరతః,
కర్మణా మనసావాచా సధర్మం వేదజాజలే!

తానుచేసే పనులద్వారాగాని, తనమాటలచేతగాని, తన మనస్సులోగాని యిత రుల యందు స్నేహమునే కలిగి యుంటూ, ఇతరులకు మేలును గలిగించుట యందే శ్రద్ధవహిస్తూ జీవితమును గడపు మానవుఁడే నిజంగా ధర్మాత్ముడు, వాడే ధర్మస్వరూపము వెలిగినవ్యక్తి సుమా అన్నాడు.

శ్లో. ఏతదేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేఱ పృథీవ్యాంసర్వమానవాః''

అన్న మనుస్మృతి ప్రబోధము ననుసరించి మహాభారతాదులు ధర్మస్వరూపమును మానవులకు కథలద్వారా ఉపాఖ్యానముల ద్వారా విశదపరిచియున్నవి. కాగా ధర్మ ప్రవర్తన యొక్క పద్ధతిని సృష్ట్యాది నుంచి ప్రపంచ మానవులకు భారత దేశమే సూచించుచున్నది. దానినే ప్రపంచమానవులు భారతీయ ధర్మవేత్తల నుండి ధర్మస్వరూపమును దెలుసుకొని తమతమ నడవడిని చక్కదిద్దుకోవలెనని విశ్వమానవులకు మూలపురుషుడైన మనువుయొక్క ఆదేశము. ఆయా దేశాలు శీతోష్ణపరిస్థితుల ననుసరించి అచ్చటి యుత్తమ పురుషులైన ప్రవక్తలు ప్రబో ధించిన ధర్మపద్ధతులు భారతీయ ధర్మ సిద్ధాంతములను మౌలికముగా వ్యతిరే కించుట లేదని యీ నాటికి తులనాత్మకముగా పరిశీలించేవారికే బోధపడు తుంది. ఆచారాలలో భేదం కనపడుతున్నప్పటికీ ఆత్మగుణాల విషయంలో క్రైస్తవ మహమ్మదీయ జైన బౌద్ధాదులు పరస్పరం పోలికలు కలిగేవున్నాయి. ఈనాడు కూడా భారతదేశం ప్రపంచ శాంతికాముకులలో అగ్రగామిగా ఉన్న విషయం స్పష్టమే కదా!

భూతదయ, క్రాంతి, అసూయ, శుచిత్వం, అనాయాసము, మంగళ కార్యప్రేమ, అకార్పణ్యం, అస్పృహ అనబడే ఆత్మగుణాలు అక్కరలేదని యే దేశమూ, ఏ మతమూ, ఏ ప్రవక్తా అనలేదు. దయ అంటే ఇతరుల మేలు కోరడం, తన విషయంలోలాగే అందరి విషయంలో మేలును, శుభమును కోరుతూ తృప్తిగలవాఁడై మెలగుటయే దయకు లక్షణం. క్షాంతి అంటే సహ నం, వెలుపటను తనలోను, తటస్థపడే ద్వంద్వములను (శీతోష్ణములు, కష్టసుఖ ములు మొదలయినవి) సహనంతో ఎదుర్కొనుట ఈగుణాన్ని వ్యాసుఁడు ఇలా వివరించాడు :

ఆకృష్టోఽభిహతోవాఽపి నాక్రోశేన్నాపి తాడయేత్ ।
అదుష్టోవాఙ్మనః కాయైః సాతితిక్షాక్షమాస్మృతా॥

గుణవంతుడైన పురుషుడు ఇతరునిచేత లాగబడినను, కొట్టబడినను పెద్దగా అధైర్యము చేతగాని, కోపము చేతగాని కేకలు పెట్టరాదు. మనో వాక్కాయ కర్మలచేత అదుష్టుడై సహింపవలెను. ఆ సహనానికే తితిక్షా అనీ, క్షమా అనీ పేరు అని శ్లోకార్థం. ఈ తితిక్షను వహించి "క్షమావాన్ జయతే భూమిమ్" (క్షమావంతుడు భూమిని జయించును) అన్న లక్ష్యమును సాధించిన వారిలో ప్రాచీన భారతీయుడు ధర్మరాజు, ఇటీవలి భారతీయుడు గాంధీ మహాత్ముడు అని చెప్పవచ్చును. అనసూయ (న+అసూయ) అనగా, ధర్మార్థ కామమోక్ష పురుషార్థ సంపదలో తనకంటె అధికుడై యున్నవానిని ద్వేషింప కుండుట. శౌచం అంటె శుచిత్వం. అది ద్రవ్యశౌచం, మనశ్శౌచం, వాక్శౌచం, కాయశౌచం అని నాలుగు విధాలు. ద్రవ్యశౌచం అంటె మన వస్త్రభూషణ పాత్రాదులను ఆయా వస్తువుల ద్వారా శుభ్రంగా ఉంచుకోవడం, మనశ్శౌచ మనగా కామ క్రోధ లోభాదులకు దుశ్చింతలకు మనస్సును వశపరుపకుండుట. కాయశౌచం స్నాన ఆచమనాదులతో శుభ్రముగా శరీరము నుంచుకొనుట. అనాయాసమనగా ఏ పని చేస్తే శరీరం చాలా అలసిపోవునో అట్టిది ధర్మకార్య మైనా తగ్గించుకొనుట. మంగళమంటె ప్రశస్త కార్యాచరణం, అప్రశస్త వర్జన మూను. అకార్పణ్యం తనకి ఎంతో ఆపద వచ్చినను ఒకనియొద్ద దీనత్వము వెల్లడింపకుండుటయు, తన ధనమును అనుభవించు హక్కు గలవారికి పంచి యిచ్చుటయును. అస్పృహ లభించిన ఐశ్వర్యమునకును భోగ్య వస్తువులకును సంతోషపడుటయు పరద్రవ్యమును అభిలషింపకుండుటయునునను ఎనిమిది ఆత్మ గుణములు మానవుడున్నతిని పొందుట కవసరమైనవి అనీ, క్షమావంతుడు లోకమును జయించుననియు, అసూయను విడిచినవాడు స్వర్గసుఖము ననుభవించు ననియు, శౌచపరుడు ఆధ్యాత్మ జ్ఞానమున కర్హుడనియు, మంగళ కార్యములైన వ్రతాదులను సలుపువాడిహపరలోక పూజ్యుడగుననియు, అనాయాసము వలన దేవసామ్యము కలుగుననియు, అకార్పణ్యవంతుడు ప్రకృతిలో లీనమగుననియు, అస్పృహవంతుడు అనంతమైన మోక్ష సామ్రాజ్య సుఖమును పొందుననియు వ్యాస భగవానుడుద్బోధించినాడు. ఇందులో ఒక్క ఆత్మ గుణమునైనను అలవరచుకొనుట అత్యంత ముఖ్యమన్నాడు.

"ఆచార ప్రభవో ధర్మః" ఒక సత్క్రియను ఆచరించినపుడే ధర్మం పుడుతుంది అంటే అపూర్వం అదృష్టం అని పేర్కొనబడ్డ సత్ఫలం మానవునికి

దేహాంతర, దేశాంతర, కాలాంతరములలో లభిస్తుందని భగవద్గీతా వాక్యం ద్వారా వ్యాసుడు వెల్లడించాడు. కనుక బ్రహ్మచారి (విద్యార్థి) గురు శుశ్రూషా గురు సేవలవల్లను బ్రహ్మచర్యాశ్రయ సంబంధములైన నియమపాలన, నిషిద్ధ కార్యావర్జనముల ద్వారా ధర్మాత్ముడౌతాడు అని ఉదంకుడు మొదలయినవారి కథలరూపంలో చెప్పాడు.

గృహస్థుడు పుత్రోత్పత్తి, భార్యాపుత్రపోషణ, మాతాపితృ సేవ, అతిథి సత్కార, ధర్మక్రియాచరణములలో ధర్మశాస్త్రం బోధించిన విధి నిషేధాలను ఆచారంతో పాటించినవాడే ధర్మాత్ముడగునని తెలిపే ఉపాఖ్యానాలు ఋషులకూ, రాజులకూ, సామాన్య మానవులైన ధర్మవ్యాధుడు మొదలయినవారికీ సంబంధించినవి అసంఖ్యాకంగా చిత్రించాడు. కనుక ఆయా కథలు చదివి, అందలి ధర్మస్వరూపమును గుర్తించి తన జీవితములో అలాంటి ప్రవర్తనము నలపరచు కొన్న మానవుడు ధర్మాతుడై సహజ శాంతి భద్రములకు దోహదం కలిగించిన వాడౌతాడన్నది నిర్వివాదాంశం.

**నీతి :** ''నీయతీతి నీతిః'' ఒకచోటనుంచి గమ్యమునకు తీసుకొనివెళ్ళే ప్రవర్తనమును 'నీతి' అని పేర్కొనవచ్చును. ''నీఞ్ + ప్రాపణే'' అను ధాతువుపై నేర్పడిన కృదంత శబ్దము. ప్రాపణమంటే చేర్చుట. అధర్మంనుంచి ధర్మానికి, అజ్ఞానం నుంచి జ్ఞానానికీ, అవివేకం నుంచి వివేకానికీ, దారిద్ర్యం నుంచి ఐశ్వర్యానికీ, ఒక్కమాటలో- ఉన్న స్థితి నుంచీ ఉన్నత స్థితియైన గమ్యానికి చేర్చే ఉపాయమూ, ఆ యుపాయాచరణమూ నీతి అనబడుతుంది. న్యాయము, సత్ప్రవర్తనము, శుక్ర చాణక్య విదుర కామందక బృహస్పతి ప్రభృతులైన మహనీయులు ధర్మార్థ కామములనే త్రివర్గమును సాధించుటకై బోధించిన ఉపాయ పరంపర గలది నీతిశాస్త్రము. ఇది రాజనీతి, నయవిద్య మొదలైన పేర్లతో వ్యవహరింపబడుతున్నది. రాజనీతిని, మానవ నీతిని, గురించిన ఆఖ్యానోపాఖ్యానములు మహాభారతంలో విశేషంగా ఉన్నవి. ముఖ్యమైనది కురుపాండవులు పరస్పర విజయం కోసం అనుసరించిన పద్ధతి రాజనీతి. దానికి సూత్రధారుడు శ్రీకృష్ణుడు. శుక్ర బృహస్పతుల తరువాత నీతిశాస్త్ర కోవిదులని చెప్పదగిన వారిలో చాణక్యుం డుత్తముడని చెప్పినప్పుడు శుక్ర బృహస్పతి మను గౌతమ చాణక్యాదులు చెప్పిన సకల నీతిసారమును ఐతిహాసిక కావ్యమార్గంలో బోధించిన మహనీయుడు

వ్యాసుడు. "సుఖస్య మూలం ధర్మః ధర్మస్య మూలమర్థః, అర్థస్య మూలం రాజ్యమ్, రాజ్యమూల మింద్రియః, ఇంద్రియజయ జయస్య మూలం వినయః, వినయస్య మూలం వృద్ధోపసేవా. వృద్ధసేవాయావిజ్ఞానం, విజ్ఞానేన ఆత్మానం సంపాదయేత్. సంపాదితాత్మా జితాత్మా భవతి, జితాత్మా సర్వార్థైః సంయుజ్యేత"

అని చాణక్యుడు అర్థశాస్త్రారంభంలో పై సూత్రాలను రచించాడు. మానవుల సుఖానికి ముఖ్య హేతువు ధర్మమనీ, ధర్మసాధనకు అర్థం మూలమనీ, అర్థ సంపదకు రాజ్యం మూలమనీ, రాజ్యసంపాదన రక్షణములకు ఇంద్రియ జయము కావాలనీ, ఇంద్రియములను జయించుటకు వినయము (నీతి వర్తనము) అవసర మనీ, వినయవంతుడు కావాలనుకున్నవాడు పెద్దలను సేవించటం అవసరమనీ, వృద్ధసేవవల్ల విజ్ఞానం లభిస్తుందనీ, విజ్ఞానంచేత ఆత్మను పవిత్రంగా ఉంచు కోవలెననీ, అలాంటి ఆత్మవిజ్ఞానం కలవాడు కామక్రోధాదులైన అరిషడ్వర్గమును జయింపగలడనీ, జితాత్ముడైన పురుషుడు సర్వార్థములను సకల సంపదలను పొందగలుగుననీ సూత్రములకు వరసగా అర్థం. ఈ విధమైన నీతిశాస్త్రంలో అసాధారణమైన విజ్ఞానం కలవానినిగా తీర్చిదిద్దిన వ్యక్తి ధర్మరాజును మనకు ఆదర్శంగా చూపించినాడు వ్యాసభగవానుడు.

దాయాదులైన కురుపాండవుల దాయ విభాగం వల్ల వచ్చిన తగవులో ధర్మరాజు ధర్మనీతిపరుడుగాను, దుర్యోధను డధర్మనీతిపరుడు, అవినీతి కల వాడునుగాను చిత్రించుట ముఖ్యలక్షణమైనప్పటికిని ప్రసక్తానుప్రసక్తములుగా వర్ణ ధర్మములు, ఆశ్రమ ధర్మములు, స్త్రీ ధర్మములు. యుద్ధ ధర్మములు, యుద్ధప్రక్రియ, వృద్ధసేవ, గురుభక్తి మొదలయిన అంశములతోపాటు మానవ ప్రవృత్తిలోగల ఉచ్చనీచ భావములు, దుర్వ్యాపారములు మొదలైన లోకవ్యవ హారము నంతటిని సుహృత్సమ్మితమైన ఉపదేశము ద్వారా యెరుకపరచి మానవుని సరిదిద్దుటయే మహాభారత లక్ష్యమన్న విషయం స్పష్టంగా గోచరి స్తుంది. ధృతరాష్ట్రుడు పెద్దవాడైయున్నప్పటికిని అతనికి రాజ్యార్హత లేదు. కౌటిల్యార్థశాస్త్రం దాయ విభాగ ప్రకరణంలో "పతితః పతితాజ్జాతాః, క్లీబశ్చ అనంశాః । జడోన్మత్తాంధకుష్ఠినశ్చ" అని నిర్ణయింపబడి వుంది. ఆచారభ్రష్టుడై పతితుడైనవానికీ, వాని కొడుకులకూ, నపుంసకునకి, బుద్ధి ఏ కొంచెమూలేని జడునికీ, పిచ్చివానికీ, గ్రుడ్డివానికి, కుష్ఠురోగికి కూడ దాయ భాగం లేదని సారాంశం. వారు ఇతర భాగస్వాముల చేత పోషింపదగిన వారేగాని స్వయంగా

భాగమును పుచ్చుకొని జీవింపదగినవారుకారు. మనుస్మృతి కూడా ఈ విషయం దృఢపరుస్తున్నది.

శ్లో. అనంశౌ క్లీబపతితౌ జాత్యంధ బధిరౌ తథా।
ఉన్మత్త జడమూకాశ్చ యేచ కేచి న్నిరింద్రియాః॥

నపుంసకునికి, పతితునికి, పుట్టు గ్రుడ్డికి, పుట్టు చెవిటికి, ఉన్మత్త జడ మూకులకూ రాజ్య భాగ పితృ ధన భాగములు లేవని మనువు చెప్పినాడు. ఈ స్థితిలో శాస్త్ర సమ్మతమైన రాజ్యాధికారం లేనప్పటికి ధృతరాష్ట్రుడు పెద్దవాడగుట వలన అతనిని సింహాసనముపైనుంచి గౌరవిస్తూ పోషిస్తూ పాండురాజు రాజ్య పాలనము చేయుటయేగాక రాజ్య విస్తృతిని గూడా చేసినాడు. తాను వేటకై వెళ్ళిన సమయంలో పొరపాటున చేసిన ముని బాలక హత్యారూపమైన పాపమునకు ప్రాయశ్చిత్తముగా ఉత్తర కురుదేశమని చెప్పబడుతున్న హిమవత్పర్వతము యొక్క ఉత్తరారణ్యమునందు వానప్రస్థ నియమములను పాటిస్తూ ఇంద్రదయమాది తేజో మూర్తులైన ధర్మరాజాదులను కన్నాడు. మాద్రీ ప్రేమానుబంధమైన బ్రహ్మచర్య వ్రతభంగమువల్ల చనిపోయినాడు. తనవల్ల జరిగిన నేరమువలన పాండురాజు మరణించుటచేత మాద్రి కూడ సహగమనము చేసి చనిపోయింది. పుత్రులు బాలురైయున్నప్పుడు వారి పోషణ భారము వహించవలసిన స్త్రీ సహగమనము చేయ నక్కరలేదన్న సూత్రము ననుసరించియు, మాద్రీ ప్రార్థన నంగీకరించియు, కుంతీదేవి పాండురాజుతో సహగమనము చేయుట మాని, చిన్న పిల్లలైన పాండవులను వెంటబెట్టుకొని మునుల సహాయముతో హస్తినాపురమును జేరినది మునుల సాక్ష్యాధారముచేతను, భీష్ముని దివ్యదృష్టి సహితమైన ధర్మ బోధచేతను ధృతరాష్ట్రుడు సోదర పుత్రుల నంగీకరించి వారి పోషణ విద్యాభ్యాసాదులను నెరపుట కొప్పుకున్నాడు.

అసూయాపరుడైన దుర్యోధనుని ప్రవర్తనమువలన కురు పాండవులు కలిసియుండుట పొసగదని తలచిన ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు నామ మాత్రముగానున్న ఇంద్రప్రస్థనగరమును ఇచ్చి, అక్కడ నివాసముచేసి నీ రాజ్య భాగమును అనుభవించుమని చెప్పినాడు. యుధిష్ఠిరుడు తన పెద్ద తండ్రి యాజ్ఞానుసారము ఇంద్రప్రస్థమును బాగుపరచి తమ్ముల శౌర్య పరాక్రమముల ద్వారా రాజ్య విస్తృతిని జేసుకొని రాజసూయ యాగమును మహా వైభవముగా జరిపినాడు. అనంతైశ్వర్య శోభితులుగానున్న పాండవులను జూచి దుర్యోధనునికి

కన్నులు గుట్టినవి. వారికి చిన్నప్పుడు తాను జేసిన లాక్షాగృహదాహాద్యపకార ములు చాలక మళ్ళీ రాజ్యభ్రష్టులను జేయవలెనను దుశ్చింతతో మాయా జూదమును నడిపి ధర్మబద్ధులూ, నీతికోవిదులూ అయిన పాండవులను పత్నీ పరాభవాద్యవమాన దుఃఖభరితులనుచేసి అరణ్యాజ్ఞాతవాసములపాలు గావించి నాడు. ఈ దుశ్చర్యల నన్నిటినీ ధృతరాష్ట్రు డంగీకరించినాడు. కురు రాజ్య ములో ఏదో రకపు సగ భాగమును పాండవులకు మొదట యిచ్చినందుకే మండి పడుతున్న దుర్యోధనునికి వారు ఇంద్రప్రస్థమును మహా వైభవోపేతమైన రాజధానీ నగరముగాను, తన రాజ్య భాగముకన్నా మించిన అశేష భారత రాజ్య భాగముగాను ఏర్పరుచుకొని సుఖముగా జీవించుటను చూచి యోర్వలేక వ్రణముపై కారము చల్లినట్లయినది. అందుకే అంత దుర్మార్గమున కొడిగట్టినాడు. పుత్ర ప్రేమచేత ధృతరాష్ట్రుడు, దూరదృష్టిచేత భీష్ముడు, ఆశ్రయ ధర్మము చేత కృప ద్రోణాశ్వత్థామలు కిమ్మనక ఉపేక్షించినారు.

అట్టి స్థితిలో మహావీరులైన పాండవులు ఎదుర్కొనక అరణ్యాజ్ఞాతవాస క్లేశములననుభవించుట కంగీకరించుట యెందుకు? అన్న ప్రశ్న సామాన్యులకు కలుగును. కాని ధర్మపరుడు, నీతికోవిదుడునైన ధర్మరాజు అట్లు చేయలేదు. ద్రౌపదీ వస్త్రాపహరణ సమయమున కురు పాండవ యుద్ధము జరిగినచో ఉభయ పక్షములవారును నశించి, ఎవరికిని కీర్తిదక్కక, చిల్లర జనం తగవులాటలో వలె కానికక్కరలేని వార్తయై, మహా భారత రచనకే ఇతివృత్తం దొరకని స్థితి యేర్పడి యుండును.

అరణ్యవాసమున ధర్మరాజు ఆర్జించినదైవబలము అపారమైనట్టిది. వ్యాస మార్కండేయాది మహామునుల యుపదేశములచేత భారత భూభాగమున గల అనేక పుణ్యతీర్థక్షేత్రదర్శనమును తాను చేయుటయేగాక తన కుటుంబమున కంతకును చేయించినాడు. అర్జునుడు స్వర్గనివాసము చేసి అపారమంత్రబలో పేతములైన మహాస్త్రములను సంపాదించుటయేగాక ఈశ్వరుని మెప్పించి, పాశు పతాస్త్రమును సంపాదించుటగూడ అరణ్యావాససమయముననే జరిగినది. అరణ్య వాసమున కాయకసరులు తినుచు పాండవులు వృథాగా గడుపలేదు. ''దైవ బలమే బలము, ధర్మమే జయము'' అను ఉత్తమ నీతిమార్గముననుసరించి కడపి నారు. పరాభవక్లేశ దుఃఖభరితయైన ద్రౌపదియు, శత్రు నిర్దళన కండూభర

భుజుఁడైన భీమసేనుఁడును, అప్పుడప్పుడూ తన వద్దకు వచ్చి తన శత్రు నిర్యాతన వాంఛను కోపోద్దీపితులై, సోల్లుంఠన వచనములతో పలికినను వారిని శాంతింపజేసి, ''న తితిక్షాసమమస్తి సాధనమ్'' అని ఓర్పువహింపమని చెప్పిన యుధిష్ఠిరుని నీతికోవిదత్వము చాల లోతైనట్టింది. ''సహసా విదధీతన క్రియామ్'' అన్నది ఆయన సిద్ధాంతము.

అజ్ఞాతవాసానంతరం మహావీరులైన పాండవులు తనకుమారులైన దుర్యోధనాదులను యుద్ధరంగమున జంపి తన రాజ్యమును వశపరుచుకొందురను భయము చేత ధృతరాష్ట్రుడు సంజయుని పంపి శాంతి ప్రయత్నమును చేస్తాడు. అయితే ఆ రాయబారంలో పాండవులకు అర్ధ రాజ్యమిచ్చే విషయం మాత్రంలేదు. సంజయుడు ధర్మరాజుతో, నీవు ధర్మాత్ముడవు, సత్యప్రియుడవు. అహింసాపరాయణుడవు. బంధువధకంటే నీకు భిక్షాన్నమైనను మేలు కలిగించును, యుద్ధము పాపకార్యమని వాదిస్తాడు. శ్రీకృష్ణుడు మధ్యలో కలిగించుకొని ఉత్తమ క్షత్రియునికి యుద్ధం స్వధర్మం. అందులో పాపం లేశంకూడా లేదంటాడు. ధర్మ స్వరూపం యెఱిగిన యుధిష్ఠరుఁడు,

శ్లో॥ నవిద్యేయుక్తిరేతస్యకాచిత్
నైవంవిధాః స్వామ్యయథాప్రియంతే
దదస్వవా శక్రపురీం మమైవ
యుధ్యస్వవాభారతముఖ్య వీర.

ధృతరాష్ట్రునికి ప్రత్యుత్తరంగా పలుకుతూ, మహారాజా! మేము నీవనుకున్నట్లు శ్రమించి భిక్షాటనంతో జీవితం గడుపుకునేవారముకాము. ఈ సనుస్యను పరిష్కరింపదలచుకుంటే ఇంద్రప్రస్థము రాజధానిగా మా భాగమును మాకిమ్ము, లేదా యుద్ధమునకు సమ్మతింపుమంటాడు. సంజయా! బంధు వినాశం నాకు ఇష్టంకాదు కాని, నేను కేవలం అసమర్థుడనయిన శాంతిప్రియుడను కాదు.

శ్లో॥ ''అలమేవశమా యాస్మితథా యుద్ధాయ సంజయ !
ధర్మార్థయోరలందాహం మృదవేదారుణాయచ॥

శాంతి నిర్వహించటంలో యెంతచాలినవాడనో యుద్ధంచేయడంలో కూడా అంతే సమర్థుడను. ధర్మార్థముల విషయంలో అవి మృదువుగా సాధ్యపడితే నేను మెత్తనివాడనే లేక అవి దారుణ కర్మసాధ్యములేయైనపుడు నేను కూడ అరివీర భయంకరుడనే. కనుక రాజ్యంలో కొంత భాగమైనను మాకిచ్చి శాంతిని కోర

మని ధృతరాష్ట్రునితో చెప్పు. కనీసం అవి "అవిస్థలం, వృకస్థలం, మాకంది, వారణావతం" అనే నగరాలు, వాటితో పాటుగా మరియేదైనా నగరం అయినా సరే. కనుక అన్నదమ్ములమైన మా అయిదుగురికీ అయిదు గ్రామాలనిచ్చుటకై దుర్యోధనుని అంగీకరింపజేయమని బంధు దాక్షిణ్యము చేతను, అహింసా ప్రియత్వము చేతను ధర్మరాజు అంటాడు.

విదురుడు ధృతరాష్ట్రునికి చేసిన నీతి బోధలో ''ఏకం విషరసో హంతి శస్త్రైకశ్చవధ్యతే. స రాష్ట్రం స ప్రజం హంతి రాజానం మంత్ర విప్లవః" విష రసం ఒక్క వ్యక్తినే చంపుతుంది. బాణం కూడా ఒక్కనినే వధిస్తుంది. రాజ్య తంత్రానికి సంబంధించిన ఆలోచన విపరీతంగా చెడినప్పుడు రాజ్యాన్నీ, ప్రజలనూ, రాజును కూడా నశింపచేస్తుంది. ధర్మరాజులోవున్న క్షమాగుణాన్ని నీవు అశక్తిగా భావిస్తున్నావు. ''సోఽస్యదోషో నమంతవ్యః క్షమాహి పరమం బలం, క్షమాగుణ్యోహ్య శక్తానాం శక్తానాం భూషణంక్షమా.'' అది అతనిలోనున్న లోపం కాదు. అది గొప్ప బలం. చేతగానివానికి క్షమాగుణం మాత్రమే, శక్తిగల వానికి అది భూషణం అది గొప్ప వశీకరణ మంత్రం. దానివల్ల సాధింపజాలనిది లేదు. శాంతి ఖడ్గం చేతిలోనున్న వానిని దుర్జనుడు ఏమీ చేయజాలడు.

శ్లో॥ అష్టాగుణాః పురుషం దీపయంతి
ప్రజ్ఞాచ కౌల్యంచ దమఃశ్రుతంచ
పరాక్రమశ్చా బహుభాషితాచ
దానం యధాశక్తి కృతజ్ఞతాచ.

భూతదయ మొదలయిన యెనిమిది ఆత్మగుణాలు, ప్రజ్ఞ, ఉత్తమ వంశ జన్మ, ఇంద్రియములను అణచుట, విద్య, పరాక్రమం, మితభాషిత్వం, యధా శక్తిగా దానం చేయటం, కృతజ్ఞత అనేవి పురుషునిది ప్రకాశింపజేస్తాయి. ఇవన్నీ ఉన్నధర్మరాజును దుష్టాత్ముడైన దుర్యోధనుడేమీ చేయలేడు. యుధిష్ఠిరుని శాంతి అతని గొప్ప రాజనీతికి ఖడ్గం. ఆయన వశీకృతచిత్తుడు. మెత్తని పులి సుమా! అంటాడు. ఈ విధంగా ధర్మరాజును ఆదర్శపురుషునిగా చిత్రించి వ్యాసభగవానుడు లోకానికి హితోపదేశం చేశాడు. ఈ హిత వాక్యమును తన వర్తనములో పాటించినవ్యక్తి నీతిమంతుడై విజయమును పొందుతాడనడంలో సంశయంలేదు.

**భీష్మ ద్రోణ వధలు :-**

మహాభారత యుద్ధం పద్దెనిమిది (18) రోజులు జరిగితే అందులో పది రోజులు భీష్ముడు శత్రు భయంకరుడై పాండవులకు లొంగలేదు. ధర్మరాజు

నీరసపడ్డాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పాండవులను వెంటబెట్టుకొని తొమ్మిదవనాటి రాత్రి భీష్ముని శిబిరానికి వెళ్ళాడు. భీష్ముని సమక్షంలోనే పాండవులతో, మీకు భీష్ముడు అజేయుడని స్తుతించి చెప్పాడు. పాండవులు వధింపవలదనుకున్న దుర్యోధనునికి సహాయంగా భీష్ముడు నిలిచాడు. ఈ అడ్డంకిని అధిగమింపటానికి పాండవులకు శక్తిలేదు. అందుకని స్వచ్ఛంద మరణంకల (తాను తలుచుకున్నప్పుడే చచ్చుట) పితామహుని ధర్మ రాజాదులు, నీ మరణం యెప్పుడు ఎలా జరుగుతుంది. తాతా! నీ శరవేగానికి తట్టుకోలేక మా సైన్యం ఎంతో నశించింది. మేము నిరుత్సాహవంతులమైనాం, మరి మాకు రాజ్యప్రాప్తి లేదా? దుర్యోధనుడు సార్వకాలికంగా దుష్పరిపాలనం సాగించవలసిందేనా? మేము గ్రాసవాసోదైన్యంలో మగ్గిపోవలసిందేనా? అని పెక్కు రీతుల దుఃఖయుక్తులై "బ్రూహితస్మాదుపాయంనో యధా యుద్ధే జయేమహి" అని ప్రార్థిస్తారు. మేం జయించే ఉపాయం చెప్పమంటారు.

ధర్మజుడు చేసిన ఆ ప్రార్థనకు మనసు కరిగి, దుర్యోధనుని దుష్ట పరిపాలన నశించి యుధిష్ఠిరుని సత్పరిపాలనం ప్రజలకు లభించుగాక యన్న వాంఛతో, క్రూరుడైన ధార్తరాష్ట్రునికి వశంవదుడై తాను జీవించియున్నందున ప్రయోజనం లేదను తలంపుతో, యుద్ధ మరణం స్వర్గప్రాప్తికి హేతువగునన్న ధర్మదృష్టితో, లోకంలో ధర్మానికి ధర్మరాజుకూ విజయం కలగాలన్న సమ్మతితో భీష్మ పితామహుడిలా అన్నాడు :

శ్లో॥ సత్యమేతన్మహాబాహో ! యథావదసిపాండవ !
నాహంజేతుం రణే శక్యం సేంద్రైరపిసురాసురైః।
ఆత్తశస్త్రో రణే యత్తు గృహీతవరకార్ముకః
తతో మాం న్యస్త శస్త్రంతు ఏతేహన్యుర్మహారథాః॥

"నాయనా యుధిష్ఠిరా! శ్రీకృష్ణుడు చెప్పినట్లు నేను యుద్ధంలో ఇంద్రునితో కలిసి వచ్చిన సురాసురుల చేత గూడా జయించుటకు సాధ్యపడను. నీ వన్నట్లు నేను ధనుర్ధనుడనై యుద్ధమున అస్త్రమును పట్టుకొన్న సమయంలో నన్ను జయించుటకు ఎవ్వనికీ సాధ్యముగాదు. కనుక నేను అస్త్ర శస్త్రములను క్రింద పెట్టి యున్నపుడు మాత్రమే యీ నీ మహారథులైన అర్జున దృష్టద్యుమ్నాదులు నన్ను హింసింతురు గాక! అప్పుడే వారికి శక్యమగును. అయితే అట్టి దశ నాకెలా వస్తుందని నీవు భయపడుతున్నావు. నాకుగల నియమాలు చెబుతాను. అందులో నీ కనువైన ఉపాయం ఎన్నుకొని విజయం సాధించుకో. నేను బ్రతికియుండగా మాత్రం నీవు దుర్యోధనాదులను ఓడింపజాలవు" అని ఈ విధంగా పలుకుతాడు.

శ్లో॥ నిక్షిప్త శస్త్రే పతితే విముక్త కవచధ్వజే
ద్రవమాణేచ భీతేచ తవాస్మీతిచవాదిని।
స్త్రియాం స్త్రీనామ ధేయేచ వికలే చైకపుత్రకే
అప్రశస్తే నరేచైవనయుద్ధంరోచతే మమ।
శిఖండీ సమరామర్షీ శూరశ్చ సమితింజయః
యధాభవశ్చ స్త్రీ పూర్వం పశ్చాత్ పుంస్త్వం సమాగతః।
అర్జునః సమరేశూరః పురస్కృత్య శిఖండినం
మామేవవిశిఖైస్తీక్ష్ణై రభిద్రవతు దంశితః।
అమంగల్యధ్వజే తస్మిన్ స్త్రీ పూర్వేచ విశేషితః।
నప్రహర్తు మభీప్సామి గృహీతేషుః కథంచన
తదంతరం సమాసాద్య పాండవో మాంః ధనంజయః
శరైర్ఘాతయతుక్షిప్రం సమంతాత్ భరతర్షభ।
... ... ... ... ... ... ... ... ...
తథోక్తవతిగాంగే యే పరలోకాయదీక్షతే।"

"ధర్మజా! నేను ఇంతకుముందే నిర్ణయించుకున్నవ్రతం ప్రకారం బాణాలు క్రింద పడవేసిన వానినీ, కవచంవిడిచి కేతనం దింపియుంచినవానినీ, పరుగెత్తువానినీ, భయపడినవానినీ, నీవేదిక్కని నన్ను వేడినవాడిని, స్త్రీని, స్త్రీ నామధేయునీ, అంగవైకల్యముగలవానినీ, ఏకపుత్రకునీ, ఊరు పేరు లేని అయోగ్యుని చంపుటకు నా మనస్సు అంగీకరింపదు. అట్టి వారితో యుద్ధము చేయను. మీ సైన్యమునందు మొదట స్త్రీగా పుట్టి, తరువాత పురుషుడైన శిఖండి వున్నాడు. అతడు నాపైకి యుద్ధానికి వస్తే నేను ప్రతియుద్ధం చేయక బాణములను రథంపై పడవేస్తాను, అశస్త్రపాణినైన నన్ను అర్జునుడు ఆ సమయంచూచుకొని వేగంగా శరవర్షంలో ముంచివేయవలె. శ్రీకృష్ణుడు, అర్జునుడు తప్ప మరియొకరు నన్ను చంపజాలరు" అని పరలోక గమనదీక్షితుడై యున్న భీష్ముని సూచన ప్రకారం యుద్ధం చేసిన అర్జునునికి గాని, అతనిని ప్రోత్సహించిన కృష్ణ యుధిష్ఠిరులకు గాని అధర్మ స్పర్శలేదు. దుర్యోధనపరాజయమను మహాకార్యమున భీష్మవధ వారికుపయో గించిన రాజనీతి మాత్రమే.

ఇక ద్రోణవధ ఇంతటి నిర్దుష్ట ప్రయత్నము కాకపోయినను సమూల ముగా పాండవ సైన్యమును నశింపజేయుటకును, రాజ్యమును అపాండవముగా జేయుటకును దుర్యోధనుని రోష వాక్యముల వలన క్రుద్ధుడై బ్రహ్మాస్త్రమును

ప్రయోగించుటకు స్థిరపడిన ద్రోణాచార్యుని అశస్త్రపాణినిగా చేయుటకు పలికిన అసత్యము పాపహేతువు కాబోదని శ్రీకృష్ణుడు,

శ్లో॥ యద్యర్థదివసం ద్రోణా యుధ్యతే మన్యు మాస్థితః
సత్యం బ్రవీమితేసేనా వినాశం సముపైష్యతి,
సభవాం స్త్రాతునో ద్రోణాత్ సత్యాజ్జాయోఽనృతంవచః
అనృతం జీవిత స్యార్థే వదన్న స్పృశ్యఽనృ తైః॥

ఇప్పటికైదురోజులనుండి ద్రోణుడసాధారణ బలపరాక్రమాలతో పాండవ సైన్యంపై విజృంభిస్తున్నాడు. ఇకమీద ఒక సగం దినం గడిస్తే పాండవ సైన్యం నిర్మూలమౌతుంది, మా అందరిని ద్రోణునిబారినుండి తప్పించుటకు నీవు పలికే అసత్యం పాపహేతువుకాదు. ప్రాణరక్షణకు, అందులో ఆశ్రిత ప్రాణరక్షణకోసమై పలికే అనృతం, అనృతంకాబోదు. అని ధర్మరాజుతో అంటూవుండగా భీముడువచ్చి "అయ్యా! మాలవదేశ రాజైన ఇంద్రవర్మ యొక్క గజాన్ని మేము చంపాము. దాని పేరు 'అశ్వత్థామ' నేను ద్రోణునితో ఆ సంగతిని "అశ్వత్థామాహతో బ్రహ్మన్నివర్తస్వ" అని పలికితే ఆయన నమ్మలేదు" అంటాడు. ఆ మాటనైనా పలుకుమని శ్రీ కృష్ణుడు వత్తిడిచేయగా జరుగబోయేదాన్ని ఆపలేముగదా! అన్నభావంతో ధర్మరాజు "అశ్వత్థామా హతః" అని ఉచ్చైస్స్వరంతోను, "కుంజరః" అని మందస్వరంతోనూ పలుకుతాడు. అజాత శత్రుని వచనం ద్రోణుడు నమ్మి అస్త్రసన్యాసం చెయ్యడం, ద్రోణవధకై జన్మించిన ధృష్టద్యుమ్నుడు అతని శిరస్సును ఛేదించటం జరిగింది.

ఈ విధంగా జరిగిన భీష్మ ద్రోణవధల విషయంలోగాని, ద్రౌపదీ వస్త్రాపహరణావిక్లేశానుభవ సమయంలోగాని, ద్రౌపదీ పంచభర్తృకత్వం విషయంలో కానీ అజాత శత్రుడైన ధర్మరాజు ప్రవర్తన అధర్మయుక్తమనిగాని, అనీతియుక్తమనిగానీ, ధర్మసూక్ష్మము నెఱిగిన విజ్ఞులభావనలేదు. బహుళములైన మానవుల జీవిత మార్గములకు చక్కనిరాచబాటలు నిర్మించునట్టి మహర్షి వ్యాసుని మహోపదేశములు మహాభారతమునందు కోకొల్లలుగా నున్నవి. ఆ యుపదేశముల నర్థము జేసికొని భారతీయులు తమతమ సందేహములను తీర్చుకొనుటయు, ప్రపంచ వ్యాప్తముగా భారత సంస్కృతిని ప్రకాశింపజేయుటయు నేటి యువతీ యువకుల కర్తవ్యమని భావించుచున్నాను. మనం భారతీయులం. భారతం మన గ్రంథం. ఇతిశమ్.

# భారతీయ సాహిత్యంపై వ్యాసుని ప్రభావం

## వ్యాసుడెవరు ?

—గుంటూరు శేషేంద్రశర్మ

సముద్రంలో కలిసిపోయిన వాడ్నయినా పట్టుకోవచ్చుగానీ కాలంలో కలిసిపోయినవాడ్ని పట్టుకోవడం అసాధ్యం. వాల్మీకి వ్యాసులు అలాంటివారు. వాల్మీకి అన్న పేరు అసలు పేరుకాదు. సంస్కృత సాహిత్యంలో ఏ కవి పేరూ అసలు పేరుగాదు. మనకు తెలిసిన సంస్కృత కవుల పేర్లన్నీ ఉర్దూ గజల్లో తఖల్లుస్ లాంటివే. వాల్మీకి అసలుపేరు రత్నాకరుడట! నిజమో కాదో రుజువు లేదు. ఆయనకే భార్గవుడనే పేరు మరొకటుంది. అలాగే ప్రాచేతసుడు అని కూడా. ప్రచేతనుడికి ఆయన పదవతరం వాడట. ప్రచేతసుడు వరుణుడు. మరి తైత్తిరీయంలో భృగువల్లి శీక్షావల్లి ఆనందవల్లి నేర్చుకున్న వరుణ పుత్రుడు వారుణి వాల్మీకియేనా? అసలు భార్గవ ప్రాచేతసాది నామధేయాలు అతని వేనా లేక భిన్న భిన్న వ్యక్తులవా? ఈ తర్జన రాక తప్పదు. భిన్న భిన్న వ్యక్తులైతే రామాయణ కర్త వాల్మీకియేనా? రామాయణ బాలకాండలోనూ ఉత్తరకాండలోనూ రామాయణ కర్త వాల్మీకి అనే ఉంది. అయితే అవి ప్రక్షిప్త భాగాలని పండితుల అభిప్రాయం. అది సమంజసం కూడా. పైగా రామాయణంలోనే (అయో-56స) సీతారాములు లక్ష్మణులు చిత్రకూట పర్వతం చేరినప్పుడు అక్కడ వాల్మీకి ఆశ్రమం వెళ్ళి వాల్మీకి మహర్షికి అభివాదం చేసినట్లు మాత్రమే చెప్పబడింది. ''ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః । అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్ ॥'' (16 శ్లో) ''తాన్ మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్ । అస్యతామితిచోవాచ స్వాగతం తం నివేద్యచ'' (17 శ్లో) ఇంతే — ఈ రెండు శ్లోకాలే ఉన్నాయి, అప్రక్షిప్తమూల గ్రంథంలో! కనక ఆ వాల్మీకే ఈ రామాయణం రాశాడనడానికి రామాయణంలో సాక్ష్యం లేదు. భారతంలో కూడ వాల్మీకి పేరు వస్తుందేగానీ రామాయణ కర్తగా

పేర్కొనబడలేదు. జనశ్రుతి మాత్రమే ఉంది. జనశ్రుతి కాలగర్భాన్ని మరింత గంభీరం చేస్తుందేగానీ కాలంలో కలిసిపోయిన వాడ్ని బయటికి తీయడానికి సహాయం చేయదు.

వ్యాసుడు ఇంతకంటే క్లిష్టం. జయం రాసిన వ్యాసుడా? భారతం రాసిన వ్యాసుడా? మహాభారతం రాసిన వ్యాసుడా? వేదవిభజన చేసిన వ్యాసుడా? బ్రహ్మ సూత్రాలు రాసిన వ్యాసుడా? పురాణాలు రాసిన వ్యాసుడా? పతంజలి యోగ సూత్రాలకు భాష్యం రాసిన వ్యాసుడా? (ఈ భాష్యానికి 'తత్త్వవైశారది' అనే వ్యాఖ్యానం వాచస్పతి అనే ఆయన రాసాడు) బృహస్పతి, నారద, కాత్యాయనాది స్మృతి కర్తల్లో ఒకడై వ్యాసస్మృతి రాసిన వ్యాసుడా? ఏ వ్యాసుడు! వీరందరూ ఒకే వ్యాసుడా లేక భిన్న భిన్న కాలాలకు చెందిన వ్యాసులా? మహాభారత బ్రహ్మసూత్ర అష్టాదశ పురాణాలు రాసిన వ్యాసుడు ఒక్కడే అని సంప్రదాయం. అదే వివాదగ్రస్తమై ఉండగా ఈ దేశంలో ఎక్కడ వ్యాసుడు అని వచ్చినా అతడు ఆ ఒక్క వ్యాసుడే అనే విశ్వాసం ఉంది. కానీ ఈ విశ్వాసాన్ని అతిక్రమించి కాలంలో కలిసిపోయిన వ్యాసుడినో వ్యాసులనో బయటికి తీయడం ఒక దుర్ఘటమైన కార్యం. ఏ కార్యం చేసిన కీర్తి ఏ వ్యాసుడికి దక్కేటట్లు చెయ్యాలో మన చేతుల్లో ఉన్నపనిగా కనిపించదు. కనక కాలంలో కలిసిపోయిన వాడు స్వశరీరంతోపాటు కీర్తి కూడా కోల్పోయినట్లే అందుచేత సశరీర కీర్తికాముకులైన ఈనాటి ''యశసే అర్థకృతే'' త్యాది కవులే ధన్యులు.

వ్యాసుడు భారతీయ సాహిత్యానికి చేసిన ప్రదానం ఏమిటి అనే ప్రశ్న బహువార చర్చితమైన విఖ్యాతము. కావ్యలోలుపులైన వారికి నిరంతర కౌతూహలకారి వాల్మీకి. వ్యాసుడి పరిధి పరిమితము. కథామాత్ర, లౌల్యానికి జీవనదాత. వాల్మీకిలో కావ్యనిర్మాణవాస్తు, అలంకారాది కావ్యద్రవ్య సంపద, కావ్యమయత చేత వక్రిమ పొందిన "నిద్రాచల పరాజితాః'' ఆది కావ్యభాష, ఆపాదమస్తకమూ సజ్జితమై ఉంటుంది. కనక వాల్మీకిని ఏ కవీ అతిక్రమించి పోలేక పోయాడు. వాల్మీకిని అడుగడుగునా అనుసరించిన ప్రథమ కవి వ్యాసుడే మొత్తం భారతం ఈ మాటకు ఉదాహరణ అయినా ప్రకృత సందర్భానికి ఒక్క తునక చాలు. వాల్మీకిలో కాళిదాసు తన కావ్య మర్మజ్ఞత చేత దర్శించి తన కావ్యాలన్నిటిలో ప్రదర్శించిన లోకనేత్రాలైన రాజు ఋషి అనే ఇద్దరి పరస్పర సంబంధం ఏదైతే ఉందో, దాన్ని కాళిదాసుకు పూర్వమే గ్రహించి శకుంతలో పాఖ్యానంలో (సంభవ పర్వం) చెప్పిన వాడు వ్యాసుడు.

రాముడ్ని వాల్మీకి మహర్షి కల్పుడని పర్ణించాడు. ''మహర్షి కల్పేణచ సంస్కృత స్తదా జగామ పుణ్యాం గతి మాత్మనః శుభాం'' (అరణ్య) (జటాయువు మహర్షి వంటి రాముని చేత దహన సంస్కారములు చేయబడినవాడై పుణ్య లోకాలు పొందాడు.) ఇట్లాగే వ్యాసుడు దుష్యంతుడ్ని రాజర్షి అంటాడు. (సంభవం 72 అధ్యాయం)'' ఏవముక్త్వా సరాజర్షిః తామనిందితగామినీం జగ్రాహ విధివత్ పాణావు వాసచ తయా సహ.'' అక్కడే మరొక చోట— "ఏవముక్త్వా సరాజర్షిః తాం అనిందిత గామినీమ్ । సం పరిష్వజ్య బహుభ్యాం స్మిత పూర్వముదైక్షత.''–

రాజులు ఋషులకు ఎంత భక్తియుక్త నమ్రత చూపేవారో ఆ నీతి విశేషం, లేక ఆ సంస్కార విశేషం, మనకు మొదట రామాయణంలో దర్శన మిస్తుంది. దండకారణ్య ఋషులు రాముడ్ని ''పరిపాలయనో రామ వధ్యమానాన్ నిశాచరైః'' అన్నప్పుడు దానికి రాముడంటాడు ''నైవమర్హథ మాం వక్తుం అజ్ఞ ప్యోహం తపస్వినాం,'' ఇది వ్యాస శకుంతలలో లేక పోయినా దాన్ని కాళిదాసు తీసుకుని'' పరిగృహీతం బ్రాహ్మణవచనం'' అన్నాడు శాకుంతలంలో.

శాకుంతలంలో తత్పూర్వం కాళిదాసు చూపించిన వ్యవహారమంతా వాల్మీకిలోనుంచే వ్యాసుడు తీసుకున్నాడు. శ్రీరాముడు దండకలో తాపసాశ్రమ మండలం ప్రవేశించే ముందు ''అభ్యగచ్ఛన్ మహాతేజా విజ్యంకృత్వా మహ ద్ధనః''- నారిత్రాడు సంధించి ఉన్న ధనుస్సు సడలించి అంటే వినీత వేషధారియై రాముడు తాపసాశ్రమంలోకి ప్రవేశించాడు. దీన్నే విపులీకరించి వ్యాసుడు వర్ణిం చాడు. దుష్యంతుడు ఆశ్రమ పద ప్రవేశాత్ పూర్వం తన వెంట వచ్చిన సైన్యాన్ని ఆశ్రమ వనద్వారం దగ్గరే ఆపివేసి తానొక్కడే ప్రవేశించినట్లు చెప్పాడు. "ధ్వజినీం అశ్వసంబాధాం పదాతిగజ సంకులాం అవస్థాప్య వనద్వారి సేనా మిదమువాచసః'' ''స్థీయతాం అత్ర। యావదాగమనం మమ'' మళ్ళీ అక్కడే. ''తతోఽగచ్ఛన్ మహా బాహురేకోఽహత్యాన్ విసృజ్యతాన్" (ఇదంతా సంభవ - 70 & 71 అధ్యాయాల్లో ఉంది) ఈ విషయాన్నే గ్రహించి కాళిదాసు శాకుంతలంలో ''తపోవనవాసినాం ఉపరోధోమాభూత్ పతావ దేవ రథం స్థాపయ యావదవతరామి'' అన్నాడు. మరొకటి కణ్వాశ్రమం ప్రవేశించే ముందు దుష్యంతుడు'' సామాత్యో రాజలింగాని సోఽపనీయ నరాధిపః" (రాజలాంఛ ణలను తీసివేసి) అన్నాడు వ్యాసుడు. రామాయణంలో రాముడు జటావల్కల

ధారి గనుక ఆయనకు ధనుస్సొక్కటే రాజలాంఛనం; ఆభరణాది లాంఛనాలు లేవు. కనక వాల్మీకిలో ధనుస్సు మాత్రమే ప్రసక్తమయింది. కానీ శకుంతలలో సర్వాభరణ భూషితుడైన రాజు గనక రాజలాంఛనాల విషయం వచ్చింది. కానీ ఈ సూక్ష్మాన్ని వ్యాసుడి నుంచి గ్రహించి కాళిదాసు తీసుకున్నాడు. కనక శాకుంతలంలో "ఇదం తావత్ గృహ్యతాం ఇతి సూతహస్తే ధనుశ్చ ఆభరణాని చ ఉపనీయ" అన్నాడు.

ఆరణ్యక రాముడ్ని వాల్మీకి వర్ణించిన శైలిని కావలసిన వరకు వ్యాసుడు తీసుకున్నాడు, వేటకై వచ్చిన దుష్యంతుడి కోసం. వాల్మీకి "సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణం, ఆజానబాహుందీప్తాస్యం అతీవ ప్రియ దర్శనం, గజవిక్రాంతగమనం జటామండల ధారిణం-" అంటూ వర్ణించాడు. ఇక్కడ వ్యాసుడు దుష్యంతుడ్ని "సాతమాయత పద్మాక్షం, వ్యూఢోరస్కం సుసంహతం। సింహస్కంధం దీర్ఘబాహుం సర్వలక్షణ పూజితం-" అని వర్ణించాడు. ఈ "సర్వ లక్షణ పూజితం" అనే మాట వాల్మీకిలో "పార్థివ వ్యంజనాన్వితం" అని ఉంది. ఈ విధంగా వ్యాసుడు శకుంతలలో వాల్మీకిని చాలా సన్నిహితంగా అనుకరించాడు.

కథాంతం కూడా రామాయణీయ యుద్ధకాండ పద్ధతే చిరకాలానంతర సమాగత అయిన సీతను రాముడు "దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢం" అని తిరస్కరిస్తాడు. సీత దుఃఖపూర్ణయై రాముడి మీద నిశిత వాక్కులు ప్రయోగిస్తుంది, తన జన్మ యొక్క దివ్యత్వాన్ని రాముడికి జ్ఞాపకం చేస్తుంది- "కిం మాం అసదృశం వాక్యం ఈ దృశం శోకదారుణం రూక్షం శ్రావయసే వీర! ప్రాకృతః ప్రాకృతాం ఇవ" (యుద్ధ 116 స. 5 శ్లో) నిమ్నజాతి పురుషుడు నిమ్నజాతి స్త్రీనుద్దేశించి మాట్లాడినట్లు నీవునాతో ఈ విధమైన మాట ఎలా చెప్పావు. "అపదేశో మే జనకాత్ నోత్పత్తిః వసుధాతలాత్। మమవృత్తంచ వృత్తంచ బహుతేన పురస్కృతం" (యుద్ధ 116-15 శ్లో) (నాజన్మ జనక మహారాజు నుంచి కాదు, నా జన్మ భూమి నుంచి నా మీద తిరస్కార వచనం వినిరేటప్పుడు నా దివ్యత్వాన్ని నీవు గుర్తుంచుకోలేవు) దీన్నే వ్యాసుడు శకుంతలోపాఖ్యానంలో అతిమాత్రంగా విస్తరించాడు. శకుంతల అంటుంది దుష్యంతుడితో "క్షితౌ అటసి రాజేంద్ర అంతరిక్షేచరామ్యహం। ఆవయోరంతరం పశ్య మేరు సర్షపయోరివ", "రాజన్ సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి।

ఆత్మనో బిల్వమాత్రాణో పశ్యన్నపి నపశ్యసి'' (సంభవ-73 అధ్యా) ఇవన్నీ కాళిదాసు పరిహరించాడు.

బ్రహ్మాది దేవతలూ అగ్ని, సీతను గ్రహించమని రాముడ్ని కోరగా అప్పుడు రాముడు సీతను గ్రహిస్తాడు. అక్కడ రాముడు అంటాడు, ''అనన్య హృదయాం సీతాం మచ్చిత్త పరిరక్షిణీం। అహమప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజాం'' (యుద్ధ 118 స-15 శ్లో) ''ప్రత్యయార్థంతు లోకానాం త్రయాణాం సత్య సంశ్రయః, ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనం'' (17 శ్లో) - వ్యాసుడు కూడా తన శకుంతలోపాఖ్యానాన్ని ఇలాగే ముగించాడు. దుష్యంతుడు శకుంతలను స్వీకరించక తిరస్కరిస్తాడు. శకుంతల కూడా వెనక చెప్పినట్లు సీత మాటలనే దీర్ఘంగా విపులీకరించి దుష్యతుండికి అప్పజెపుతుంది. అప్పుడు, బ్రహ్మాది దేవతలు రాముడ్ని సీతను గ్రహింపుమని రామాయణంలో చెప్పినట్లు, ఇక్కడ ఆకాశవాణి దుష్యంతుడికి చెపుతుంది. ''భరస్వ పుత్రం దుష్యంత మావమంస్థాః శకుంతలాం'' అని ''అథాంతరిక్షాత్ దుష్యంతం వాగువాచాశరీరిణీ'' (దుష్యంతా నీ పుత్రుడ్ని స్వీకరించు శకుంతలను అవమానించకు) దేవతలు ఋషులు కూడా ఆ మాటే చెప్పి పుష్ప వృష్టి కురిపిస్తారు." ఏవముక్త్వా తతో దేవాః ఋషయశ్చతపోధనాః పతివ్రతేతి సంహృష్టాః పుష్పవృష్టి వవర్షిరే'' ఆ విధంగా శకుంతలను గ్రహించిన దుష్యంతుడు రాముడివలెనే అంటాడు'', అహంచాప్యేవమేవైనాం జానామి స్వయమాత్మజం। యద్యహం వచనాదస్యా గృహ్ణీయామి మమాత్మజం। భవేద్ధి శంక్యో లోకస్య నైవశుద్ధో భవేదయం...'' ఈ విధంగా శకుంతలోపాఖ్యానం అంతా రామాయణాన్ని అనుసరించే వ్యాసుడు సాగాడు.

కనక వాల్మీకిని అనుసరించిన ప్రథమకవి వ్యాసుడే. ఆ తర్వాత ఎందరో అనుసరించారు. భాసుడు వాల్మీకి సూక్ష్మాలెన్నో గ్రహించాడు వాల్మీకి ''కృత కృత్యాహివైదేహీ ఛాయేవాను గతాపతిం'' అని అంటే దాన్ని తీసుకుని భాసుడు ప్రతిమలో ''సూర్య ఇవగతో రామః। సూర్యందివస ఇవ లక్ష్మణోను గతః సూర్యదివసావసానే। ఛాయేవ నదృశ్యతే సీతా'' అని ఒక నాటకీయ శ్లోకం రచన చేశాడు.

కాళిదాసు, అరణ్యకాండలో ఉన్న ''ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ। అనుపస్థీయ మాం రోమాం సంక్రుద్ధో వ్యాజహారహ'' అనే బీజాన్ని

తీసుకుని అరణ్య కిష్కింధ సుందరకాండల సౌందర్య సంపదను యథాతథంగా వాడుకుని మేఘసందేశం రూపొందించాడని 'షోడశి' (తిరుపతి దేవస్థానం ప్రతి) లో వివరించబడింది.

ఇంత విపులంగా వ్యాసుణ్ని కవులు వాడుకోలేదు. కానీ వాల్మీకి తర్వాత "సర్వేషాం కవిముఖ్యానాం ఉపజీవ్యో భవిష్యతి" అని భారతమే చెప్పినట్లు వ్యాస కృతి బహు కవిముఖ్యులకు ఆధారమైన విషయం జగద్విదితమే. కనక చర్విత చర్వణమన్నాను వెనక.

కానీ నిజంగా ఏ వ్యాసుడు రాశాడో పురాణాలు, చెప్పలేముకానీ, పురాణ కర్త అయిన వ్యాసుడు మాత్రం, సాహిత్యం మాట అటుంచి, దేశానికి ఎంతో అపారమైన సాంస్కృతిక సంపద ఇచ్చాడు. నిజంగా ఈ దేశం ఇతిహాస పురాణాల శిశువు-ఇతిహాస పురాణాలు వచ్చేసరికి వేదకాలం గతించింది. ఆ దేవతలు ఆ ఆచార వ్యవహారాలు అన్నీ గతించాయి. ఇతిహాస పురాణాలు ఒక నూతన లోకాన్ని సృష్టించాయి ఆ లోకపు సాయం సంధ్యనే ఈ రోజు మనం చూస్తున్నాము మన దేశంలో. యూరోప్ ఆది భూముల్లో ఆ లోకం ఏ నాడో క్రైస్తవ ఇస్లాం మతాలచేత విధ్వంసం చేయబడింది. అయినా ఆశ్చర్యం ! అది పాశ్చాత్య కవుల తత్త్వవేత్తల వాఙ్మయంలో మొలక లెత్తుతూ వృక్షాలవుతూనే ఉంది. పాశ్చాత్య దేశాల్లో క్రైస్తవ మతం చర్చిల్లోనే వాఙ్మయంలో లేదు; అలాగే ఇస్లాం మతం మసీదుల్లోనే ఉంది. గజల్లోలేదు.

సంస్కృతి అంటే సమాజంలో ఉన్న మాతా పితృ పుత్రమిత్రాది అన్యోన్య సంబంధాలు. స్త్రీ పురుష సంబంధాలు, ప్రభుత్వ ప్రజా సంబంధాలు, ఆస్తి సంపదల హక్కులు, దేవతలు, తీర్థక్షేత్రములు, వ్రతక్రతు దానధర్మాది కార్యాలు ఇత్యాదులన్నీ కలిసిన ఒక మానవ వ్యవహార సముదాయ స్వరూపము. భౌగోళిక పరిస్థితులు మనిషి శారీరక రూపాన్ని ప్రభావితంచేస్తే సంస్కృతి మనిషి యొక్క గౌణ స్వరూపాన్ని నిర్ణయిస్తుంది. కనకనే ఈ దేశవాసులంతా ఇతిహాస పురాణాల శిశువులన్నాను; వేదోపనిషత్తుల శిశువులు కారు !

వేదాలువచ్చి మన దేశీయ మృత్తిక నుంచి పుట్టిన మాతృ పూజా విధుల్ని వెనక్కి తోసివేసింది. శక్తిపూజ పామరజన సంస్కృతిగా మార్చివేయబడింది. కానీ ఈ దేశపు జనాభాలో పునాదిగతమైన పౌర ఆ పామర జనులు. వారి మంత్ర తంత్రాలను కొన్నింటిని వేదమతం గ్రహించి సంస్కృతీకరించి తనలో భాగంగా

చేసుకుంది. ఆ మంత్రాలే అధర్వ శిరస్సులని రామాయణ కాలంలో అనబడేవి; మహా భారత కాలానికి అధర్వ వేదమయ్యాయి. వేదమతం తీసుకొని మంత్రతంత్రాలు శబర మంత్రాలనే పేరుతో దేశంలో సర్వత్రా ఇంకా ఉన్నాయి.

విగ్రహా రాధన లేని వేద మతం యజ్ఞ యాగాదుల మీద ఆధారపడి ఎంతో కాలం నిలవలేక పోయింది. జైన బౌద్ధాది అవైదిక మతాలు దేవాలయాల్ని విగ్రహా రాధనని సృష్టించి తత్పూర్వమే ప్రజామోద నిష్టితమైఉన్న తాంత్రిక విధానాన్ని అవలంబించి మంత్రతంత్రాది పూజాకల్ప విధుల సహాయంతో ప్రజాబాహుళ్యం లోకి వ్యాపించి పోతున్నాయి. ప్రజాబాహుళ్యాన్ని స్త్రీ జనాన్ని అనుసరించి రాజులు కూడా దేవాలయాది పూజా విధానానికి ఆదరణ ఎక్కువగా ఇవ్వసాగారు. యజ్ఞ యాగాదుల ఉనికి సన్నగిల్లింది. ఆ దశలో వేదమతం కూడా అన్యోన్య బద్ధము లైన తంత్ర, విగ్రహారాధనలను అవలంబించి జీర్ణోద్ధరణ సాగించారు. అందులో పురాణ రచన ప్రధాన ఘట్టం. అక్కడ్నించి మన దేశంలో జన వ్యాప్తములైన దేవతలు, పూజలు, కథలు, విశ్వాసాలు వైదిక మతంలోకి విలీనీకరణపొందాయి. ఈ విలీనీకరణ బహుదృశ్యాదృశ్యంగా ఉన్న మర్మంచేత గర్భితమై ఉంది. జన సామాన్యానికి నచ్చే దేవాలయ పూజాది విధానాలన్నీ తీసుకోబడ్డాయేగానీ, దేవతలు వేదాల్లో నుంచే తీసుకొని మార్పులు కూర్పులు చేసి ఒక నవీన సృష్టి అయిన వినూత్న దేవతలకు అవి వర్తింపజేయ బడ్డాయి. ప్రథమ దశలో గ్రామ శక్తు ల్లాంటి దేవతల్ని తీసుకోలేదు. శివుడు విష్ణువు ప్రధాన దేవతలు. వీళ్ళు వేదాల్లో అప్రధానులు. ఇంద్రాదులు పురాణాల్లో నిమ్నస్థానం పొందారు. ఇలాంటి మార్పులు చాలా చేయబడ్డాయి.

అతి పూర్వమై వేదకాలానికి సన్నిహితమైన రామాయణంలో ఇంద్ర పార మ్యమేగానీ విష్ణపారమ్యంలేదు. వేదాల్లో ఇంద్రాది దేవతలు అగ్నిముఖులు; దేవాః అగ్ని పురోగమాః; పురాణాల్లో దేవతలు బ్రహ్మ పురోగమాః. పురాణాల్లో శివుడు ప్రమథగణ పరివేష్ఠితుడు. రామాయణంలో శివుడు వేదంలో వలె మరుద్గణ పరిష్ఠి తుడు; "కృతోద్వాహంతు దేవేశం గచ్ఛంతం సమరుద్గణం। ధర్షయామాస దుర్మేధా హుంకృతశ్చ మహాత్మనా" (బాల-23 సః శ్లో) (సమాధినుంచి వెలువడి ఒకనాడు రుద్రుడు మరుద్గణ సమేతుడై బయలుదేరెను; అప్పుడు దుర్బుద్ధియైన కందర్పుడు రుద్రునిపై దాడిచేసెను......

వేదాల్లో ఉన్నది రుద్రుడే; అతడి పరివారము మరుద్గణాలు, భార్య ఉమ. రుద్రుడు ఋగ్వేదంలో కపర్ది ''ఇమారుద్రాతవసే కపర్దినే'' రుద్రుడు వైదిక సమాజానికి విరోధి ఇంద్రాదులవలె బంధువుకాదు. ''మానో మహాంతముతమానో అర్భకంమాన ఉక్షంతముతమాన ఉక్షితం మానోవధీః పితరంమో మాతరం మానం ప్రియా స్తన్వో రుద్రరీరిషః''— ఓ రుద్రా మాలో పెద్దవాడ్ని చంపకు, మా పిల్లవాడ్ని చంపకు, మాలో యౌవన వంతుడ్ని కడుపులో ఉన్నవాడ్ని చంప కుము, మా తండ్రిని తల్లిని చంపకుము (రుగ్వేదం) అతడే యజుర్వేదంలో సర్వ స్వమని పూజింపబడ్డాడు; ''త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్... ''ఇత్యాది.—వేదాల్లో రుద్రుడి వాహనం ఎలుక, నంది కాదు ! ''ఏకోరుద్రో నద్వితీయాయ తస్థు ఆఖుస్తే రుద్ర పశు స్త్వంజుషస్వ'' (ఓరుద్రా ఎలుకనీ పశువు దాన్ని నీవు పోషింపుము) అలాంటి రుద్రుడ్ని పురాణాలు సపరివార సమేతంగా మార్చివేశాయి పురాణాల్లో ఆయన శివుడు, ఆయన వాహనం నంది; ఎలుకను గణపతికి వాహనం చేశాయి. శివుడి భార్య పార్వతి అయింది.

పామరజన మతాలుగా పరిమితం చేయబడిన లింగ, మాతృమతాలు పురాణాల్లో వైదిక మతంలోకి విలీనీకరణ పొందాయి. లింగ పూజకు పురాణాల్లో శివుడికి ఎలా సంధానం కుదిరిందో పరిశోధించాలి. పర్షియా, సుమేరియా, ఈజిప్టు వగైరా దేశాల్లో కూడా ప్రాచీన కాలంలో లింగపూజ ఉండేది. అక్కడ లింగాన్ని వాళ్ళు శివుడనే వాళ్ళో కాదో? భారతదేశంలో మాత్రం పురాణాలు శివుడ్ని లింగంతో సంధానించి, వైదిక రుద్రుడితో నమక చమకాదులతో సహా కలిపివేశారు. మరొకవైపు విష్ణువు శిఖరాలకు ఎత్తబడ్డాడు అలాగే శక్తి కూడా. కనకనే ఈ పురాణాన్ని సాత్త్విక, రాజసిక, తామసిక పురాణాలని మూడు భాగాలుగా విభజించారు కూడా. ఇదంతా ఏఏ దశల్లో ఎలా జరిగిందో మొత్తం పౌరాణిక యుగచరిత్ర రాస్తే అది ఒక బ్రహ్మాండమైన గ్రంథం అవుతుంది. వ్యాసం ఒక లఘురచన. అందులో ఒక గ్రంథం ఇరికించడం, ఏనుగును ఏకుల బుట్టలో పెట్టడమే అవుతుంది.

వేదాల బయటఉన్న దేవతల్ని ఉన్నత పీఠాలకెత్తి వైదిక దేవతల్ని నిమ్నగతుల్ని చేసి తీర్థక్షేత్ర దేవాలయాది తాంత్రిక విధానాన్ని ప్రధాన భాగంగా ప్రవేశపెట్టి ఒక నూతన మతాన్ని సృష్టించాయి పురాణాలు. ఇంకా ముఖ్యమైనది ఏమిటంటే శివుడెలాగో అంతకంటే ఈ దేశంలో జనవ్యాప్తంగా

ఉన్న మాతృపూజను ఇతిహాస పురాణాల్లో సర్వత్రా మిళితం చేయడం. పురాణాల్లో ఒక ప్రత్యేక పురాణమే దేవీభాగవతమనే పేరుతో సంకలితం చేయబడింది. ''సర్వ చైతన్య రూపాంతాం ఆద్యాం విద్యాంచధీమహి బుద్ధిం యానః ప్రచోదయాత్'' అనే దేవీస్తోత్ర మంత్రంలో ఆ పురాణం ప్రారంభం అవుతుంది. ప్రారంభం మంత్రంతో, మంత్రగ్రథన గాయత్రీచ్ఛందంతో! ఈ దేశపు ప్రాగ్దేశమంతా కలకత్తా నుంచి గౌహాతీ దాకా శాక్తభూమి. అస్సాంలో దశ విద్యాయతనాలతో పరివేష్టింపబడి ఉన్న కామాఖ్యాదేవి దేవాలయం గౌహాతీలో ఎన్నో శతాబ్దాల నుంచీ అసంఖ్యాక భక్తజనానికి గమ్యస్థానంగా ఉంది. ఈ విధంగా అష్టాదశ పురాణాలు ఈ దేశపు అవైదిక మతాలుకాని మతాలనన్నిటినీ క్రోడీకరించి ఆర్యమత రూపాలతో సంస్కరించి ప్రతిష్ఠించాయి.

ఇప్పుడు మనం ఉదయం నిద్ర లేచినప్పటి నుంచి రాత్రి నిద్రపోయే వరకు ఈ పురాణాల తంత్రులు మీటే గానానికి లయగానే నడుస్తున్నాము. మన దేశంలో ఇక్కడా అక్కడా ఉన్న కొన్ని పట్టణాల పోకడ చూచి మన దేశీయ జీవనం పాశ్చాత్య స్వరబద్ధ అవుతోంది అనుకుంటున్నవారు మనలో ఉన్నారు; కానీ మన అసలు దేశమైన గ్రామసీమల్ని మరచి పోతున్నారు. వాస్తవంగా మన పట్టణ ప్రజల మనస్తత్వం పరిశీలిస్తే మన పట్టణాలుకూడా పెద్ద పెద్ద గ్రామాలే అని తెలుస్తుంది. కలకత్తా అంత పెద్ద గ్రామం మరొకటి తూర్పున లేదు. అట్లాగే దక్షిణాన మద్రాసు, ఉత్తరాన ఢిల్లీ లక్నో వారణాసి మొదలైనవి, పశ్చిమాన బొంబాయి !

పురాణాలు రాసినవాడు వ్యాసుడు అయితే ఈనాటి మన పురాణ సంస్కృతికి మన జీవన విధానానికి వ్యాసుడే కర్త. ఇదే పాత్ర పాశ్చాత్య దేశాల్లో హోమర్ నిర్వహించాడు. మన దేశంలోలాగే పశ్చిమ ఖండంలో గ్రీసులో ఒలింపియన్ దేవతలనే జీవ్స్ప్రభృతి దేవగణానికి ముందు స్త్రీ దేవతలే ఉండేవారు. వారిని కోరేస్ (Kores : maiden godesses) అనేవారు. ఏథెన్స్ నగరదేవత ఏథీనా, థేసలీలో ఫెరాయ్ నగర దేవత ఫేరియా ఇలా- మన దేశంలో గ్రామదేవతలైతే, గ్రీసులో నగర దేవతలు; మన అంకమ్మ పోలేరమ్మ లాంటివాళ్ళే. అలాగే ప్రాచీన గ్రీకు దేవతల్లో క్తోనియన్ దేవతలుండేవారు; అంటే పాతాళలోక దేవతలు, వారే నగదేవతలు. ఈనాటికీ ఏథీనా దేవాలయంలో రోజూ మొదట నాగపూజ జరుగుతుంటట. ఇలాంటి దేవతలనన్నింటినీ వెనక్కి

తోసేసి, హోమర్ ఒలింపియన్ దేవతల్ని తెచ్చి ప్రతిష్ఠించాడు. అయితే పురాణ కర్త వ్యాసుడు భారతదేశంలో ఎలా పూర్వ అర్వాచీన దేవతల విలీనీకరణ చేశాడో అలాగే హోమర్ కూడా ఏథీనా, పెర్సిఫోన్, డిమిట్రిస్, లాంటి స్త్రీ దేవతల్ని కూడా ఒలింపియన్ దేవతల్లో మిళితం చేశాడు. తన ఇలియడ్, యులిసిస్‌ల ద్వారా హోమరిక్ హిమ్స్ (Hymns) ద్వారా, వ్యాసుడు ఇక్కడ చేసినట్లే హోమర్ ఒక నూతన సంస్కృతిని సృష్టించి గ్రీసులో ప్రవేశపెట్టాడు. క్రైస్తవమత దండయాత్ర అనంతరం కూడా శిథిలాల్లో నుంచి లేచిన ఫీనిక్స్ లాంటి హోమరిక్ సంస్కృతినే పశ్చిమ ఖండాలవారు అనుభవిస్తూ ఆరాధిస్తున్నారు.

అయితే మన దేశంలో పురాణాలు వ్యాసుడు రాసాడా! అనేదే ప్రశ్న. పురాణాలు, వేదోపనిషత్తుల అనంతరం, ఇతిహాసాల అనంతరం వచ్చాయని అనుకోవడం సామాన్య విజ్ఞానం. ఈ సామాన్య విజ్ఞానం నిజం కాదు. వేదాల్ని గురించి ఎలా అపౌరుషేయం అన్నారో పురాణం కూడా అలాగే అపౌరుషేయం అన్నారు. ''పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతం। అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః'' (1-60-61) అని వాయుపురాణం ప్రతిపాదించింది. ఈ మాట దగ్గిర్నుంచీ పురాణాలు వెయ్యి సంవత్సరాల క్రితమే రాయబడ్డాయనే సిద్ధాంతం వరకూ ఎన్నో మతభేదాలున్నాయి.

వేదోపనిషత్తుల్లో పురాణాల ప్రసక్తి ఉంది, అయితే అవి ప్రాచీన కాలంలో సమిష్టిగా పురాణం అని మాత్రమే అనబడేది. పురాణాలనే బహువచనం లేదు పురాణం అపౌరుషేయం అన్నారు. పురాణాలు ఒక దేశానికీ ఒక కాలానికీ సంబంధించినవి కావు! అవి ప్రపంచ వాయువుల్లో ఎగిరే నానాజాతి రంగుల పక్షులు. మనం ఇక్కడ మనది అనుకునే వామన కథ, కుల్లెర్వో అనే ఫిన్లెండ్ పురాణంలో ఉంది. సృష్టి తొలి పురుషుడైన మహోన్నత శరీరధారి, ఆకాశ మండలాన్ని ఆచ్ఛాదించి సూర్యచంద్ర తారకల కాంతి ఆపి భూమండలాన్ని అంధకార బంధురం చేసిన ఒక ఓక్ వృక్షాన్ని గొడ్డలితో ఛేదించడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. అప్పుడు వైనేమోయినెన్ అనే అంగుష్ఠ మాత్ర పురుషుడు, యోద్ధవేషధారి, వచ్చి నేను దాన్ని ఖండిస్తానంటాడు. తొలిపురుషుడు నవ్వుతాడు. అతడు నవ్వుతుండగానే ఈ అంగుష్ఠ మాత్ర పురుషుడు వామనుడు, ఆకాశం అంత ఎత్తుకు పెరుగుతాడు. మూడగులు వేసి ఓక్ వృక్షాన్ని చేరి దాన్ని

తన ఖడ్గంతో ఒక్క వేటుకు నరికివేస్తాడు, భూమికి నక్షత్ర కాంతి ప్రసాదిస్తాడు. అదే పురాణంలో 'మునపోజ్కా' లేక 'కాలవేల' అనే మహిమాన్విత వీరుడు ఒక పెద్ద గుడ్డులో నుంచి పుడతాడు. అనేక ప్రాణాపాయాలను ఎదుర్కొని మరణించక జీవిస్తాడు బాలుడుగానే. మన గరుత్మంతుళలా కనిపిస్తాడు. V. Stasov (1868) అనే రష్యన్ పండితుడు ఈ వీరుడ్ని కృష్ణుడితో పోల్చి పరిశీలించాడు.

ప్రళయం చేత ప్రపంచం జలార్ణవం అయినప్పుడు ఒకే ఒక్క పురుషుడు మనువు ఒక చేప చెప్పిన ప్రకారం ఒక నావ నిర్మించి ఆనావను చేప కొమ్ముకు కట్టగా ఆ చేప దాన్ని కొన్ని సంవత్సరాలు ఈదుతూ తీసుకుపోతుంది; చివరకు ఆ నావకు ఉత్తరాద్రి తగులుతుంది. నావను అక్కడి చెట్టుకు కట్టి తాను రక్షింపబడతాడు. అతడే మానవ సృష్టికర్త మనువు; ఇది శతపథ బ్రాహ్మణంలో ఉన్న కథ, మహాభారతం ఈ చేపను బ్రహ్మగా మార్చింది, పురాణాలు విష్ణువుగా మార్చాయి.

ఈ విధంగా మన దేశంలో ఉన్న ''జల ప్రళయమూ-మనువూ'' గాథ, అన్యదేశాల పురాణాల్లో కూడా ఉంది- సుమారు 2500 BC నాటి నాగరికత అయిన బాబిలోనియన్ పురాణాల్లో ఈ ఐతిహ్యం ఉంది. సృష్టికి సంబంధించిన ఈ బాబిలోనియన్ కథ ఏడు ఇటుక రాళ్ళమీద రాయబడిఉంది. 1854 లో కుయుంజిక్ అనే చోట బాబిలోనియన్ చక్రవర్తి అషుర్ బనిపాల్ లైబ్రరీ శిథిలాల్లో జరిపిన అన్వేషణలో దొరికాయి ఈ ఏడు రాళ్ళు. కథ- దేవతలు మనుషుల్ని పుట్టించారు. ఒయాన్నిస్ అనే ఒక మత్స్యదేవత వాళ్ళకు తత్త్వశాస్త్ర వాస్తుశాస్త్ర ఇత్యాది సమస్త శాస్త్ర జ్ఞానమూ నేర్పాడు. మనుషులు తెలివిపొంది అభివృద్ధి కావడం దేవతలకు ఈర్ష్యాజనకమయింది. కనక వాళ్ళని వినాశనం చెయ్యాలని జలప్రళయం కలిగించారు. అయితే 'ఈ' అనే ఒక జ్ఞాన దేవత ఒక్క మానవుణ్నే భార్యా సమేతంగా రక్షించాలని సంకల్పించాడు. షంష్ నపిష్టం నామధేయుడైన ఆ మానవుడు నావ నిర్మించుకుని భార్యా సమేతంగా ప్రళయ జలాన్ని కొన్ని సంవత్సరాలు తరించి నిశిర్ అనే పర్వతాగ్రాన్ని చేరి అక్కడ ఆగి ఒక పావురాన్ని ఆకాశంలోనికి విడిచి పెడతాడు. కథ ఇలా నడుస్తుంది.

సుమేరియన్ బాబిలోనియన్ పురాణాలు అన్యోన్య జన్యమైనవి. ప్రజలు కూడా అంతే - షంష్ అంటే సుమేరియన్ పురాణాల్లో తేజోదేవత. అతడు ఆకాశంలో ప్రయాణం చేస్తూ ఉదయాస్తమానాలు కలిగిస్తాడు. అతడి రథానికి ఒక చక్రమూ అశ్వాలూ ఉంటాయి. ఈ చక్రమే సూర్యుడు. ఋగ్వేదంలో 2అష్టకం 3 అధ్యాయం 1 మండల 22 అనువాకం 164 సూక్తంలో ఉన్న ఋక్కుల్ని చూస్తే సూర్యుడు చక్రమనీ అందులోనూ కాలచక్రమనీ వర్ణించినట్లు అర్థమవుతుంది. సూర్యచక్రంతో ఇంద్రుడు రాక్షసుల్ని సంహరించినట్లు ఋగ్వేదంలో మరో చోట ఉంది.

జలప్రళయంలో నావచే రక్షింపబడిన ఏకైక మానవుడు షంష్ నపిష్టం సూర్యవంశీయుడనుకోవచ్చు. నపిష్టిం అనే సుమేరియన్ పదం మన సంస్కృత శబ్దం నప్తకు మూలం కావచ్చు. నప్త అంటే ఒక వంశస్థుడు, వంశీయుడు (Descendant) కనక షంష్ నపిష్టింను మనం సూర్యనప్తగా తీసుకుంటే సూర్యవంశస్థుడైన మన శతపథ బ్రాహ్మణ లేక పౌరాణిక మనువే అవుతాడు.

గత సంవత్సరం (1984) ఆంధ్ర సారస్వత పరిషత్తుహాల్లో డా॥ తంగిరాల గారి జానపద గ్రంథావిష్కరణ సభలో మాట్లాడుతూ నేను అంకమ్మ కథ పోలికలు మహాభారత ఉత్తంకోపాఖ్యానంలో కనిపిస్తాయనీ ఆ పోలికలే వెనక చెప్పిన ఋగ్వేదంలోని కాలచక్రఋక్కుల్లో ఉన్నాయనీ ఆ తర్వాత సుమేరియన్ ప్రాచీన పురాణం గిల్గమేష్‌లో ఉన్నాయనీ చూపించాను. ఒక కాలచక్ర ఋక్కుల్లో తప్ప మిగతా అన్నిటిలో ఒక సర్పం ఉండడము, అది పాతాళ లోకం లోకి పారిపోవడం అన్నిటా కనిపిస్తుంది, ఉత్తంకోపాఖ్యానంలో తక్షకుడు కుండలాలు పుచ్చుకుని ఎలా పారిపోతాడో అలాగే గిల్గమేష్‌లో షంష్ నపిష్టం నుంచి గిల్గమేష్ (తత్పౌరాణిక వీరుడు) గ్రహించిన ఒక సంజీవిని లాంటి మొక్కని నేలమీద పెట్టి శౌచానికి వెళ్ళినప్పుడు ఒక సర్పం వచ్చి ఆ మొక్కని తీసుకుని చరచరా వెళ్ళిపోతుంది.

ఈ పురాణాలు ఇండియా, బాబిలోనియా, సుమేరియా, ఈజిప్టు, గ్రీసు ఇత్యాది దేశాల్లోనేగాక, మరింత పశ్చిమం వెళ్ళితే ఫిన్లెండ్, స్కాండినేవియా, ఐస్‌లెండ్, ఐర్లండ్, ఇంగ్లండ్, వేల్సు అనే ప్రాంతాల్లో కూడా అనాది కాలం నుంచీ ఉన్నాయి. క్రీస్తు పూర్వమే ఎన్నో శతాబ్దాల నుంచీ వెస్‌లెండ్ స్కాండినేవియా భూముల్లో 'సాగా'లనే వచన పురాణాలు 'కుశీలవుల' చేత వంశ పారం

పర్యంగా ప్రజా సమూహాల ముందు గానం చేయబడేవి. ముఖ్యంగా ఐరిష్ సంప్రదాయం యూరోప్‌లో అతి ప్రాచీన మయినది అతిగొప్పది. ఐరిష్ ప్రజలు కెల్టులు కెల్టిక్ పురాణాలు కావ్యాలు రామాయణ భారతాలవలె గానం కోసం రాయబడినవి. వంశ పారం పర్యంగా కుశీలవుల చేత పాడబడేవి. ఈ కుశీలవుల్ని అక్కడBards and Minstrels అంటారు. అమెర్జిన్ అనే కవి రాసిన "తౌతాదె దన్నాన్" అనే కెల్టిక్ పురాణం, గ్రీసును మినహాయిస్తే, మిగతా యూరోపు కంతా అంతకంటే ప్రాచీన కావ్యం లేదు.

పూర్వకథ లన్నిటినీ కలిపి ఒక కొత్త కథల పుస్తకంగా క్రోడీకరించడం అక్కడి సంప్రదాయం. అదే భారతీయ పురాణాల సంప్రదాయం కూడా. 12 శ. (A.D) లో క్రోడీకరించిన The Book of Leinster అనే గ్రంథానికి కర్త అయిన కవి గ్రంథారంభంలో అంటాడు" He is no poet who does not synchronize and harmomize all the previous stories". క్రోడీకరించినవాడు కూడా కవి అనే అనబడతాడు. అదే సంప్రదాయం ప్రకారం అష్టాదశ పురాణాలు క్రోడీకరించి, విభజించిన వ్యాసుడు కూడా ఆ పురాణాల కర్త, కవి;

పురాణాల విషయం వచ్చేసరికి ప్రపంచం అంతా చర్చా పరిధిలోకి వస్తుంది. కనక వేదాల పూర్వం నుంచీ సర్వత్రా, వ్యాపించి ఉన్న పురాణాలను క్రోడీకరించి అక్షర బద్ధంచేసి అష్టాదశ పురాణాలుగా విభజించి మన దేశానికి అనుగ్రహించిన ఆ వ్యాసమహర్షి ఎవరో, ఈ దేశాన్ని తను సృష్టించిన పౌరాణిక సంస్కృతి జలాలతో ప్లావితం చేసిన ఆ మహర్షి ఎవరో ఆ వ్యాస సంప్రదాయానికి నా నమస్కారము—

# శ్రీ దేవీభాగవత తత్వము

—డాక్టర్ ప్రసాదరాయకులపతి

భాగవతములు రెండు. ఒకటి దేవీ పరము. ఒకటి విష్ణుపరము. అష్టాదశ పురాణములలోని దొకటి. ఉపపురాణములలో నిదొకటి.

శ్లో. మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్

మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్య, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త, విష్ణు, వామన, వాయు, వరాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందములు పదునెనిమిది మహాపురాణములు. ఉపపురాణముల లోను భాగవత ప్రస్తావన కలదు.

శ్లో. అన్యాన్యుపపురాణాని మునిభిః కథితానితు
ఆద్యం సనత్కుమారోక్తం నారసింహమతః పరం
పరాశరోక్తం ప్రవరం తథా భాగవతాహ్వయం

—కూర్మ పురాణము

ఇటులే గరుడ పురాణమునను ధర్మకాండ ప్రథమాధ్యాయమున

శ్లో. పురా భాగవతం దౌర్గం నందిప్రోక్తం తథైవచ
పాశుపత్యం రైణుకంచ భైరవంచ తథైవచ-
అని లఘుపురాణ విభాగమున చెప్పబడినది.

మొత్తము మీద పురాణములలో అనేక స్థలముల చెప్పిన ఉప పురాణములు చాల కలవు. (1) నారదీయ (2) బృహన్నారదీయ (3) నందీశ్వర (4) బృహన్నందీశ్వర (5) శివ (6) సాంబ (7) గణేశ (8) లైంగ (9) కల్కి (10) కాళికా (11) చండికా (12) వాసిష్ఠ (13) మారీచ (14) వారుణ (15) పారాశర్య (16) వామన (17) సనత్కుమారీయ (18) దేవీ (19) ధర్మ (20) శివధర్మ (21) బృహద్ధర్మ (22) విష్ణుధర్మోత్తర (23) విష్ణుధర్మ

(24) నరసింహ (25) భార్గవ (26) బ్రహ్మాండ (27) ఆది (28) ఆదిత్య (29) నంది (30) దౌర్వాస (31) కాపిల (32) మానవ (33) ఔశనస (34) భవిష్యోత్తర (35) భాగవత (36) కూర్మ (37) భవిష్య.

వీనిలో ఏవో ఒక పదునెనిమిది ప్రతి పట్టికలోను ఉండును. ఈ పురాణములలో పరస్పర విరోధయుతములుగా భాసించు నంశములున్నను అన్నియు వ్యాసకృతములనుట సంప్రదాయము. పురాణోపపురాణములు భిన్నకాలములలో భిన్న ఋషులచే నిర్మింపబడినను ద్వాపర యుగాంతమున ద్వైపాయనవ్యాసుడు వానినొక పద్ధతిలో కూర్చుటచే అన్నింటికీ వ్యాసుడే కర్తయను ఆచార మేర్పడినది.

ఈ పురాణవాఙ్మయములో దేవీ భాగవత స్థానమును గూర్చి చాల చర్చ జరిగినది.

శ్లో. తత్రపద్మ పురాణంతు ప్రథమంచ ప్రణీతవాన్
తతోఽన్యాని పురాణాని కృత్వా షోడశతుక్రమాత్
అష్టాదశం భాగవతం సారమాకృష్య సర్వతః
కృతవాన్ భగవాన్ వ్యాసః శుకమధ్యాపయత్ స్వయం

అదే పద్మపురాణమున శకున పరీక్షయందు

శ్లో. బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ మార్తండం నారదేరితం—
తథైవగదితం రామపురాణం కాపిలం తథా
వారాహం బ్రహ్మకైవర్తం శకునేషు ప్రశస్యతే
శైవం భాగవతం దౌర్గం భవిష్యోత్తరమేవచ
అనియు, అందే మరొక చోట
'శైవమాది పురాణంచ దేవీ భాగవతం తథా'
అని ఉపపురాణములయందు పరిగణన చేయబడినది.

శివమత్స్యపురాణముల దృష్టిలో దేవీ భాగవతమే మహాపురాణము. శివ పురాణమున నిట్లు కలదు.

శ్లో. యత్రవక్తా స్వయంతందే బ్రహ్మ సాక్షాచ్చతుర్ముఖః
తస్మాద్బ్రాహ్మం సమాఖ్యాతం పురాణం ప్రథమం మునే
పద్మ కల్పస్యమాహాత్మ్యం తత్రయస్మాదు దాహృతం

తస్మాత్పాద్మం సమాఖ్యాతం పురాణం చద్వితీయకం
పరాశర కృతం యత్తు పురాణం విష్ణుబోధకం
తదేవ వ్యాస కథితం పుత్రపిత్రోరభేదతః
యత్ర పూర్వోత్తరేఖండే శివస్య చరితం బహు
శైవమే తత్పురాణంహి పురాణ జ్ఞావదంతిచ
భాగవత్యాశ్చ దుర్గాయాః చరితం యత్రవిద్యతే
తత్తు భాగవతం ప్రోక్తం నతుదేవీ పురాణకం...

మత్స్య పురాణమున నిట్లు కలదు.

శ్లో. యత్రాధి కృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః
వృత్రాసురవధోపేతం తద్భాగవత మిష్యతే

అటులే పురాణాంతరమున

శ్లో. హయగ్రీవ బ్రహ్మవిద్యాయత్రవృత్రవధ స్తథా
గాయత్ర్యాచ సమారంభః తద్వైభాగవతంవిదుః

కాళికా పురాణమున

''యదిదం కాళికాఖ్యం తన్మూలం భాగవతం స్మృతం''

అనియు కలదు. ఇవన్నియు దేవి భాగవతము యొక్క మహా పురాణత్వమును స్థాపించుచున్నవి.

శివపురాణమున ఉమాసంహితయందు మరొక చక్కని ప్రమాణమున్నది.

శ్లో. బ్రహ్మణా సంస్తుతా సేయం మధురై టభనాశకీ
మహావిద్యా జగద్ధాత్రీ సర్వ విద్యాధిదేవతా
ద్వాదశ్యాం ఫాల్గుణ స్యైవ శుక్లాయాం సమభూన్నృప

అను వచనమును బట్టి విద్యాధిదేవత ఫాల్గుణ శుక్ల ద్వాదశినాడు దయించినది. ఆమె సరస్వతి. ఆమె పేర వెలసిన కల్పము సారస్వత కల్పమని హేమాద్రి కల్ప శ్రాద్ధ ప్రకరణ నాగరఖండమున కలదు.

శ్లో. సారస్వతస్య కల్పస్య మధ్యే యేస్యుర్నరామరాః
తద్వృత్తాం తోద్భవంలోకే తద్భాగవతమిష్యతే

అను ప్రమాణమును బట్టి సారస్వతకల్పమున సరస్వతీ మాహాత్మ్య ప్రకటన చేయు పురాణము భాగవతము. అది దేవీ భాగవతమే. కనుక దేవీ భాగవతము మహా పురాణము.

దేవీ యామళతంత్రమున కూడ మరొక దృష్టాంతముకలదు.

శ్లో. శ్రీమద్భాగవతం నామ పురాణం వేద సమ్మితం
పారీక్షితా యోపదిష్టం సత్యవత్యంగ జన్మనా
యత్ర దేవ్యవతారాశ్చ బహవః ప్రతి పాదితాః

సౌభాగ్య కల్పలత యందు సంహార భైరవ తంత్రస్థ వచనము ఇటులు స్మరింప బడినది.

''ఇదం రహస్యం చరితం రాధోపాసనముత్తమం
వ్యాసాయ మమ భక్తాయ ప్రోక్తం పూర్వం మయాద్విజే
మత్తో రహస్యం జ్ఞాత్వైవ రాధామాహాత్మ్యముత్తమం
ఏ తస్య విస్తరంచక్రే శ్రీమద్భాగవతే తథా
నారదే బ్రహ్మవైవర్తేలో కానాం హితకామ్యయా

వ్యాసుడు పారీక్షితునకు చెప్పినది, దేవి అవతారములు చెప్పినది, రాధా మాహాత్మ్యము వర్ణించినది - భాగవతము. ఇది దేవీ పరము.

ఇటులే విష్ణుపరమైన భాగవతము విషయమునను అనేక ప్రమాణములు పండితులు చూపియున్నారు. ఏది మహా పురాణమను సంశముపై విద్వాంసులలో చాల చర్చలు బయలు దేరినవి. వైష్ణవశాక్తేయుల మధ్య మతద్వేషముతో ప్రారంభమైన యీ వాద ఝుంఝూమారుతము రెండు శతాబ్దుల క్రిందనే ఉత్తర హిందూస్థానమంతయు వ్యాపించినది. దాని వాసన దక్షిణాపథమునకును సోకకపో లేదు. కాశీనివాసియు దక్షిణాచారప్రవర్తకుడునైనగదా కాశీనాథ భట్టు దేవీ భాగవతమే ప్రమాణము, అదే మహాపురాణము, విష్ణు భాగవత మార్షమే కాదు అని నిర్ణయించుచు దుర్జనముఖచపేటికయను గ్రంథము రచించి భాగవతపక్ష వాదులను నిరసించెను. దానికుపోద్బలముగా భాగవతము వ్యాసునిపేర బోప దేవుడను పండితుడు రచించెనను వాదము పుట్టినది దానిని త్రోసిరాజని భట్టోజీ దీక్షితుల శిష్యుడగు రామాశ్రయపండితుడు ''భాగవతము బోపదేవరచితము కాదు. అది ఆర్షమే. దేవీ భాగవతమార్షముకాదు.'' అనుచు దుర్జనముఖచపేటికా ఖండన మను గ్రంథము రచించి దేవీ భాగవత పక్ష వాదులను ధిక్కరించెను. అంతట మరియొక పండితుడు దానిని ఖండించుచు దేవీ భాగవతార్షత్వమును స్థిరపరచుచు దుర్జన ముఖ పద్మపాదుక అను గ్రంథము రచించెను. ఈ విషయమును పురస్కరించుకొనియే భాగవత స్వరూప విషయ శంకా నిరాసత్రయోదశ

మను పేర పురుషోత్తమ పండితుడొక గ్రంథము వ్రాసెను. మితాక్షర వ్యాఖ్యాత యగు బాలంభట్టుకూడ ఈ భాగవత రచనా విషయమును ప్రస్తావించెను.

పాశ్చాత్య విమర్శకులలో విల్సన్ పండితుడు 18 పురాణములలోను భారతము రచింపబడిన తర్వాత భాగవతము రచింపబడినదని ఆంతరంగిక సాక్ష్యము కలదు గాన భాగవతమే మహాపురాణాములలోనిదని వ్రాసెను. (Preface to Vishnu purna) మేజర్ బి డి. బసు విష్ణుభాగవతములో ప్రధానముగా దర్శనముల ననుసరించిన వేదాంతసిద్ధాంతములు కన్పించుననియు దేవీభాగవతములో దేవీయజ్ఞాదిసందర్భములలో తాంత్రికకర్మకాండ కన్పించుచున్నదనియు తంత్రశాస్త్రములు క్రీ. శ. 1 వ శతాబ్దమునకు చెందినవని నిస్సంశయముగా నిరూపితమగుట చేతను విష్ణుభాగవతమే ప్రాచీన తరమని ప్రతిపాదించెను. (Sacred Books or the Hindus - fore word p. 7)

తంత్రశాస్త్ర ప్రభావముచేతనే రాధా పూజ దేవీ భాగవతములో ప్రవేశించి యుండునని అతని అభిప్రాయము. విష్ణుభాగవతములో రాధా ప్రశంసలేదు. అందుచేత కొన్ని భాగములు విష్ణు భాగవతముకంటే ప్రాచీనమైనను మొత్తము మీద ఇప్పటి దేవీ భాగవత రూపమర్వాచీనమని అతడభిప్రాయపడెను. ఇతడు మరియొక వింత సిద్ధాంతమును కూడ ప్రతిపాదించెను. అనేక హేతువులచే ప్రాచీన కాలమున భాగవతులందరు గౌరవించెడి భాగవతమొక్కటే యుండెడి దనియు, బౌద్ధమత ప్రభావముచే బ్రాహ్మణధర్మము కృశించిన వేళ ఈ ప్రాచీన భాగవతము మృతస్థితికి వచ్చియుండుననియు తిరిగి బ్రాహ్మణ్యపునరుజ్జీవనము జరిగినపుడు బలము పుంజుకొని వైష్ణవులు శ్రీమద్భాగవతమును, శాక్తేయులు దేవీ భాగవతమును రచించుకొని యుందురని మేజర్ బసు భావించినాడు. అంతే కాక మంగళ,చండి, షష్ఠి, మానస మొదలగు దేవతల వృత్తాంతములు దేవీ భాగవతములో కనపించుచుండుటచే ప్రాచీన పురాణముల వరుసలో దీనిని లెక్కించుటకు సందేహము కలుగుచున్నదనియు ముఖ్యముగా వంగదేశమునుండి ఎన్నో ప్రక్షిప్తములందు చేరియుండుననియు అతడు వ్రాసినాడు. శ్రీ కంఠశాస్త్రియను ప్రసిద్ధాచార్యుడు దేవీ భాగవతమే ప్రాచీన తరమని వ్రాసినాడు.

బృహద్ధర్మ పురాణాదులు కొన్ని ఈ రెంటిని గూడ అష్టాదశ పురాణములలో చేర్చియుండుటచే వీని మహాపురాణత్వము చర్చింపబని లేదనియు, తక్కిన పురాణములవలె ఇవియు అర్షములేయని అనుకొన్న సరిపోవుననియు మల్లాది

సూర్యనారాయణ శాస్త్రిగారు సమన్వయించుటకు ప్రయత్నించినారు. ఇదియు నొక విధముగా ఉచితముగానే ఉన్నది.

ఇక దేవీ భాగవతోదయమును గూర్చి పరిశీలింతము. అందే ప్రథమ స్కంధమున పంచదశాధ్యాయమున ఒకకథ దీనికి సంబంధించినది కలదు. వ్యాస పుత్రుడైన శుకుడు సంసారము దుఃఖమయము గాన దానిని త్యజింపవలెనని తలచెను.

శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం దుఃఖంచ మరణేతథా
గర్భపాతే పునర్దుఃఖం విష్ఠామూత్రమయే పితః
తస్మాదతిశయం దుఃఖం తృష్ణాలోభ సముద్భవం
యాచ్ఞాయాం పరమందుఃఖం మరణాదపి మానద.

కావున సంసారమును త్యజించి సన్యాసి కావలెనని శుకుడు భావించెను. ఈ విషయము విని వ్యాసుడు సుదుఃఖితుడై కన్నులందు అశ్రువులు జాలువార మిక్కిలి వ్యాధితుడయ్యెను. అప్పుడు శుకుడు ఆశ్చర్యపడి మాయా ప్రభావ మెంత గొప్పది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును దానిని తప్పించుకొన లేక పోయిరి గదా. విష్ణ్వంశసంభవునిగా పౌరాణికులు చెప్పెడి నాతండ్రి వ్యాసుడును మాయావశుడై దుఃఖించుచున్నాడు. పురాణవక్త, భారత నిర్మాత, వేద విభాగ కర్త అయిన వ్యాసుడ తడే వాడే ఇట్లయిన ఇంక చెప్పవలసినదే మున్నది. మాయాబలము పండితులకును దుస్త్యజము గదా "అని తండ్రి మనశ్శాంతికై సర్వకారణ కారణయైన పరమేశ్వరిని మహాదేవిని మనసా ప్రార్థించి వ్యాసునితో ఇట్లనెను." మహాభాగా! నీవు మహనీయుడవు. అందరికిని బోధించువాడవు ప్రాకృతునివలె ఏల శోకించెదవు. ధైర్యము వహింపుము. మోహజాలమును విడిచిపెట్టుము. ఈ జన్మలో నేను కుమారుడను. నీవు తండ్రివి. పూర్వజన్మలో నేనెవడనో నీవెవడవో. ఈ బంధములు అనిత్యములు. దుర్లభమైన మానుషజన్మ పుణ్యము చేతగాని లభింపదు. సంసారబంధమున చిక్కుకుని జీవితము నేల పాలు చేసుకొనవలెను. స్త్రీలకొఱకు, ధనము కొఱకు కాలము వ్యర్థము చేయుట అజ్ఞానము అతిపవిత్రమైన ఈ కర్మభూమిలో పుట్టితిమి. జీవితమును తరింప జేసికొనుట కర్తవ్యమని నేను భావించుచున్నాను. నా బుద్ధి సంసారవాసనల యందు ఆసక్తి పొందుట లేదు. దైవజ్ఞుడవు, మహామతివి యైన నీవు నన్ను ప్రబోధింపుము."

అప్పుడు చతుర్థాశ్రమమానసుడైన కుమారుని చూచి వ్యాసుడిట్లు పలికినాడు. ''కుమారా! నేను రచించిన భాగవతము పఠింపుము నీ సందేహములన్నియు తీరును. దాని వివరములు చెప్పెదను వినుము. ఇది బ్రహ్మసమ్మితమైన పురాణము. పంచలక్షణ సంయుతము. నాతి విస్తీర్ణము. సర్వ పురాణములకును ఆది భూషణము. విన్న మాత్రముననే సదసజ్జ్ఞాన విజ్ఞానము గల్గును. ద్వాదశ స్కంధ సమన్వితమైన దానిని నీవు చదువవలయును.

ఒకప్పుడు పాలకడలిలో విష్ణువు బాలుడై వటపత్రమునందు శయనించి యుండెను. అతనికి నేను ఎవనిచేత నిర్మింపబడితిని? ఈ బాలత్వము నా కెట్లు వచ్చెను? అని సందేహము కలిగి చింతించెను. అప్పుడు బాల విష్ణువునకు ఒక అర్ధ శ్లోకము వినబడెను. ''సర్వం ఖల్విదమేవాహం నాన్యదస్తిసనాతనమ్.'' ఈ వాక్యము నెవరు పలికిరి? స్త్రీయా? పురుషుడా? నపుంసకుడా? అని మరల సంశయము పుట్టెను- అయినను ఆ వాక్యమును ఆతడు పునః పునఃస్మరించు చుండెను. అనగా జపము చేసెను. అప్పుడాతని ముందు దివ్యాంబర ధారిణి, దివ్యభూషణ భూషిత, శంఖచక్ర గదాపద్మ ధారిణియైన చతుర్భుజ మహాలక్ష్మి సాక్షాత్కరించెను. ఆమె చుట్టును ఎందరో సమానాకారముగల చెలికత్తెలుండిరి. ఆ దృశ్యమును చూచి విష్ణువు విస్మయావిష్ట హృదయుడయ్యెను. ''ఈమె ఎవరు? ఈ సఖులెవ్వరు? వరాయుధ ధరలు, నానా భరణభూషితలు, మందార మాల విలసితలు, ముక్తాహారవిరాజితలు అయిన యీకాంత లెవరు? ఈ ఏకార్ణవ మైన జలమేమి?'' అందులో ఈ న్యగ్రోధమెక్కడిది. దాని ఆకుపై శిశురూపమున నేనుండుట ఏమి?'' అని ఆతడనుకొనుచుండెను. అంత చిరునవ్వు నవ్వుచు, మహాలక్ష్మి ఈ విధముగ పలికెను- మహాశక్తి ప్రభావము చేత నీవు నన్ను మరచి పోయితివి. అపరాశక్తి నిర్గుణ నేనును, నీవును గుణయుతులము. నేను సాత్విక శక్తిని. నేను ఎప్పుడును నీ హృదయమున నివసింతును. నీ దగ్గర నుందును నీ నాభికమలము నుండి బ్రహ్మ ఉదయించి రజోగుణ సమన్వితుడై తపస్సుచేసి, శక్తిని సంపాదించి మూడు లోకములను సృష్టించును. అతని భ్రూమధ్యము నుండి రుద్రుడు పుట్టి తపస్సుచే తామసీ శక్తిని సాధించి కల్పాంతమున లోకములను సంహరించును. నేనా పరమేశ్వరియొక్క సగుణ రూపమును. నీవు విన్న శ్లోకార్థము ఆమెచే ప్రకటీకృతమైనది. నీ హితమునకై ప్రోక్తమైన దానిని వేద సారము, శుభావహము అయిన భాగవతముగా తెలిసికొనుము. ఇది సర్వ శాస్త్రము

లకు సారమైన మహా విద్య. దేవి నీయందలి ప్రేమచే ఈ వాక్యను నీ కందించి నది." అపుడు దాని రహస్యము నెరిగిన వాడై విష్ణువు మహామంత్ర రూపమైన ఆ విద్యను హృదయమున ధరించెను. కాలాంతరమున తన నాభికమల సంజాతుడైన బ్రహ్మకు దాని నుపదేశించెను. బ్రహ్మ దానిని తన కుమారుడగు నారదునకు తరువాతి కాలమున ఉపదేశించెను. నారదుడు నాకా రహస్య విద్యనుపదేశించెను. శతకోటి విస్తరమైన ఆ భాగవత సారాంశమును నేను గ్రహించి ద్వాదశస్కంధ పరిమితముగా రచించితిని. దానిని నీవు పఠింపుము. నీతోపాటు నా శిష్యుడు రోమహర్షణ సంభవుడును ఈ సంహితను పఠించును.'' ఇది భాగవతోదయ కథ ముక్తి హేతువు. సృష్టి రహస్య వివరణకారిణి సర్వేశ్వరియైన మహామాయా ప్రభావమును వర్ణించునది, దేవ్యవతారకథలను వివరించు నదియైన ఈ గ్రంథము పుట్టిన విధమిది.

దేవీభాగవతములో దేవీ మహత్వమును గూర్చిన ప్రధాన కథ పరిశీలింపవలసి యున్నది.

ఇది భాగవతావతార కథకు తరువాతది. త్రిమూర్తుల కంటె దేవి గొప్పదని స్థాపించుగాథయిది. ప్రళయమున సృష్టి నశించిపోగా ఏ కార్ణవమైన స్థితిలో కమల భవుడైన బ్రహ్మకు సందేహము కలిగెను. తానెవడో, ఎక్కడనుండి వచ్చెనో, యీ నీరేమో, యీ పద్మమెక్కడిదో అర్థము కాలేదు. తనను రక్షించు వాడెవడో తెలియలేదు. పోనీ తానుదయించిన పద్మమెక్కడ మొదలైనదో చూతమని ఆ నీటిలో లోతుకుపోయినాడు. వెయ్యేండ్లు వెదకినను మూలము దొరకలేదు. చింతా క్రాంతుడైన బ్రహ్మకపుడాకాశమునుండి 'తప తప' అని వినబడెను. ఆ ఆకాశవాణిననుసరించి పద్మ కర్ణికయందు అతడు వెయ్యేండ్లు తపస్సు చేసెను. అంత మరల ఆకాశము నుండి 'సృజ సృజ' అని వినబడెను. బ్రహ్మ విమూఢుడై "ఏమి సృష్టించవలెను ? ఎటులు చేయవలెను'' అని ఆలోచించుచుండ మధుకైటభులను దైత్యులిద్దరు వచ్చి అతనిని బాధించిరి. అపుడు భయముతో ఏమి చేయవలెనో తోచక పద్మనాళము నాధారముగా గొని నీటిలోనికి బ్రహ్మ దిగిపోయెను. కొంత దూరము పోయిన తర్వాత పరమాద్భుత పురుషుడొకడు కనిపించెను. మేఘశ్యాముడు, పీతాంబరుడు, చతుర్భుజుడు, శేషశాయి, వనమాలా విభూషితుడు శంఖచక్ర గదాపద్మధారియై భోగిభోగోపరిస్థితుడై ఆ మహనీయుడు నిద్రించుచుండెను. అత్త బ్రహ్మ చింతాక్రాంతుడై నిద్రా

స్వరూపిణియైన మహాదేవిని స్తోత్రము చేయగా ఆ దేవి విష్ణు శరీరమునుండి బయటకు వచ్చి దివ్యాభరణ మండితయై ఆకాశమున ప్రకాశించెను. నిద్రనుండి లేచిన విష్ణుమూర్తి ఐదు వేల సంవత్సరములు యుద్ధము చేసి మధుకైటభులను సంహరించెను. ఆసమయమున రుద్రుడు కూడా అక్కడకు వచ్చెను. ముగ్గురును గగనస్థితయైన ఆ దేవతను స్తుతించిరి. ఆమె కృపావలోకనములతో ఇటులు పలికినది'' బ్రహ్మ విష్ణుమహేశ్వరులారా! మీమీ నియత కార్యములను చేయుడు. అతంద్రితులై మీమీ విభూతులతో సృష్ట్యాది బాధ్యతలు నిర్వర్తింపుచు మీమీ నికేతనములలోవసింపుడు. ''అపుడు వారు అమ్మా! అంతయు జలమయము. భూమి యెక్కడనులేదు. పంచతత్వములు. తన్మాత్రలు, గుణములు, ఇంద్రియ ములు ఏమీ లేవు. అశక్తులమై ఏమి చేయగలము'' అన్నారు. ఆ మాటలు విని దేవి చిరునవ్వు నవ్వినది. ఇంతలో ఆకాశమునుండి ఒక విమానముదిగినది. గత సాధ్వసులై విమానమున ప్రవేశింపుడని ఆమె వారిని నాదేశించినది. అద్భు తములను మీకు చూపెదనని వారితో అన్నది. ఆమె ఆజ్ఞప్రకారము ముగ్గురు రత్నమండితము, కింకిణీజాల శబ్దితము, సురసద్మనిభమైన ఆ విమానము నారో హించినారు. మనోవేగముతో ఆ విమానమాకాశమున పోయినది. ఎచటకో, ఏమో తెలియుటలేదు. కొంత సేపటికి ఒక అందమైన దృశ్యము తోచినది. సుందరనంద నోద్యానము. పారిజాతమునీడ కామధేనువు. చతుర్దంతియైన ఐరావతము. మేనకా ప్రభృతి అప్సరసలు నాట్యమాడుతున్నారు విద్యాధరులు, గంధర్వులు, యక్షులు మందారవాటికా మధ్యమున పాడుచు క్రీడించుచున్నారు శచీసహితు డైన ఇంద్రుడు కనిపించినాడు. అగ్ని, యమ, వారుణ, వాయు, కుబేరాది దిక్పా లకులు విరాజిల్లుచున్నారు ఇంతలో విమానము కదలినది. మరల కొంత సేపటికి సత్యలోకము వచ్చినది అందు బ్రహ్మ ఉన్నాడు. సాంగములైన చతుర్వేదములు సాగరసరిత్పన్నగోరగములు కన్పడినవి. ఆ సనాతన బ్రహ్మ ఎవరో- ఆశ్చ ర్యము కలిగినది. మరల విమానము కదలినది. ఈసారి కైలాసము వచ్చినది. అక్కడ దశభుజుడు, అర్థచంద్రధారి, వృషారూఢుడు త్రిలోచనుడు కనిపించి నాడు. గణపతి, సుబ్రహ్మణ్యాదులు అలరుచున్నారు.

ఈ మరొక శివుడెవరు? ఆలోచన కందుటలేదు. విమానము మరల వేగము నందుకొన్నది. ఈ పర్యాయము వైకుంఠము వచ్చినది. అందు గరుడారూఢుడు పీతాంబరుడు, అతసీకుసుమభాసుడు, దివ్యాభరణ భూషితుడు, సనాతన విష్ణువు

కనిపించినాడు. ఈ రెండవ విష్ణువెవరో ? ఈ త్రిమూర్తులకు ఈ వింతఅర్థము కాలేదు. విమానము మరల పోవుచున్నది. ఈ మారు సుధా సముద్రమువచ్చినది. చలద్వీచీ విరాజితము, యాదోగణ సమాకీర్ణము - అయిన ఆ మహాంభోధి మధ్యమున ఒకవనము. మందార పారిజాతాది వృక్షములతో ఒక మనోహర దృశ్యము.

శ్లో. మందార పారిజాతా ద్యైపాదపై రతిశోభితః
నానా స్తరణ సంయుక్తో నానా చిత్ర విచిత్రితః
ముక్తాదామపరిక్లిష్టో నానాదామ విరాజితః
అశోక వకులా ఖ్యైశ్చ వృక్షైః కురువకాదిభిః
సంవృతస్సర్వత స్సౌమ్యైః కేతకీచంపకైర్వృతః
కోకిలారావ సంఘుష్టో దివ్యగంధ సమన్వితః
ద్విరేఫాలి రణత్కారైః రంజితః పరమాద్భుతః
తస్మిన్ ద్వీపేశివా కారః పర్యంకస్సుమనోహరః
రత్నాళి ఖచితోఽత్యర్థం నానా రత్న విరాజితః
దృష్టోఽస్మాభిర్విమానస్థైః దూరతః పరిమండితః
నానా స్తరణ సంఛన్న ఇంద్రచాప సమన్వితః
పర్యంక ప్రవరే తస్మిన్ ఉప విష్టావరాంగణ...

ఈ దృశ్యమే సౌందర్యలహరిలో ఆచార్యశంకరుల వాక్కున ఎటులు రూపు దాల్చినదో చూడుడు.

శ్లో. సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీ పరివృతే
మణి ద్వీపే నీపోపవనవతి చింతామణి గృహే
శివాకారేమంచే పరమశివ పర్యంకనిలయాం.
భజంతి త్వాంధన్యాః కతిచన చిదానందలహరీ॥

అమృత సముద్రము. ఆమధ్య మణి ద్వీపము. అందు రమణీయోద్యానము. దానిలో దేవతా వృక్షములు. అటచింతామణి గృహము. ఆ లోపల శివాకారమగు మంచము. పరమశివ పర్యంకము. దానిపై భువనేశ్వరి. ఆమె రూపమును దేవీ భాగవతమెటులు వర్ణించినదో పరికింపుడు.

శ్లో. రక్త మాల్యాంబరధరా రక్త గంధాను లేపనా
సురక్త నయనా కాంతా విద్యుత్కోటి సమప్రభా

సుచారువదనా రక్తదంతచ్ఛదవిరాజితా
రమాకోట్యధికా కాంత్యా సూర్య బింబనిఖాఖిలా
వరపాశాం కుశాఖీతి ధరా శ్రీ భువనేశ్వరీ...

ఈ మూర్తియే శంకరుల కవితా మధుర వాక్కున నెట్లు పలుకబడినదో గమనింపుడు.

క్వణత్కాంచీ దామా కరికలభకుంభా స్తననతా
పరిక్షుణ్ణా మధ్యే పరిణత శరచ్చంద్ర వదనా
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానాకరతలైః
పురస్తా దాస్తాంనః పురోమధితు రాహోపురుషికా

ఆ దివ్యమూర్తిని చూచి త్రిమూర్తులు పులకించినారు. విస్మితులైనారు. ఈమె యెవరు? పేరేమి? ఈమె గంధర్వికాదు. అప్సరసకాదు. దేవాంగనకాదు దూరమునకు సహస్రకరగా, సహస్రాక్షిగా, సహస్రవదనగా భాసించుచున్నది. ఈ మహాదేవి యెవరను సంశయము వారికి కలిగినది. కొంత సేపటికి విష్ణువు పోల్చుకోగలిగినాడు. "ఆమె యెవ్వరోకాదు. సాక్షాత్ సర్వేశ్వరి. సర్వమునకు, మనకు కారణమైన భగవతి. మహావిద్య, మహామాయ. ఈమె సంకల్ప వికల్పము లెవరికి తెలియవు. సృష్టిస్థితిలయకారిణి యీమెయే. ఈమె దర్శనముచే మనము ధన్యులము. కృతకృత్యులము. పరమ పుణ్యాత్ములైన తపస్వులకు మాత్రమే ఈమె దర్శనం లభించును. నేను, దేవతలందరు, రమాది దేవకాంతలు ఆమెలో లక్షాంశమునకునుసరికాము. నేను మహార్ణవమున వటపత్రమున బాలునిగా నున్నప్పుడు చూచినదీమెనే. ఈమెయే నాకు జోల పాటలు పాడుచు, ఊయల లూపెడిది. ఈమెను చూచుచుండ అప్పటి విషయములన్నియు గుర్తుకు వచ్చుచున్నవి. ఈమె మన తల్లి. ఆమె పాద సన్నిధికి మనము పోవుదము. పునఃపునః ప్రణమిల్లుచు ఆమె పార్శ్వమున కరుగుదము. ద్వారపాలకులు మనలను లోపలికి పోనీయక వారించినచో అక్కడనే ఉండి స్తోత్రము చేయుదము. ఆ మాటలకు బ్రహ్మేశులు సరేయనిరి. ముచ్వురు స్తుతించుచు ఆమె సన్నిధానమున కరిగిరి. వారిని చూచుచునే మహామాయ మందహాసము చేసినది. మరుక్షణమున ముగ్గురును స్త్రీలుగా మారిపోయిరి. రత్నాలంకారములతో రమ్యరూపములతో మహిళలైన వారు ఆమె చరణములచెంత వినమ్రభావముతో ప్రణమిల్లి నిలబడిరి. అక్కడ వేలకొలది పరిచారికలు రక్త నీలపీతాది విచిత్రాంబర ధారిణులై

యున్నారు. కొందరు పాటలు పాడుచు, కొందరు నాట్యము చేయుచు, కొందరు వివిధ వాయిద్యములు వాయించుచు మైమరచి భజించుచున్నారు. ఇంతలో పరమాద్భుతమైన ఒక దృశ్యము వారికి గోచరించినది అద్దము వంటి ఆమె గోటిలో స్థావరజంగమాత్మకమైన సమస్త బ్రహ్మాండమును వారికి కనిపించినది. దిక్పాలకులు నారద తుంబురులు విద్యాధరాప్సరో యక్ష రక్షో గంధర్వ కిన్నర సిద్ధ సాధ్యనాగాదులెందరో అందు కలరు. వైకుంఠ సత్య కైలాసములు సర్వ పర్వతములు సరిత్సింధువులు త్రిమూర్తులు అందు కన్పడిరి. ఆ దృశ్యములు చూచుచుండగానే నూరు సంవత్సరములు గడచినవి. అక్కడి స్త్రీలతో స్నేహము వారికెంతో ఆనందము కలిగించినది. విమోహితులై వారితో కలిసి చాలాకాలము తిరిగిరి. తరువాత ఒకనాడు విష్ణువు సర్వేశ్వరియైన ఆమెను వివిధరీతుల స్తోత్రము చేసెను. అటులే శివుడును బ్రహ్మయు స్తుతించిరి ఆ ముగ్గురి ప్రార్థనలు విన్న భగవతి సంతోషించి తన స్వరూపమును వారికి వివరించినది దయామయియై తన విశ్వరూప సందర్శన భాగ్యము వారికి కలిగించినది. త్రిమూర్తులు భయభ్రాంతులై కంపించి నిమీలిత నేత్రులై శాంతించమని ఆమెను ప్రార్థించిరి. ఆమె తన తీవ్రరూపము నుపసంహరించి బాలా రూపిణియై తమతమ లోకములకు వెడలి జాగ్రత్తగా పరిపాలన చేయమని వారి కనుమతి యిచ్చినది. హరిహర బ్రహ్మలకు మహాలక్ష్మి మహాకాళి మహా సరస్వతి దేవులను భార్యలుగా ప్రసాదించి వారు తన రూపాంతరములే అన్న సంగతి వారికి బోధించినది. ఆ స్త్రీలతోసహా బైటికిరాగానే వారికి పురుష రూపములు వచ్చినవి. విమానమెక్కి అందరు స్వస్థానములకు చేరిరి. తమ తమ లోకములలో ఆమె ఆజ్ఞ ప్రకారము బాధ్యతలను నిర్వర్తించుట మొదలుపెట్టిరి. క్లుప్తముగ దేవీ అవతారమునకు సంబంధించిన ప్రధాన కథ యిది.

ఇదికాక దేవీ మాహాత్మ్యమును వర్ణించుచు భక్తులనను గ్రహించు కథలెన్నో కలవు తృతీయ స్కంధములోని సుదర్శన కథ చతుర్థ స్కంధము లోని శ్రీకృష్ణ జన్మకథనము, పంచమ స్కంధములోని మహిషాసుర శుంభ నిశుంభాది వధా వృత్తాంతము, సురథుని కథ ప్రసిద్ధమైనవి. మార్కండేయ పురాణమున పంచమస్కంధ గాథలు ప్రత్యేక ప్రాధాన్యము వహించినవి. ద్వితీయ స్కంధమున భారతకథ అంతయు వచ్చినది. మత్స్యగంధి పుట్టుక నుండి పరీక్షిన్మరణము వరకు ద్వితీయ స్కంధమున వర్ణింపబడినది. షష్ఠ

స్కంధమున వృత్రాసుర కథ, నహుషుని కథ, హరిశ్చంద్రోపాఖ్యానము, నిమి వసిష్ఠుల గాథలు, హైహయ వంశకథలు, ఏకవీర, కాలకేతుల యుద్ధము మొదలగునవి కలవు. సప్తమ స్కంధముల బ్రహ్మోద్యుత్పత్తి, సూర్యవంశ విస్తార కథనము, చ్యవనునకు యవ్వనము ప్రాప్తించిన కథనము, శర్యాతి యజ్ఞమున అశ్వినులకు సోమపానము ప్రాప్తించిన విధము, రేవతుని బ్రహ్మలోక గమనాది కథనము, కకుత్స్థమాంధాత్రాద్యుత్పత్తి, సత్యవ్రతోపాఖ్యానము, త్రిశంకు హరిశ్చంద్ర సంపూర్ణ గాథలు కలవు. అష్టమ స్కంధమున భూగోళము నందలి సర్వద్వీప సమాచారమును, గ్రహనక్షత్ర మండల విశేషములను అతల తలాతలాది లోక వర్ణనమును, నరకాది స్వరూపమును కలవు. నవమ స్కంధమున గంగోత్పత్తి కథ, కుశధ్వజకథ, వేదవతీ తులసీ ఉపాఖ్యానములు, సావిత్రీ కథ మొదలగునవి కలవు. దశమ స్కంధమున అగస్త్యకృత వింధ్య నిరోధకథ, స్వారోచిషాది మను చరిత్రము, మహాకాళీ మహాలక్ష్మి ఉత్పత్తి కథనము కలవు. ఏకాదశ స్కంధమున సదాచార విధిక్రమము, శౌచ స్నాన విధి, జపమాలా, భస్మధారణాది విధులు, రుద్రాక్ష, త్రిపుండ్ర ఊర్ధ్వపుండ్రాది మహిమలు, సంధ్యావందన బ్రహ్మయజ్ఞ గాయత్రీ పురశ్చరణ కర్మ, వైశ్వ దేవాదులు, పురశ్చర్యానియమ కామ్య కర్మాది విధులు వివరింపబడినవి. ద్వాదశ స్కంధమున గాయత్రీ మంత్ర తత్వమంతయు సహస్ర నామములతో సహా చెప్పబడినది. కేనోపనిషదర్థ వర్ణనము, గౌతమ శాపము, మణిద్వీప వర్ణనము మొదలగునవి కూడ ఇందుకలవు. దేవీ మంత్రముల యొక్క అనేక విశేషములు ప్రతిస్కంధమునను ఏదో ఒక దేవతారాధన సందర్భమును పురస్కరించుకొని చెప్పబడినవి. తొమ్మిదవ స్కంధమునందలి షష్ఠీ, మంగళ, చండీ మొదలగు దేవతలు ఉత్తర హిందూస్థానము నందలి కొన్ని ప్రాంతములలో మాత్రమే ప్రసిద్ధులు. అందు ముఖ్యముగా రాధాదేవికి సంబంధించిన విశేషములు శ్రీమద్భాగ వతములో కృష్ణ కథలలో ఎక్కడను చెప్పబడకపోవుటచే పండితులలో వివాదములకు దారితీసినవి.

దేవీపూజా విధానములలో మధురభక్తి సంప్రదాయమునకు మూలమైన రాధాకృష్ణభక్తి బృందావనము నుండి వికసించి యావద్భారతదేశమునను వ్యాపించినది. బ్రహ్మవైవర్తపురాణమున యీ దేవతలకు సంబంధించిన గాథలు వివరముగా కలవు. ఆ సంప్రదాయము ప్రకారము బ్రహ్మ విష్ణు మహేశ్వరుల

సత్యలోక, వైకుంఠ, కైలాసములకు పైన గోలోకము కలదు. రాధాకృష్ణులు దాని అధీశ్వరులు. ఈ మహాకల్పమున మొదటిసారిగా రాధాకృష్ణులు బృందావనమున అవతరించిరి. ఈ కృష్ణుడు వైకుంఠాధిపతియైన నారాయణుని అంశ కాదు. త్రిమూర్తుల కతీతుడైన పరమపురుషు డతడు. రాధాదేవియు అటులే సర్వేశ్వరి. వారి వలననే హరిహరబ్రహ్మలు లక్ష్మీ దుర్గా సరస్వతులు ఉదయించిరి. వారి నారాధించుటను మించిన అర్చనా విశేషము లేదు. ఒక రకముగా చెప్పినచో రాధయు కృష్ణుడును ఒకరే. మరొక రకముగా చెప్పినకృష్ణుని హ్లాదినీ శక్తిరాధ. రాధా సంప్రదాయపరులు కృష్ణుని కంటె రాధకే ఎక్కువ ప్రాధాన్యమిత్తురు. రాధాదేవి అనుగ్రహము లేనిది కృష్ణుని పొందుట అసాధ్యమని ఆ సిద్ధాంతము. సర్వభక్తి మార్గములలోను మధురభక్తి మార్గము ఉత్కృష్టమైనది పరమేశ్వరుని తల్లిగా, తండ్రిగా, సోదరునిగా, స్నేహితునిగా, ప్రభువుగా భావించు విభిన్నమతముల కంటె పరమేశ్వరుని ప్రియునిగా భావించు కృష్ణభక్తి సంప్రదాయము జీవేశ్వరైక్యమును సాధించు అత్యుత్తమ మార్గమని తజ్ఞుల అభిప్రాయము దానికి పురుషోత్తముడైన కృష్ణుడు కేంద్రము ఆ కృష్ణుడు రాధాదేవి కరుణ లేక వశుడు కాడు. కనుక రాధారాధనము అత్యంత ప్రధానము.

దేవీభాగవతములో రాధను ప్రకృతి యొక్క ప్రాణశక్తిగా వర్ణించుట కన్పించును. ఆమె ధ్యాన విధానము నవమస్కంధమున మనోహరముగా వర్ణింపబడినది. రాధాదేవి స్వరూపము నభివర్ణించు ఈ క్రింది శ్లోకములను పరికింపుడు

శ్లో. ధ్యాయామ్యహం మహాదేవీం రాధికాం రాసనాయికామ్
శ్వేత చంపకవర్ణాభాం శరదిందు సమాననామ్
కోటిచంద్రప్రతీకాశాం శరదంభోజ లోచనామ్
బింబాధరాం పృథుశ్రోణీం కాంచీయుత నితంబినీం
కుందపంక్తి సమానాభ దంత పంక్తి విరాజితాం
క్షేమాంబర పరీధానాం వహ్నిశుద్ధాం శుకాన్వితాం
ఈ షద్ధాస ప్రసన్నాస్యాం కరికుంభాయుగస్తనీం
సదా ద్వాదశ వర్షీయాం రత్నభూషణ భూషితాం
శృంగార సింధులహరీం భక్తానుగ్రహకాతరాం
మల్లికామాలతీమాలా కేశపాశవిరాజితాం

సుకుమారాంగలతికాం రాసమండలమధ్యగాం
వరాభయాంకరాం శాంతాం శశ్వత్సుస్థిర యౌవనాం
రత్నసింహాసనాసీనాం గోపీమండలనాయికాం
కృష్ణప్రాణాధికాం వేదబోధితాం పరమేశ్వరీం

షడక్షరమైన రాధా మంత్రము వాంఛాచింతామణిగా వర్ణించబడినది. వక్త్రకోటి సహస్రములును, జిహ్వాకోటి శతకములును ఈ మంత్రమాహాత్మ్యమును వర్ణింపశక్యములు కావు. దీనిని మొదట గోలోకమున రాసమండలమున భక్తితత్పరుడైన శ్రీకృష్ణుడు ఉపదేశ స్వీకారము చేసెను. తరువాత లోకమున వ్యాపించినది.

దేవీ భాగవతము ప్రకారము సృష్ట్యాదిని మూలప్రకృతి రెండు శక్తులైనది. ఒకటి ప్రాణశక్తి. రెండు బుద్ధిశక్తి. మొదటిది రాధ. రెండవది దుర్గ. సర్వప్రపంచము ఈ రెంటికి అధీనమైయుండును.

శ్లో. మూలప్రకృతిరూపిణ్యా స్సంవిదోఽజగదుద్భవే
ప్రాదుర్భూతం శక్తియుగ్మం ప్రాణబుధ్యాదిదైవతం
జీవానాం చైవసర్వేషాం నియంతృప్రేరకం సదా
తదధీనం జగత్సర్వం విరాడాది చరాచరం
యావత్తయోః ప్రసాదో న తావన్మోక్షో హి దుర్లభః
తతస్తయోః ప్రసాదార్థం నిత్యంసేవేత తద్ద్వయం

ఈ రాధ-దుర్గ-ఇద్దరి అనుగ్రహము, లేనిది మోక్షము లేదు. కార్యసిద్ధి లేదు. కనుక యీ ఇద్దరిని నిత్యము సేవింపవలయును. సర్వాపన్నివారిణి, దుర్గ సంకటహంత్రి, సర్వబుద్ధ్యధిదేవి అంతర్యామి స్వరూపిణి, శైలీ శక్తి, శైవ వైష్ణవులిద్దరికి నిత్యోపాస్యయైన దుర్గ-నవాక్షర మంత్రాధిదేవతగా ఇందు వర్ణింపబడినది. యీ దుర్గ మహాకాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతీరూప. అందుచే ధ్యానమున మూడు రూపములును చెప్పబడినవి.

**మహాకాళీ ధ్యానము ;**

శ్లో. ఖడ్గ చక్ర గదా బాణ చాపాని పరిఘం తథా
శూలం భుశుండం చశిరః శంఖం సందధతీం కరైః
మహాకాళీంత్రినయనాం నానాభూషణ భూషితాం
నీలాంజన సమ ప్రఖ్యాం దశ పాదాననాంభజే

మధుకైటభనాశార్థాం తుష్టావాంబుజాసనః
ఏవం ధ్యాయేన్మహాకాళీం కామబీజ స్వరూపిణీం

**మహాలక్ష్మి ధ్యానము :**

శ్లో. అక్షమాలాంచ పరశుం గదేషు కులిశానిచ
పద్మం ధనుష్కుండికాం చ దండం శక్తిమసిం తథా
చర్మాంబుజం తథా ఘంటాం సురాపాత్రం చ శూలకం
పాశంసుదర్శనం చైవ దధతీమరుణ ప్రభాం
రక్తాంబుజాసనగతాం మాయా బీజస్వరూపిణీం
మహాలక్ష్మీంభజే దేవం మహిషాసురమర్దినీం

**మహా సరస్వతీ ధ్యానము :**

శ్లో. ఘంటాశూలే హలంశంఖం ముసలం చ సుదర్శనం
ధనుర్బాణాన్ హస్త పద్మైర్దధానాం కుంద సన్నిభాం
శుంభాది దైత్యసంహర్త్రీం వాణీ బీజస్వరూపిణీం
మహా సరస్వతీం ధ్యాయేత్సచ్చిదానంద విగ్రహాం

ఈ దేవతా విధానము మరింత వివరముగా మార్కండేయ పురాణమున గలదు. అందలి సప్తశతి శ్లోకములు మంత్రములుగా పరిగణన కెక్కినవి. పారాయణచే సర్వకామ్యసిద్ధిని ప్రసాదించు విద్యగా దానికి ప్రసిద్ధి వచ్చినది. సప్తశతీ గుప్తవతీటీక యందు భాస్కరాచార్యులు పదవ్యుత్పత్తి ప్రదర్శన పూర్వకముగా వివరించుచు ముమ్మూర్తులు కలిసిన దుర్గా రూపము నిటులను సంధించియున్నారు.

శ్లో. మహా సరస్వతి చితే మహాలక్ష్మి సదాత్మికే
మహా కాళ్యానందరూపే త్వత్తత్వ జ్ఞాన సిద్ధయే
అనుసందధ్మహేదేవి వయం త్వాం హృదయాంబుజే

ఈ సందర్భమున దేవీ భాగవతమున శకున పరీక్షా విషయ మొకటి చెప్పబడినది. పనికైపోవు వారు పాటించు నంశములను గూర్చి ప్రాచీన శ్లోక మొకటి చూడుడు.

ఉషస్స్యాత్ గార్గ్య సిద్ధాంతం శకునంతు బృహస్పతేః
మనశ్శుద్ధి ర్వ్యాసమతం విప్ర వాక్యం హరేర్మతం
అభిజిత్సర్వ సంజ్ఞాతం.........

కార్యసిద్ధికై బయలుదేరువారు ఉషఃకాలమున బయలుదేరిపోవలెనని గార్గ్యుడు, శకునము చూచుకొని బయలుదేరవలెనని బృహస్పతి, మనస్సు నిర్మలముగా నున్నపుడు బయలుదేరవలెనని వ్యాసుడు, విప్రాశీస్సులందిపోవలెనని హరి, చెప్పినారు. అభిజిత్తు సర్వాంగీకృత సమయము. 'మనోబలంతు మాంతవ్యం' అని మరొక వాక్యమును ప్రసిద్ధమే. ఇక దేవీ భాగవత వచనము చూడుడు.

శ్లో. శకునాంశ్చ పరీక్షేత నిత్యమస్మిన్యథావిధి
కుమారీ దివ్యహస్తేన యద్వావటు కరాంబుజాత్
మనోరథంతు సంకల్ప్య పుస్తకం పూజయేత్తతః
దేవీంచ జగదీశానీం ప్రణమేచ్చ పునఃపునః
సుస్నాతాం కన్యకాం తత్రా నీయార్ఘ్యర్చ్యయథావిధి
శలాకాంరోపయేన్మధ్యే తయాస్వర్ణేన నిర్మితాం
శుభం వాప్య శుభం తత్ర యదాయాతి చ తద్భవేత్
ఉదాసీ నేప్యుదాసీనం కార్యం భవతి నిశ్చితః

కన్యకను సుస్నాతను శుచిగా అర్చించి బంగారు శలాకను ఆమెచేత గ్రంథమున పెట్టించవలెను. ఆ పుట యందున్న దానినిబట్టి కార్యము యొక్క ఫలాఫలసిద్ధి నిర్ణయించవలెను.

ఇటువంటి విశేషము లెన్నో దేవీ భాగవతమున కలవు. దేవీ పూజా విధానము ఉపయోగించవలసిన, తగిన వస్తువులు మొదలగునవి జాగ్రత్తగా నెరిగి పూజించవలెను. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క యిష్టముండును. అది గుర్తెరిగిన సిద్ధిని వేగముగా పొందవచ్చును.

అలంకార ప్రియో విష్ణు రభిషేక ప్రియశ్శివః
నమస్కార ప్రియ స్సూర్యః దుర్గా దేవ్యర్చనా ప్రియా
దీపప్రియః కార్తవీర్యః గణేశ స్తర్పణ ప్రియః

విష్ణువు అలంకార ప్రియుడు చక్కగా తులసీదళములతో, మణిమయాభరణములతో అలంకరించి పూజించిన ఆయనకిష్టము. శివునకదేమియులేదు. నెత్తిననిన్ని నీరుపోసిన చాలును. ఆ బోళా శంకరుడు సంతోషించును. అధికతర ప్రీతికై పంచామృతములతోను అభిషేకించుట కలదు. ఇక సూర్య నమస్కారములు ప్రసిద్ధమే. ఆరోగ్యమునకు, విజయమునకు, కార్యసిద్ధికి వీనిని చేయుట అందరెరిగినవే. కార్తవీర్యార్జునుడు దీప ప్రియుడు. దీపము వెలిగించి

ఆయన పేరు ముమ్మారుస్మరించిన చాలు చోరాది బాధలు నివారణమగునని దత్తాత్రేయ తంత్రము చెప్పుచున్నది. గణపతి తర్పణ ప్రియుడు. గణేశ తంత్రములో అనేక విధములైన తర్పణ పద్ధతులు: గణపతి యొక్క రూప భేద ములు చెప్పబడినవి. పరమేశ్వరి దుర్గ అర్చనా ప్రియ. పూలు, కుంకుమ మొద లైన ద్రవ్యములతో అష్టోత్తర, సహస్రనామములతో, వివిధ రీతులతో అర్చించిన ఆమె సంతుష్టి చెంది అనుగ్రహించును.

పూజ సందర్భమున ఇష్టమైన ద్రవ్యములెటులో అనిష్టమైన ద్రవ్యములును కలవు.

> నాక్షతై రర్చయేద్విష్ణుః నతులస్యాగణాధిపం
> నార్చయేదంబికామర్కైః నకేతక్యా మహేశ్వరం
> నభైరవంమల్లికాభిః......

ఈ శ్లోకము కొంత వింత గొలుపుచున్నది. కాని దీనిలో తాంత్రిక రహస్యములు కలవు. ఆయా దేవతల తత్వము, లక్షణముబట్టి ఈ విషయము నిర్ణయమై యుండును. విష్ణువు విషయమున అక్షత నిషేధమేమని సహజముగా సందేహము కలుగును. ఏ దేవతను పూజించినను సామాన్యముగా అక్షతలుపయోగించుట చూచుచునే ఉన్నాము. మరి యీ నిషేధమేమి? ధర్మశాస్త్రవేత్త, మహాపండితుడు కమలాకరభట్టు దీనికి సమాధానము చెప్పినాడు. యవాక్షతల విషయమున నిషేధముగాని, తండులాక్షతల విషయమున నిషేధము లేదని అతని వివరణ. దీనికొక కారణమున్నది. యవలు వీర్యవంతమైన ధాన్యము దానిలో రజోగుణము కలదు సత్త్వగుణ స్వరూపుడైన విష్ణువును రజోగుణ ప్రేరకమైన యవాక్షతలతో పూజింపరాదు. అంత సారము లేని బియ్యపు అక్షతలతో పూజింపవచ్చును.

అటులే గణేశునకు తులసి నిషేధము. వినాయకచవితినాడు ఇరువది యొక్క పత్రితో పూజించునపుడు అందులో తులసి కూడ నుండును గదా! తులసి పవిత్రమైనది. గణపతిని దానితో నెందుకు పూజింపరాదు? అను సందే హము కలుగుట సహజము. ఇక్కడ గమనింపవలసినదేమనగా గణపతి- సర్వ విఘ్న నివారకుడు, విఘ్నపతి, యుద్ధవీరుడు, అయనను పూజించు ద్రవ్యములు ఆ గుణమును ప్రేరేపించునవిగా నుండవలెను. తులసి సాత్విక వస్తువు సత్వ గుణమును కలిగించు లక్షణము దానికి కలదు. తులసి దళములు ప్రసాదముగా స్వీకరించుచు, తులసీ మాలలు ధరించుచు తులసితో విష్ణు పూజసేయువాడు

మొదట ఎంతటి రాజసుడైనను సాత్వికముగా మారును. అటువంటి ద్రవ్యముతో గణపతి పూజ చేసిన కార్యసిద్ధి కలుగదు. వినాయకచవితినాడు పత్రితో పూజించునపుడు తులసి కూడ అందుండుట ఆరోజు వరకు మాత్రమే. దాని భావన వేరు.

అర్కపుష్పములు- తామస- విషద్రవ్యము. పరమేశ్వరిని వానితో నర్చింపరాదు, తీక్ష్ణ, విషద్రవ్యములతో మహాదేవతల నర్చించుట దోషము. ఏ క్షుద్రవామాచార పద్ధతులలోనో అటువంటి పూజలుండును. దక్షిణాచార మార్గమున కాదు.

శ్లో. శ్మశానస్థః స్వస్థో గళిత చికురో దిక్పటధరః
సహస్రం త్వర్కాణాం నిజగళిత వీర్యేన కుసుమం
జపంస్త్వాం ప్రత్యేకం మనుమపిధ్యాన నిరతో
మహాకాళి స్వైరం సభవతి ధరిత్రీ పరిబృఢః

కర్పూరాది స్తోత్రమున మహాకాళీ పూజా విధానమున శ్మశానమున దిగంబరుడై సిజవీర్య సిక్తములైన అర్కపుష్పములతో వేయిసార్లు కాళీమంత్ర పూర్వకముగా పూజించినవాడు మహారాజగునని కలదు. జిల్లేడుపూలు అందును తెల్లజిల్లేడుకు సంబంధించిన పుష్యార్కయోగాది విశేషములు తంత్ర గ్రంథములలో బహుళములుగా గలవు. దక్షిణాచారపరులు ఈ మార్గములు, ఈ పూజలు హర్షింపరు, అంగీకరింపరు.

ఇక కేతకి శివునకు నిషిద్ధమైన కథ పురాణమున ప్రసిద్ధమైనది కనుక దానినిట ఉదాహరింపవలసిన పనిలేదు. మరి భైరవుని విషయమున మల్లెపూల నిషేధమునను ఈ తత్వమే సుకుమారములు, ధవళములు ఐన మల్లెతోగాక ఆ దేవత లక్షణమునుబట్టి నీలలోహిత పుష్పములతో పూజింపవలసి యుండును.

కనుక పరమేశ్వరిని పూజించునపుడు మనకే కామ్యముకలదో దానికి తగిన ద్రవ్యముతో పూజలు హోమములు నిర్వర్తించవలసియున్నది. ఏకాదశ స్కంధమున గాయత్రీ సమర్చన గూర్చి చెప్పు సందర్భమున వాంఛాసిద్ధికై చేయవలసిన విధానములన్నియు స్పష్టముగా చెప్పబడినవి

శ్లో. అథశాంతిః పయోక్తాభిస్సమిద్భిర్జుహుయాద్ద్విజః
శమీసమిద్భిశ్శామ్యంతి భూతరోగ గ్రహాదయః

ఆర్ద్రాభిం క్షీరవృక్షస్య సమిద్భిర్జుహుయాద్ద్విజః
జుహుయాత్ శకలైర్వాపి భూతరోగాది శాంతయే

శమ్యాదులతో హోమముచేసి భూతరోగాదులను పోగొట్టుకొను పద్ధతులు దేవీభాగవతమున ఎన్నో చెప్పబడినవి నీళ్ళలో నిల్చుండి జపముచేసి బాధలు నివారించుకొనుటయు కలదు.

శ్లో. జానుదఘ్నే జలే జప్త్వా సర్వాన్ దోషాన్ శమంనయేత్
కంఠదఘ్నే జలే జప్త్వా ముచ్యేత్ ప్రాణాంతి కాద్భయాత్
సర్వేభ్యశ్శాంతి కర్మభ్యో నిమజ్జాప్సు జపః స్మృతః

గాయత్రీ దేవతలకు సంబంధించిన సర్వవిశేషములు దేవీభాగవతమున కలవు కవచాదులు, సహస్ర నామములు- సర్వవిధ పూజా, హోమప్రక్రియలు, ప్రతి అక్షరమునకు సంబంధించిన వర్ణ, దేవతా, ఋషి విశేషములు సమస్త వివరములు కలవు. ద్విజులకు బ్రహ్మోపదేశమున లభించు ప్రధాన విద్యయగుటచే దానిని గురించి అత్యంత విపులముగా చెప్పుట జరిగినది.

గాయత్రీ జపవేళ ఏమి జరుగును? దానికంత ప్రాధాన్య మేలవచ్చినది? 'నగాయత్ర్యాః పరంమంత్రం నమాతుః పరదైవతం' అనునంత గౌరవస్థానము లభించుటకు కారణమేమి? రాజైన విశ్వామిత్రుని బ్రహ్మర్షిని చేసినదీ విద్యయే. ఈ నరుడైననూ రజస్తమోలక్షణములు తొలగించి సత్వాభిముఖునిగా చేయు లక్షణము దీనికి కలదు. ఎవడు గాయత్రిని జపించు చుండునో వానిబుద్ధి నా దేవత నడపు చుండును. మంత్రసిద్ధియై దేవతా సాక్షాత్కారము కలిగి సర్వమును తెలియుస్థితి వచ్చిన దశవేరు. అంత వరకు సాధకుని పరిస్థితియేమి యన్నచో ఎవడు గాయత్రిని జపించునో వాని యం దా దేవతానుగ్రహము నిలిచియుండును. ఏ విధముగా ఆలోచించి పనులు చేసిన వానికి మేలు జరుగునో దేవి వాని కటువంటి ఆలోచనలే యిచ్చును. దానిచే సాధకుడు సర్వాపదలనుండి విముక్తుడై శుభము లందును.

గాయత్రి సౌరవిద్య సవిత యొక్క వరేణ్యమగు భర్గమును సాధకుడు ధ్యానించును. సామాన్యముగా స్మార్తులు మంత్రాధిష్ఠాన దేవతను ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయా ముఖములు గల స్త్రీ మూర్తిగా భావింతురు.

శ్లో. ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తామిందు నిబద్ధరత్నమ కుటాం తత్వార్థవర్ణాత్మికాం

గాయత్రీం వరదా భయాంకుశకశా శ్శుభ్రంకపాలం గదాం
శంఖం చక్రమధారవిందయుగళంహస్తైర్వహంతీం భజే
ఇది ధ్యాన మూర్తిని వర్ణించు శ్లోకము.

ఈ గాయత్రి మంత్రమునే వైష్ణవులు జపించు వేళ మంత్రాధిష్టానదేవతను సూర్యమండలాంతర్గతుడైన శ్రీమన్నారాయణునిగా ధ్యానింతురు.

శ్లో. ధ్యేయస్సదా సవితృ మండల మధ్యవర్తీ
నారాయణస్సరసిజాసనే సన్నివిష్టః
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుర్ధృత శంఖ చక్రః

ఏదైనను సూర్యమండలాంతర్గతశక్తి, సౌర ప్రభ కొందరిచే పురుషునిగా, కొందరిచే స్త్రీగా భావి చబడుచున్నది. ఇక గాయత్రీ మంత్రమును ధారా ప్రవాహముగా జపించు వేళ సాధకుని దేహము నుండి సప్తవర్ణోద్భాసిత మైన కాంతి పుంజము గోపురాకారముగా సూర్యమండలము వైపు ప్రయాణము చేయుట తాను చూచినానని లెడ్ బీటరను దివ్యజ్ఞాన సమాజీయుడు వ్రాసినాడు. సత్యమే, సూర్యకిరణములు సప్తవర్ణకిర్మీరితములుగదా! అందుకే సూర్యుడు సప్తాశ్వుడుగా మనవాఙ్మయమున చెప్పబడినాడు.

ఏ దేవత ఉపాసనయైనను ఇటులే ఉండును. ఆ దేవతా మంత్రమును జపించునపుడు సాధకునకు మంత్రదేవతకు-దేవతా నిలయమునకు ఒక అనుబంధ మేర్పడును. దేవతా మంత్రశబ్దములు సాధకుని యందు అదృశ్యవిద్యుత్తరంగ రూపమున ప్రవహించును ఇది సాధన రహస్యము.

దేవీపరమైన వాఙ్మయగ్రంథములలో వివిధ విభాగములలో అనేక దేవతామూర్తులు, వాని సాధనలు ఎన్ని చెప్పబడినను ఒక దేవతకు ప్రాధాన్య ముండును. ఆ పురాణమునకా దేవత ప్రధాన స్థానీయ. బ్రహ్మాండ పురాణమున లలిత రాజరాజేశ్వరి షోడశీ మంత్ర దేవత. బ్రహ్మ వైవర్తమున రాధ. మార్కండేయ పురాణమున నవాక్షరీ దేవత-చండి. దేవీ భాగవతమున భువనేశ్వరి. హ్రీంకారాధిష్టాన దేవత హ్రీంకార రూపిణి. ఆమెనిలయమున హ్రీంకార జపనిష్ట ములైన పక్షిబృందములు కలవు. హృల్లేఖా భావగాశీలనామజపపరాయణు లచ్చట గలరు. ఆ హ్రీంకార రూపిణినే త్రిమూర్తులారాధించి తరించిరి.

ఈ దేవీ భాగవతమును శుక సూతుల తర్వాత విన్నవాడు జనమేజయుడు. తండ్రి పరీక్షిత్తు హత్య సంగతి తెలిసిన పిదప సర్పయాగము చేసినాడు. కోపము కొంత తీరినదిగానీ తండ్రియొక్క గతిని గూర్చి చింతగలిగినది. క్షత్రియులకు రణమరణముత్తమము కాకున్న గృహమున సహజ మరణము పొంద వలెను. కాని పరీక్షిత్తు అంతరిక్ష మరణము పొందినాడు. అందును హత్య చేయ బడినాడు. అతనికి శాంతి లభించవలెనన్న ఏమి చేయవలయునని భగవానుడగు వ్యాసుని జనమేజయుడడిగినాడు. వ్యాసుడీ విధముగా సమాధానము చెప్పినాడు—

శ్లో. శృణు రాజన్ ప్రవక్ష్యామి పురాణం గుహ్యమద్భుతం
పుణ్యం భాగవతం నామే నానాఖ్యానయుతం శివం
అధ్యాపితం మయా పూర్వం శుకాయాత్మ సుతాయ వై
శ్రావయామి నృప త్వాం హి రహస్యం పరమం మమ.

తండ్రికి శాంతి కలుగుటకై దేవీ యజ్ఞము చేసి దేవీభాగవతము వినుమని పారాశర్యుడు పారీక్షితునకు ఉపదేశించినాడు.

శ్లో. దేవీ మఖం విధానేన కృత్వా పార్థివసత్తమ
శ్రీమద్భాగవతం నామ పురాణం పరమం శృణు
త్వామహం శ్రావయిష్యామి కథాం సరమ పావనీం
సంసార తారిణీం దివ్యాం నానా రస పమాహృతాం...

జనమేజయుడును అటులే దేవీ భాగవతము వినినాడు. అది నానారస సమాహృత మనుట సత్యము. అనేక కథాసందర్భములలో శృంగార వీర కరుణాద్భుతాది రసములు పరిపోషితములైనవి

దేవీ భాగవత రచనలో కథాగమనమున ఇతర పురాణములలో వలెనే అనుష్టుప్ ఛందమే వాడినను స్తోత్రములలోను. రసానుగుణమైన సందర్భముల లోను ఎన్నో ఛందస్సులు వాడుట కనిపించును. విష్ణుకృత భువనేశ్వరీ స్తుతి వసంతకోకిలా వృత్తములో మనోహరముగా నెటులో సాగినదో ఒక ఉదాహరణ చూడుడు —

శ్లో. నా హంభవో నవిరించి వివేదమాతః
కోన్యో హివేత్తి చరితం తవదుర్విభావ్యం
కానీహసంతి భువనాని మహాప్రభావే
హ్యస్మిన్ భవాని చరితే రచనా కలాపే

అటులే శివకృతస్తుతిలో మరొక ఛందో విలాసము గమనించుడు.

శ్లో. న తపసా న దమేన న సమాధినా
నచ తథా విహితైః క్రతుభిర్యథా
తవ పదాబ్జ పరాగనిషేవణాత్
భవతి ముక్తిరజే భవసాగరాత్

తపోదమ సమాధులను మించినది దేవీ చరణ సేవయని శివోక్తి. బ్రహ్మకృత స్తోత్రము పరికింపుడు. తానే సృష్టికర్తనని గర్వించిన తన అహంకారము పరాస్త మైనదని ఆయన చేయు సన్నుతి ఎంత వినయ మధురముగా నున్నదో చూడుడు-

కర్తాహం ప్రకరోమి సర్వమఖిలం బ్రహ్మాండ మత్యద్భుతం
కోన్యోஉస్తీహచరాచరే త్రిభువనే మత్తస్సమర్థః పుమాన్
ధన్యోஉస్మ్యత్ర న సంశయః కిలయదా బ్రహ్మాస్మి లోకాతి గో
మగ్నోஉహం భవసాగరే ప్రవితతే గర్వాభి వేశాదితి...
అతోஉహంచ జాతో విముక్తః కథం స్యాం
సరోజా దమేయాత్త్వదా విష్కృతా ద్వై
తవాజ్ఞాకరః కిం కరోஉస్మీతి నూనం
శివే పాహిమాం మోహమగ్నం భవాబ్ధే

దేవి మనోహరాకారము శృంగారసుందరముగా అనేక సందర్భములలో వర్ణింపబడినది త్రిమూర్తులు దర్శించిన ఆ రమణీయ మూర్తిని దర్శింపుడు—

శ్లో. అరుణా కరుణామూర్తి కుమారి నవయౌవనా
సర్వ శృంగార వేషాఢ్యా మందస్మితముఖాంబుజా
ఉద్యత్పీన కుచద్వంద్వ నిర్జితాంభోజ కుట్మలా
నానామణిగణా కీర్ణభూషణై రుపశోభితా
కనచ్చక్ర తాటంక నిటంక వదనాంబుజా...

ఈ శ్లోకమును చదువుచున్నప్పుడు సుప్రసిద్ధమగు లలితా ధ్యాన శ్లోకము స్ఫురించును.

శ్లో. సకుంకుమ విలేపనాం అళికచుంబ కస్తూరికాం
సమంద హసితేక్షణాం సశర చాప పాశాంకుశాం
అశేషజన మోహినీం అరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమ భాసురాం జపవిధౌస్మ రేదంబికాం

ఈవిధముగా దేవీభాగవత శ్లోకములు తాము రసవంతముగా అలరారుటయే గాక సౌందర్యలహర్యాది రచనలకు ప్రేరకమై, అనేక మంత్రదేవతా ధ్యాన్య శ్లోకములకు ఆదర్శమై ప్రకాశించుచున్నవి. పుణ్యఫల దృష్టితోను కవితా మాధుర్య దృష్టితోను, దేవీ తత్వజ్ఞానార్జన దృష్టితోను శ్రీదేవీ భాగవతము సర్వ జనులకు పఠనీయము. ద్వితీయ స్కంధమున గ్రంథ శ్రవణఫలిత మిటుల చెప్పబడినది.

శ్లో. యఇదంశృణుయా న్నిత్యం సర్వాన్ కామాన వాప్నుయాత్
భగవత్యా సమాఖ్యాతం విష్ణవే యదనుత్తమం
తేనశ్రుతేన తేరాజంశ్చిత్త శాంతిర్భవిష్యతి
పితౄణాం చాక్షయస్స్వర్గః పురాణ శ్రవణాద్భవేత్

# వ్యాసుని రచనలు - అష్టాదశ మహాపురాణములు

—డా॥ పుల్లెల రామచంద్రుడు

అపారమైన సంస్కృత వాఙ్మయంలో ఎన్నో అతి విస్తృతాలైన శాఖలు ఉన్నవి వాటిలో అతి ప్రాచీనమైనది, వేదాలతో సమాన ప్రతిపత్తి గలది - పురాణశాఖ.

**పురాణశబ్దార్థము :** 'పురాణ' మనగా 'ప్రాచీనమైనది' అని అర్థము. యాస్కుడు 'నిరుక్తం'లో పురానవమ్ - 'పురాణమ్' అనగా ప్రాచీన కాలములో క్రొత్తది (ఇప్పుడు మాత్రం పాతది) అని నిర్వచనం చెప్పి ఉన్నాడు. దీనికే 'అపి' చేర్చి ''పురాపినవమ్'' - ప్రాతదైనను నవ్యత్వము కలది - అన్ని కాలాలకీ ఉపయోగించేది- అని కొందరు అర్థం చెప్పినారు.

''పురా అనితి ఇతి పురాణమ్'' – ''ప్రాచీనమైనది, ఇంకనూ జీవించి ఉన్నది పురాణము'' అని వాయు పురాణము చెప్పుచున్నది.

యస్మాత్పురాహ్యన తీదం పురాణం తేన తత్ స్మృతమ్'' (1-203) ప్రాచీన పర పరను వర్ణించేది పురాణము అని పద్మపురాణంలో నిర్వచనం చెప్పబడింది.

"పురా పరంపరాం వష్టి పురాణం తేన తత్ స్మృతమ్'' (5-2-53)
బ్రహ్మాండ పురాణం ప్రకారం ''పూర్వం ఆవిర్భవించినది కనక పురాణం''

''యస్మాత్పురాహ్యభూచ్చైతత్పురాణం తేన తత్స్మృతమ్''(1-7-173)
ఈ విధంగా పురాణ శబ్దానికి ఏ వ్యుత్పత్తి చెప్పినా ''అతి ప్రాచీనము'' అనే అర్థం మాత్రం సర్వ సమ్మతమే. వేదాదులలో కూడా పురాణాల ప్రసక్తి ఉన్నది.

ఋక్కులు, సామములు, అధర్వమంత్రాలు, పురాణాలు, యజుర్వేదము, స్వర్గంలో నివసించే దేవతలూ కూడా ఉచ్ఛిష్టమునుండి..అనగా పరమాత్మనుండి- పుట్టినవని అధర్వవేదంలో చెప్పబడింది.

"ఋచః సామాని ఛన్దాంసి పురాణం యజుషా సహ
ఉచ్ఛిష్టాజ్జ జ్ఞిరే సర్వే దివి దేవా దివిశ్రితాం" (అధర్వ 11-7-4)

అధర్వ వేదంలో ఇంకా అనేక స్థలాలలో ఇతిహాసములు, నారాశంసులు, గాధలు వీటితోపాటు పురాణాలను గూర్చి కూడా నిర్దేశనం చేయబడి ఉన్నది శతపథ - గోపథ- తైత్తిరీయ బ్రాహ్మణాలలోను, ఆరణ్యకాలలోనూ, ఉపనిషత్తులలోను, గృహ్యా సూత్రాదులలోను కూడా అనేక స్థలాలలో పురాణం పేర్కొనబడినది. దీనినిబట్టి యజ్ఞాది కర్మ ప్రధానమైన వైదిక వాఙ్మయంతో పాటు అతి ప్రాచీన కాలంలో ఎన్నో ప్రాచీన విషయాలను వర్ణించే పురాణాలు, గాథలు (కథలు), నారాశంసులు (ఉత్తమ నరుల ప్రశంసలు) ఇతిహాసాలు ఇలాంటి లౌకిక విషయ ప్రధానమైన వాఙ్మయం కూడా బహుళ ప్రచారంలో ఉండేదనీ, ఈ వాఙ్మయ శాఖలన్నింటినీ అధ్యయనం చేసినవాడే పండితుడుగా పరిగణింపబడే వాడనీ తెలుస్తున్నది. ఇతిహాస పురాణాలు పంచమవేదంగా కూడా పరిగణింపబడేవి బ్రహ్మవిద్య సంపాదించడానికై సనత్కుమారుని దగ్గరకి వెళ్ళిన నారదుడు తాను అంతకుముందు నేర్చిన విద్యల గురించి చెపుతూ చతుర్వేదాలతో పాటు పంచమవేదమైన ఇతిహాసపురాణం కూడా నేర్చినట్లు చెప్పినట్లు ఛాందోగ్యోపనిషత్తులో వర్ణింపబడి ఉన్నది-

"ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేదమా
థర్వణ మితిహాస పురాణం పఞ్చమం వేదమ్" (ఛా.ఉ. 7-1)

అందుచేతనే ధర్మశాస్త్రకారులైన ఋషులు తత్తన్మతస్థాపకులైన శంకరాచార్యాద్యాచార్యులు కూడా పురాణాలకి అప్రతిహతమైన ప్రామాణ్యాన్ని అంగీకరిస్తూ వాటి అధ్యయనం ఉత్తమ పుణ్యహేతువని ప్రతిపాదించిచారు.

**పురాణాలు- ఇతిహాసాలు :** పురాణాలనగా వాయుపద్మపురాణాదులనీ ఇతిహాసాలనగా రామాయణ మహాభారతాలనీ ఈనాడు ప్రసిద్ధంగా చెప్పికోవడం ఉన్నది. అయితే వేదాలలో అక్కడక్కడ ఉండేకొన్ని భాగాలకే ఈ పేర్లు ఉండేవి అన్నట్లుగా శంకరాచార్య సాయణాచార్యాదు లిచ్చిన లక్షణాలనిబట్టి తెలుస్తోంది. "ఇతిహాస ఇత్యూర్వశీ పురూరవయోః సంవాదాదిః ఊర్వశీహాప్సరా "ఇత్యాది బ్రాహ్మణదేవం పురాణమ్-" అసద్వా ఇదమగ్రఆసీత్" ఇత్యాది (ఛాం. ఉ. శాం. భా. 7.1) "బ్రాహ్మణభాగాలలో ఉన్న ఊర్వశీ పురూరవః సంవాదాదులు ఇతిహాసాలు సృష్ట్యాదులను వర్ణించె భాగాలు పురాణాలు" అని

దీని అర్థము. శతపథబ్రాహ్మణ భాష్యంలో (11. 5. 68) సాయణాచార్యులు దీనికి భిన్నంగా ఊర్వశీ పురూరవః సంవాదాదులు పురాణాలనీ, సృష్టిక్రమాది వర్ణనలు ఇతిహాసాలనీ చెప్పిఉన్నారు. లక్షణాలలో భేదం ఉన్నా, పురాణేతిహాసాలు వేదాలలో ఓతప్రోతంగా ఉండేవి అనేవిషయం దీనినిబట్టి తెలుస్తోంది. కాలక్రమేణా ఇవి వేదాలనుండి విడివడి స్వతంత్ర వాఙ్మయంగా రూపొంది ఉండాలి. వెనుక ఉదహరించిన ఉపనిషద్వాక్యంలో నారదుడు పేర్కొన్న పంచమ వేదమైన పురాణేతిహాసం మాత్రం స్వతంత్ర వాఙ్మయమనే చెప్పవలసి ఉంటుంది. అందుచేతనే నాలుగు వేదాలకంటే వేరుగా దానిని నిర్దేశించడం జరిగింది.

ఏమైనా పురాణేతిహాసాల విభాగం అంతస్పష్టంగా లేదనే చెప్పాలి. మహాభారతం తనను తాను "జయోనామేతిహాసోఽయం శ్రోతవ్యోవిజిగీషుణా" (ఉప- 136-8) ఇత్యాదులలో 'ఇతిహాసం' అని చెప్పుకుంటూనే మరొకచోట "ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరిమర్షిణా" (ఆ. ప 1-17) ఇత్యాదులలో 'పురాణం' అని చెప్పుకుంటుంది. అదేవిధంగా వాయుపురాణానికి 'ఇతిహాసం' అనికూడా అ పురాణంలోనే నిర్దేశం ఉంది.

ఇమంయో బ్రాహ్మణో విద్వానితిహాసం పురాతనమ్
శృణుయాత్ శ్రావయేద్వాపి తథాధ్యాపయతేఽపిచ
ధన్యం యశస్య మాయుష్యం పుణ్యం వేదైశ్చ సంమితమ్
కృష్ణద్వైపాయనే నోక్తం పురాణం బ్రహ్మవాదినా"

(వా. పు- 10 3-48-51)

ఈ విధంగా అర్థశాస్త్రాది ప్రాచీన గ్రంథాలలోకూడా పురాణేతిహాసాలకు మధ్య అంతగా భేదం పాటించలేదు. అయితే ఇప్పుడుమాత్రం రామాయణ మహాభారతాలను ఇతిహాసాలనీ, వాయుపురాణాలనీ చెప్పడం ప్రచారంలో ఉన్నది. స్థూలంగా వీటి భేదాలను ఈ పురాణాదులను విధంగా చెప్పవచ్చును. పురాణాలలో సర్గము (సృష్టి), ప్రతిసర్గము (ప్రలయము), వంశము (ఋషులు, రాజులు మున్నగువారి వంశావళి), మన్వంతరము (విశిష్టమైన కాలప్రమాణవర్ణనము), వంశానుచరితము (ప్రసిద్ధులైన రాజఋష్యాదులచరిత్ర) వీటివర్ణనలు ఉంటాయి. ఇంకా ఎన్నో ధర్మశాస్త్ర విషయాలు, దాన, తీర్థ, వ్రత, అవతారాదుల వర్ణనలూ ఉంటాయి. ఇతిహాసంలో ప్రాచీన కథలు ఉంటాయి. వాటితోపాటు లోక వ్యవ

హారానికి ఉపయోగించే ఎన్నో విషయాలు బోధించి, ఇతిహాసమనే దీపం లోక మనే ఇంట్లోఉన్న మోహం అనే చీకటినికూడా తొలగిస్తుంది.

''ఇతిహాస ప్రదీపేన మోహావరణ ఘాతినా
లోకగర్భ గృహం కృత్స్నం యథావత్సం ప్రకాశితమ్''

ఈ స్థూలభేదాన్ని బట్టి ఈనాడు ప్రచారంలో ఉన్న వ్యవహారంయుక్తమే అని చెప్పవచ్చును.

**పురాణాల అవిర్భావం :** ప్రాచీన వాఙ్మయంలో మనకు ''పురాణము'' ''పురాణ సంహిత'' అని రెండు మాటలు వినిపిస్తాయి. పురాణ మనగా లోక వృత్తము. అది ఒక నిశ్చిత గ్రంథరూపంలో కాకుండా వివిధ కథాకథన రూపంలో లోకంలో ప్రచారంలో ఉన్న ఒక విద్యా విశేషము. గ్రంథరూపంలో క్రోడీకరించినది పురాణసంహిత. వీటిలో పురాణం అనేది వేదాలకంటే కూడ ప్రాచీనమైనదని కొన్ని పురాణాలు చెప్పుచున్నవి. బ్రహ్మనోటినుండి శతకోటి విస్తృతమైన పురాణం ముందు బయలుదేరినదట, పిమ్మట వేదాలు బయలు దేరినవట

''పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్
నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్[1]
అనన్తంచ వక్త్రేభ్యం వేదాస్త్యస్యనిర్గతాః''

పురాణానిర్భవాన్ని గూర్చి స్కంద, మత్స్య, పద్మ పురాణాదులలో మరొక సాంప్రదాయం కూడా ఉన్నది. పూర్వకల్పంలో చతుర్ముఖ ప్రోక్తమైన పురాణం శతకోటి ప్రవిస్తరంగా ఉండేదట. అల్పబుద్ధులైన అర్వాచీనుల సౌకర్యం కొరకే ఆ బ్రహ్మయే వ్యాసరూపంలో వచ్చి దానిని నాలుగు లక్షల గ్రంథాలలోకి కుదించి పదునెనిమిది పురాణాలుగా చేసినాడట.

1. ''శతకోటి ప్రవిస్తరమ్'' అనగా నూరుకోట్ల గ్రంథాల ప్రమాణం గలది అని అర్థము. ఈ రోజుల్లో ''500 పదాలతో ఒక వ్యాసం వ్రాయండి'' అన్నట్లు పూర్వం ఏ గ్రంథాన్నైనా - అది పద్యంలోఉన్నా, గద్యంలో ఉన్నా- గ్రంధ సంఖ్యతో లెక్కించేవారు. గ్రంథం అంటే ఇక్కడ 32 అక్షరాలు. ఈ గ్రంథం వెయ్యి గ్రంథాల గ్రంథం అంటే ఆ గ్రంథంలో ఉన్న మొత్తం అక్షరాలను 32 తో భాగిస్తే వెయ్యి గ్రంథాలు వస్తాయి అని అర్థము.

''పురాణమేకమేవా సీదస్మిన్ కల్పాన్తరే నృప
త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్
స్మృత్వా జగాదచ మునీన్ప్రతి దేవశ్చతుర్ముఖం
చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరేద్వాపరే సదా
తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే''

(స్కం. పు-1-23-30)

**రెండు ప్రాచీన వాఙ్మయ ప్రవాహాలు:** అతి ప్రాచీన కాలంనుంచీ రెండు వాఙ్మయ ప్రవాహాలు బ్రహ్మనుండి ఆవిర్భవించి పరస్పరోపకారకాలుగా ఉంటూ రెండు మార్గాలలో ప్రవహిస్తున్నాయి. మొదటిది వేద వాఙ్మయ ప్రవాహము; రెండవది పురాణ వాఙ్మయ ప్రవాహము. మొదటిది కర్మకాండ ప్రధానమైనది; రెండవది కర్తృత్వ ప్రధానమైనది. మొదటి దానిని బ్రహ్మనుండి ఋషులు పరిగ్రహించి ప్రచారము చేయగా రెండవదానిని మునులు స్వీకరించి ప్రచారము చేశారు. అందుచేత ఈ రెండుకూడా సమాన ప్రామాణ్యం గలవి. ఈ విషయం మార్కండేయ పురాణంలో చెప్పబడినది.

''ఉత్పన్న మాత్రస్య పురా బ్రహ్మణోఽ వ్యక్త జన్మనః
పురాణమేతద్వేదాశ్చ ముఖేభ్యోఽను వినిస్సృతాః
వేదాన్ సప్తర్షయస్తస్మాజ్జ గృహుస్తస్యమానసాం
పురాణంచ గృహుశ్చాద్యామునయస్తస్య మానసాః (మా. పు-45)

పైన వివరించిన విధంగా, అనూచారంగా వస్తున్న, అతి ప్రాచీనమైన పురాణాన్ని విభజించి, గ్రంథస్థంచేసి. కృష్ణద్వైపాయనుడు పురాణ సంహితను రచించినాడు. వేదాలను విభజించడం (వ్యసనమ్) చేతనే కాకుండా పురాణ వ్యసనం చేయడంచేత కూడా కృష్ణద్వైపాయనునికి వ్యాసత్వం సిద్ధించినది. వ్యాసుడు తాను రచించిన పురాణ సంహితను లోమహర్షణుడనే సూతునకు బోధించి దానిని ప్రచారం చేయవలసిందిగా ఆజ్ఞాపించినాడు. లోమహర్షణుడు వ్యాసుని పురాణ సంహిత ఆధారంగా పురాణ సంహిత నొకదానిని నిర్మించి ఆత్రేయుడైన సుమతి, కాశ్యపుడైన అకృతవ్రణుడు, భారద్వాజుడైన అగ్ని వర్చసుడు, వాశిష్ఠుడైన మిత్రాయువు, సావర్ణియైన సోమదత్తి, శాంశపాయనుడనే సుశర్మ అనే ఆరుగురు శిష్యులకు బోధించినాడు. వీరిలో కాశ్యప-సావర్ణి శాంశపాయనులు అనే ముగ్గురు శిష్యులు నరో మూడు సంహితలను నిర్మించారు.

రోమహర్షణుని సంహితతో కలిపి నాలుగు సంహితలైనవి ఈ సంహితలలో పాఠభేదములే తప్ప అర్థాలలో భేదాలు అంతగా లేవట. ఈ విషయం వాయు పురాణాదులలో చెప్పబడినది.

**వ్యాసుడు** : వ్యాసుణ్ణి గూర్చి మనకు తెలిసిన విషయాలను నాలుగైదు వాక్యాలలో చెప్పివేయవచ్చును.

"వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమ కల్మషమ్
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిం."

ఈ ప్రసిద్ధ శ్లోకంలో చెప్పినట్లుగా- బ్రహ్మ- ఆయన కుమారుడు శక్తి. ఆయన కుమారుడు పరాశరుడు. పరాశరుని కుమారుడు వ్యాసుడు. వ్యాసుని కుమారుడు శుకుడు. పరాశరునికి దాశరాజు కన్యయైన సత్యవతియందు వ్యాసుడు పుత్రుడుగా జన్మించిన కథ లోకప్రసిద్ధమైనదే. వ్యాసుడు విష్ణ్వవతారమని అనేక పురాణాదులలో చెప్పబడినది. బ్రహ్మయే వ్యాసుడిగా అవతరించినట్లు కొన్ని పురాణాలు సూచిస్తున్నాయి.

మనం ఇప్పుడు చూసిన పరాశరాత్మజుడైన వ్యాసుని అసలు పేరు కృష్ణద్వైపాయనుడు. శరీర వర్ణాన్నిబట్టి కృష్ణుడు, నదీ ప్రవాహ మధ్యంలో ద్వీపం మీద పుట్టడంచేత ద్వైపాయనుడు రెండూ కలిసి-కృష్ణద్వైపాయనుడు. "వ్యాసుడు ఆనేది ఒక పదవినిబట్టి వచ్చిన పేరు. వేదాలను, పురాణాలను విభజించినవాడని అర్థము. మనకు తెలిసిన భాషలో- 'సంపాదకుడు', 'ఎడిటర్'. ప్రతి ద్వాపర యుగంలోనూ ఒక్కొక్క వ్యాసుడు వస్తూ ఉంటాడనీ, ఇలాంటి వ్యాసులు 27 గురు ఉండేవారనీ విష్ణుపురాణ, దేవీ భాగవతాదులలో చెప్ప బడింది.

**27గురు వ్యాసులపేర్లు:** 1) బ్రహ్మ, 2) ప్రజాపతి, 3) శుక్రాచార్యుడు, 4, బృహస్పతి, 5) సూర్యుడు, 6) యముడు, 7) ఇంద్రుడు, 8) వసిష్ఠుడు, 9) సారస్వతుడు, 10) త్రిధామ, 11) త్రిశిఖుడు, 12) భరద్వాజుడు, 13) అంతరిక్షుడు, 14) వర్ణి, 15) త్రయ్యారుణుడు, 16) ధనుంజయుడు, 17) ఋతుంజయుడు, 18) జయుడు, 19) జాతకర్ణుడు, 20) గౌతముడు 21) హర్యాత్మ. 22) వాజశ్రవసుడు, 23) సోమశుష్మాయణ తృణ బిందువు 24) భార్గవ ఋక్షుడు, (వాల్మీకి) 25) శక్తి, 26) పరాశరుడు, 26) కృష్ణ ద్వైపాయనుడు.

విష్ణు పురాణంలో ఇచ్చిన ఈ పేర్లతో నాలుగైదు పేర్లు తప్ప ఇతర పురాణాలలో ఇచ్చిన పేర్లు సరిపోతున్నాయి.

**పురాణ సంహితకు సహాయపడినవి :-** వ్యాసుడు ఆఖ్యానాలతోటీ ఉపాఖ్యానాలతోటీ, గాథలతోటీ, కల్పశుద్ధులతోటి పురాణము సంహితను రచించినాడట :

''ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానై ర్గాథాభిః కల్పశుద్ధిభిః
పురాణ సంహితాం చక్రేపురాణార్థ విశారదః'' (విష్ణు- 3-6-15)

ఇక్కడ ఉన్న ''కల్పశుద్ధిభిః'' అన్న పదానికి బదులు బ్రహ్మాండ పురాణంలో ''కల్ప జోక్తిభిః'' అనీ వాయు పురాణంలో "కులకర్మభిః" అని పాఠాంతరా లున్నాయి.

**1-2: ఆఖ్యానోపాఖ్యానాలు :** ఆఖ్యానమనగా స్వయంగా చూసిన విషయాన్ని చెప్పడం అనీ, ఉపాఖ్యాన మనగా వినిన విషయాన్ని చెప్పడం అనీ శ్రీధరీ వ్యాఖ్యానంలో ఉద్ధరించిన ఒక శ్లోకంలో చెప్పబడింది.

''స్వయం దృష్టార్థ కథనం ప్రాహురాఖ్యానకం బుధాః
శ్రుతస్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే.''

ఈ విభజన రామోపాఖ్యానం, నలోపాఖ్యానం మొదలైన పేర్లకు అనుగుణంగా ఉన్నది. కానీ కొంతమంది విద్వాంసుల అభిప్రాయం ప్రకారం పెద్ద కథ ఆఖ్యానం, చిన్నకథ ఉపాఖ్యానం.

**3. గాథలు :** అజ్ఞాత కర్తృకాలైన ఎన్నో శ్లోకాలు వేదాలలోను, పురాణాలలోనూ ఉదాహరింపబడుతూ ఉంటాయి. వాటికి 'గాథలు' అని పేరు. ఇవి సాధారణంగా మహాపురుషుల స్తుతిపరంగాను, తత్కృత కార్యవర్ణన పరంగానూ ఉంటాయి. వ్యాసుడు పురాణరచనలో వాటి సహాయం కూడా తీసుకున్నాడనే విషయం అనేక స్థలాలలో పురాణాలలోనూ, మహాభారతంలోనూ కనబడే గాథలవల్ల స్పష్టం అవుతుంది.

**4. కల్పశుద్ధి :** దీనికి శ్రౌతార్థ కల్పమని శ్రీధరస్వామి అర్థం చెప్పినాడు. 'కల్పజోక్తి' అన్న పాఠం గ్రహించినట్లయితే ఆయా కల్పాలలో జరిగిన ప్రసిద్ధ విషయాల వర్ణనము అని అర్థము చెప్పుకొనవచ్చును.

**అష్టాదశ మహాపురాణాలు :** మహా పురాణాలు పదునెనిమిది. వాటి పేర్ల ప్రారంభంలో ఉన్న అక్షరాలను నిర్దేశిస్తూ దేవీ భాగవతంలో ఒక శ్లోకం చెప్ప బడింది.

''మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్''

మకారాది పురాణాలు రెండు - మత్స్య మార్కండేయ పురాణాలు. భకారాదులు రెండు - భాగవత భవిష్య పురాణాలు. 'బ్ర' మొదట ఉన్నవి మూడు - బ్రహ్మ -బ్రహ్మ వైవర్త-బ్రహ్మాండపురాణాలు. వాదులు నాలుగు - విష్ణు-వాయు-వామన-వరాహ పురాణాలు. అనాపలింగ కూస్కాలు, అగ్ని - నారద-పద్మ-లింగ-గరుడ - కూర్మ - స్కంద పురాణాలు. విష్ణు పురాణ భాగవతాలలోను, ఇతర పురాణాలలోను ఇవి బ్రహ్మ-పద్మ-విష్ణు-శివ-భాగవత-నారదీయ-మార్కండేయ -అగ్ని-భవిష్య-బ్రహ్మవైవర్త-లింగ-వరాహ-స్కంద-వామన-కూర్మ-మత్స్య -గరుడ-బ్రహ్మాండ పురాణాలు అనే క్రమంలో చెప్పబడినవి.

ఈ పద్దెనిమిది పురాణాలు వివిధరూపాలలో విభజింపబడినవి. ''పురాణం పంచలక్షణమ్'' అనే లక్షణాన్ని అనుసరించి, ఐదు లక్షణాలూ ఉన్నవి అతి ప్రాచీనములనీ, మిగిలినవి వాటికంటె అర్వాచీనములనీ చెప్పడం ఉన్నది. దీని ప్రకారం వాయు-బ్రహ్మాండ-మత్స్య-విష్ణు పురాణాలు అతిప్రాచీనములు. మిగిలినవి వాటికంటె అర్వాచీనములు. అదే విధంగా ఆయా పురాణాలలో ప్రధానంగా ప్రతిపాదింపబడిన దేవతలను బట్టి మరొక విభాగం చేయబడింది. బ్రహ్మ పురాణానుసారంగా, శివపారమ్యాన్ని అంగీకరించే మత్స్య-కూర్మ-లింగ-శివ-స్కంద -అగ్ని పురాణాలు తామసములు. బ్రహ్మాండ-బ్రహ్మవైవర్త-మార్కండేయ-భవిష్య-వామన-బ్రహ్మ పురాణాలు బ్రహ్మకు, అగ్నికి, పారమ్యాన్ని అంగీకరించడం వలన రాజసాలు. విష్ణు పారమ్యాన్ని చెప్పడం చేత విష్ణు-నారద-భాగవత-గరుడ-పద్మ-వరాహ పురాణాలు సాత్త్విక పురాణాలు, ఐతే కొన్ని ఇతర పురాణాలలో విభాగం మరొక విధంగా ఉంది. గరుడ పురాణం శివపారమ్యాన్ని చెప్పే వాయు పురాణాన్ని సాత్త్విక పురాణాలలో చేర్చింది. ఇలాంటి భేదాలు ఇతర పురాణాలలో కనబడే విభాగాలలో కూడా ఉన్నాయి. అందుచేత ఈ త్రివిధ విభాగం విషయంలో అన్ని పురాణాలకీ ఐకమత్యం లేదని స్పష్టం ఔతోంది.

మహాపురాణాలలో వాయు పురాణం చేరుతుందా, శివపురాణం చేరుతుందా అనే విషయంలో మతభేదం ఉన్నది. అలాగే మహాపురాణాలలోని భాగవతం దేవీ భాగవతమా, శ్రీమద్భాగవతమా అని పండితులలో విప్రతిపత్తి ఉన్నది. శ్రీమద్భాగవతం బోపదేవుడనే పండితుడు రచించినదని కొందరి అభిప్రాయము.

**పురాణలక్షణము :** పురాణంలో సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశ్యానుచరితము అనే ఐదు విషయాల వర్ణనం ఉండవలెనని చెప్పబడింది-

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశ్యానుచరితం చేతి పురాణం పఞ్చలక్షణమ్"

1) సర్గః=జగత్సృష్టి; 2) ప్రతిసర్గః=ప్రలయము, 3) వంశః=బ్రహ్మదేవుని నుండి పుట్టిన రాజుల వంశము; 4) మన్వంతరమ్ = పదునాలుగు మన్వంతరములు; 5) వంశ్యానుచరితమ్=ప్రధానమైన వంశముల మూలపురుషుల వర్ణనము.

పురాణాలకు పది లక్షణాలు ఉండవలెనని భాగవతాదులలో చెప్పబడినవి.
"సర్గశ్చాథ విసర్గశ్చ వృత్తీ రక్షాన్తరాణిచ
మనోవంశాను చరితమ్ సంస్థా హేతురపాశ్రయః

1) సర్గః=సృష్టి; 2) విసర్గః=జాతిసృష్టి; 3) వృత్తిః=జీవులకు జీవిక; 4) రక్షా=జగద్రక్షణము; 5) అన్తరాణి=మన్వంతరాలు; 6) వంశః= వంశానుచరితమ్ వెనుక చెప్పినవే; 8) సంస్థా=ప్రతిసర్గము; 9) సృష్టికి కర్మాదుల ద్వారా హేతువైన జీవుడు; 10) అపాశ్రయః=బ్రహ్మ. ఈ పది లక్షణాలను, వెనుక చెప్పిన ఐదు లక్షణాలలోను అంతర్గతము చేయవచ్చు. ఉదాహరణకు - విసర్గము, అపాశ్రయము అనగా సృష్టికర్త ఐన బ్రహ్మ అగుటచే అదీ, కర్మ వాసనల ద్వారా సృష్టి హేతువైన జీవుడు (హేతువు) ఈ మూడును, సర్గంలో అంతర్గతములౌతాయి. అందుచేతనే "పురాణమ్ పఞ్చ లక్షణమ్" అనేది ఎక్కువ ప్రచారంలో ఉంది.

వేదవాఙ్మయానికి సమాంతరంగా పురాణ వాఙ్మయం కూడా అతి ప్రాచీన కాలం నుండి వస్తున్నదనీ, ఆ పురాణ వాఙ్మయాన్నే ఆధారంగా చేసుకొని వ్యాసుడు ఒక నిర్దిష్ట పద్ధతిలో పురాణ సంహితను రచించి రోమహర్షణ సూతునకు ఉపదేశించినాడనీ, అతడు మరొక పురాణ సంహితను ఉపదేశించి

నాడనీ, అతడు మరొక పురాణ సంహితను రచించి ఆరుగురు శిష్యులకు ఉపదేశించగా వారిలో ముగ్గురు మూడు పురాణ సంహితలను రచించినారనీ, ఈ విధంగా ఆరు పురాణ సంహితలు ఏర్పడినాయనీ, ఇంతవరకూ మనం చూచిన దానినిబట్టి తెలుస్తోంది. తరువాత చర్చించబడిన అష్టాదశ పురాణాలను కూడా వ్యాసుడే సరస్వతీతీరంలో ఉన్న ఆశ్రమంలో కూర్చొని రచించాడని సాంప్రదాయకుల విశ్వాసం. ఈ రచయితను వ్యాసుడనడానికి ఏ అభ్యంతరమూ ఉండక పోవచ్చును. దేవీభాగవతాదులలో ఇరవై ఏడుగురు వ్యాసుల నామ నిర్దేశం ఉన్నట్లు చూచినాము కదా! ఆ ఇరవై ఏడుగురూ ద్వాపరయుగానికి చెందిన వారని అక్కడ చెప్పినారనేది వేరే విషయం.

భాషా విషయాదులనుబట్టి చూడగా ఈ పురాణాలన్నీ వేరువేరు కాలాలలో, వేరువేరు దేశాలలో వ్యాసులచే రచింపబడి ఉండాలని విమర్శకుల అభిప్రాయము. ఐతే, వీటికి వేదవ్యాసుడు రచించిన ప్రాచీన పురాణ సంహితలు ఆధారాలు కావచ్చును; మార్గదర్శకాలు కావచ్చును. పురాణేతిహాసాలలో కాలదేశ భేదాలను బట్టి భిన్న విషయాలు చేర్చబడుతూ ఉంటాయనే విషయాన్ని పురాణాలలోనే అంగీకరించినట్లు కనబడుతున్నది :

''ఇతిహాస పురాణాని భిద్యన్తే లోక గౌరవాత్''

(స్కాం. పు. కుమారికా ఖండము 40. 198)

లోక గౌరవాన్నిబట్టి పురాణేతిహాసాలు మారుతూ ఉంటాయని దీని అర్థము. అందుచేత ఆయా కాలాలలో ఆయా పురాణాలను రచించిన మునులు కూడా తమ పురాణాలు వేదవ్యాస ప్రోక్తాలే అని చెప్పడంలో భావం- తమ పురాణాలకు వేదవ్యాస ప్రోక్తాలే అని చెప్పడంలో భావం- తమ పురాణాలకు వేదవ్యాసుని పురాణం ఆధారం అని సూచించడం అనే అనుకోవాలి.

ఇపుడు ఈ అష్టాదశ పురాణాల గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం:

**1. బ్రహ్మ పురాణము :** దీనికి ఆది బ్రాహ్మమని కూడా పేరు. ఇందులో 245 అధ్యాయాలు, దాదాపు 14000 శ్లోకాలు ఉన్నాయి. దీనికి పురాణ లక్షణాలన్నీ ఉన్నాయి సృష్టిని గూర్చి చెప్పిన తరువాత సూర్యచంద్ర వంశాల వర్ణనం సంక్షిప్తంగా చేయబడినది. పార్వత్యాఖ్యానము, మార్కండేయాఖ్యానము, గౌతమీ మహాత్మ్య ఖండంలో అనేక తీర్థాల వర్ణన-ప్రధానమైనవి. 32 అధ్యాయాలలో శ్రీకృష్ణ చరిత చెప్పబడినది. శ్రీమద్భాగవతంలోని దశమ

స్కంధ కథకూ, దీనికీ చాలా పోలికలున్నాయి. మరణానంతరం కలిగే అవస్థల వర్ణనం కూడా అనేక అధ్యాయాలలో చేయబడింది. ఒరిస్సాలో ఉన్న కోణార్క దేవాలయ తీర్థ మహిమా, అక్కడనున్న సూర్యుని మహిమా, విస్తృతంగా వర్ణింపబడినది. దాదాపు పది అధ్యాయాలలో సాంఖ్య సిద్ధాంతం విస్తృతంగా ప్రతిపాదింపబడింది.

బ్రహ్మ పురాణానుసారంగా పృథ్వీలోని అన్ని ఖండాలలో శ్రేష్ఠమైనది భరత ఖండము, అందులో దండకారణ్యతీర్థం చాలా శ్రేష్ఠమైనది. ఈ దండకారణ్యంలో ప్రవహిస్తున్న గోదావరీనది-దానికే గౌతమీ అని కూడా పేరు సర్వనదీ శ్రేష్ఠ.

''పృథివ్యాం భారతవర్షం దండకం తత్ర పుణ్యదమ్
తస్మిన్ క్షేత్రేకృతం కర్మ భుక్తిముక్తి ప్రదంనృణామ్
తీర్థానామ్ గౌతమీ గంగా శ్రేష్ఠాముక్తి ప్రదానృణామ్
తత్ర యజ్ఞేన దానేన భోగాన్ ముక్తి మవాప్స్యతి (88-అధ్యాయం)

ఒరిస్సాలో ఉన్న కోణార్క (కోణార్క) క్షేత్రమునూ, జగన్నాథ క్షేత్రమునూ, దాని దగ్గరనున్న చిన్న చిన్న క్షేత్రాలనూ వర్ణించడంచేత ఈ పురాణంలో ఉన్న మొదటి భాగాలు ఆ ప్రాంతాలలో రచింపబడినవనీ, మిగిలిన భాగాలు గోదావరీ తీరంలో రచింపబడినాయనీ ఊహించవచ్చును. అంతఃపరిశీలన చేసి చూస్తే ఇందులోని 175 అధ్యాయాలు అతిప్రాచీనములనీ, 176 వ అధ్యాయం మొదలు 245 వ అధ్యాయం వరకూ ఉన్న భాగం కాలాంతరంలో చేర్చబడినదనీ విమర్శకుల ఊహ. క్రీ. శ. 14 వ శతాబ్దానికి పూర్వమే రచితమై ఉండాలి.

**2 పద్మ పురాణము :** ఈ పురాణంలో 50,000 శ్లోకాలున్నాయి ఇది ఆది-భూమి-బ్రహ్మ-పాతాల-సృష్టి-ఉత్తర ఖండాలనే ఆరు ఖండాలలో విభక్తమై ఉన్నది. ఐతే భూమి ఖండంలో ఉన్న

''ప్రథమం సృష్టి ఖండంహి భూమిఖండం ద్వితీయకమ్
తృతీయం స్వర్గఖండంచ పాతాలఞ్చ చతుర్థకమ్
పంచమంచోత్తరం ఖండం సర్వపాపప్రణాశనమ్''

అనే శ్లోకాన్నిబట్టి సృష్టిఖండం ఆ రేడ తరవాత చేర్చబడినట్లు తెలుస్తున్నది.

**అ) సృష్టి ఖండము :** ఇందులో సముద్ర మథనం, పృథుచక్రవర్తి ఉత్పత్తి, పుష్కరతీర్థవాసుల ధర్మాలు, వృత్రాసురయుద్ధము, వామనావతారము, మార్కండేయ వృత్తాంతము, కార్తికేయ జననము, రామచరితము, తారకాసుర వధ, మొదలైన కథలు విస్తృతంగా చెప్పబడినవి.

**ఆ) భూమి ఖండము :** ఈ ఖండం ప్రారంభంలో శివకర్మ అనే బ్రాహ్మణుడు పితృభక్తి ద్వారా స్వర్గం చేరిన కథ చెప్పబడింది. రహస్యవేషం ధరించిన ఒకడు జైన ధర్మాన్ని ఉపదేశించగా, వేనుడనే రాజు చెడ్డ మార్గాన్నవలంబించి విప్ర శాపం వలన మరణిస్తాడు అతని భుజం మథించగా పృథు చక్రవర్తి ఆవిర్భవిస్తాడు. అనేక విధాలైన నైమిత్తికాభ్యుదయ కర్మలను వర్ణించిన తరువాత సుకల అనే పతివ్రత కథ విస్తృతంగా వర్ణింపబడింది. యయాతి మాతలుల సంవాద రూపంలో పుణ్య పాపాలు, విష్ణుభక్తి మొదలైన విషయాలు ప్రతిపాదింపబడినవి. పద్మ పురాణం విష్ణుభక్తి ప్రధానమైన గ్రంథమే. ఐనా ఇతర దేవతల విషయంలో కూడా ఆదరాతిశయము బోధింపబడింది. శివకేశవులకు అభేదాన్ని, వారికి బ్రహ్మదేవునితో అనన్యాత్వాన్ని బోధిస్తూ ఈ విధంగా చెప్పబడింది.

"శైవంచ వైష్ణవం లోకమేక రూపం నరోత్తమ
ద్వయోశ్చాప్యన్తరం నాస్తి ఏక రూపం మహాత్మనోః
శివాయ విష్ణు రూపాయ విష్ణవే శివ రూపిణే
శివస్య హృదయే విష్ణుర్విష్ణోశ్చ హృదయే శివః
ఏకమూర్తి స్త్రయో దేవాః బ్రహ్మవిష్ణు మహేశ్వరాః
త్రయాణా మన్తరంనాస్తి గుణభేదాః ప్రకీర్తితాః

**ఇ) స్వర్గఖండం :** ఈ ఖండంలో దేవతాగంధర్వాప్సరోయక్షాదిలోకాలు సవిస్తరంగా వర్ణింపబడినాయి. దీనిలోని శకుంతలోపాఖ్యానము భారతంలోని ఉపాఖ్యానానికి భిన్నంగా ఉన్నది. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలంతో పూర్తిగా సమంగా ఉన్నది. పురాణం అనే పేరునుమాత్రం పట్టి ఇది కాళిదాసు కాలంకంటె ప్రాచీనమనీ, కాళిదాసు దీనిని అనుకరించాడనీ అనడం కంటె ఇదే కాళిదాసు దుష్యంతుని కథలో చేసిన మార్పులను యథాతథంగా గ్రహించినట్లు చెప్పడం యుక్తము. విక్రమోర్వశీకథ విషయంలోకూడా పద్మపురాణమే కాళిదాసుని అనుకరించి ఉండాలి.

**ఈ) పాతాల ఖండము:-** ఇందులో నాగలోకం వర్ణించే సందర్భంలో రావణుని ప్రసంగం రావడంచేత రామకథ అంతా చెప్పబడింది. ఈ రామకథ రఘు వంశంలో ఉన్న రామకథకూ, భవభూతి ఉత్తర రామచరితంలో ఉన్న రామకథకూ చాలా దగ్గరగా ఉన్నది. అందుచేత ఇది ఆ కవుల తరువాత కాలంలో వ్రాయబడినదనడంలో సందేహం లేదు. వ్యాసుడు 18 పురాణాలను రచించినట్లు, వాటిలో భాగవత పురాణం శ్రేష్ఠమైనదన్నట్లు చెప్పబడింది.

**ఉ) ఉత్తరఖండము:-** ఈ ఖండంలో అనేకమైన ఆఖ్యానాలు ఉన్నాయి. విష్ణుభక్తి యొక్క ప్రశంస, విష్ణుప్రీతికరాలైన వ్రతాదుల వర్ణనము ఉన్నాయి. వంగదేశంలో ఉన్న ఉత్తర ఖండంలో మరికొన్ని విషయాలు అధికంగా ఉన్నాయి. దక్షిణదేశంలోని ఒక రాజు శైవుల దుర్బోధలు విని వైష్ణవమతానికి హాని కలిగించినట్లు వర్ణింపబడినది భాగవతాన్ని గూర్చి ముచ్చటించడమే కాకుండా రామానుజ మత ప్రశంస కూడా ఉన్నది. ఈ రాజు 1133 ప్రాంతములో సింహాసనానికి వచ్చిన కులోత్తుంగచోళుడై ఉంటాడు. హరివంశం ద్వారా 1585 ప్రాంతంలో ప్రతిష్ఠితమైన రాధావల్లభ సాంప్రదాయం కూడా ఇందులో ఉదాహరింపబడినది. ఈ అన్ని కారణాలచేత పద్మపురాణం కాళిదాస భవభూతుల అనంతరం అనగా, ఎనిమిదవ శతాబ్ది తరువాత వ్రాయబడినదనీ, అందులోనూ వంగదేశ ప్రతిలో ఉన్న ఉత్తర ఖండ భాగం 16 వ శతాబ్దం తరువాత చేర్చ బడినదనీ చెప్పవచ్చును.

**3. విష్ణు పురాణము:-** విష్ణు పురాణం వైష్ణవ దర్శనానికి ఆలంబనం అని చెప్పవచ్చును. రామానుజాచార్యులు ఈ పురాణం నుంచి అనేక ప్రమాణా లను ఉదాహరించి ఉన్నారు. ఇందులో ఆరు అంశాలు (ఖండాలు) 126 అధ్యా యాలు ఉన్నాయి. మొదటి అంశంలో సృష్టి వర్ణనము, రెండవ అంశంలో విస్తృతమైన భూగోళ వర్ణనము, మూడవ అంశంలో ఆశ్రమ ధర్మ వర్ణనము, నాల్గవ అంశంలో చంద్రవంశ రాజుల వర్ణనము ఉన్నాయి. ఐదవ అంశంలో శ్రీకృష్ణుని చరిత్ర భాగవతంలోని దశమ స్కంధంలో ఉన్నట్లుగానే ఉన్నది. షష్ఠాంశంలో ప్రళయము భక్తిప్రమాణమూ వర్ణింపబడినవి.

దీనిలోని చతుర్థాంశంలో సుందరములైన గద్యలు కూడా ఉన్నాయి. మొత్తంమీద యీ పురాణంలో భక్తి జ్ఞానమార్గాల సమన్వయం కనబడుతుంది. విష్ణువుకు ప్రాధాన్యం చెప్పినా, ఇతర దేవతాద్వేషానికి అవకాశం లేదు విష్ణువు,

శివునితో మాట్లాడుతూ "నువ్వు నేనే-యీ జగత్తుకూడా నేనే. అవిద్యామోహితులైనవారు మన ఇద్దరి మధ్యా భేదం చూపుతూ ఉంటారు'' అని అద్వైతతత్వం ఉపదేశిస్తాడు:

''యోఽహం సత్వంజగచ్చేదం సదేవాసురమానుషమ్
మత్తోనాన్యదశేషం యత్ తత్త్వంజ్ఞాతు మహార్హసి
అవిద్యామోహితాత్మానః పురుషాభిన్న దర్శినః
వదన్తి భేదం పశ్యన్తి చావయోరన్తరం హర'' (5-33, 48-9)

ఇతర పురాణాలలోవలెనే ఇందులో కూడా లోక వ్యవహారాన్ని బోధించే సుభాషితాలు అనేకం వున్నాయి. హితంగాను, ప్రియంగాను, కాలానుగుణంగాను మాటలాడేవాడు పుణ్యలోకాలను పొందుతాడట.

''హితుంమితం ప్రియకారే వశ్యాత్మా యోభిభాషతే
సయాతిలోకానాహ్లాద హేతు భూతాన్ నృపాక్షతూన్".

నారదీయ పురాణంలో చెప్పిన ప్రకారం విష్ణు పురాణంలో 24,000 శ్లోకాలు వుండాలి. అయితే ఇపుడు లభ్యమయ్యే గ్రంథంలో 6,000 శ్లోకాలు మాత్రమే వున్నాయి. అనేకమైన అంతరంగ బహిరంగ ప్రమాణాలనుబట్టి ఈ పురాణం క్రీస్తుకుపూర్వం రెండవ శతాబ్దికి చెందివుంటుందని పండితులు అభిప్రాయపడుతున్నారు.

**4. వాయు పురాణము :** ఇదికూడా ప్రాచీనమైనది. ఇందులో 112 అధ్యాయాలు, దాదాపు 11,000 శ్లోకాలు ఉన్నాయి. ఇందులోని ఖండాలకు పాదాలని పేరు ప్రక్రియాపాదము అనుషంగ పాదము, ఉపోద్ఘాత పాదము, ఉపసంహార పాదము. ప్రారంభంలో సృష్టి ప్రక్రియ విస్తృతంగా వర్ణింపబడింది. తరువాత నాలుగు ఆశ్రమాలు, వాటి ధర్మాలు చెప్పబడినవి. ఇందులోని భూగోళ వర్ణనము చాలా విస్తృతమైనది. 50-53 అధ్యాయాలలో ఖగోళ వర్ణనము కూడా సవిస్తరంగా చేయబడినది యుగాలు యజ్ఞాలు, తీర్థాలు, ఋషులు, ఋషివంశాలు, ప్రాచీనరాజ వంశాలు సవివరంగా వర్ణింపబడినవి 86-87 అధ్యాయాలలో సంగీత శాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు చెప్పబడినవి ఈ పురాణంలో శివతత్వాన్ని అతి విస్తరంగా వర్ణించినా విష్ణ్వవతారాలు కూడా వర్ణింపబడినవి. పశుపతి పూజకు సంబంధించిన పాశుపత యోగము 11-15 అధ్యాయాలలో వర్ణింపబడినది ఇది ఇతర పురాణాలు వేటిలోనూ లేని అపూర్వవిషయము దీనిని

బట్టి ప్రాచీన యోగశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు తెలుస్తున్నాయి. పురాణాలకున్న పంచలక్షణాలు దీనితో నిర్వహింపబడినవి అయితే, చివరి తొమ్మిది అధ్యాయాలు (104-112) వైష్ణవమత పుష్టికొరకై తరవాత చేర్చ బడినవి.

వాయుపురాణంలో మొదటి గుప్తరాజుల రాజ్య సరిహద్దులు చెప్పబడి ఉన్నాయి.

''అనుగంగం ప్రయాగంచ సాకేతం మాగధాం స్తథా
ఏతాన్ జనపదాన్ సర్వాన్ భోక్ష్యన్తే గుప్త వంశజాః''

అయితే కుమారగుప్త దిగ్విజయ యాత్రాదులు పేర్కొనలేదు. భారతీయ వాఙ్మయంలో ప్రప్రథమంగా మేషాదిరాసులను పేర్కొన్నది యాజ్ఞవల్క్యస్మృతి క్రీ. శ. 2 వ శతాబ్దంలో. ఇవి పద్మపురాణంలో కూడా పేర్కొనబడినవి. వాయుపురాణంలోకూడా మేష, తుల, మకర, సింహాలు పేర్కొనబడి ఉన్నాయి. ఇలాంటి అంతరంగిక ప్రమాణాలచేత ఈ పురాణం క్రీ॥ శ॥ 400 ప్రాంతానికి చెందినదని చెప్పవచ్చును.

**5. శ్రీమద్భాగవతము :** పురాణాలలో అతి ప్రసిద్ధమైనది శ్రీమద్భాగ వతము. ఇది భక్తి సర్వస్వము వల్లభ సంప్రదాయ, చైతన్య సంప్రదాయాలకు ఇది ఉపజీవ్య గ్రంథము. ఇది వారికి ప్రామాణిక గ్రంథం అవడంచేత వివిధ వైష్ణవ సాంప్రదాయాలకు చెందిన వారు తమతమ సంప్రదాయాలకు అనుగుణంగా దీనికి వ్యాఖ్యలు వ్రాసినారు. ఐతే అద్వైత తత్త్వానికి మాత్రమే సరిగా సమన్వయం అయ్యే ఘట్టాలు అనేకం ఉన్నాయి భక్తికీ అద్వైతానికి విరోధం లేక పోవడం సర్వవిదితమే కదా! అద్వైత తత్త్వ ప్రతీకాలైన ఎన్నో శ్లోకాలను చూపవచ్చును;

''అహమే వాసమేవాగ్రే, నాన్యద్యత్సదసత్పరమ్
పశ్చాదహం యదేతచ్చ యోన, శిష్యేత సోఽస్మ్యహమ్
—భాగ. 2-9-32

''సృష్టికి పూర్వం నేనే ఉన్నాను. అపుడు స్థూల ప్రపంచంగాని, తత్కారణం గానీ లేదు. తర్వాత ఆవిర్భవించిన ప్రపంచమూ నేనే. ప్రళయానంతరం మిగిలేదీ నేనే.''

అద్వితీయజ్ఞానరూపమైన పరబ్రహ్మనే అనేక పేర్లతో పిలుస్తూ ఉంటారు.

"వదన్తి తత్తత్వ విదస్తత్త్వం యద్ జ్ఞానమద్వయమ్
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్దతే" (భాగ-12-11)
"జ్ఞానం విశుద్ధం పరమార్థమేక మనన్తరం త్వబహిర్బ్రహ్మసత్యమ్
ప్రత్యక్ ప్రశాన్తం భగవచ్ఛబ్ద సంజ్ఞం యద్వాసుదేవం కవయోవదన్తి
-భాగ-5-12-11

అట్టి పరబ్రహ్మతత్వాన్ని కనుగొనడానికి ఉత్తమ సాధనంగా భక్తిని ఉపదేశించడం భాగవతం యొక్క వైశిష్ట్యము.

"నసాధయతి మాంయోగో నసాంఖ్యం ధర్మఉద్ధవ
నస్వాధ్యాయ స్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జితా." 11-14-20
"ప్రీణనాయ ముకున్దస్య నవృత్తం న బహుజ్ఞతా
న దానం న తపోనేజ్యా న శౌచం న వ్రతానిచ
ప్రీయతేఽమలయా భక్త్యా హరరమ్యత్ విడమ్బనమ్" 7-51-2

18,000 శ్లోకాలలో ఉపనిబద్ధమైన ఈ శ్రీమద్భాగవతం ఏడు స్కంధాలుగా విభజింపబడినది. పురాణాలకు ఉండవలసిన పంచలక్షణాలే కాకుండా భాగవతంలోనే చెప్పిన దశలక్షణాలు కూడా దీనికి సమన్వయిస్తాయి.

ఒరిస్సా దేశానికి చెందిన, 13వ శతాబ్దానికి చెందినవాడైన బోపదేవుడనే పండితుడు శ్రీమద్భాగవతాన్ని రచించినట్లు లోకంలో ప్రసిద్ధి ఉన్నది. కానీ క్రీ.శ. 1200 ప్రాంతానికి చెందిన మధ్వాచార్యులు "భాగవత తాత్పర్య నిర్ణయము" రచించి యున్నారు. 11వ శతాబ్దానికి చెందిన రామానుజాచార్యులు "వేదాంత తత్వ సారం" అనే గ్రంథంలోని శ్లోకాలను ఉదహరించియున్నారు. ఇంకా ఇలాంటి బాహ్య ప్రమాణాలనుబట్టి భాగవతం 13వ శతాబ్దికి చెందిన బోపదేవుని రచన కాజాలదని ఇది 6వ శతాబ్దికి ఈవల జరిగినదికాదని పండితుల అభిప్రాయము.

భాగవతంలో దక్షిణదేశ క్షేత్రాలు, నదులు ఎక్కువగా వర్ణింపబడి ఉన్నాయి ద్రవిడ దేశంలో విష్ణుభక్తి అధికంగా ఉండగలదని చెప్పడంలో అక్కడ ఉన్న ఆళ్వారుల సూచన ఉండి ఉంటుందని పండితుల ఊహ. ఇంకా ఇలాంటి అంతరంగిక ప్రమాణాలను బట్టి శ్రీమద్భాగవతం దక్షిణ దేశంలో, అందులోనూ ద్రవిడ దేశంలో రచింపబడిందని విమర్శకుల అభిప్రాయము.

**6. నారద పురాణం :** ఈ పురాణంలో రెండు భాగాలు ఉన్నాయి. పూర్వభాగంలో 125 అధ్యాయాలు, ఉత్తరభాగంలో 82 అధ్యాయాలు ఉన్నాయి. మొత్తం శ్లోకాల సంఖ్య 25,000 ఇది విష్ణు పారమ్యాన్ని బోధించే పురాణం. వైష్ణవాగమాలను పేర్కొనడమే కాకుండా, పాంచరాత్ర విధాన వర్ణనం కూడా ఈ పురాణంలో కనబడుతుంది. ఇందులో బౌద్ధుల నింద అత్యధికంగా చేయ బడింది. ఏకాదశ వ్రతమహాత్మ్య వర్ణనం అతి విస్తృతంగా ఉన్నది. పరమ వైష్ణవుడైన రుక్మాంగదుని ఉపాఖ్యానం ఈ పురాణంలో ఉన్నది. అతడు తన రాజ్యంలో ఉన్న 8 నుంచి 80 సం॥ల వయస్సు కలవారు ఏకాదశీ వ్రతం చేయని పక్షంలో వారు వధ్యులు-దండ్యులు ఔతారని ఆజ్ఞ ఇచ్చినాడట.

''అష్టవర్షాధికో మర్త్యోహ్య-పూర్ణాశీతి వత్సరః
యోభుంక్తే మామకే రాజ్యే విష్ణోరహని పాపకృత్
సమే వధ్యశ్చ దండశ్చ నిర్వాస్యో విషయాద్బహిః''

అగ్ని పురాణ గరుడపురాణాలలోవలెనే ఈ పురాణంలో కూడా వ్యాకరణ-నిరుక్త-జ్యోతిష్య-ఛందః శాస్త్రాదులకు సంబంధించిన విషయాలు చెప్పబడినవి. విష్ణు-రామ-హనుమత్-కృష్ణ-కాళీ-మహేశాదుల మంత్రాలు సవివరంగా వర్ణింపబడి ఉన్నవి. దర్శనాలకి సంబంధించిన విషయాలను మహాభారతం నుంచి గ్రహించినది. ఇది క్రీ.శ. 700-900 సంవత్సరాల మధ్య రచింపబడి ఉంటుందని పండితుల ఊహ.

**7. మార్కండేయ పురాణము :** ఈ పురాణంలో 137 అధ్యాయాలు 9,000 శ్లోకాలు ఉన్నాయి. మదాలస అనే రాజమహిషి చరిత్ర అందులో చెప్పబడింది. ఆమె బ్రహ్మవాదిని. ఆమె తన తనయుడైన అలర్కునికి చిన్నతనం నుంచి బ్రహ్మవిద్య ఉపదేశించినది. అతడు పెద్దవాడై రాజ్యం పాలించే సమయంలో కర్మజ్ఞానాల మధ్య చక్కని సమన్వయం ఆచరించి చూపాడు. ప్రసిద్ధమైన దుర్గాసప్తశతి ఈ పురాణంలోనే ఉన్నది. మహాకాళీ-మహాలక్ష్మి-మహాసరస్వతీ రూపురాలైన దేవి యొక్క మాహాత్మ్యాన్ని ప్రతిపాదిస్తూ 13 అధ్యాయాలున్నవి. మన్వంతర వర్ణనము కూడా విస్తృతంగా చేయబడింది. కొన్ని వైదిక కర్మల ద్వారా అభీష్టఫలాలను ఏవిధంగా పొందవచ్చునో కొన్ని ఉపాఖ్యానాల ద్వారా విశదీకరింపబడినవి. దీని నుండి అనేక విషయాలు దేవీ భాగవతంలో స్వీకరింపబడినవి దీని రచనా కాలం క్రీ. శ. 400-500 అని పండితుల అభిప్రాయము

**8. అగ్ని పురాణము** : ఈ పురాణం ప్రాచీన భారతీయ విద్యా సర్వస్వం అని చెప్పవచ్చును. 383 అధ్యాయాలుగల ఈ పురాణంలో అనేక విషయాలు చెప్పబడినవి. అవతారాలను గూర్చి సంక్షిప్తంగా చెప్పిన తరువాత రామాయణ, భారత కథలు విపులంగా చెప్పబడినవి. దేవాలయ నిర్మాణము, మూర్తి ప్రతిష్ట, పూజావిధానము-విశదీకరింపబడినవి. జ్యోతిశ్శాస్త్ర-ధర్మశాస్త్ర-వ్రత-రాజనీతి-ఆయుర్వేద-ఛందశ్శాస్త్ర-వ్యాకరణశాస్త్ర-అలంకారశాస్త్రాదులకు సంబంధించిన విషయాలు అతి విపులంగా చర్చింపబడినవి. యోగశాస్త్రానికి సంబంధించిన అష్టాంగముల నిరూపణం చేయడిబనది. చివర అద్వైత సిద్ధాంతం ప్రతిపాదింపబడినది. దీనిని బట్టి —

"ఆగ్నేయేతు పురాణేఽస్మిన్ సర్వాః విద్యాః ప్రదర్శితాః
అనే వాక్యంలోని యదార్థం స్పష్టం ఔతుంది. అగ్ని 382-52

వహ్ని పురాణం అనేది ఒకటున్నది. అది అగ్నిపురాణానికి మూలమైనది. అది క్రీ. శ. నాల్గవ శతాబ్దికి పూర్వం రచింపబడినది. అందులోని విషయాలు గ్రహించి, అనేక శాస్త్రీయ విషయాలుగూడా సంగ్రహించి ఈ అగ్నిపురాణం వ్రాయబడింది. ప్రధానమైన విద్యలను అందరికీ అందజేయడం పురాణాల ధ్యేయం. ఆ విషయంలో అగ్నిపురాణం చరితార్థమైనది అనడంలో సందేహంలేదు. 11వ శతాబ్దానికి చెందిన భోజమహారాజు రచించిన సరస్వతీకంఠాభరణం చాలా వరకు అగ్నిపురాణాన్ని ఆధారంగా చేసుకుని వ్రాయబడింది. ఈ పురాణంలోని అలంకార శాస్త్ర విభాగానికి మూలం దండి రచించిన కావ్యాదర్శము. అందు చేత 7-11 శతాబ్దుల మధ్య రచింపబడి ఉంటుంది.

అగ్నిపురాణం అనేకమైన తాంత్రికానుష్టానాలను ప్రతిపాదించి ఉన్నది. వాటిలోని కొన్ని విశిష్టానుష్టానాలు బెంగాలులో ప్రచారంలో ఉన్నవి. అందుచేత ఇది ఆ దేశంలో రచితమై ఉండాలి.

**9. భవిష్యపురాణము** : ఈ పురాణాన్ని నారద-అగ్ని-మత్స్య-వాయు పురాణాలు ఉటంకించినవి. అందుచేత ఇది ప్రాచీన పురాణమే అని చెప్పడానికి వీలున్నది. కాని దీని పేరును సార్థకం చేసేందుకు అనేక కాలాలలో అనేక పండితులు రాబోయే చరిత్ర అంటూ అనేక అర్వాచీన విషయాలు చేర్చడం జరిగింది. "ఇంగ్రేజ" అనే పేరులో ఇంగ్లీషువారు భారతదేశానికి రావడం కూడా పేర్కొనడింది జ్వాలాప్రసాదమిశ్ర అనే పండితులు తమ వద్ద నాలుగు భవిష్యపురాణ

లిఖితప్రతులు ఉన్నట్లూ ఒక దానికి మరొకదానికి అంతగా సంబంధంలేనట్లూ చెప్పినారట. అవన్నీకలిపివేయగా ఏర్పడిన పురాణం ఈనాడు ప్రచారంలో ఉన్నది.

నారదపురాణానుసారం భవిష్యపురాణంలో బ్రాహ్మపర్వ-విష్ణుపర్వ-శివపర్వ-సూర్యపర్వ అనే నాలుగు పర్వాలు, 14,000 శ్లోకాలు ఉన్నాయి. సూర్యపూజ అతివిస్తృతంగా వర్ణింపబడినది. శ్రీకృష్ణుని కుమారుడైన సాంబునకు కుష్ఠురోగం కలుగగా తన్నివారణకోసం గరుత్మంతుడు శాకద్వీపం నుంచి బ్రాహ్మణులను తీసికొనివచ్చినాడు. వారు సూర్యోపాసనా విధానం చేత దానిని నిరాకరించినారు. కలియుగంలో ఆవిర్భవించిన అనేక రాజవంశాల వర్ణన కూడా ఈ పురాణంలో అతి విస్తృతంగా ఉన్నది.

**10. బ్రహ్మవైవర్త పురాణము** : ఈనాడు మనకు లభించే బ్రహ్మవైవర్త పురాణం- బ్రహ్మఖండము, ప్రకృతిఖండము, గణేశఖండము, కృష్ణజన్మ ఖండము అనే నాలుగు ఖండాలలో విభక్తమై యున్నది. దాదాపు 25,000 శ్లోకాలు ఉన్నవి నాల్గవదైన కృష్ణ జన్మఖండం మొత్తం పురాణంలో సగం కంటె ఎక్కువగా ఉన్నది రాధాకృష్ణుల చరిత్రానికి ప్రాధాన్యం ఇవ్వడమే ఈ పురాణం యొక్క ప్రధాన లక్ష్యం.

**బ్రహ్మఖండము:** ముప్పై అధ్యాయాల ఈ బ్రహ్మఖండంలో కృష్ణుడు చేసిన జగత్సృష్టి వర్ణింపబడినది 16 వ అధ్యాయంలో ఆయుర్వేదానికి సంబంధించిన విషయాలు ఉన్నాయి ప్రకృతి ఖండంలో ప్రకృతి వర్ణించబడినది. కృష్ణుని ఆదేశం ప్రకారం ప్రకృతి ఆయా సమయాలలో దుర్గా- లక్ష్మి- సరస్వతీ- సావిత్రీ- రాధా రూపాలలో ఆవిర్భవిస్తూ ఉంటుందిట. గణేశ ఖండంలో గణేశుని ఉత్పత్తి, ఆయన చరిత్ర వర్ణింపబడినవి గణేశుడు శ్రీకృష్ణుని అవతారమని ప్రతిపాదింపబడినది.

కృష్ణుడు బ్రహ్మను విభరించడంచేత దీనికి బ్రహ్మవైవర్తమనే పేరు వచ్చినదట.

''వివృతం బ్రహ్మ కార్త్స్న్యేన కృష్ణేన యత్ర శౌనక
బ్రహ్మవైవర్తకం తేన ప్రవదన్తి పురావిదః -బ్ర వై- 1-1-10

దీనికి బ్రహ్మ కైవర్తనమని నామాంతరమున్నది. అది ఎందుచేత వచ్చినదో తెలియదు. కృష్ణ పారమ్యాన్ని వర్ణించే పురాణం అవడంచేత కృష్ణభక్తులైన

వైష్ణవులు, ముఖ్యంగా గౌడ దేశీయులైన వైష్ణవులు, దీనికి చాలా ప్రాధాన్యం ఇస్తారు.

బ్రహ్మవైవర్తన పురాణం బ్రహ్మపారమ్యాన్ని బోధించే పురాణమనీ, అందుచేత రాజసమనీ, అనేక పురాణాలలో చెప్పబడి ఉన్నది. మనకు ఇపుడు లభించే పురాణాలలో శ్రీకృష్ణునకు ప్రాధాన్యం చెప్పబడినది. అచ్చటచ్చట బ్రహ్మ నింద కూడా కనబడుచున్నది. కృష్ణుడే పరాత్పరబ్రహ్మ అనీ, అతని నివాసం గోలోకంలో అనీ, అతని భార్య రాధ అనీ ప్రతిపాదించే ఈనాటి బ్రహ్మ వైవర్తం, ప్రాచీన బ్రహ్మవైవర్తాన్ని వైష్ణవులు మార్చివేయగా ఏర్పడినది. తంత్ర శాస్త్రానికి సంబంధించిన విషయాలు పురాణాలలో తొమ్మిది పది శతా బ్దుల ప్రాంతంలో ప్రవేశించినవి. ఈ పురాణంలోని ప్రకృతిఖండ, గణేశ ఖండా లలో తంత్రశాస్త్ర ప్రభావం అత్యధికంగా కనబడుతున్నది. అందుచేత ఈనాడు లభించే బ్రహ్మవైవర్తం నవమశతాబ్ది కంటె ప్రాచీనం కాదనీ, రాధాకృష్ణ సంప్ర దాయం వర్ణింపబడి ఉండడంచేత 15 వ శతాబ్దం ప్రాంతానికి చెంది ఉండ వచ్చుననీ పండితుల అభిప్రాయము.

ఈ పురాణంలో ముస్లింల నిర్దేశం ఉన్నది. సంకర జాతులను వర్ణించే సందర్భంలో సాలెజాతి స్త్రీ యందు మ్లేచ్ఛునివలన 'జోలా' జాతి పుట్టినదని చెప్పబడింది. "మ్లేచ్ఛాత్కువిందర కన్యాయాం జోలాజాతిర్బభూవహ" (10-121) హిందీలోని 'జులాహా' బెంగాలు భాషలో 'జోలా' అశ్వినీకుమారుల వీర్యంవలన బ్రాహ్మణకన్యయందు 'వైద్యుడు' పుట్టినాడట (10-123) ఈ ప్రసిద్ధి బెంగాలులో ఉన్నది. అందుచేతనే 'వైద్యులను' బ్రాహ్మణులలో కొంచెం తక్కువచూపు చూస్తారట. బెంగాలు దేశంలో ప్రచారంలో ఉన్న వివిధ దేవతా పూజా విదానాలు వర్ణింపబడినవి రాధావల్లభ సంప్రదాయానికి ఆ దేశం ఆటపట్టు. ఈ కారణాలు అన్నింటిచేతా ప్రస్తుతం లభ్యమవుతున్న బ్రహ్మవైవర్తం బెంగా లులో రచింపబడినదనీ, ఇది ప్రాచీన బ్రహ్మవైవర్తం కంటె భిన్నమనీ విమర్శ కుల ఊహ.

**11 లింగపురాణము** : ఈ పురాణంలో 163 అధ్యాయాలు, 11,000 శ్లోకాలు ఉన్నవి. సృష్టి శివునిద్వారా చెప్పబడినది. శివుని లింగరూపంలో పూజిం చడం వర్ణింపబడినది. శివుడు 28 అవతారాలు ఎత్తినట్లుగా చెప్పబడినది. శైవ మతానికి సంబంధించిన వ్రతాలు, తీర్థాలు విస్తృతంగా వర్ణింపబడినవి. శైవదర్శ

నానికి ముఖ్యంగా పాశుపతసిద్ధాంతానికి సంబంధించిన అనేక విషయాలు ప్రతిపాదింపబడినవి. అష్టమూర్తియైన శివుని ఎనిమిది మూర్తులకూ ఎనిమిది వైదికనామధేయాలు చెప్పబడినవి. 1) పృథ్వీమూర్తి=శర్వుడు; జలమూర్తి=భవుడు: 3) అగ్నిమూర్తి=పశుపతి; 4) వాయుమూర్తి=ఈశానుడు 5) ఆకాశమూర్తి =భీముడు; 6) సూర్యమూర్తి=రుద్రుడు; 7) సోమమూర్తి=మహాదేవుడు; 8) యజమానమూర్తి=ఉగ్రుడు; ప్రత్యేకమూర్తికి ఒక భార్యా; ఒకపుత్రుడూ చెప్పబడిఉన్నారు. అనేకమైన బాహ్య, అంతరంగిక ప్రమాణాలనుబట్టి లింగపురాణం అష్టమ, నవమ, శతాబ్దులకు సంబంధించి ఉంటుందని' విమర్శకుల అభిప్రాయము 'దానసాగరం' అనే గ్రంథాన్నిబట్టి ఆరువేల శ్లోకాల మరొక లింగపురాణంకూడా ఉండేదన్నట్లు తెలుస్తోంది.

**12. వరాహపురాణం :** విష్ణువుయొక్క వరాహావతారకథ ప్రధానంగా వర్ణింపబడదంచేత దీనికి ఈ పేరు వచ్చింది. దీనికి దక్షిణాత్య పాఠము, గౌడదేశ పాఠము అని రెండు విభిన్న పాఠాలు ఉన్నవి ఇపుడు గౌడదేశ పాఠమే ప్రచారంలో ఉన్నది. ఇతర పురాణాలలో చెప్పినదానినిబట్టి వరాహపురాణంలో 25,000 శ్లోకాలు ఉండాలి. కానీ ఇపుడు లభ్యమయ్యే పురాణంలో దాదాపు 11.000శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. ఇందులో విష్ణువుకు సంబంధించిన అనేక వ్రతాలు చెప్పబడినవి ద్వాదశీవ్రత మహాత్యం విస్తృతంగా వర్ణింపబడినది. పదకొండు మాసాలలో ఉన్న పదకొండు శుక్లద్వాదశులకు పదకొండు విష్ణురూపాలతో సంబంధం ఉన్నట్లుగా చెప్పబడింది. (1) మార్గశిర, శుక్లద్వాదశి- మత్స్యద్వాదశి: (2) పుష్యమాసము- కూర్మద్వాదశి (3) మాఘమాసము- వరహద్వాదశి: (4)ఫాల్గుణమాసము- నృసింహద్వాదశి (5)చైత్రము-వామనద్వాదశి (6) వైశాఖము- పరశురామద్వాదశి: (7) జ్యేష్ఠము-రామద్వాదశి (8) ఆషాఢము- కృష్ణద్వాదశి; (9) శ్రావణము- బుద్ధద్వాదశి; (10)భాద్రపదము- కల్కిద్వాదశి; (11) ఆశ్వయుజము- పద్మనాభద్వాదశి.

వరహ పురాణంలో ఉన్న మధురా మహాత్యం, నచికేతోపాఖ్యానము, చాలా విస్తృతమైనవి. నచికేతోపాఖ్యానంలో స్వర్గనరకాల వర్ణనేగాని, ఆధ్యాత్మిక విద్యాప్రసంగంలేదు. రామానుజీయ వైష్ణవమతానికి సంబంధించిన ఎన్నో విషయాలు ఇందులో చేర్చబడినని. నారాయణుడే ఆదిదేవుడని స్థాపించడం, జ్ఞానకర్మ సముచ్చయము, శ్రాద్ధవర్జ్య పదార్థాలు, ద్వాదశినాడు విష్ణుపూజా విధా

నము, వివిధలోహాలతో భగవత్ ప్రతిమా నిర్మాణము, వాటిప్రతిష్ఠ, పాంచ రాత్రాగమప్రామాణ్యము ఈ విషయాలన్నీ రామానుజ సంప్రదాయం వారిచేత యథాతథంగా గ్రహింపబడినవి. దీనిరచన నవమ-దశమ శతాబ్దులలో జరిగి ఉంటుంది.

**13 స్కాందపురాణం :** స్కందుడు (కుమారస్వామి) దైవతత్వాలను ఉపదేశించడంచేత దీనికి ఆ పేరు వచ్చినది. ఇదిపురాణాలన్నింటిలోకీ బృహత్ప్రమాణంగల పురాణం. 81,000శ్లోకాలు ఉన్నట్లు ప్రసిద్ధి, ఈ విషయం ఈ పురాణంలోనేఉన్న సూతసంహితద్వారా తెలుస్తున్నది. దీనిలో చెప్పిన ప్రకారం స్కందపురాణంలో ఆరు సంహితలు ఉన్నాయి.

| సంహిత | శ్లోకసంఖ్య | సంహిత | శ్లోకసంఖ్య |
|---|---|---|---|
| 1. సనత్కుమార సంహిత | 36,000 | 4. వైష్ణవసంహిత | 5,000 |
| 2. సూతసంహిత | 6,000 | 5. బ్రహ్మసంహిత | 3,000 |
| 3. శంకరసంహిత | 30,000 | 6. సౌరసంహిత | 1,000 |

మొత్తం 81,000 శ్లోకాలు ఈ పురాణాన్ని ఖండాలరూపంలో 1. మహేశ్వర ఖండం; 2 వైష్ణవఖండం; 3 బ్రహ్మఖండం 4. కాశీఖండం: 5. రేవా ఖండం 6. తాపీ ఖండం; 7. ప్రభాస ఖండం అనే 7 ఖండాలుగాగూడా విభజించడం ఉన్నది.

సంహితలలో సూత సంహిత శివోపాసనా విషయంలో సాటిలేనిది. ఇందులో వైదిక తాంత్రిక పూజా విధానాలు రెండూ సవిస్తరంగా ప్రతిపాదించబడినవి. ఈ సంహితలో 1) శివమాహాత్మ్య ఖండం, 2) జ్ఞానయోగ ఖండం, 3) ముక్తి ఖండం, 4) యజ్ఞవైభవ ఖండం అనే నాలుగు ఖండాలు ఉన్నాయి. మొదటి ఖండంలో శివుని మహిమ వర్ణింపబడినది, జ్ఞానయోగ ఖండంలో ఆచార ధర్మాదులు, సాంగోపాంగమైన హఠయోగ ప్రక్రియా వర్ణింపబడినవి. ముక్తి ఖండంలో ముక్తికి ఉపాయాలు ప్రతిపాదింపబడినవి. అన్నింటికంటె పెద్దదైన యజ్ఞ వైభవ ఖండంలో శైవ భక్తి మార్గంతో కలిపి అద్వైత వేదాంత సిద్ధాంతం ప్రతిపాదింపబడినది.

"శివప్రసాదేన వినా న భుక్తయః-శివప్రసాదేన వినా న ముక్తయః
శివప్రసాదేన వినా నదేవతాః-శివప్రసాదేనహి సర్వమాస్తికాః"

అనేది ఇందలి ఉపదేశసారము. సూతసంహితకు విద్యారణ్యులు భాష్యము వ్రాసినారు. శంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యం వ్రాయడానికి ముందు సూత సంహితను పద్దెనిమిదిసార్లు పారాయణ చేసినారట.

శంకర సంహితలో 1) సంభవకాండ, 2) అసురకాండ, 3) మహేంద్ర కాండ, 4) యుద్ధకాండ, 5) దేవకాండ, 6) దక్షకాండ, 7) ఉపదేశకాండ-అనే ఏడు కాండలున్నాయి.

సౌర సంహితలో కూడా శివపూజకు సంబంధించిన అనేక విషయాలు చెప్పబడినవి. ఇప్పుడు లభిస్తున్న సనత్కుమార సంహిత చిన్నది. మిగిలిన సంహితలు లభ్యం కావడంలేదు.

ఇపుడు ఖండ క్రమంలో వర్జ్య విషయాలను చూద్దాం :-

**అ) మాహేశ్వరఖండం :** కేదారఖండం, కుమారికాఖండం అని రెండు ఖండాలుగా విభక్తమై, పార్వతీపరమేశ్వరుల విచిత్రలీలలు ఇందు వర్ణితములు.

**ఆ) వైష్ణవ ఖండం :** ఈ ఖండంలోని ఉత్కలఖండంలో. పూరీ జగన్నాధుని దేవాలయము పూజా విధానం మొ॥ విషయాలు, జగన్నాథ స్వామి ప్రతిష్ఠకు సంబంధించిన ఉపాఖ్యానాలు చెప్పబడినవి.

**ఇ) బ్రహ్మ ఖండం :** ధర్మారణ్యమనే క్షేత్రం యొక్క మహాత్మ్యం, ఉజ్జయినీ మహాకాళేశ్వరుని పూజాప్రతిష్ఠానాదులు వర్ణింపబడినవి.

**ఈ) కాశీ ఖండం :** కాశీ మహిమ, కాశీలో ఉన్న వివిధ శివలింగాదుల ఉత్పత్తి, పూజాదులు సవిస్తరంగా వర్ణింపబడినవి.

**ఉ) రేవా ఖండం :** నర్మదానద్యుత్పత్తి, నర్మదా తీరంలో ఉన్న సకల తీర్థాల వర్ణనము ఈ ఖండంలో ఉన్నాయి. ప్రసిద్ధమైన సత్యనారాయణ వ్రత కథ ఈ ఖండంలోనిదే.

**ఊ) తాపీ ఖండం :** నర్మదానదికి ఉపనదియైన తాపీనదీ తీరంలో ఉన్న అన్ని తీర్థాలూ వర్ణింపబడినవి. ఈ ఖండం ద్వారా ప్రాచీన భారత సామాజిక స్థితి స్పష్టంగా తెలుస్తుంది.

**ఋ) ప్రభాస ఖండం :** ఇది ప్రభాసక్షేత్రమాహాత్మ్య వర్ణన పరము. దీనివల్ల ద్వారక చుట్టుపట్ల ఉన్న భూగోళస్థితి బాగా స్పష్టం అవుతుంది.

ఇతర పురాణాలలో వలెనే స్కంద పురాణంలో కూడా కావ్యచ్ఛాయ ఉన్న శ్లోకాలు ఉన్నాయి.

"విభ్రమో యత్ర నారీషున విద్వత్సుచ కర్హిచిత్
నవ్యః కుటిల గామిన్యో న యత్ర విషయే ప్రజాః 9
బాణేషు గుణ విశ్లేషో బన్ధోక్తిః పుస్తమేధృథా
స్నేహత్యాగః సదైవాస్తి యత్ర పాశుపతే జనే 19
యత్ర క్షపణకా ఏవ దృశ్యన్తే మల ధారిణః
ప్రాయో మధువ్రతా ఏవ యత్ర చఞ్చల నృత్తయః 20

—కాశీ ఖండం 24 అధ్యాయము

ఇవి బాణభట్టు కాదంబరిలో ఉపయోగించిన సరి సంఖ్యాలంకారాలను గుర్తుకు తెస్తాయి.

ఈ పురాణంలో ప్రక్షిప్తాలైన భాగాలు అత్యధికంగా ఉన్నాయని విమర్శకుల అభిప్రాయం. దీనిలో వివిధ క్షేత్రాల మహాత్మ్యాలు అత్యధిక సంఖ్యలో ఉండడంచేత అప్పుడప్పుడు ఆయా వ్యక్తులు వ్రాసిన స్వస్వప్రాంతీయ క్షేత్రాల మహాత్మ్యాన్ని ఏతత్పురాణాంతర్గతాలుగా చెప్పడం పరిపాటి అయిపోయి ఉంటుంది. దీని రచన సప్తమ-నవమ శతాబ్దులలో జరిగి ఉంటుందని విమర్శకుల అభిప్రాయం.

**14 వామన పురాణం :** వామనావతారాన్ని ప్రధానంగా వర్ణించడం చేత దీనికి ఈ పేరొచ్చింది. విష్ణువుయొక్క అవతారాలను వర్ణించడంచేత ఇది వైష్ణవ పురాణమే ప్రధానంగా అయినా, కాలక్రమంలో శైవప్రభావం చేత దీనిలో శివచరిత్ర కూడా ప్రవేశపెట్టబడి ఉంటుంది. ఇందులో 95 అధ్యాయాలు ఉన్నాయి. నారదపురాణాను సారంగా 10,000 శ్లోకాలు ఉండవలసి ఉన్నా, ప్రస్తుతం లభ్యమయ్యే గ్రంథంలో 6,000 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. ఇది కురుక్షేత్రంలో వ్రాయబడి ఉంటుంది. శివచరిత్ర భాగంలో పార్వతీదేవి ఘోర తపస్సు శివుడు బ్రహ్మచారి వేషంలో పార్వతిని పరీక్షించడానికి రావడము, వారి సంభాషణ, వారి వివాహము మొదలైన విషయాలు అలంకారిక శైలిలో వర్ణింపబడినవి. దీనిమీద కాళిదాసు యొక్క ప్రభావం- ప్రధానంగా కుమార సంభవం యొక్క ప్రభావం ఎక్కువగా కనబడుతుంది. కొన్ని సామ్యాలు:-

1. "తతో రాజేతి శబ్దోఽస్య పృథివ్యాం రంజనాదభూత్"

(వా. పు-47-24)

"రాజా ప్రకృతి రంజనాత్" (రఘు-4-12)

"రాజా ప్రజారంజనలబ్ధవర్ణః పరస్తపోనామ యదార్థనామా॥
(రఘు-6-12)

2. "తపసోదారయామాస ఉమేత్యేవా బ్రవీచ్చసా" (వామన-47-24)
"ఉమేతి మాత్రా తపసోనిషిద్ధా పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ"
(కుమా, 5-26)

3. కథంకరః పల్లవకోమలస్తే నమేష్యతే శార్వకరం ససర్వమ్"
(వా-51-63)
"అవస్తు నిర్బన్ధపరే కథం నుతే కరోఽయమాముక్త వివాహకౌతుకః
కరేణ శంభోర్వలయీ కృతాహినా నహిష్యతే తత్ప్రథమావలంబనమ్"
(కు-5-66)

4. "పురస్త్రియః పురస్త్రీణాం గతింధర్మస్యవై విమః" (వా-52-13)
"ప్రాయేణైవం విధే కార్యే పురంధ్రీణాం ప్రగల్భతా" (కు. 6-32)

5. "జామిత్ర గుణ సంయుక్తాం తిథిం పుణ్యాం సుమఙ్గలామ్ (వా-52-60)
తిథౌతు జామిత్ర గుణాన్వితాయామ్ (కు-7-1)

ఈ విధంగా కాళిదాసు రచనలతో అనేకమైన సామ్యాలు ఉన్నాయి. ఈ పురాణంలో శైవ-వైష్ణవ చరిత్రల సురుచిర సమావేశం కనబడుతుంది. పైన చెప్పిన కాళిదాస వాక్య సంగ్రహణాదులను బట్టి వామన పురాణం క్రీ. శ. 600-900 మధ్య రచింపబడి ఉంటుందని ఊహించవచ్చును.

**15. కూర్మ పురాణం :** ఈ పురాణంలో బ్రాహ్మీ, భాగవతీ, సౌరీ, వైష్ణవీ అనే నాలుగు సంహితలున్నాయనీ, మొత్తం శ్లోకాల సంఖ్య 18,000 అనీ భాగవత, మత్స్య పురాణాదులద్వారా తెలుస్తున్నది. కానీ ఇపుడు బ్రాహ్మీ సంహిత మాత్రమే కూర్మ పురాణం అనే పేరుతో లభిస్తున్నది. దీనిలో 6,000 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. విష్ణువు కూర్మావతారం ధరించి ఇంద్రద్యుమ్నుడనే భక్తునికి ఈ పురాణాన్ని ఉపదేశించడంచేత దీనికి ఈ పేరు వచ్చింది. ఇందులో అడుగడుగునా శివుడే ముఖ్యదేవత అని చెప్పబడినది. అయినా వాస్తవంలో త్రిమూర్తులకు భేదం లేదని కూడా స్పష్టంగా చెప్పబడింది. శక్తి పూజకు చాలా ప్రాధాన్యం ఇవ్వబడింది. శక్తి సహస్రనామ స్తోత్రం కూడా ఒకటి దీనిలో ఉన్నది. విష్ణువు శివరూపుడేనని లక్ష్మి పార్వతికి ప్రతికృతి అనీ వర్ణింపబడినది.

శివుడు ఎంత గొప్పవాడనగా- శివుని అనుగ్రహం చేతనే కృష్ణుడు జాంబవతిని పొందగలిగినాడు.

దీనిలో రెండు భాగాలున్నాయి. పూర్వభాగంలో సృష్టి వర్ణనాదుల తరువాత పార్వతి తపస్సు వర్ణింపబడినది. కాశీ ప్రయాగ క్షేత్రాల మాహాత్మ్యం వర్ణింపబడినది. వ్యాసగీతంలో నాలుగు ఆశ్రమ ధర్మాలు చెప్పబడినది. ఉత్తర భాగంలో ఈశ్వరగీత, వ్యాసగీతాలు ఉన్నాయి. ధ్యానయోగం ద్వారా శివ సాక్షాత్కారం పొందే మార్గం ఈశ్వరగీతలో వర్ణింపబడినది. నాలుగు ఆశ్రమ ధర్మాలు చెప్పబడినవి.

మహేశ్వరునికి శాంతి, విద్య, ప్రదిష్ట, నివృత్తి అనే నాలుగు విధాలైన శక్తులున్నవనీ అందుచేతనే పరమేశ్వరుడు చతుర్వ్యూహుడనీ చెప్పబడినది, ఇది పాంచరాత్రాగమములనుండి గ్రహించిన పద్ధతి. వాస్తవంలో ఇది మొదట పాంచరాత్రమతాన్ని ప్రతిపాదించే పురాణమనీ, కాలక్రమంలో పాశుపతులు దీనిలో పాశుపత ప్రక్రియను ప్రవేశపెట్టినారనీ విమర్శకుల అభిప్రాయము. ఈ పురాణం ఐదారు శతాబ్దులలో రచితమై ఉంటుంది.

**16. మత్స్య పురాణము :** ఈ పురాణంలో 291 అధ్యాయాలు, 15,000 శ్లోకాలు ఉన్నాయి. ప్రారంభంలో మన్వంతరాలు గూర్చి సంక్షిప్తంగా చెప్పిన పిమ్మట పితృదేవగణాల వర్ణన విస్తృతంగా చేయబడినది. రాజవంశ వర్ణనలలో సోమవంశ వర్ణన చాలా విస్తృతంగా ఉన్నది. ఈ పురాణంలో వివిధ వ్రతాల వర్ణన ఎక్కువగా ఉండడం ఒక విశిష్టత. పరమేశ్వరుడు త్రిపురాసురులతో చేసిన యుద్ధం సవివరంగా వర్ణింపబడినది. తారకాసుర వధ కూడా వర్ణింపబడినది మత్స్యావతారకథే ప్రధానంగా ఉండడంచేత దీనికి మత్స్యపురాణం అనే పేరువచ్చింది. కాశీప్రయాగ క్షేత్రాలు. నర్మదానదీ ప్రాంతంలో ఉన్న క్షేత్రాలు వర్ణింపబడినవి. ఋషివంశాల వర్ణనము, 25 అధ్యాయాలలో రాజధర్మ ప్రతిపాదనము, వివిధ దేవతా మూర్తుల ప్రతిమా నిర్మాణాదుల విస్తృత వర్ణనము ఈ పురాణంలో ప్రధానంగా చెప్పుకొనదగిన విశేషాలు.

ప్రళయకాలంలో అన్నినదులూ నశించినా, నర్మద మాత్రం నశించదని చెపుతూ నర్మదానదికి గంగకంటె కూడా ఎక్కువ వైశిష్ట్యాన్ని అంగీకరించడం, నర్మదానదీతీరాన్ని అనుసరించి ఉన్న చిన్నచిన్న తీర్థాలను కూడా వర్ణించడం మొదలైన ఆధారాలనుబట్టి ఈ పురాణం నర్మదాతీరంలో రచింపబడినది

కాళిదాసుని విక్రమోర్వశీయంలో ఉన్నకథకూ, ఈ పురాణంలో ఊర్వశీ ఉపాఖ్యానానికీ అత్యంత సామ్యం ఉండడం చేత ఇది కాళిదాసానంతరం రచింపబడి ఉంటుందనీ విమర్శకుల అభిప్రాయం.

**17. గరుడ పురాణం :** విష్ణువు గరుత్మంతునకు ప్రపంచ సృష్టిని గూర్చి బోధించడం చేత దీనికి ఈ పేరు వచ్చినది. ఇందులో 264 అధ్యాయాలు, 18,000 శ్లోకాలు ఉన్నాయి. ఇది రెండు ఖండాలుగా విభజింపబడినది. పదకొండు అధ్యాయాలలో రాజనీతి సవివరంగా వర్ణించబడింది. ముప్పైరెండు అధ్యాయాలలో ఆయుర్వేదానికి సంబంధించిన ఎన్నో విషయాలు చెప్పబడినవి. ఆరు అధ్యాయాలలో ఛందశ్శాస్త్రము, పదమూడు అధ్యాయాలలో సాంఖ్యమూ నిబద్ధమై ఉన్నాయి. ఈ విధంగా గరుడపురాణంలోని పూర్వఖండం అగ్నిపురాణం వలెనే సకల విద్యా సంగ్రహంగా ఉన్నది. నలభైఐదు అధ్యాయాల ద్వితీయ ఖండానికి ప్రేతకల్పము అనిపేరు. మరణానంతరం మనుష్యుడు ఏ విధంగా లోకాంతరాలకు వెళతాడు మొదలైన విషయాలు అతి విస్తృతంగా చెప్పబడినవి గర్భావస్థ, నరకము, యమలోకమార్గము, ప్రేతగణ నివాస స్థానము, ప్రేత లక్షణాలు, ప్రేతత్వవిముక్తి, యమలోకము మొదలైన విషయాలు ఇంతవిస్తృతంగా మరి ఏ పురాణంలోనూ చెప్పలేదు

ఈ పురాణం నవమశతాబ్ది ప్రాంతంలో మిథిలలో రచింపబడి ఉంటుందని విమర్శకుల అభిప్రాయం

**18. బ్రహ్మాండ పురాణము :** ఈ పురాణంలో సమస్త బ్రహ్మాండము, వర్ణింపబడినది. నారదపురాణంలో చెప్పినదానిని బట్టి మొదట దీనిలో 12 000 శ్లోకాలు ఉండేవి. ప్రక్రియా పాదము, అనుషంగ పాదము, ఉపోద్ఘాత పాదము, ఉపసంహారపాదము అని నాలుగు పాదాలు ఉన్నాయి ప్రథమ ఖండంలో భూగోళవర్ణనం అతి విస్తృతంగా చేయబడింది. జంబూద్వీపము, అందులోని పర్వతాలు, నదులు, భద్రాశ్వ-కేతుమాల-చంద్రద్వీప-కింపురుషవర్ష-కైలాస-శాల్మలి ద్వీప-కుశద్వీప-క్రౌంచద్వీప-శాకద్వీప-పుష్కర ద్వీపాదులు గ్రహ నక్షత్రాదులు వర్ణితములై ఉన్నాయి. పరశురామ చరిత్ర కూడా ఈ పురాణంలో సవిస్తరంగా చెప్పబడినది. పరశురామునితో ఘనిష్ఠ సంబంధం ఉండడంచేతను, సహ్యపర్వత, గోదావరీ ప్రాంతాలను అధికంగా వర్ణించడంచేతనూ ఈ పురాణం ఆ ప్రాంతాలలో రచింపబడి ఉంటుందనే, దీనిలోని కొన్ని భాగాలు ప్రాచీనము

లైనవనీ, ఇది క్రీ. శ. 600-900 సంవత్సరాలలో పరిపూర్ణం అయి ఉంటుం దనీ పండితుల అభిప్రాయం

## ఉపపురాణాలు

అష్టాదశ మహా పురాణాలను అనుకరిస్తూ, కొన్నిచోట్ల వాటితో ఉన్న కథను సంక్షేపిస్తూ కొన్నిచోట్ల మార్పులుచేస్తూ ఉపపురాణాలు వ్రాయబడినవి. అవి కూడా పద్దెనిమిది ఉన్నాయి. ''పద్దెనిమిది మహాపురాణాలే కాక ఇంకా ఉన్న పురాణాలు వాటినుండే ఆవిర్భవించినవి'' అని మత్స్యపురాణంలోనూ, ఈ అష్టా దశ మహాపురాణాలను, ఉపపురాణాలను మునులు రచించినారు అని విష్ణుపురాణం లోను చెప్పబడినది

''అష్టాదశభ్యస్తు పృథక్ పురాణం తత్ప్రదృశ్యతే
విజానీధ్వం ద్విజ శ్రేష్ఠా స్తథా తేభ్యో వినిర్గతమ్'' (మ. పు. 53-63)
''మహా పురాణాన్యేతాని హ్యష్టాదశ మహామునే
తథాచోపపురాణాని మని భిం కథితానిచ'' (వి. పు. 3-624)

ధర్మాదుల విషయంలో కూడా ఉపపురాణాలకు మహాపురాణాలకు వలెనే ప్రామాణ్యం ఉందని అంగీకరింపబడినది.

''అన్యాశ్చ సంహితాః సర్వా మరీచికపిలాదయః
సర్వత్ర ధర్మకథనే తుల్యా సామర్థ్యముచ్యతే''

ఉపపురాణాల సంఖ్య అనిశ్చితమని కొందరి అభిప్రాయము అయితే అవికూడా, పద్దెనిమిదే అని బ్రహ్మవైవర్త స్కాంద పురాణాదులలో స్పష్టంగా చెప్పబడినది–

''అష్టాదశ పురాణానా మేవ మేవ విదుర్బుధాః
ఏవంచోపపురాణా నామష్టాదశ ప్రకీర్తితాః''
(బ్ర. వై. పు. 131-22)

''పారాశరం భాగవతం క్రౌంచ మష్టాదశమ్ మతమ్''
(స్కాం.పు.రే.ఖ. 1-55)

ఉప పురాణాలుకాక ఇంకా కనబడే ఇతర పురాణాలు ''ఔపపురాణాలు'' అని చెప్పబడుచున్నవి.

**ఉప పురాణాల పేర్లు:-** 1) ఆది పురాణము, 2) నరసింహ పురాణము 3) స్కాంద పురాణము, 4) శివ పురాణము, 5) దుర్వాసః పురాణము

6) నారదీయ పురాణము, 7) కపిల పురాణము, 8) వామన పురాణము, 9) ఔశనస పురాణము, 10) బ్రహ్మాండ పురాణము, 11) వరుణ పురాణము, 12) కాళికా పురాణము, 13) మాహేశ్వర పురాణము, 14) శాంబ పురాణము, 15) సౌర పురాణము, 16) పారాశర పురాణము, 17) మారీచ పురాణము, 18) భాస్కర పురాణము.

''ఆద్యం సనత్కుమారోక్తం నారసింహమథాపరమ్
తృతీయం స్కాందముద్దిష్టం కుమారేణ చ భాషితమ్
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశభాషితమ్
దుర్వాససోక్తమాశ్చర్యం నారదీయమతఃపరమ్
కపిలం వామనంచైవ తథైవోశనసేరితమ్
బ్రహ్మాండంవారుణం చాథకాపిలాహ్వయమేవచ
మాహేశ్వరం తథాశాంబం సౌరం సర్వార్థసంచయమ్
పరాశరోక్తమ పరం మారీచం భాస్కరాహ్వయమ్
(కూ. పు. పూర్వార్థము-1-17-20)

ఇతర పురాణాలలో ఈ ఉప పురాణాల పేర్లు కొన్ని వేరువేరుగా ఉన్నాయి. వాయుపురాణ శివపురాణాలలోను, దేవీభాగవత శ్రీమద్భాగవతాలలోనూ ఏది మహాపురాణము, ఏది ఉప పురాణము అనే విషయంలో అభిప్రాయభేదంఉన్నది. శివపురాణ దేవీ భాగవతములే ఉప పురాణాలని చాలమంది పండితుల అభిప్రాయము.

అష్టాదశ మహాపురాణాలు, అష్టాదశోప పురాణాలు ఉన్నట్లే అష్టాదశ ఔప పురాణాలు కూడా ఉన్నాయి: 1) సనత్కుమార, 2) బృహన్నారదీయ. 3) ఆదిత్య, 4) సూర్య. 5) నందికేశ్వర, 6) కౌర్మ, 7) భాగవత. 8) వాసిష్ఠ 9) భార్గవ, 10) ముద్గల, 11) కల్కి, 12) దేవీ. 13) మహాభాగవత, 14) బృహద్ధర్మ 15) పరానంద, 16) వహ్ని, 17) పశుపతి, 18) హరివంశ పురాణాలు.

''ఆద్యం సనత్కుమారం చ నారదీయం బృహచ్చయత్
ఆదిత్యం భానవంప్రోక్తం నందికేశ్వర మేవచ
కౌర్మం భాగవతం జ్ఞేయం వాసిష్ఠం భార్గవం తథా
ముద్గలం కల్కిదేవ్యౌచ మహాభాగవతం తతః

బృహద్ధర్మం పరానన్దం వహ్నిం పశుపతిం తథా
హరివంశం తతోజ్ఞేతు మిదమౌప పురాణకమ్.'' (బృహద్వివేకము-8)

ధర్మకల్పద్రుమం అనే గ్రంథంలో జ్ఞానానందసరస్వతి ఇంకా పురాణాలు ఉన్నాయని ప్రతిపాదించి ఉన్నాడు. ఆయన చెప్పిన విధంగా పురాణాలు ఐదు విధాలు:- 1) మహా పురాణాలు, 2) ఉప పురాణాలు, 3) ఔప పురాణాలు, 4) ఉపోప పురాణాలు, 5) ఉపౌప పురాణాలు. యీ విధంగా ఉపోప-ఉపౌప పురాణాలు కూడా పద్దెనిమిదేసి ఉన్నాయి. యీ అవాంతర భేదాలను గుర్తించకుండా ఉపపురాణాలు అసంఖ్యాకంగా ఉన్నాయని లోకప్రసిద్ధి ఏర్పడినది.

ఈ ఉపపురాణాలలో కూడా దైవ - వైష్ణవ - సౌర - శాక్తాది భేదాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఉపపురాణౌపపురాణాదులలో చాలవరకు క్రీ॥ శ॥ 10వ శతాబ్దానికి పూర్తి అయి ఉండవచ్చునని పండితుల ఊహ. కొన్ని ఉప పురాణాలు క్రీస్తుకు పూర్వం పంచమ శతాబ్దంలో ఉన్నాయనీ, కొన్ని క్రీ॥ శ॥ షష్ఠ శతాబ్దం ప్రాంతానికి చెందినవనీ అభిప్రాయభేదాలు ఉన్నాయి. ఈ మహా పురాణ-ఉప పురాణ, ఔప పురాణాది భేదాలతో విలసిస్తున్న పురాణ వాఙ్మయం ఎంత విస్తృతమైనదో అది కేవలము ఊహైకగవ్యము.

## పురాణాలలోని ప్రధాన ప్రతిపాద్య విషయములు

పురాణాలలో శివ - విష్ణు - శక్తి - గణపతి - కుమార - సూర్యాదిదేవతల చరిత్రలూ, కొందరు దేవతల అవతారాదులు, అతి విస్తృతంగా వర్ణింపబడినవనే విషయం సర్వప్రసిద్ధము. ఒక పురాణంలో ఉన్న కథలు కొన్ని మార్పులు-చేర్పులతోను, సంక్షిప్త-విస్తృత రూపాలలోను - ఇతర పురాణాలలో కూడా ఉంటాయి. ఈ విధమైన దేవీ, దేవతాపరములైన కథలూ, మహాత్మ్యాలే కాకుండా లౌకిక విషయాలు కూడా ఎన్నో పురాణాలలో లభిస్తాయి.

### పురాణాలలో సృష్టి వర్ణనము :

పురాణాలలో వర్ణించిన సృష్టిక్రమం చాలవరకు సాంఖ్యు లంగీకరించిన సిద్ధాంతానికి సరిపోతుంది. సాంఖ్యమతానుసారంగా ప్రపంచ సృష్టి ప్రకృతి పురుషుల సంయోగంవల్ల ఏర్పడుతుంది. ప్రకృతికే ప్రధానము, మాయ మొదలైన నామాంతరాలు ఉన్నాయి. పురుషుడనగా జీవుడు. జీవుని కర్మానుసారంగా ప్రకృతి ప్రపంచాన్నంతటినీ సృష్టిస్తుంది. జీవుడు సుఖదుఃఖాలను

(ఆ సృష్టితో తనకులేని సంబంధాన్ని సృష్టించుకుని) అనుభవిస్తాడు. ప్రకృతి, పురుషుడు కూడా అనాదులు-నిత్యతత్త్వములు.

పురాణాలలో ఈ రెండూకూడా విష్ణువుయొక్క, లేదా పరమేశ్వరుని యొక్క రూపాలే అని ప్రతిపాదింపబడినది. అనగా, వీటియొక్క రూపాలే అని ప్రతిపాదింపబడినది. అనగా, వీటియొక్క ఉనికి, విష్ణువుయొక్క ఉనికిమీద ఆధారపడినది ఇవి-ఆ విష్ణువునుండే ఆవిర్భవించి, అతనియందే తిరోభవిస్తాయి. ఈ రెండే కాకుండా విష్ణువుయొక్క మూడవరూపం కాలం అనేదికూడా ఉంది. ఆ కాలాత్మక శక్తినిబట్టి ప్రకృతిపురుషులు సృష్టిసమయంలో కలవడమూ, ప్రళయంలో విడిపోవడమూ జరుగుతూ ఉంటుంది. కాలము-అనాది, అనంతము. ఈ కాలాన్నే సహాయంగా చేసుకుని పరమేశ్వరుడు, లేదా విష్ణువు సృష్టి స్థితిప్రళయాలు చేస్తూ క్రీడిస్తూ ఉంటాడు.

"విష్ణోః స్వరూపాత్ పరతోహితేద్వే-రూపేప్రధానం పురుషశ్చ విప్ర
తస్యైవ తేఽన్యేన ధృతేవియుక్తే-రూపాన్తరంయద్ద్విజకాల సంజ్ఞమ్"
-(విష్ణు-1-2-24)

పౌరాణిక సిద్ధాంతం ప్రకారం ప్రపంచం అనాది-అనంతము, ఇపుడు ఎట్లు ఉన్నదో పూర్వమూ అట్లే ఉండేది భవిష్యత్తులో కూడా అలాగే ఉండబోతుంది.

"యధేదానీం తథాగ్రేచ పశ్చాదప్యేత దీదృశమ్" (భాగ-3-10-13)

మీమాంసకులు కూడా "న కదాచిదనీ దృశం జగత్" అని ఈ విషయాన్నే అంగీకరిస్తారు. అట్లైతే సృష్టి ఏమిటి, ప్రళయం ఏమిటి అనే ప్రశ్న వస్తుంది. ఇక్కడ నిత్యత్వం అంటే ప్రవాహం నిత్యమని అర్థము "ఏ ఒక్కడూ ఒకసారి దిగిన నదిలోకి మరొకసారి దిగలేడు" అని ఒక ఉక్తి ఉన్నది. అనగా గోదావరీ నది ఒకే నదిగా, అవిచ్ఛిన్నంగా ఉన్నట్లు కనబడుతున్నా, క్షణం క్రితం ఉన్న జలప్రవాహం వేరు, మరుక్షణంలో ఉన్న జలప్రవాహం వేరు. మానవాముల విషయంలో కూడా అంతే క్షణం క్రితం మన రక్తనాడులలో ప్రవహించే రక్తం వేరు, ఈ క్షణంలో ప్రవహించేది వేరు. అందుచేతనే బౌద్ధులు క్షణిక వాదాన్ని అంగీకరించినారు. ప్రకృతంలో జగత్తు నిత్యమనగా ప్రవాహరూపంలో నిత్యమని అర్థము.

ప్రకృతి-పురుష-వ్యక్త జగత్తులు (జగత్తు ప్రకృతిరూపమే) కాలము-ఈ నాలుగూ పరమాత్మ స్వరూపాలే. పరమాత్మ ఏతచ్చతుష్టయ స్వరూపుడు కూడా

ఈ **అతీతతత్వమే** అద్వైతులు చెప్పిన **అద్వైతనిర్గుణ** బ్రహ్మతత్వము. **సాంఖ్యుల ద్వైత సిద్ధాంతానికీ**, అద్వైతుల **అద్వైతతత్వానికీ చక్కని సమ న్వయం** ఈ పురాణాలలో **అనేకచోట్ల** కనబడుతుంది.

పురాణాలలో సృష్టి - 1) ప్రాకృత సృష్టి; 2) వైకృత సృష్టి, 3) ప్రాకృత వైకృత సృష్టి అని మూడు విధాలు. బుద్ధిపూర్వకంగా కాకుండా నైసర్గి కంగా బ్రహ్మ చేసిన సృష్టి పాకృత సృష్టి. ఆలోచనా పూర్వకంగా చేసినది వైకృత సృష్టి. ప్రాకృత సృష్టి మూడు విధాలు; వైకృత సృష్టి అయిదు విధాలు ఈ ఎనిమిది విధాల సృష్టులు, ప్రాకృత వైకృత సృష్టి కలిసి మొత్తం సృష్టి తొమ్మిది విధాలు.

> ''ప్రాకృతాశ్చ్రత్రయు పూర్వే సర్గాస్తేఽబుద్ధి పూర్వకాః
> బుద్ధిపూర్వం ప్రవర్తన్తే ముఖ్యాద్యాః పఞ్చవైకృతాః''
>
> (శివపురాణము వాయుపురాణము)

**ప్రాకృత సృష్టి :** 1) బ్రహ్మ సృష్టి : బ్రహ్మ మొట్టమొదట సృష్టించి నది మహత్తత్వము. ఇదే బుద్ధితత్వము. దీని సృష్టికి బ్రహ్మ సృష్టి అని పేరు. ఇక్కడ బ్రహ్మ అనగా మహత్తత్వమని అర్థము. సాంఖ్య సిద్ధాంతం ప్రకారం కూడా ప్రకృతితత్వం నుంచి మొట్టమొదట పుట్టినది మహత్తత్వమే.

2) భూతసృష్టి : పృథివ్యాది పంచస్థూలభూతాలకు కారణమైన సూక్ష్మ రూపాలకు తన్మాత్రలని పేరు వాటికే సాంఖ్యులలో అవిశేషములని పేరు వాటి సృష్టి భూతసృష్టి. ఇవి మహత్తత్వంలోని తామసాంశం నుండి జనిస్తాయి

3) వైకారిక సృష్టి : ఇంద్రియాల సృష్టికి వైకారిక సృష్టి అని పేరు. మహత్తత్వంలో ఉన్న సాత్వికాంశం నుంచి పంచజ్ఞానేంద్రియాలు పంచ కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియోభయ రూపమైన మనస్సు జనిస్తాయి. ఇదికూడా సాంఖ్యుల మతమే.

**వైకృత సృష్టి :** 1) బ్రహ్మదేవుడు ప్రాచీన కాలానికి సంబంధించిన సృష్టిని గూర్చి ఆలోచన చేయగా పంచపర్వ అయిన అవిద్య ఆవిర్భవించినది. 1) తమస్సు : అజ్ఞానము, 2) మోహము; 3) మహామోహము; భోగలాల సత్వము. 4) తామిస్రము: క్రోధము 5) అంధతామిస్రము: పట్టుదల- ఇవి ఆ అవిద్య యొక్క పర్వాలు. మళ్ళీ ధ్యానం చేయగా పర్వతవృక్షలతాది జడపదా

ర్థాలు పుట్టినవి. ఇది ముఖ్య సృష్టి. పర్వతాదులు చిరకాలస్థాయులవడం చేత ఈ సృష్టికి ఆ పేరు పెట్టబడినది.

2) తిర్యక్ సృష్టి: బ్రహ్మకు తృప్తికలగకపోవడం చేత మళ్ళీ ఆలోచించగా పశుపక్ష్యాది జంగమసృష్టి జరిగినది. ఈ తిర్యగ్జంతువులు తమః ప్రధానములు.

3) దేవ సృష్టి : పైసృష్టి చేత కూడా సంతృప్తి కలగకపోవడంతో బ్రహ్మ మళ్ళీ ఆలోచించి ఊర్ధ్వలోకాలలో నివసించే సత్త్వప్రధానులైన దేవతలను సృష్టించినాడు. దేవతలు విషయప్రీతికలవారు, బాహ్యాన్తర దృష్టి కలవారు.

4) మానుష సృష్టి : దానిచేత కూడా బ్రహ్మకు సంతృప్తి కలగలేదు. పునః ఆలోచించి మరొక సృష్టి కూడా చేసినాడు. అదే మానుష సృష్టి. మనుష్యులు అర్వాక్స్రోతస్కులు. భూమి మీద మాత్రమే తిరిగేవారు. వీరిలో సత్త్వరజస్తమోగుణాలు మూడూ ఉంటాయి. అందుచే అధిక దుఃఖవంతులై (తమఃప్రభావం) నిత్య క్రియాశీలురై (రజఃప్రభావం) బాహ్యాభ్యంతర జ్ఞాన సంపన్నులై (సత్త్వప్రభావం) ఉంటారు.

5) అనుగ్రహ సృష్టి : ఈ సృష్టి విపర్యము, సిద్ధి, శక్తి, తుష్టి అని నాలుగు విధాలుగా ఉంది. ఇవి భావాలు. స్థావరాలలో విపర్యము, తిర్యగ్యోనులలో శక్తి, మనుష్యులలో సిద్ధి, దేవతలలో తుష్టి ఉంటాయి. సాంఖ్య కారికలో 'శక్తి'కి బదులు 'అశక్తి' చెప్పబడినది. కానీ, వాయుపురాణం ప్రకారం సకల సృష్టి కూడా ప్రకృత్యనుగ్రహం చేత కలిగినది కాన సృష్టిసామాన్యానికే అనుగ్రహ సృష్టి అని పేరు.

ప్రాకృతవైకృతోభయాత్మక సృష్టికి కౌమార సృష్టి అని పేరు. బ్రహ్మ మహా తపస్సు చేసి సనత్కుమారుని సృష్టించినాడు. ఈ సృష్టి కౌమార సృష్టి.

సృష్టి చేయవలెననే అభిలాష కలుగగనే మొదట బ్రహ్మలో తమోగుణం అధికమైనదట. అపుడు ఆయన కాలినుండి అసురులు పుట్టినారు. బ్రహ్మ ఆ శరీరాన్ని విడచి మరొక శరీరాన్ని ధరించినాడు. మొదటి శరీరం రాత్రి అయినది. సత్త్వ ప్రధానమైన రెండవ శరీరం ముఖం నుండి సురులు జన్మించినారు. ఆ రెండవ శరీరాన్ని కూడా విడిచి బ్రహ్మ ఆంశికంగా సత్త్వ ప్రధానమైన మరొక శరీరం ధరించినాడు. రెండవ శరీరం పగలు అయినదట. మూడవ శరీరం ప్రక్కల నుండి పితృదేవతలు జనించినారు. ఆ శరీరం విడిచిపెట్టగా

అది సంధ్య అయినది. తిరిగి రజోగుణమైన నాల్గవ శరీరం ధరించగా దానినుండి రజోగుణ ప్రధానులైన మానవులు జన్మించినారు. ఆ దేహాన్ని కూడా విడిచి పెట్టగా అది ప్రభాత సమయమైనది. ఈ విధంగా ఈ కథ ద్వారా అసురులకు రాత్రితోను, సురులకు దినముతోను, పితృదేవతలకు సాయం సంధ్యతోను, మనుష్యులకు ప్రాతఃకాల సంధ్యతోను సంబంధాన్ని చెప్పి వారికి ఆయాకాలాలలో బలం ఎక్కువగా ఉంటుందనే విషయం సూచింపబడింది.

బ్రాహ్మ సృష్టి : విష్ణువు ఆజ్ఞ ప్రకారం బ్రహ్మదేవుడు విష్ణు దేవుని నాభి కమలంలో కూర్చొని నూరు దివ్య సంవత్సరాలపాటు తపమాచరించినాడు. అపుడు సముద్రం మధ్య ప్రబలమైన వాయువు వీచడంతో బ్రహ్మ కూర్చొన్న పద్మం కూడా కదలడం మొదలుపెట్టింది. తపస్సువల్ల, ఆధ్యాత్మిక జ్ఞానంవల్ల కలిగిన శక్తిచేత బ్రహ్మ ఆ జలాన్ని వాయువుని త్రాగివేసినాడు. మిగిలిన ఆకాశాతలచుంబియైన పద్మంలో ప్రవేశించి దాన్ని మూడు భాగాలుగా చేసి భూః, భువః, స్వః లోకాలను సృష్టించినాడు. కామ్య కర్మకు అవకాశం ఉన్నా-కామ్య కర్మ ద్వారా చేరగలిగిన లోకాలు యీ మూడే - వాటి పైన ఉన్న మః, జనః, తపః సత్యలోకాలు నిష్కామకర్మ అనుష్టించేవారు చేరదగినవి. ఈ నాలుగు లోకాలకి కలిసి బ్రహ్మలోకమని పేరు

తాను ప్రారంభించిన సృష్టి కార్యక్రమం ముందుకు సాగడం కోసం బ్రహ్మదేవుడు తనతో సమానమైన ప్రభావం గల తొమ్మండుగురు మానసపుత్రులను సృజించినాడు. వారికి నవబ్రహ్మలని పేరు భృగు, పులస్త్య, పులహ, క్రతు, అంగిరస్, మరీచి, దక్ష, అగ్ని, వశిష్టులని వీరి పేర్లు. ఖ్యాతి, భూతి మొదలైన కన్యలను సృజించి వీరితో వివాహం జరిపించినాడు. అపుడు సృష్టి శీఘ్రగతిలో జరిగింది. బ్రహ్మచేసిన సృష్టి మానసీ సృష్టి.

రౌద్రీసృష్టి : నవబ్రహ్మలను సృజించడానికి పూర్వం బ్రహ్మదేవుడు సనకసనందన సనాతన సనత్సుజాతులనే మానసపుత్రులను సృజించి సృష్టి చేయవలసినదిగా వారిని ఆదేశించినాడు. వారు సహజ వైరాగ్యవంతులగుటచే ఆ పని చేయలేదు. బ్రహ్మకు తీవ్రమైన కోపం వచ్చి భృకుటి ఏర్పడగా దానినుండి ప్రచండ సూర్యునివలె దేదీప్యమానంగా ఉన్న రుద్రుడు బ్రహ్మదేవుని ఆజ్ఞ ప్రకారం తన దేహంలో ఉన్న పురుషభాగాన్ని పదకొండు భాగాలుగాను, స్త్రీ

భాగాన్ని సౌమ్య, క్రూర, శాంత, అశాంత, శ్యామ, గౌరాది అనేక రూపాలు గాను విభజించాడు. తద్వారా జరిగిన సృష్టికి రౌద్రీ సృష్టి అని పేరు.

(చూ. విష్ణు- 1-7-11-15, మార్కండేయ- 52-2-10)

ఈ విధంగా బ్రహ్మ విష్ణువుయొక్క ప్రేరణచేత తీవ్ర తపస్సుచేసి జగత్సృష్టి చేయగలిగినాడు. వాస్తవంలో బ్రహ్మ విష్ణువు యొక్క రూపాంతరమేనని విష్ణు పురాణంలో చెప్పబడింది. శైవపురాణాల ప్రకారం సృష్టిప్రేరకుడు - పరమేశ్వరుడు. సాధారణంగా అన్ని పురాణాలలోనూ ఉన్న సృష్టి ప్రక్రియ ఈ విధంగానే ఉంటుంది. సాంఖ్యులంగీకరించిన 24 తత్త్వాలు పరమేశ్వరునితో కలిసి 25 తత్త్వాలు ప్రతిపాదింపబడి ఉంటాయి.

**ప్రతిసర్గము :** ప్రతిసర్గమనగా ప్రళయము, నైమిత్తిక ప్రళయము, ప్రాకృత ప్రళయము, అత్యంతిక ప్రళయము, నిత్యప్రళయము అని ఇది నాలుగు విధాలు.

**నైమిత్తిక ప్రళయము :** నాలుగు యుగాలు ఒక మహాయుగం. వెయ్యి మహాయుగాలు బ్రహ్మయొక్క ఒక దినము. బ్రహ్మదినానికి కల్పమని పేరు. దీనిలో పద్నాలుగుగురు మనువుల కాలం గడుస్తుంది. కల్పమైన తరువాత అంత కాలంపాటు ప్రళయమేర్పడుతుంది. ఆ సమయంలో భూర్భువః స్వర్లోకాలు ప్రళయం చెందుతాయి. మహర్జనః తపః సత్యలోకాలు మాత్రము అలాగే ఉండి పోతాయి. ఆ సమయంలో సకల ప్రపంచాన్ని తనలోపల ఇముడ్చుకొని బ్రహ్మ, పిమ్మట శేషశాయి ఐన నారాయణుడు నిద్రిస్తారు. బ్రహ్మ శయనించడం అనే నిమిత్తంవల్ల కలిగినదవడంచేత దీనికి నైమిత్తిక ప్రళయం అని పేరు.

''ఏషనైమిత్తికో నామ మైత్రేయప్రతిసంచరః
నిమిత్తం తత్రయచ్ఛేతే బ్రహ్మరూపధరోహరిః (విష్ణు- 6-4-7)

**2. ప్రాకృత ప్రళయము :** ఇది నైమిత్తిక ప్రళయంకంటె చాలా అధికమైన కాలానికి వస్తుంది. ఆయన లెక్కప్రకారం బ్రహ్మకు నూరు సంవత్సరాల ఆయుర్దాయం పూర్తయిన తరువాత మహాప్రళయం ఏర్పడుతుంది. ఆ సమయంలో పంచమహాభూతాలు, వాటి తన్మాత్రలు, అహంకారం, మహత్తత్త్వము, ఇవన్నీ అవ్యక్త ప్రకృతిలో లీనమైపోతాయి.

**3. అత్యంతిక ప్రళయము:** దీనికి కాలంతో సంబంధం లేదు. జీవుడు జ్ఞానం సంపాదించుకొని ఏ క్షణంలో అజ్ఞానం నుంచి విముక్తుడౌతాడో, ఆ క్షణంలోనే అతనికి ఆత్యంతిక ప్రళయం- అనగా మోక్షం లభిస్తుంది.

**4. నిత్యప్రళయం :** ప్రపంచంలో ఉన్న పదార్థాలన్నింటిలోను, ప్రతి క్షణంలోను క్రొత్తక్రొత్త పరిణామాలు కలుగుతూనే ఉంటాయి. ఇదే నిత్య ప్రళయము.

## మన్వంతరాలు

కృతయుగం (దీనికే సత్యయుగం అని కూడా పేరు) (17,28,000 సంవత్సరాలు), త్రేతాయుగం (12,96 000 సంవత్సరాలు) ద్వాపరయుగం (8,64,000 సంవత్సరాలు) కలియుగం (4 32,000 సంవత్సరాలు) అని నాలుగు యుగాలు. మొత్తం నాలుగు యుగాలూ కలిస్తే మహాయుగం (43,20,000 సంవత్సరాలు) వెయ్యి మహాయుగాలు ఒక బ్రహ్మ దినము. బ్రహ్మరాత్రికూడా అన్ని సంవత్సరాలే. బ్రహ్మ దినకాలంలో 14 మన్వంతరాలు వాటికి 14 గురు మనువులు ప్రభువులు. వీరిపేర్లు- స్వాయంభువమనువు, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చక్షుష, వైవస్వత, సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి. రుద్రసావర్ణి, దేవ సావర్ణి, ఇంద్రసావర్ణి, చివరి ఇద్దరి మనువుల పేర్లు కొన్ని పురాణాలలో రుచి, భౌమ అని, కొన్నింటిలో రౌచ్య, భౌమ్య అని ఉన్నవి. ఆయా మన్వంతరాలకు చెందిన మనువుల చరిత్ర పురాణాలలో వర్ణింపబడుతుంది. ప్రతి మన్వంతరంలోనూ ఐదు విధాల ఆధికారిక పురుషులుంటారు - మనువు, సప్తఋషులు, దేవతలు, ఇంద్రుడు, మనుపుత్రులు. మనుపుత్రు లనగా మనువంశీయులై భూమిని పాలించే క్షత్రియులు లేదా మనువు ఉపదేశించిన పద్ధతిలో ప్రజాపాలన చేసేవారు. హరి ఒక అంశావతారంతో ప్రతీ మన్వంతరంలోనూ అధికారికపురుషుడుగా ఉంటాడని భాగవతం చెబుతున్నది-

"మన్వంతరం మనుర్దేవాః మనుపుత్రాః సురేశ్వరాః
ఋషయోంశావతారశ్చ హరేః షడ్విధముచ్యతే (భాగవ 12-7-5)

ఈ అధికారిక పురుషులు ఆ మన్వంతరం అయిపోయినతోడనే అధికారనివృత్తులౌతారు. క్రొత్త మన్వంతరంలో క్రొత్త అధికారిక పురుషులు వస్తూ ఉంటారు. ఈ మన్వంతరాల వర్ణన ఆయా మానవుల చరిత్ర - మార్కండేయాది పురాణాలలో విస్తృతంగాను, కొన్నింటిలో సంక్షిప్తంగాను వర్ణించబడినది.

ప్రస్తుతం నడుస్తూ ఉన్నది వైవస్వత మన్వంతరము ప్రతి మన్వంతరంలోను అధికారిక పురుషుల పేర్లు వేరువేరుగా ఉంటాయి. సూర్యకుమారుడైన

శ్రాద్ధదేవుడు మనువు. ఇతడే వైవస్వత మనువు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుత్తులు, అశ్వినీదేవతలు, ఋభువు- వీరు దేవగణము. దేవ రాజైన ఇంద్రుని పేరు పురందరుడు. కశ్యప- అత్రి- వశిష్ట- విశ్వామిత్ర- గౌతమ - జమదగ్ని - భారద్వాజులు సప్తర్షులు. ఇక్ష్వాకు - నృగ - దృష్ట - శర్యాతి- నారిష్యంత- సాభాగ- అరిష్ట- కరూష- పృషద్ధ్రులు అనే తొమ్మండుగురు మనుపుత్రులు. భాగవతానుసారం వసుమంతుడు పదవవాడు. ఇది మన్వంతరాలకు సంబంధించిన సంక్షిప్త పరిచయం.

## ఇతర విషయాలు

ప్రతి పురాణంలోను ధర్మశాస్త్రానికి సంబంధించిన విషయాలు చెప్పబడినవి. నిబంధ గ్రంథాలలో (ధర్మసింధు, నిర్ణయసింధు మొదలైన నిబంధ గ్రంథాలు) ఆయా ధర్మ విషయాలను చర్చించేటప్పుడు అనేక పురాణ వాక్యాలు ప్రమాణంగా చూపబడినవి.

**అవతారవాదము :** అవతారవాదం పురాణాలలో చాలా ప్రధానమైనది వైష్ణవ పురాణాలలో విష్ణ్వవతారాలు శైవపురాణాలలో శివావతారాలు వారి చరిత్రలూ విపులంగా వర్ణించబడినవి దీనికి అనుబంధంగా భక్తియొక్క వైశిష్ట్యము భక్తుల చరిత్రలూ వర్ణించబడినవి.

అనేక పురాణాలలో దానాల మహాత్మ్యమూ వివిధ దానాలవలన కలిగే ఫలాలు అతి విస్తృతంగా చెప్పబడినవి. దానసాగరం వంటి నిబంధ గ్రంథాలు రచించి బల్లాలసేనుడు మొదలైన రచయితలు పురాణాలనించి ఎన్నో దాన విషయక విషయాలు సంగ్రహించి ఉన్నారు.

వైదికమతంలో అతిప్రధానమైనది, సాధారణంగా ఇతర మతాలలో అంతగా కనబడనిదీ అయిన ఒక విశేషం పితృదేవతా పూజ. శ్రద్ధగా చేయదగినదవడం చేత దీనికి శ్రాద్ధమని పేరు. ఈ శ్రాద్ధకు సంబంధించిన కాలము, పదార్థములు, వ్యక్తులు మొదలైన ఎన్నో అంశాలు పురాణాలలో అత్యధికంగా వర్ణించబడినది.

పుణ్యతీర్థయాత్ర ప్రతి భారతీయునికి అవశ్యాచరణీయమని ఈనాడు కూడా విశ్వాసం ఉన్నది. కన్యాకుమారి మొదలు కాశ్మీరంవరకు ఉన్న భారతావనిలో వేలాది పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. పురాణాలలో ఈ పుణ్య

క్షేత్ర వర్ణనం అతి విపులంగా చేయబడినది. ముఖ్యమైన కాశీ- గయా- ప్రయాగాది క్షేత్రాల మహాత్మ్యాలు అనేక పురాణాలలో వర్ణింపబడినవి. అనేక ప్రసిద్ధాలైన పుణ్యక్షేత్రాల మహాత్మ్యాలు తత్తత్ప్రాంతాలలో రచితములైన పురాణాలలో వర్ణింపబడినవి.

ఆయా కాలాలలో ఆయా దేవతలను ఉద్దేశించి నియమ పూర్వకంగా చేసే పూజా విధానాలకు వ్రతాలని పేరు. అలాంటి వ్రతాలు పందలకొలది పురాణాలలో ముఖ్యంగా స్కాందపురాణాదులలో వర్ణింపబడినవి. ప్రతి మానవుని మనస్సు ఏదో విధంగా పరమాత్మను ఏదో రూపంలో స్మరిస్తూ ఉండేటట్లు చేయడమే ఈ వ్రతాల ప్రధాన లక్ష్యము.

పురాణాలు కేవలం పరలోకానికి మాత్రమే సంబంధించిన విషయాలను కాకుండా సామాజిక విషయాలను కూడా అత్యధికంగా ప్రతిపాదించి ఉన్నాయి. వర్ణాశ్రమ ధర్మాలు, రాజధర్మాలు, సామాన్య నీతి మార్గమూ- ఈ విషయాలను గూర్చి బోధించని పురాణం ఒక్కటి కూడా లేదు. ఆయా కాలాలలో ఉన్న సాంఘిక- రాజకీయ- మత సంబద్ధ పరిస్థితులు పురాణాలలో మనకు లభించినట్లు మరెక్కడా లభించవు.

పురాణాలలో అనేక విద్యలు వర్ణింపబడినది. అగ్ని- గరుడ- నారద పురాణాదులు విజ్ఞాన సర్వస్వాలని చెప్పవచ్చును. ఆ కాలంలో ప్రచారంలో ఉన్న, లోకోపయుక్తాలయిన వైజ్ఞానిక విషయాలు, వివిధ కళలకు, శిల్పాలకు సంబంధించిన విషయాలు, వివిధ కళలకు, శిల్పాలకు సంబంధించిన విషయాలు కూడా పురాణాలలో పొందుపరచబడి ఉన్నవి.

**అశ్వశాస్త్రము, గజశాస్త్రము :** అశ్వాల జాతులు వాటిని నడిపించే పద్ధతులు, వాటి రోగాలూ, చికిత్సలూ, అగ్ని పురాణాదులలో గరుడ పురాణాదులలో విస్తృతంగా ప్రతిపాదింపబడి ఉన్నాయి. ఇదే విధంగా గజశాస్త్రంలో కూడా ఉన్నాయి. సోమపుత్రు డనేవాడు గజవైద్య ప్రవర్తకుడని మత్స్య పురాణంలో చెప్పబడినది. అగ్నిపురాణం 291 వ అధ్యాయంలో గజశాంతి చెప్పబడినది. 282 వ అధ్యాయంలో గోచికిత్స ప్రత్యేకంగా చెప్పబడినది.

**ఆయుర్వేదము :** ఆయుర్వేదం సర్వజనోపయోగి. దీనిని గూర్చిన విస్తృత వివరణము పురాణాలలో ఉన్నది. ప్రధానంగా గరుడ-అగ్ని పురాణాలు

అతి వివరంగా జ్వర-రక్త-పిత్త-కాస-శ్వాసాది రోగాల విధానమూ అనేకమైన ఓషధుల పేర్లూ, ద్రవ్యగుణము మొదలైన విషయాలను వర్ణించి ఔషధ నిర్మాణ కల్పాలెన్నో బోధించినది. ధన్వంతరి విశ్వామిత్ర పుత్రుడైన సుశ్రుతునికి ఈ విద్యను బోధించినట్లుగా పేర్కొనబడినది. కాశీరాజైన దివోదాసుడే ధన్వంతరి యట.

వృక్షాలకు లతలకు కలిగే చీడలూ, తన్నివారణోపాయాలూ కూడా వృక్షాయుర్వేద భాగంలో అగ్ని పురాణాదులలో వర్ణించబడినవి.

**రత్నపరీక్ష** : మణి మంత్రౌషధాల ప్రభావం ఊహింపరానిదని ఈనాడు కూడా విజ్ఞుల విశ్వాసము విభిన్న రత్నాలు ధరించడమువల్లా, వాటిని గృహాలలో ఉంచుకొనడంవల్లా అపూర్వ శక్తులు లభిస్తాయి. రోగాదులు నశిస్తాయి. అందుచేత అలాంటి రత్నాల పరీక్ష పురాణాలలో చెప్పబడినది. పురుగులు తొలిచివేయడం, రంగులో మార్పు మొదలైన దోషాలు ఉన్నట్లయితే రత్నాలు లాభానికి బదులు నష్టం కలుగచేస్తాయి. అందుచేత ప్రాచీన శాస్త్రాలలో రత్నపరీక్ష ఒక ప్రధాన విషయంగా ఉండేది. గరుడ పురాణంలో దాదాపు 12 అధ్యాయాలలో రత్నపరీక్ష చెప్పబడినది. వజ్ర- ముక్తాఫల- పద్మరాగ- మరకత- ఇంద్రనీల- వైడూర్య- పుష్పరాగ- కర్కేతన- పులక- రుధిరరత్న- స్ఫటిక- విద్రుమాలను గూర్చిన సువిస్తృత వర్ణన ఉన్నది.

**వాస్తువిద్య** : దేవాలయ రాజభవనాదుల నిర్మాణానికి సంబంధించిన శాస్త్రానికి వాస్తువిద్య అని పేరు. మత్స్య పురాణంలో ఇది పద్దెనిమిది అధ్యాయాలలో అతి విస్తృతంగా ప్రతిపాదింపబడినది. అగ్ని - గరుడ - విష్ణు-ధర్మోత్తర పురాణాలలో కూడా ఈ విషయం వర్ణింపబడినది. 1) వాస్తు విద్యకు సంబంధించిన మూల సిద్ధాంతాలు; 2) మందిరాది నిర్మాణ ప్రదేశాన్ని ఎన్నుకొని దానిమీద భవన నిర్మాణక్రమ విచారము 3) దేవతామూర్తుల నిర్మాణము, 4) దేవాలయ రాజప్రాసాదాదుల నిర్మాణము:- ఇవి ఈ విద్యలోని విషయాలు. వాస్తు శాస్త్రానికి సంబంధించిన ఎందరో పూర్వ రచయితల పేర్లు (భృగువు, అత్రి, విశ్వకర్మ, మయుడు, నారదుడు, మొ॥) పేర్కొనబడినవి. ప్రాచీన కాలంనుంచీ వస్తున్న స్వతంత్ర గ్రంథాలనుంచి ఈ విషయాలు సంగ్రహించి, పురాణాలలో పొందుపరుపబడినాయని చెప్పడంలో సందేహం లేదు.

**జ్యోతిషము** : సిద్ధాంత భాగమనీ, ముహూర్త భాగమనీ, ఫలభాగమనీ, జ్యోతిషంలో మూడు భాగాలున్నాయి. గ్రహనక్షత్రాదుల సంచారాదులను గూర్చి

చెప్పేది సిద్ధాంత భాగము. శుభాశుభ ముహూర్తాలను నిర్ణయించేది ముహూర్త భాగము. జాతక ఫలాలను చెప్పేది ఫలభాగము. ఈ మూడు భాగాల జ్యోతిః శాస్త్రము కూడా భాగవత, దేవీ భాగవత, గరుడ, అగ్ని, నారద పురాణాలలో నిక్షిప్తమైఉన్నది.

**సాముద్రిక శాస్త్రము :** స్త్రీ పురుషుల వివిధావయవ సన్నివేశ పరిమాణాదులను బట్టి కరతల పాదతలాదులందు ఉండే రేఖలనుబట్టి, దంతరోమ కేశాదులనుబట్టి వారి స్వరూప స్వభావ భాగ్యాదులను నిర్ణయించే శాస్త్రానికి సాముద్రిక శాస్త్రమని పేరు. సముద్రుడనే ముని ప్రాచీన కాలమున ఈ విషయ మును గూర్చి ఒక ప్రామాణిక గ్రంథమును రచించుటచే దీనికి సాముద్రిక శాస్త్రమని పేరు వచ్చినది. ఈ శాస్త్రానికి సంబంధించిన విషయాలు కూడా "అంగవిద్య" అనే పేరుతో పురాణాలలో ప్రతిపాదింపబడినవి. అగ్ని - గరుడ పురాణములలో దీని విస్తృత వర్ణనమున్నది.

**ధనుర్విద్య :** అనాడు ప్రచారములోఉన్న వివిధ ప్రయోగాదులను బోధించువిద్య ధనుర్విద్య ఆ కాలములో ధనుస్సుకు ఎక్కువ ప్రాధాన్యముండుటచే ఇతర ఆయుధములన్నీ వర్ణించిన ఈ శాస్త్రానికి ధనుర్విద్య అని పేరువచ్చినది. ఇదికూడా అగ్నిపురాణంలో నాలుగు అధ్యాయాలలో ప్రతిపాదింపబడినది.

పురాణాలలో ఆయా ఉపాఖ్యానాలలో ప్రసంగవశంచేత కొన్ని విచిత్ర విద్యలు ప్రతిపాదించబడినవి, ఆధునిక యుగంలో చాలామంది వాటియందు అంతగా విశ్వాసములేనట్లు మాట్లాడుతూ ఉంటారుగానీ అనాదికాలంనుంచీ నేటి వరకు మనదేశములోనేకాదు సకల దేశాలలోనూ కూడా వాటిప్రయోగప్రచారాలు జరుగుతూనే ఉన్నాయి.

**అనలేపనవిద్య :** మార్కండేయ పురాణంలో ఒకపాదలేపనము వర్ణింపబడినది. దానిని పాదాలకు పూసుకున్నట్లయితే ఒక దివసంలో సహస్రయోజనాల యాత్ర చేయవచ్చును. ఈ విషయము మనుచరిత్ర చదివిన ఆంధ్రులందరికీ సువిదితమే.

**స్వేచ్ఛా రూపధారిణీ విద్య :** ఇష్టము వచ్చిన రూపం ధరించగలశక్తి మార్కండేయ పురాణంలో- కంధరుడు విద్యుద్రూపుడనే రాక్షసుణ్ణి సంహరించగా అతని భార్య ఈ విద్యచేత యక్షిణిగా మారి కంధరుని ఇంట్లో ప్రవే

శించి బాధించినకథ ఉన్నది" అట్లే మహిషాసురుడు స్వేచ్ఛచేత-సింహము, యోధుడు, ఏనుగు, మహిషము మొదలైనరూపాలను ధరించగలిగినాడు.

**అస్త్రగ్రామ హృదయ విద్య** : ఈ విద్యాబలంచేత సకలాస్త్రాల రహస్యాలను తెలుసుకుని శత్రువులను జయింపగలుగుతారు. మనోరమ స్వారోచిషునకు ఈ విద్యను ఉపదేశించిన విధానము మార్కండేయ పురాణంలో చెప్పబడినది.

**సర్వభూతరుత విద్య** : ఈ విద్య చేత పశుపక్షికీటకాదులు ధ్వనుల (భాషల) అర్థం తెలుసుకొనవచ్చును. మందారుడనే విద్యాధరుని కూతురైన విభావరి స్వారోచిషునికి ఈ విద్యను కట్నంగా ఇచ్చినదని మార్కండేయ పురాణంలో ఉన్నది. బ్రహ్మదత్తుడనే రాజు ఈ విద్యచేత చీమల ప్రేమాలాపములను అర్థంచేసుకో గలిగినాడట (మత్స్యపురాణం పద్మపురాణం).

**పద్మినీ విద్య** : ఈ విద్యచేత నిధులను కనుగొని వశంచేసుకోవచ్చును. కళావతి స్వారోచిషునకు ఈ విద్యను ఇచ్చెనట. (మా. పు.)

**రక్షోఘ్న విద్య** : యజ్ఞాలను అపవిత్రంచేసే రాక్షసులను సంహరించే విద్య, ఖలాకుడనే రాక్షసుడు దీని చేతనే చంపబడినట్లు మార్కండేయపురాణ గాథ ఉన్నది.

ఈ విధంగా ఇంకా ఎన్నో విద్యలు- 'జాలంధరీ విద్య' (అంతర్ధానం చెందే విద్య) 'విద్యాగోపాలమంత్రం (వాక్సిద్ధి కలిగేది)' పరాబాలా విద్య (సర్వసిద్ధిప్రదాయని) పురుషప్రమోహినీ విద్య, 'ఉల్లాపనా విధాన విద్య (సక్రమమైన దానిని ఋజువుగా చేసేది) ' దేవ హూతి విద్య' (దేవతలను పిలువగలిగినది) 'యుపకరణ విద్య' వజ్ర వాహనికా విద్య (శత్రు సంహారకము) 'సింహవిద్య' 'నరసింహవిద్య' 'గాంధారీ విద్య' 'అంతర్ధాన విద్య' 'వైష్ణవీ విద్య' త్రైలోక్య విజయ విద్య మొ॥ ఇంకా ఎన్నో చెప్పబడినవి.

అన్ని పురాణాలలోనూ భూగోళ వర్ణనము చేయబడినది. కొన్నింటిలో అతివిస్తృతంగా ఉన్నది. దీని పరిశీలనమే ఒక మహాకార్యము. ఈ పురాణాలలో సకల భూగోళ వర్ణనమూ— భారతవర్షమూ కూడా ఉన్నవి. వాయు పురాణాదులలో నాలుగు ద్వీపాలు చెప్పబడినవి. మేరుపర్వతము దానికి నాలుగు పక్కలా తూర్పున భద్రాశ్వద్వీపము, దక్షిణాన జంబూ ద్వీపము, పశ్చిమాన కేతుమాలద్వీపము, ఉత్తరదిక్కున ఉత్తర కురు (దేశము) ద్వీపము ఉన్నవి.

భద్రాశ్వద్వీపము చైనాదేశం కావచ్చును. జంబూద్వీపము- మన దేశము. కేతమాలము ఆక్సస్ నదీ ప్రాంతము. ఉత్తరకురు దేశము అల్తాయీ పర్వతశ్రేణులు మొదలు ఉత్తర సముద్రంవరకు వ్యాపించిన దేశము. ఇది ఈనాడు శీతలదేశంగా ఉన్నా ఒకానొకప్పుడు సకల సౌఖ్యసమృద్ధంగా ఉన్నట్లు పురాణగత వర్ణనలవల్ల తెలుస్తోంది.

కొన్ని పురాణాలలో జంబూ- ప్లక్ష- శాల్మలి- కోశద్వీప- క్రౌంచ- శాక- పుష్కర ద్వీపాలనే ఏడు ద్వీపాల వర్ణన ఉన్నది. ఇది కేవలం ఊహామాత్రా కృతద్వీప వర్ణనం కాదనీ, కొన్నింటిని ఇప్పుడు గుర్తించడం శక్యమే ననీ పేర్లు మొదలైన వాటిని జాగ్రత్తగా పరిశీలించి వర్ణిత విషయాలను పురస్కరించుకుని ఇతరద్వీపాలను కూడా గుర్తించవచ్చునని పండితులు అభిప్రాయము. ఇథియోపియా దేశ ప్రాంతం కుశద్వీపం కావచ్చునని కొందరి అభిప్రాయం ఈజిప్టుకి వెలుపల, ఆఫ్రికా ఈశాన్య ప్రాంతం శకద్వీపమనీ కొందరి అభిప్రాయం. నేటి సిథియా శకద్వీపమని పండితులు పురాణాలలో కనబడే నదీపర్వతాదుల అతి విస్తృతమైన వర్ణనములను బట్టి గుర్తించగలిగినారు. పాతాళమనగా మెక్సికో పెరూ ప్రాంతమని కొందరి అభిప్రాయం. మయ సంస్కృతికి స్థానం మెక్సికో. ఇదేవిధంగా ఇతర ద్వీపాలను కూడా నిరంతర పరిశీలన ద్వారా గుర్తించ వచ్చును. పురాణాలలో చెప్పిన మేరుపర్వతం పామీర్ పర్వతమని పండితుల అభిప్రాయం. హిమాలయానికి ఉత్తరాన మేరు పర్వతం ఉన్నదనీ, ఈ రెండు పర్వతాల మధ్య హేమకూట, నిషధ పర్వతాలున్నాయని, పురాణాలు చెప్తూన్నాయి. హిమాలయ, పామీర్ పర్వతాల మధ్యనున్న కుధ్ నలూన్‌ధియేన్ శాన్ పర్వతశ్రేణులే ఈ హేమకూట నిషధ పర్వతాలై ఉంటాయి

**భారతవర్షము :** భారతవర్షానికి పూర్వకాలం అజనాభ వర్షము, హైమవత వర్షము అని రెండు పేర్లు ఉండేవి. అజనాభమనగా అజుని (అనగా జన్మలేని శ్రీమహా విష్ణువు యొక్క) నాభిస్థానమని అర్థము. అనగా విష్ణువు నాభికమలంలో ఆవిర్భవించిన బ్రహ్మదేవుడు మొట్ట మొదట సృజించిన వర్షము అని అర్థము. హిమవత్పర్వతము చాలా ప్రధానమైన దగుటచే హైమవతవర్షము అని కూడా పేరు.

భారతమనే పేరు రావడానికి మత్స్య పురాణం తప్ప పురాణాలన్నింటి లోనూ ఒకే వ్యుత్పత్తి చెప్పబడినది. స్వాయంభువ మనువు కుమారుడు నాభి

అతని కుమారుడు ఋషభుడు, ఋషభుని నూరుగురు కుమారులలో పెద్దవాడు భరతుడు. ఇతనిని బట్టి "అజనాభవర్షము" "భరతవర్షము" అయినది. కూర్మ పురాణం ప్రకారం ప్రజలను భరించడం వలన మనువుకే భరతుడని పేరు. అందుచే భరతవర్షమని పేరు వచ్చినది. ఐతే శకుంతలా పుత్రుడైన భరతుని బట్టి ఈ దేశానికి ఈ పేరు వచ్చిందని చెప్పడానికి పౌరాణికాధారం ఏదీలేదు.

భారతఖండాన్ని నవఖండాలుగా విభజిస్తూ పురాణాలలో వర్ణనం ఉన్నది. గుప్తుల కాలంలో భారత సంస్కృతి వివిధ ప్రాంతాలలో వ్యాపించినది. అప్పటి నించి ఈ నవద్వీప వర్ణనము ప్రారంభమైనదని విమర్శకుల అభిప్రాయము.

"భారతస్యాచ వర్షస్య నవ భేదాన్ నిబోధత
ఇంద్రద్వీపః కసేరుశ్చ తామ్రపర్ణో గభస్తిమాన్
నాగద్వీపస్తథాసౌమ్యో గన్ధర్వస్త్వ థవారుణః
అయంతునవ మస్తేషాం ద్వీపః సాగర సంవృతః

(మత్స్య-114-7-8)

ఇంద్రద్వీపము, కసేరు, తామ్రపర్ణము, గభస్తిమంతము, నాగద్వీపము. సౌమ్యము, వారుణము, భారతము.

మత్స్య పురాణంలో "అయంతునవమః" "ఇది తొమ్మిదవది" అని చెప్పబడినదిగాని, ఆ "ఇది" ఏదో చెప్పలేదు. కానీ, వామన పురాణంలో-

"అయంతు నవమస్తేషాం ద్వీపః సాగర సంవృతః
కుమారాఖ్యః పరిఖ్యాతో ద్వీపోఽయం దక్షిణోత్తరః"

(వామ-13-11)

అని, తొమ్మిదవదాని పేరు 'కుమారద్వీపము'ని చెప్పబడినది. భారతదేశానికే కుమారఖండము అని పేరు. కన్యాకుమారి వరకు, గంగోత్పత్తి స్థానం వరకు ఉన్న ఖండం కుమారఖండమని మత్స్య, వాయు పురాణాలు చెప్పుచున్నాయి.

"ఆయతస్తు కుమారీతో గంగాయాః ప్రభవావధి" (మత్స్య-114-10)
"ఆయతో హ్యా కుమారిక్యా దాగంగా ప్రభవాచ్చవై
తిర్యగుత్తర విస్తీర్ణః సహస్రాణినవైవతు" (వాయు పు-45-8)

వీటిలో ఏడింటిని గుర్తించడం జరిగినది. 1) ఇంద్రద్వీపము = అండమాన్ ద్వీపము: 2) నాగద్వీపము = నికోబార్ ద్వీపము 3) తామ్రపర్ణము = లంక; 4) వారుణ ద్వీపము = బోర్నియా 5) కసేరుమాన్ ద్వీపము = మలయా. కుమార ద్వీపము = భారతము. ఈ నాడు గ్రేట్ ఇండియా అనేదానికి ఇది చాలావరకు సరిపోతుంది.

కుమారద్వీపానికి పూర్వోత్తర సరిహద్దుల్లో కిరాతులు, పశ్చిమోత్తర సీమలో యవనులు ఉన్నారని మత్స్య, మార్కండేయ పురాణాలలో చెప్పబడినది. క్రీ.పూ. నాల్గవ శతాబ్ద ప్రాంతంలో బాక్ట్రియాలో నివసిస్తూ తరువాత గాంధార, కాబూల్ ప్రాంతాలను ఆక్రమించిన యవనులే వీరు. వామన పురాణం ప్రకారం దక్షిణంలో ఆంధ్రులు, ఉత్తరాన తురుష్కులూ ఉండేవారు. ఇది కాలా తరంలో జరిగిన మార్పులను సూచిస్తున్నది. ప్రథమ, ద్వితీయ శతాబ్దాల ప్రాంతంలో ఆంధ్ర శాతవాహన రాజ్యం, దక్షిణాన పూర్వ పశ్చిమ సముద్రతీరాలవరకు వ్యాపించింది. ఉత్తరదేశంలో కుషానులు మొదలైన వారు రాజ్యం ఏర్పరచుకొన్నారు. ఈ ఐతిహాసికమైన మార్పును వామనపురాణం సూచిస్తున్నది. భారత దేశంలోని పర్వతాలూ, నదులూ మొదలగువాటి అతివిస్తృతమూ, యదార్థమూ అయిన వర్ణనము మార్కండేయ పురాణములో ఉన్నది.

**పురాణాలలోని ఐతిహాసిక సత్యాలు :**

పురాణాలలో చెప్పిన అనేక ఐతిహాసిక విషయాలు యదార్థములే అన్న విషయం పండితుల పరిశోధనల వల్ల తేలింది. కొన్ని శిలా లేఖలు, ముద్రలు మొదలైనవి లభించడంతో అంతవరకు పుక్కిటి పురాణాలని చెప్పబడినవి, చక్కటి చరిత్ర గాధలుగా అంగీకరింపబడుతున్నాయి. వాయుబ్రహ్మాండ పురాణాలలో వర్ణించిన వాకాటిక రాజుల చరిత్ర నిజమైనదేనని, తామ్రపత్రాదుల ద్వారా నిరూపింపబడినది. వింధ్య శక్తియొక్క కుమారుడైన ప్రవీరుడు అశ్వమేధ రాజసూయాలు చేసినట్లుగా పురాణాలలో చెప్పబడినది. ఆ ప్రవీరుడు మొదటి ప్రవరసేనుడనీ, అతడు ఆ యజ్ఞాలు చేసినాడనీ తామ్రపత్రాల ప్రామాణ్యాన్ని బట్టి నిర్ణయింపబడినది. ఈ ప్రవరసేనునికి నలుగురు కుమారులని పురాణప్రసిద్ధి. గౌతమీ పుత్రుడనే ఒకే పుత్రుడుండేవాడని ఇతిహాసికులు అభిప్రాయపడేవారు అయితే కొన్ని ముద్రలద్వారా సర్వసేనుడనే మరొక కుమారుడు కూడా ఉన్నట్లు తెలియవచ్చింది. బహుశః మిగిలిన ఇద్దరి పుత్రుల పేర్లు కూడా మున్ముందు తెలియవచ్చును. ఆంధ్రరాజుల విషయంలో కూడా అనేకమైన ఐతిహాసిక సత్యాలు వాయుపురాణాదుల ద్వారా బయటపడినవి. ఇదే విధంగా పురాణాల సహాయంతోనే ఐతిహాసికులు శిశునాగ-నంద - శుంగ-కణ్వ-ఆంధ్రభృత్య- నాగవంశాదులకు చెందిన రాజుల చరిత్రను పునర్నిర్మింప కలిగినారు. చరిత్రకు అందని సూర్యచంద్రాది వంశాలకు చెందిన రాజుల చరిత్ర

అతి విస్తృతంగా అన్ని పురాణాలలోనూ కనబడుతూనే ఉన్నాయి. వీరిలో కొందరి రాజుల పేర్లు అతిప్రాచీనమైన వైదిక వాఙ్మయంలో కూడా చెప్పబడి ఉన్నాయి. వీరి విషయంలో శిలాలేఖ- తామ్రపత్ర- ముద్రాదులు లభించనంత మాత్రాన ఈ వర్ణనల నన్నింటినీ సత్యదూరాలని కొట్టివేయవలసిన పనిలేదు.

**ఉపసంహారము :** ఈ సంక్షిప్తపరిచయాన్ని బట్టి పురాణ వాఙ్మయం ఎంత విస్తృతమైనదో, ఎంత విషయ వైవిధ్యం కలదో స్పష్టం ఔతుంది. వైదిక ధర్మాన్ని సామాన్య మానవులకు అందుబాటులో ఉండేటట్లు చేయడమే కాకుండా భిన్నభిన్న కాలాలలో ఆవిర్భవించిన వివిధ విద్యల సారాన్ని కూడా ఒకచోట నిక్షిప్తంచేసి సకలజనోపకారం చేయడం కూడా పురాణాల ప్రధాన లక్ష్యము. కాలం మార్పుతో పురాణాలలో కూడా నూతన విషయ చరిత్రాది సంకలనంద్వారా మార్పులు చేయబడుతూ వచ్చినవి. ఈ విషయం వెనుక ఉదాహరించిన స్కాందపురాణాంతర్గత కుమారికా ఖండంలోని ''ఇతిహాసపురాణాని భిద్యన్తే లోక గౌరవాత్'' అనే వాక్యంవల్ల స్పష్టం ఔతూనే ఉన్నది. పురాణాలలో ప్రతిపాదించిన విషయాలను సంక్షిప్తంగా వెనుక పరిశీలించి ఉన్నాము. వాటి సంక్షిప్త పరిచయం పురాణవాక్యాలలోనే ఏ విధంగా చెప్పబడినదో చూద్దాం—

"పురాణేష్వేవ బహవో ధర్మాస్తే నిరూపితాః
రాగిణాంచ విరాగాణాం యతీనాం బ్రహ్మచారిణామ్
గృహస్థానాం వనస్థానాం స్త్రీ శూద్రాణాం విశేషతః
బ్రాహ్మణ క్షత్రియ విశాం యే చ సంకరజాతయః
గఙ్గాద్యాయా మహానద్యో యజ్ఞావ్రత తపాంసిచ
అనేక విధ దానాని, యమాశ్చ నియమైః సహ
యోగధర్మా బహువిధాః సాంఖ్యా భాగవతా స్తథా
భక్తిమార్గా జ్ఞానమార్గా వైరాగ్యానిల నీరజాః
ఉపాసనా విధిశ్ప్రోక్తః కర్మ సంశుద్ధ చేతసామ్
బ్రాహ్మం శైవం చ సౌరం శాక్తం తథార్హతమ్
షడ్దర్శనాని చోక్తాని స్వభావ నియతాని చ'' (వాయు అ 104)

అష్టాదశ మహాపురాణాలే కాకుండా ఉపపురాణాలనే పేరుతోటి మరొక పేరుతోటి ఇంకా చాలా పురాణాలు ఉన్నవనే విషయం పైన చూచి ఉన్నాము

పురాణం అనే పేరు చెప్పగానే అది వ్యాసరచితం అనే ఒకమాట ప్రచారంలో ఉన్నది. అది ఎంత అసంగతమో పురాణాలను ఏమాత్రం పరిశీలించినా స్పష్టం అవుతుంది. వ్యాసుడే రచించినాడని పట్టుదల ఉంటే మాత్రం ఆ వ్యాసుడు ఒక్కడు కాదనీ, అనేక వ్యాసులు- ఎన్ని పురాణాలు మనకు వేరువేరుగా కన బడుతున్నాయో అందరు వ్యాసులు ఉన్నారనీ అంగీకరించవలసి ఉంటుంది, ఇరవై ఏడుగురు వ్యాసులున్నట్లు పురాణాలలోనే చెప్పబడినది కదా! ఇతర ప్రమాణాలను బట్టి వేరువేరు కాలాలలో జరిగినట్లుగా నిశ్చితమైన విషయా లన్నింటినీ పొందుపరచిన పురాణాలన్నీ ఒకే కాలంలో రచింపబడినాయని ఎలా అంగీకరించడం? భవిష్యత్తులో జరిగేవాటిని ముందుగానే దివ్యదృష్టితో చూచి వ్రాసినాడని చెప్పేవాదం కేవలం బాలురను మభ్యపెట్టే వాదం భవిష్యత్కాలం ప్రయోగించినంత మాత్రాన అదొక కథాకథన పద్ధతి అని మాత్రమే చెప్ప గలంగానీ ఎప్పుడో జరిగే దానిని పూర్వమే వ్రాసినారనడం యుక్తం కాదు. భవిష్యత్పురాణంలో పృథ్వీరాజాదుల చరిత్ర, మొగల్ సామ్రాట్టుల చరిత్ర కూడా ఉన్నాయి. ఆంగ్లేయుల ఆగమనం కూడా సూచింపబడినది. అంతా భవిష్యత్కాలిక క్రియా ప్రయోగంతో నడిచినది. ఇప్పుడు దాని పునర్ముద్రణం జరిగే పక్షంలో ఇందిరాగాంధీ చరిత్ర వరకూ అది నడిచే అవకాశం లేక పోలేదు.

పురాణాలు వ్యాస రచితాలని చెప్పగాన్ని వెనుక సూచించినట్లు ఒక విధంగా సమర్థించవచ్చును. అతిప్రాచీనమైన పురాణాన్ని ఒక దానిని వ్యాసుడు ఒక నిశ్చితరూపంలో సంహితగా వ్రాసినాడు. ఆయన శిష్యుడైన సూతుడు అదే మార్గంలో మరొక సంహితనూ, ఆయన ఆరుగురి శిష్యులలో ముగ్గురు ఇరి మూడు సంహితలనూ రచించినారు. ఈ విషయం పురాణాలలోనే ఉన్నది కదా! ఆ సంహితా పంచకం చూపించినమార్గంలో ఇతరులు ఇతర పురాణాలు రచించినారు. మనకిప్పుడు లభించేవి అవే.

''పురాణం'' అనేది ఒక సాహిత్య ప్రక్రియగా పూర్వకాలంలో ప్రచా రంలో ఉన్నది. అష్టాదశవర్ణనలున్నట్లయితే మహాకావ్యం అన్నట్లు, ఒకటిరెండు వర్ణనలు లేకపోయినా దోషం లేదన్నట్లు, పంచలక్షణాలుంటే పురాణం అన్నారు. మహాకావ్య రచనకూ, తల్లక్షణ నిర్ణయానికీ మార్గదర్శకుడు వాల్మీకి ఐతే, పురాణ రచనకు, తల్లక్షణ ప్రతిపాదనకూదారి చూపినవాడు వ్యాసుడు. ఆదికవిని చాల

మంది కవులు అనుసరించినట్లు ఆదివ్యాసుణ్ణి చాలామంది వ్యాసులు అనుసరించి నారు. అనేక పురాణాలను వ్రాసినారు.

పూర్వం బౌద్ధజైన మతాల ప్రాబల్యంవల్ల వైదిక మతానికి చాలా అఘాతం కలిగింది త్రైవర్ణికేతరులు విద్యలకు దూరం అవడంచేత ఆ మతప్రచారకులుచూపే ప్రలోభాలకు లొంగిపోయి వైదికమతంనుంచి దూరం కాసాగారు. ఆ ప్రవృత్తిని అరికట్టడంకోసం, వైదిక మత సిద్ధాంతాలు అందరికీ అందుబాటులో ఉండడానికి, తత్తద్దేవతారాధనలచేత తత్తద్వ్రతాద్యాచరణలచేత ప్రతి ఒక్కరికీ తమకు కూడా తరుణోపాయం ఉన్నదని మానసిక సంతృప్తిని కలిగించడం ద్వారా వైదికమత ప్రచారానికి ఆయాకాలాలలో ముఖ్యంగా గుప్త యుగం నుండి రచింపబడిన ప్రక్రియావైశిష్ట్యం గల గ్రంథాలు— పురాణాలు ఈనాడు మనం చెప్పే Mass Education (జనసామాన్యవిద్య) అనేదానిని కూడా పురాణ ప్రవచనాలద్వారా సాధించేవారు. ఆ రోజులలో బౌద్ధజైనాదుల ప్రలోభనాలు ఏ విధంగా ఉండేవో సప్తమ శతాబ్దికి చెందిన మహామీమాంసకుడైన, కుమారిలభట్టు మాటలనుబట్టి తెలుసుకోవచ్చును:-

"శాక్యాదివచనాని తు కతిపయదమదానాది వచయవర్జం సర్వాణ్యేవసమస్త
చతుర్దశ విద్యాస్థాన విరుద్ధాని త్రయీమార్గ వ్యుత్థిత విరుద్ధాచరణైశ్చ
బుద్ధాదిభిః ప్రణీతాని. త్రయీ బాహ్యేభ్యః చతుర్థవర్ణనిరవసిత
ప్రాయేభ్యః వ్యామూఢేభ్యః సమర్పితానీతి నవేదమూలత్వేన సంభావ్యన్తే
(జై. సూ 134 తంత్రవార్తికము)

పురాణాలు అనేక కర్తృకాలనే విషయాన్ని ప్రాచీనులు అంగీకరించినారు. పురాణాలలోనే ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది

శ్రాద్ధ సమయంలో ఇతిహాసపురాణాదులను వినిపించవలెనని మనువు ఆదేశించినాడు.

''స్వాధ్యాయం శ్రావయేత్ పిత్ర్యే ధర్మశాస్త్రాణి చైవహి
ఆఖ్యానానీతిహాసాం శ్చ పురాణాని ఖిలానిచ ''

ఈ శ్లోకానికి వ్యాఖ్యానిస్తూ మేధాతిథి "పురాణాని వ్యాసాది ప్రణీతాని" అని అంటాడు. ''పురాణములనగా వ్యాసుడు మొదలైనవారు రచించినవి'' అని ఈ వాక్యానికి అర్థము.

అదే విధంగా మార్కండేయ పురాణంలో "వేదములు, పురాణములు బ్రహ్మముఖము నుండి బయలుదేరినవి. పరమర్షులు అనేకమైన పురాణ సంహిత లను రచించినారు. వేదాలవిభాగం కూడా వేయి విధాలుగా చేసినారు" అని చెప్ప బడినది.

"పురాణమే తద్వేదాశ్చ ముఖేభ్యోఽను వినిస్సృతాః
పురాణ సంహితాశ్చ క్రుర్బహులాః పరమర్షయః
వేదానాం ప్రతిభాగశ్చ కృత స్తైస్తు సహస్రశః"

(మార్కండేయ 45-20-21)

(బ్రహ్మముఖము నుండి పురాణమ్ = ఒక్క పురాణము బయల్వెడలినది. దాని నాధారంగా చేసుకుని ఎందరో పరమ ఋషింద్రులు (పరమర్షయః = బహు వచనం) పురాణ సంహితలు రచించినారు.

అదే విధంగా "వ్యాసుడు మొదలైనవారు అష్టాదశ పురాణాలను రచించి నారు అవి ధర్మ బోధకములు" అని కూర్మ పురాణంలో చెప్పబడినది.

"అష్టాదశపురాణాని వ్యాసాద్యైః రథితానితం
వియోగాద్బ్రహ్మణో రాజన్ తేషుధర్మః ప్రతిష్ఠితః"

(కూర్మ - పూర్వార్థము 12-2౮8)

ఈ విధంగా పురాణాలు అనేక కర్తృకాలనే విషయం నిర్వివాదాంశం. మార్గ దర్శకుడు వ్యాసుడు కావడంచేత వీటికన్నింటికీ వ్యాసకర్తృకత్వం ఔపచారి కంగా ప్రసిద్ధిలోనికి వచ్చింది ఇలా వస్తు స్థితిని అంగీకరించినంత మాత్రాన పురాణాల వైశిష్ట్యానికి కొరతగాని, వ్యాసుని గౌరవానికి న్యూనత్వంగానీ రాదు.

ఏది ఏమైనా అతి విస్తృతమూ అనితరభాషా సాధారణమూ అయిన ఈ పురాణ వాఙ్మయం ప్రాచీన భారతదేశానికి సంబంధించిన ఐతిహాసిక విషయాలనూ సామాజిక పరిస్థితులనూ ధార్మిక వ్యవస్థలనూ ఆధ్యాత్మిక చింతనాన్నీ ఆధి భౌతిక విచారాలనూ ఆధి దైవికాన్వేషణలనూ సుస్పష్టంగా చూపగలిగిన అద్భుత విద్యాస్థానము వైదేశిక శక్తులు ఎంత ప్రయత్నించినా, వైనాశికులు ఎంత విజృంభించినా, తార్కికమ్మన్యులు ఎంత తాండవం చేసినా, భారతీయ సనాతన మతాన్నీ, సంస్కృతినీ చెక్కు చెదరకుండా కాపాడిన వజ్ర కవచము

శ్రీః శ్రీః శ్రీః

యత్కృపాదేశ స సర్గాన్ని ఒన్థో రచితోమయా
తస్యైవ జానకీ జానేః పదయోరయ మర్ప్యతే

దేవతాను గ్రహః పిత్రో స్తపశ్చాచార్య సత్కృపా
కర్తాస్మద్గ్రన్థ జాతస్య కరణం కేవలం వయమ్

1. "వేదార్థాదధికం మన్యే పురాణార్థం వరాననే
వేదాః ప్రతిష్ఠితాః సర్వే పురాణే నాత్ర సంశయః"

—నారద-పు. 2.24-17

2. "యన్నదృష్టం హి వేదేషు నదృష్టం స్మృతిషు ద్విజాః
ఉభయో ర్యన్నదృష్టంహి తత్పురాణైః ప్రణీయతే"

—ప్రభాసఖండ-2-92

3. యోవేద చతురోవేదాన్ సాఙ్గోపనిషదో ద్విజః
పురాణం నైవ జానాతి నచస స్యాద్విచక్షణః

—బ్రహ్మాండ ప్రక్రి 1-70

1. వేదార్థము కంటె పురాణార్థము అధికమైనది. వేదాలన్నీ పురాణాలలో ఇమిడిపోయినవి.
2. వేదాలలో కనబడనివీ, స్మృతులలో కనబడనివీ, ఆ రెండింటిలో కనబడనివీ పురాణాలలో లభిస్తాయి.
3. సాంగమలైన నాలుగు వేదాలు తెలిసిన వాడైనా పురాణాలు తెలియని వాడు పూర్తి పాండిత్యము కలవాడు కాజాలడు.

# వ్యాససాహిత్యం – సార్వకాలికత

—డా॥ కొత్తపల్లి ఘన శ్యామల ప్రసాదరావు

నమామి కవిమాతంగం వ్యాసం సత్యవతీసుతం ।
యస్యవాఙ్మయగంధేన చర్చితం భువనత్రయమ్ ॥

శ్రీ భగవాన్ వ్యాసమహర్షి చిరంజీవి. ఆయన సాహిత్య సృష్టి సార్వకాలికము, సార్వజనీనము గూడ. ఇది మన దేశమున వేల యేండ్లుగా విజ్ఞులు విశ్వసించిన మాట. సత్యమును పదే పదే మననము చేసికొనుట, దాని యందలి మన విశ్వాసమును సుదృఢ మొనర్చుటకునూ, ఊగిసలాడు మనస్సున్నవారికి విశ్వాసపు టూపిరులు నింపుటకునూ ఉపయోగించును కదా! కానిచో మన యీ వ్యాససాహితీ సందర్శన ప్రయత్నమునకే ప్రయోజన మగుపించదు. ప్రయోజన మాశింపక మందబుద్ధి గూడ ఒక పనిని ప్రారంభింపడనునది లోకానుభవము.

పుట్టినవాడు గిట్టుట తథ్యమని చెప్పిన సంప్రదాయమే కొందరిని చిరంజీవులుగ గూడ చెప్పినచో, అది ఎట్లా విషయమును ప్రతిపాదించినదో వివేకు లాలోచింపవలెను గదా! వ్యాసుడెవరు? మానవుడా? అయినచో అతడు చిరంజీవి యగుట ఎట్లు? ఈ ప్రశ్నలకు మన పురాణ సాహిత్యమున లభించు సమాధానము నాలోచింతము.

శ్లో. అష్టాదశపురాణానికృత్వా సత్యవతీసుతః।
భారతాఖ్యానమతులం చక్రే తదుపబృంహితం॥
మన్వంతరేషు సర్వేషు ద్వాపరే ద్వాపరేయుగే।
ప్రాదుష్కరోషి ధర్మార్థీ పురాణాని యథావిధి॥
ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపేణ సర్వదా।
వేదమేకం స బహుధా కురుతే హితకామ్యయా॥
అల్పాయుషోఽల్పబుద్ధీంశ్చ విప్రాన్ జ్ఞాత్వాకలావధౌ।
పురాణసంహితాం పుణ్యాం కురుతేఽసౌ యుగేయుగే॥
(దేవీ భాగవతం)

సత్యవతీసుతుడైన వ్యాసుడు అష్టాదశ మహా పురాణములను, వాని కుపబృంహణముగా మహాభారతమును రచించెననియూ, ప్రతి మన్వంతరము నందలి, ప్రతి ద్వాపరయుగముననూ వ్యాసుడు, కేవల ధర్మ బుద్ధితో పురాణ ముల నావిర్భవింప జేయుననియూ, వ్యాసుడు విష్ణువే యనియూ, కలియుగమ నందు జనులు మందబుద్ధులగుదురనియూ, వారి కొఱకై వైదిక విజ్ఞాన సార మంతయునూ, తమలో నిముడ్చుకొనిన పురాణములను, వ్యాసుడు, ఆయా సమ యములందు సృష్టించుచునే యుండుననియూ, దేవీ భాగవతములోని పై శ్లోకము లనుబట్టి తెలియుచున్నది. అంతేగాదు, సత్యవతీ సూనుడైన వ్యాసుడు ఈ పరంపరలో ఇరువది ఎనిమిదవ వాడనీ, ఇరువది తొమ్మిదవ ద్వాపరమునందు ద్రోణాచార్యుని పుత్రుడగు అశ్వత్థామ, వ్యాసుడుగా జన్మింప గలడనీ కూడ దేవీ భాగవతమున గలదు. పద్మ పురాణమునందు కూడ ఈ వ్యాస పరంపర ప్రత్యేకముగా, పూర్వభాగమునందలి నలుబది తొమ్మిదవ అధ్యాయమున చెప్ప బడినది. దీనినిబట్టి వ్యాసుడు అనునది ఒక ఆచార్య పీఠమనియూ ఒక్కొక్క ద్వాపర యుగమున ఒక్కొక్క తపస్సంపన్నుడగు మహనీయుడు, వ్యాసుడై ఆ పీఠ మధిరోహించి, మరల మరల అష్టాదశ పురాణములను రచించు ననియూ తెలియుచున్నది. కాబట్టి వ్యాసుడు చిరంజీవి యనియూ, అతని రచనలు యుగాంతము వరకూ సార్వజనీనములుగా నుండుననియూ తెలియుచున్నది. ఇది మన విశ్వాసము.

సత్యవతీ సుతుడూ, కృష్ణ ద్వైపాయనుడూనైన వ్యాసుడు, ఆధునిక కాల గణనము ప్రకారము ఇప్పటికి ఐదువేల యేండ్లకు పూర్వము, ఉత్తర భారత దేశములోని యమునానదీ తీరములోని ఒక చిన్న ద్వీపములో ఒక బెస్తవాని పెంపుడు బిడ్డయైన సత్యవతియను కన్యకకు పరాశరుడను ఒకానొక మహాఋషి వలన జన్మించెను ఆ బాలుని శరీరపు రంగు నల్లన యగుటచే "కృష్ణుడు" అనియూ, ద్వీపంలో పుట్టుటచే 'ద్వైపాయనుడు' అనియూ, అతనికి పేర్లు ఏర్పడి నవి. భారతదేశ చరిత్రలో యమునానదికి గల ప్రత్యేకత ఎట్టిదో గాని, దానితో ముడిపెట్టుకొనిన మరియొక అవతారమూర్తిగూడ హైందవ హృదయ సామ్రాజ్య ములను, నాడూ నేడూ కూడ ఏలుచున్నాడు. అతని పేరుగూడ 'కృష్ణుడే'. వీరిద్ద రునూ వేదపురుషులే. ఒకరు వేదములను సంకలనముచేసి, బ్రహ్మ సూత్రములలో వాని సారము నందించినవారు. వేరొకరు వేదాంత సారమును గీత రూపమున

గానము చేసినవారు ఒకరు మహాభారతమును సాక్షియై రచించినవారు. వేరొకరు మహాభారత చరిత్రను అంతస్సాక్షియై నడిపించినవారు. ఇరువురూ ఏక కాలమున మహా భారత కథల్లో పాత్రధారులై జీవించినవారే. ఒకరు అష్టాదశ పురాణకర్త, వేరొకరు దశావతార ధర్త. ఆ విధముగా, వశిష్ఠుని మునిమనుమడు శక్తికి మనుమడు, పరాశరుని కొడుకూ, శుకుని తండ్రియైన వ్యాసుడు, సాక్షాత్తూ విష్ణు స్వరూపుడేయనియూ, మన సంప్రదాయమున విశ్వసింపబడుచున్నది. ఇది వ్యాసుని జీవిత పరిచయము ఇంకా వ్యాస సాహిత్యమును పరిశీలింతము.

కృష్ణద్వైపాయన వ్యాసుని పేరున జరిగిన సాహితీ వ్యాసంగము వ్యవహార దృష్ట్యా అయిదంశములుగా పరిశీలింపదగును. తత్వతః మాత్రము అది యంతయూ ఒకే విద్య. అనంతమైన వేదవిజ్ఞానమునే, ఆయన, వివిధ దశలలో, వివిధ స్థానాలలోని మానవుల కొఱకు తీర్చిదిద్దెను. వేద విద్యను వివిధ శాఖలుగా విడదీసి యందించుట- వేద ప్రతిపాదితమైన పరాతత్వమును 'బ్రహ్మ సూత్రములు'గా సూత్రీకరించుట- వేదోప బృంహణముగా 'పురాణ సంహిత' రచించుట- ఇట్టి సర్వవైదిక విజ్ఞానమునూ, మానవ జీవనమున కన్వయించి, సామాన్య జనుల కనగాహన చేయుటకై, పంచమ వేద మనబడిన 'మహాభారతము'ను ఇతిహాసముగా ప్రపచించుట- పామరుడైననూ, నిత్యము పఠించు కొను రీతిగా విశ్వవిజ్ఞానము నంతనూ, విష్ణు, దుర్గా, శివ సహస్ర స్తోత్రములలో నిబంధించుట- యనునవి వ్యాస సాహితీ వ్యాసంగమున పంచాంగములు. వీని ద్వారా సర్వకాలికమైన సత్యప్రతిపాదన మెట్లు జరిగినదో, ఒక్క మెతుకనంటి అన్నము యొక్క పదునును గుర్తించు రీతిలో- సూచించుటకే యీ నా ప్రయత్నము. అందుకుగాను, ముందుగా 'వేదము'ను గురించిన మౌలికమగు నవగాహన మవసరము గదా!

జిజ్ఞాస గలిగిన మేధావికి, తన శరీరమునందే, తనకెట్టి ప్రమేయమునూ లేకుండగానే, అనేక ప్రవృత్తులు, అనేకానేక క్రియా పరిణామములు జరుగు చున్న వనెడి మౌలిక సత్యము బోధపడుతుంది. వీనన్నిటిలోనూ ఏకసూత్రతను క్రమంగా ఆతడు కనుగొనగలడు. అట్లే, తనవంటి అనేకానేక జీవులేగాక, తన చుట్టూ ఆవరించియున్న ప్రకృతి మొత్తంలోనూ, ఏదో ఒక అంతర్లీనమైన ఒక క్రమం, ఒక చక్కని వ్యవస్థ పనిచేస్తోందనీ, కాబట్టి విస్తరించి యగుపించే విశ్వమంతా, అస్తవ్యస్తమైన యవస్థ (chaos) కాదనీ, సువ్యవస్థితమనీ

(cosmos), అట్టి విశ్వచైతన్య చాలనములో తానుగూడా ఒక వ్యక్తిమాత్రమేననీ మేధావి గుర్తించగలడు. వ్యక్తిగా "తాను" రూపొందని 'దశ' ఒకటున్నదనీ, అందే ఎక్కడనుంచో తానేర్పడ్డాననీ, ప్రస్తుతం, "తానూ" 'తన్నావరించిన విశ్వములు' సత్యములనీ, 'తాను' చూచుచుండగానే, అనేకానేకములు, తన చూపుకు, భౌతిక విజ్ఞానానికికూడ అందకుండపోతున్నవనీ గుర్తిస్తాడు. వీటన్నిటికి వెనుకగల కార్యకారణ సంబంధం గురించి ఆతనికి ఆరాటం కలగటం సహజమే. ఈ ప్రశ్నలకు సమాధానం కొఱకు 'అతడు' పడిన ఆరాటం తపనగా- ఆదే- క్రమవికాసంలో తాత్త్వికమైన 'తపస్సు'గా రూపొంది, సార్థక మైన మహోన్నత సాధనాస్థితిగా పరిణతిచెంది ఆతడు దర్శించిన విజ్ఞానమే 'వేదము'. అందలి పరమసత్యమే 'ధర్మము'. అది త్రికాలాబాధితమనీ, అదియే విశ్వమునంతకూ సుస్థితిని కల్పించుచున్నదనీ ఋషియైన మనీషి కనుగొన్నాడు. 'ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠా' అన్న వాక్యమును అంతర్నిహితమైయున్న, విశ్వ స్వరూపమును అవగాహన చేసికొన్నాడు. ఇది ఒక వైదిక విజ్ఞాన విశేషము. ఇది సార్వకాలికము నేటి విజ్ఞానవేత్తల యవగాహనము కూడ ఈ సత్యమునే గుర్తించుచున్నదని చెప్పవచ్చును. ఖగోళమున అతివిశాలమైన సౌర మండలమును, ఏ సూత్రము క్రమముతప్పనీక నిలుపుచున్నదో- అతి చిన్నదైన పరమాణువులోని న్యూక్లియస్ (Nucleus), ప్రోటాను (Proton) ల నడుమ గూడ, యట్టి సూత్రమే కనబడుచున్నదనీ, నేఁడు వైజ్ఞానికులు ప్రవచించు చున్నారు కదా! సత్యమెప్పుడునూ ఒక్కటే- సందర్శనములలోనే వివిధ కోణములు విస్తరించుచుండును గదా!

తెలిసికోవాలని యత్నించేవాడూ, తెలిసికొనబడవలసిన తత్త్వము, 'తెలియుట' అనునది వేరువేరు కావనీ, విశ్వప్రతిష్ఠానకమైన, సత్యమైన ధర్మ వ్యవస్థతో తాను తాదాత్మ్యం చెంది, 'జ్ఞాత', 'జ్ఞేయ', 'జ్ఞానము'ల సమైక్యతా రూపమైన శాశ్వత విజ్ఞాన సర్వస్వమును లోలోపల సందర్శించి- దానికి 'వేదము' అని వైదిక ఋషి పేరుపెట్టాడు. తద్విజ్ఞానపుటునికికి, తనకుగాని, తనవంటి ఏ పురుషునకుగాని, కర్తృత్వ నేతృత్వములవంటి, ప్రక్రియలలో, అధికారం లేదని గుర్తించి, అట్టి విజ్ఞానమునంతనూ "అపౌరుషేయము" అని నిర్వచించాడు. భవిష్యత్తులోగూడ అట్టి విజ్ఞానమును యథాతథముగా కేవలము, అర్థం చేసుకొనుటయే తప్ప ఏ పురుషుడూ అందు అక్షరమునుగానీ, స్వరమును

గానీ మార్చకూడదని ఆశించాడు. అలా శాసించాడు. విశ్వవిజ్ఞాన శాస్త్రమునకు భారతీయ ఋషి యిచ్చిన శాశ్వతమైన విలువ యట్టిది. 'అపౌరుషమేయ' మనుట లోని నీతి యట్టిది. ఆధునిక పరిభాషలో మనకంటుబాటులోని భౌతికాంశముగా దానిని పోల్చి చెప్పుకోవలసినపుడు 'గురుత్వాకర్షణ' విద్యను చెప్పుకోవచ్చును. ఈ శక్తి, దాని విజ్ఞానము "ఐజక్ న్యూటన్" అను శాస్త్రజ్ఞుని కన్న మునుపునుంచీ ప్రకృతిలో ఉన్నదే. దానికి కర్తగా అతడు భావించలేదు. మనముగూడ అట్లు చెప్పుకొనుట లేదు. దానిని నవీనయుగంలో, సరిగా, సందర్శించి, తొలిసారిగా, తెలియని వారికి వివరించి చెప్పినవాడు న్యూటన్. ఆయన ద్రష్టమాత్రమే "గురుత్వాకర్షణ శక్తి" న్యూటన్ సృష్టికాదు. కాబట్టి 'అపౌరుషేయము'- అయినా అతడే దానిని ముందుగా సందర్శించాడు కాబట్టి, లౌకికంగా అతని పేరుననే యది విదితము దానికి ద్రష్టయైన ఋషి యతడు. ఆదేవిధంగా విశ్వచైతన్య విజ్ఞాన సర్వస్వమైన 'వేదము' మానవ కర్తృత్వపు ప్రమేయం లేనిదగుటచే అపౌరుషేయ మనీ, విజ్ఞానమున కవధులు లేవుగాబట్టి-'అనంత'మనీ, సృష్టియనే తొలి'భౌతిక' క్రియలో అవినాభావంగా ఆవిష్కృతమయే 'తొలినాదపు' నినాదాలలో ఋషులు తాము విని, వినిపించారు కొబట్టి- చూచి చెప్పారు కాబట్టి,-వేదము 'శృతి'యని, 'దర్శనమనీ' మన సంప్రదాయమున విశ్వసింపబడుచున్నది.

ఆధునికమేదావి, తన జ్ఞానేంద్రియ సాధనముల శక్తినెంతో పెంపొందించు కుంటూ బాహ్యమైన ఈ విశ్వస్వరూప స్వభావ నిరూపణమునకు నిరంతరం ప్రయత్నం చేస్తూ, తాను కనుగొనిన మౌలిక సత్యములను, సూత్రములనూ, విశ్వవిజ్ఞాన సర్వస్వమున జోడిస్తూ, విజ్ఞానశాస్త్ర సాహిత్యమును విస్తరింపచేస్తు న్నట్లే, ప్రాచీనఋషులు తపస్సాధనలో వేదవిద్య విస్తరింపచేశారు.

భౌతికమైన జ్ఞానేంద్రియముల శక్తినెంత పెంచుకొనిననూ కనుగొనజాలని పరమసత్యమును గురించిన సందర్శనమునకై ఆరాటపడిన ఆధునిక మానవమేధ, క్రమక్రమముగా భౌతికశాస్త్రమును (Physics) మనో విశ్లేషణాంశముగా మలచుకొని. భౌతికాతీతవిజ్ఞాన శాస్త్రంగా (Metaphysics) నేడు విస్తరింప చేస్తోంది. Quantum Mechanics పేరున నేడు విశ్వవిస్తృతిగాంచు చున్న విజ్ఞాన శాస్త్రాధ్యయన విభాగము, ముందుకు సాగినకొలదీ, వైదిక ఋషులు అంతర్దృష్టితో సందర్శించిన మౌలిక సత్యములకు, అది సన్నిహిత

ముగా చేరుకొనుచున్నదని నేడు చెప్పబడుచున్నది. సత్యసందర్శనమే పరమ లక్ష్యమైనపుడు, ఒకనాటి వైదిక ఋషికైనా, నేటి విజ్ఞానశాస్త్ర జిజ్ఞాసువుకైనా, అంతిమలక్ష్యం ఒక్కటేకాగలదు. వారివారి సాధనలలో, సాధనాలలో, అనుభవాలలో వ్యత్యాసాలు, ముందువెనుకలూ వుండవచ్చును. ఆ విధంగా వుంటాయి కూడ. నేటి వైజ్ఞానికులదృష్టి భౌతికం-భూమిక తమ్మావరించిన ప్రకృతిసాధనం. పంచేంద్రియపరివ్యాప్తమైన తర్కం-ఫలితము విజ్ఞానము, దాని వినియోగమున భౌతికసుఖము. నాటి వైదికఋషికి దృష్టి ప్రధానంగా ఆధ్యాత్మికం-భూమిక పురుషుడు-సాధనం తపోయోగం-ఫలితం జ్ఞానం—తద్వినియోగమున అభ్యుదయ నిశ్శ్రేయసముల ప్రాప్తి.

దేశ కాలములనుబట్టి మనిషి అవసరములు మారుటచే, విజ్ఞానమును తన కవసరమగునట్లు విస్తరింపచేసికొని, మనిషి వినియోగించుకొనుట జరుగుచుండును. అట్టి వినియోగసాధనములలో తేడాలున్ననూ, విజ్ఞానము మాత్రము, మౌలికాంశమున మార్పులేనిదై యుండును కదా! అట్లే వేలయేండ్లు గడచివచ్చిన, మానవయాత్రలో ప్రకృతి, పురుషులను గురించిన మౌలిక విజ్ఞానము, ఒక్కటిగానే యుండి, వాని ప్రవృత్తులలో, వ్యవస్థలలో, దైనందిన జీవన సాధనా సాఫల్యములలో వ్యత్యాసమున్ననూ, మౌలికమైన మానవ స్వభావము ఒకేరీతిగా నుండునని మన యనుభవము. అట్టి మౌలికములైన ప్రాకృతిక సూత్రములు, మానవతా ప్రవృత్తులు-సార్వకాలికములు. వానిని తన సాహిత్యమున మహాఋషియైన వ్యాసుడు ఎట్లు ప్రతిపాదించెనో పరిశీలించుటకే ఈ రచనము. దీనియందు నేటి మానవుడు గూడ తన జీవితమును తీర్చిదిద్దుకొనదగిన విజ్ఞానము వున్నదని చెప్పగలిగినచో వ్యాస సాహిత్యము సార్వజనీనము కాగలదు.

**చతుర్వేదములు-వ్యాసుడు :**

వైదిక ఋషులు తాము దర్శించిన విజ్ఞానమును వివిధ సంహితలుగా కూర్చి, గురుశిష్యపరంపరలో అధ్యయనాధ్యాపనాలలో, ముందుతరాల వారికందిస్తూ వచ్చారు. కృష్ణద్వైపాయన వ్యాసుని కాలంనాటికి, యిట్టి వైదిక వాఙ్మయము అనంతంగా పెరిగి, గజిబిజిగా చిక్కులుపడియున్నది. దానినంతను వ్యాసుడు పరిశీలించి, విషయ, వినియోగ, ప్రాధాన్యతలనుబట్టి వర్గీకరించాడు. ప్రార్థనారూపముననున్న మంత్రములను 'ఋక్కులు'గనూ, యజ్ఞయాగాదిక్రతువులలో వినియోగ విధులకుపయుక్తముగా 'యజుస్సు'లను, స్వరప్రాధాన్యమును

బట్టి 'సామము'లను, ఐహిక జీవనమున కవసరమైన, విశేషవిద్యల నందించు మంత్రములను 'అథర్వణము'లుగనూ విడదీసి-అట్టి ఒక్కొక్క సంహితనూ ఒక్కొక్క ఋషి పరంపర కప్పగించాడు.

> పారశర్యోమహాయోగీ, కృష్ణద్వైపాయనో హరిః ।
> ఆరాధ్యదేవ మీశానం దృష్ట్వా సాంబం త్రిలోచనం ॥
> తత్ప్రసాదాదసౌవ్యాసం వేదానా మకరోత్ప్రభుః ।
> అథశిష్యాన్ప్రజగ్రాహ చతురో వేదపారగాన్ ॥
> ఋగ్వేదస్య చతం '**పైలం**' జగ్రాహ సరుహాద్యుతిః ।
> యజుర్వేద ప్రవక్తారం '**వైశంపాయన**' మేవచ ॥
> '**జైమినిం**' సామవేదస్య శ్రావకం సో అన్వపద్యత ।
> తధైవాథర్వవేదస్య 'సుమన్తుం' ఋషిసత్తమమ్ ॥
> (పద్మపురాణం-496 అధ్యాయం)

ఈ విధంగా సనాతన వేదవిజ్ఞానాన్ని తరతరాలకూ అందచేసేది, శాశ్వతవ్యవస్థను వ్యాసుడు చేశాడు. అట్టి వ్యవస్థ లభించుటచేతనే, తదనంతర మనీషులు వేద విద్యలాధారముగా, విశ్వవిఖ్యాతిగాంచిన వివిధశాస్త్రములకు కళలకు, భౌతికవిద్య లకు కూడ శ్రీకారము చుట్టి, భారతీయ సాహిత్యమును విస్తరింపచేశారు. సక్ర మముగా వాని వినియోగముననే భారతదేశమందు స్వర్ణయుగము ఒకప్పుడు వెలసినది. ఇచటనే మనము మరియొక విషయమును గూడ సమన్వయించుకొన వలెను. మన ఆర్ష సాహిత్యంలో ''త్రయీవిద్య''యను పదము-వేదపర్యాయ ముగా వినిపించుచుండును. అనగా వేదములు మూడని యర్థము. మరి 'చతుర్వే దము' అనునది గూడ సుప్రసిద్ధమైన వచనము గదా! ఈ రెంటికి సమన్వయ మెక్కడ?-ఆయా యుగధర్మములనను సరించి ఒకానొక కాలఖండమున అప్పటి వ్యాసునిచే 'వేదము' 'మూడుగా' విడదీయబడియుండవచ్చును. కానీ కృష్ణద్వైపా యన వ్యాసుడు మాత్రము, యుగావసరమును బట్టి వేదమును నాలుగుగా విభ జించి, వానికి వినియోగమును నిరూపించి మనకందించెనని ఎంచినచో - 'చతుర్వే దము'లనుటలోని సమన్వయము సాధ్యము.

**బ్రహ్మసూత్రములు :**

వేదము సర్వవిజ్ఞానమునకు నిలయమే. కానీ మనిషికి కలిగెడి మౌలికమైన జిజ్ఞాసకు- అనగా ఈ సృష్టిరహస్యమేమి? దీనికి మూలకారణమేమి? ఎచటినుండి

ఇది యెంతయూ వచ్చును? ఎచటకు పోవునన్న ప్రశ్నలకు వేదవ్యాసుడు ప్రవచించిన ''బ్రహ్మసూత్రము''లలో నొక సమాధానము లభించుచున్నది. వేద సారమును పిండిపోసినదని చెప్పబడెడి సర్వోపనిషత్సాహిత్య సమన్వయ మును వ్యాసుడిందు సాధించినాడు.

బ్రహ్మసూత్ర రచనా విధానము వ్యాసుని నిశితమేధకు మరొక తార్కా ణము. ఇందు నాలుగధ్యాయము లున్నవి. మొదటిది సమన్వయాధ్యాయము. సృష్టికి మూలకారణమైన బ్రహ్మపదార్థము గురించి తన కాలమువరకూ విన వచ్చిన భావనలన్నిటినీ సమన్వయము చేయుట యిందు జరిగినది. రెండవది అవిరోధాధ్యాయము తనకు పూర్వమున్న ఋషులు దర్శించిన విజ్ఞాన విశేషము లలో పరస్పర విరోధము లేదని, వానిని ఒక క్రమమున తీర్చిదిద్ది విషయ ప్రతిపాదనమిందు వ్యాసుడు చేసినాడు. ఈ విజ్ఞానమంతయూ దేనికొరకు? మానవుని యున్నతికొరకు గదా! కావుననే మూడవ అధ్యాయమునకు సాధనా ధ్యాయమని పేరుపెట్టి, దీనిలో వివిధ మానవప్రవృత్తుల విశ్లేషణము జరిపి ఆత్మ జ్ఞానమే మానవ పరమావధియని సూచింపబడినది. నాలుగవది ఫలాధ్యాయము. ఇందు మానవ జీవన సాధనాగమ్యమైన ఆనందస్వరూపమెట్టిది? అట్టి శాశ్వతా నందము ఎట్లు కలుగును? వంటి విషయములు ప్రతిపాదితములు. అన్ని అధ్యా యములలోనూ, పూర్వపక్ష సిద్ధాంతముల రూపమున- అనగా ప్రశ్నలు, సమా ధానములుగా విషయప్రతిపాదనము జరిగినది. ఈ విధమైన రచనాపథకమే శాస్త్రవిద్యావివేచనామార్గమునకు వ్యాసుడు పెట్టిన ఒక వరవడిగా సార్వకాలి కత సంతరించుకొనినది.

బ్రహ్మసూత్రములందలి పరమార్థమేమి? సచ్చిదానంద స్వరూపము అనంతము, అవ్యయము, నిత్యము శుద్ధమునైన, ఒకే ఒకటైన, పరబ్రహ్మము నుండియే, ఈ చరాచర విశ్వమంతయూ విస్తరించినది. అనంతమైన కాలములో, ఆ పరమాత్మయే మాయావరణమున సృష్టి, స్థితి, లయాత్మకమైన విశ్వముగా పరిణమించుచున్నది. పరమాత్మయొక్క ఇట్టి ప్రవృత్తినివృత్తులు, లీలావిలాసము వలె జరుగుచుండును. భౌతికమయిన విశ్వమంతయూ, తాత్త్వికముగా నొక త్రిగుణాతీతమైన ఆభాస. పరమాత్మయొక్క నిత్యత మాత్రమే సత్యము. బ్రహ్మసూత్రములలోని వ్యాసుని సందర్శనమిట్టిది. ఇట్లే మన ఆర్ష సాహిత్య మున వివిధభూమికలలో విశ్వస్వరూప స్వభావ నిరూపణమున, ముఖ్యంగా

ఆరు దర్శనములు ప్రవచింపబడినవి. వానిలో వ్యాసునిది వేదాంత దర్శనము. ఇది ఆధ్యాత్మికమైన, సార్వకాలిక విజ్ఞాన నిదర్శనము.

ఆధునిక విజ్ఞానమున ఈ విశ్వముయొక్క యదార్థ స్వరూప స్వభావ నిరూపణమున, నేటివరకూ జరుగుచూ వచ్చిన పరిశోధనములు సూచించుచున్న విషయములుకూడ వేదాంత దర్శనమునకు సరిపోల్చదగియున్నవని రెండిసీ తరచిచూచిన వారంగుచున్నారు.

"The Basic elements of the Vedantic world- view, are also those of the world-view emerging from Modern Physics. There is no contradiction, between the theories of contemporary science and vedantic mystical thought, which produces a conception of the world in which man's scientific discoveries are in perfect harmony with his spiritual aims and religious beliefs." (Dr. M.K. Gupta). అనగా "విశ్వమును గురించి వేదాంత దర్శనము నందు లభించెడి మౌలికాంశములు, ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్ర మావిష్కరించు సత్యములకు సరిపోవును. వేదాంత దర్శనమునకు నవీన విజ్ఞాన పరిశోధనము లకు విరోధము లేదు. శాస్త్రీయ పరిశోధనలకు, ఆధ్యాత్మిక, ధార్మిక విశ్వాసము లకు నడుమ సామరస్యమే యగుపించుచున్నదని ఒక భారతీయ శాస్త్రజ్ఞుని మాట. నేడు అమెరికా దేశములోని అనేక విశ్వవిద్యాలయములలో విఖ్యాతి గాంచిన భౌతికశాస్త్రాచార్యునుగా పరిశోధనములను సలుపుచున్న డాక్టర్ ఫ్రిట్ జాఫ్ కాప్రా (Dr. Fritzof Kapra) అను మేధావి మనదేశములోని భారతీయ విద్యాభవనము వారిచే ప్రచురింపబడిన "The New Vision of Reality" అను గ్రంథమున చెప్పిన యంశములు యిచట ప్రస్తావించుకొనదగి యున్నవి "I see parallels in Hindu thought to the world-view arrived at, when quantum theory and Relativity theory were combined to describe the force fields of subatomic particles. The conception of physical things and phenomena as transient manifestations of an underlying fundamental entity, is not only a basic

element of quantum field theory, but also a basic element of Hindu world view like Eienstein, the Hindu mysties consider this underlying entity as the only Reality, all its phenomenal manifestations are seen as illusory and transitory (మాయ) and the idea of a periodically expanding and contradicting Universe which involves a scale of time and space of Vast proportions (కల్పములు, యుగములు, మన్వంతరములు), has arisen not only in modern cosmology but also in ancient Indian Mythology" -Fritzof Kapra. ప్రాచీన తాత్విక విజ్ఞానమునకు ఆధునిక శాస్త్రములకునూ గల సామరస్యమును సశాస్త్రీయంగా చూపుతూ ఈ శాస్త్రజ్ఞుడే వ్రాసిన "Tao of Physics" వంటి గ్రంథములు నేడు చదువదగినవని చెప్పుట ఇచట యుక్తియుక్తము గదా! ఈ సందర్భముననే మరియొక వైజ్ఞానిక విశేషమును గురించి యిచట ముచ్చటింపదగియున్నది.

నేడు, మౌలికమైన విశ్వచైతన్య స్వరూపము, తరంగములుగా విస్తరించి యున్నదా? (Wave Motion) అణువణువులుగా (Photons) వ్యాప్తమై యున్నదా? అను విషయముపై ఆధునిక వైజ్ఞానిక ప్రపంచమున ఎంతయో పరిశోధనము జరుగుచున్నది. తరంగ రూపము, అణు రూపములు రెండునూ సత్యములేయని అంగీకరింపనిచో-వైజ్ఞానిక పరిశోధనము సాధించిన కొన్ని ముఖ్య ఫలితాంశముల నిరూపణము, సమన్వయములు సాధ్యమగుటలేదు. కావున దానిలో అణు రూపము, తరంగ రూపములు రెండునూ యదార్థములేయని, పరస్పరము యిట్టి స్థితినుండి మార్పును చెందు నవకాశము గలదని ఇప్పటికి వైజ్ఞానికులు తేల్చి చెప్పినట్లు మనకు తెలియుచున్నది. De Broglie అను విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞుడు ఇట్టి 'ద్వైధీస్థితి'ని గూర్చిన సూత్రబద్ధమైన శాస్త్రాంశములను ప్రతిపాదించి నిరూపించినాడు. ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడగు M C. Eselev చిత్రించిన ఒక చిత్రము- ఈ వ్యాస ప్రారంభమున ముద్రితము- ఇట్టి ద్వైధీభావనను సామాన్యునకు కూడ అవగతమగునట్లు చేయుట కుపయోగించునని తలంపబడుచున్నది. ఆ చిత్రపటమును గమనించినచో మన దృష్టినిబట్టి అణువే తరంగముగా, తరంగమే అణువుగా ఎట్లు విస్తరించియుండునో తెలియును. బొమ్మలో చేపగా నగుపించినదానినే మనసున నిలిపి పైపైకి చూచిన కొలదీ

క్రమముగా మధ్యకు వచ్చుసరికి దాని యాకృతి అదృశ్యమగును. అంతయూ తరంగముగా తోచును అట్లే మరింత పైకి చూచిన కొలది మన దృష్టి మారి అదియే మరల ఒక పక్షిగా, అనగా స్థిరరూపముగా-ఒక అణువు (Particle)గా మారినట్లుండును. ఈ రెండు దశలును మన దృష్టినిబట్టియే ఏర్పడుచుండును. నిగూఢమైన వైజ్ఞానిక శాస్త్ర విషయమును మామూలు మాటలలో చెప్పు యత్న మిది. ఒక దిశాదర్శనము మాత్రమే యిది. ఇచట నిది యంతయూ దేనికనగా వ్యాస సాహిత్యమున. విచిత్రముగా, యిట్టి మౌలికాంశములను సూచించు విజ్ఞాన విశేషముల భూమికలు లభించుచున్నవని చెప్పుటకే. మహాభారతమందలి ఆది పర్వమున ఉదంకోపాఖ్యానమున సూచింపబడిన-''సితాసిత తంతువులు నిరంతరమూ అల్లుకొనుచున్నవనీ, వానినుండి భూతములు, భువనములు ఏర్పడుచున్నవని చెప్పిన సందర్భమున (వ్యాసమున వేరొకచో అది వివరముగా చెప్పబడినది) విశ్వ చైతన్యము యొక్క మౌలికమైన తరంగ భావము-పురాణములలో వర్ణితమైన పరశురాముని తల్లియైన రేణుకావృత్తమున సూచితమై అనేక తంత్ర గ్రంథములలో విపులముగా వివరింపబడిన ''రేణుకా''-రేణుమయమైన దేవీ తత్వము-విశ్వ చైతన్య స్వరూపమున నవీన శాస్త్రజ్ఞులు కనుగొనిన రేణువు స్వభావమును (Particle Nature) సూచించుచున్నవనిన వ్యాస సాహితీ పిపాసులకు ఆశ్చర్యముగ నుండును గదా!

**పురాణ సంహిత :-**

సృష్టికి మూలమైన బ్రహ్మ పదార్థాన్ని వివరించినతర్వాత దానినుండి ఈ విశ్వమంతా ఎలా వచ్చింది? అనే జ్ఞానమును సర్వమానవాళికీ అందించే యత్నంలో ఒక సాధనంగా పురాణ సంహితను రచించాడు వ్యాసభగవానుడు. వేద విజ్ఞానం అందనిదీ, అది అందరికీ అందాలి - మనం అందించాలి. అప్పుడే సమాజ ఋణం తీరుతుంది. ఇదీ వ్యాసుని ఆకాంక్ష. ఎంతటి ఉదాత్తమైన విశ్వజనీన భావన యిది!!! అయితే సామాన్య మానవుని స్థాయి ఏమిటి? తాను, తన అవసరాలు, వానిని తీర్చేందుకేనన్నట్లు, తన్నావరించియున్న ఈ ప్రకృతి - వీనిని గురించిన పరిమిత విజ్ఞానం, ప్రతివాడు ఏదో విధంగా కలిగే వుంటాడు. అయితే వీనిని గురించిన సార్వకాలిక, విస్తృతవిజ్ఞానం అతనికి కలిగిస్తేనే, సామాన్యుడు గూడ సమున్నతుడు కాగలడు. సంతృప్తిగా బ్రతకగలడు. అట్టి విజ్ఞానాన్నందించేందుకే పదునెనిమిది పురాణాలు వ్యాసుడు వ్రాశాడు. అయితే

పురాణాల పేరు వినడంతోనే నేడు మనకెన్నో సందేహాలు కలుగుతాయి. పురాణాలు ఎన్ని? అన్నీ వ్యాసునివేనా? పురాణాలలో పరస్పర విరోధాలున్నాయా? యిలా ఎన్నో ప్రశ్నలు-పురాణముల యందలి విషయమేమిటో, దాని సార్వకాలికత ఎట్టిదో పరిశీలించిన పిదప ఈ ప్రశ్నలు, ప్రశ్నలుగా మనని బాధించవు.

'పురాణం పంచలక్షణం' అని దాని నిర్వచనము. అనగా సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరము, వంశానుకథనములను అయిదు లక్షణములును వాని యందు వివరింపబడవలెను. సృష్టికథ, ప్రళయముల వృత్తాంతము, మళ్ళీ జరిగే సృష్టి, నడుమనున్న ప్రపంచము, ప్రజల కథ-ఆపైన అనంతమైన కాలజ్ఞానము, తద్గణనములు, మానవ వికాసము, విశ్వమున, వాని వంశముల చరిత్ర లిందుండవలెను. మానవున కావాసమైన నవఖండ భూమండల విజ్ఞానము, అనంతమైన ప్రకృతిని 'ప్రతీక' రూపంలో, ఒక చిత్రపటముగా ముందు తరాల కందించే యత్నంలో, ఒకే చిత్రకారుడే చిత్రించినప్పటికీ-దృశ్యవైవిధ్యాన్ని బట్టిగానీ, దృక్కోణ వైవిధ్యాన్నిబట్టిగానీ, వివిధ దశలలో విభిన్న చిత్రములు దృశ్యమానమగుచుండుట సహజానుభవము కదా! అయిననూ అన్నిటిలోనూ ప్రకృతి యొక్క సార్వకాలిక స్వరూప స్వభావావిష్కరణమే పరమ లక్ష్యము. వాని వివరణములో తేడాలున్ననూ మౌలిక విషయమొక్కటిగనే యుండును. కాని పంచలక్షణయుక్తముగా, వ్యాసునిచే చెప్పబడిన మౌలికమైన ఒకే పురాణ సంహిత, వివిధ స్థాయిలలో పలువురు శిష్యులకు ఆతనిచే వివరింపబడునపుడును-తదనంతరమున ప్రవచనకారులైన వారియొక్క ప్రత్యేకతలనుబట్టి భిన్నత్వమును సంతరించుకొనిననూ ఏకత్వమును గూడ సూచించుననియూ, ప్రవచనకారులు ఆ సంహితకు కర్తలు కాక వ్యాఖ్యాతలు మాత్రమే గనుక మౌలికముగా పురాణములన్నియునూ వ్యాసునివేయనియూ, మనము సమన్వయము చేసుకొనవచ్చును.

వేదవిజ్ఞానాన్ని సామాన్యులకందించేందుకు వ్యాసుడెన్నుకొన్న సాహిత్య ప్రక్రియలు రెండు- ఒకటి పురాణము, రెండవది ఇతిహాసము. ఈ రెంటి తీరులోనూ తేడా వున్నది. ''ఒకే పరతత్వం ఈ విశ్వరూపంగా ఎలా ఆవిష్కృతమైనది?'' అన్న అంశాన్ని కథలు, కథలుగా వివరించే ప్రయత్నం పురాణంలో వున్నది. దీనిలో మానవుని పాత్ర ప్రధానం కాదు సర్గ, ప్రతి సర్గలు, మన్వంత

రముల కథ, భౌగోళికాంశముల, చారిత్రక విషయముల నిరూపణమే ప్రధానము. మానవుని కథ ఒక చరిత్రగా మాత్రమే యిందు ప్రతిపాదితము అయినా విశ్వమంతటా ఒకే చైతన్యం నిండి వున్నది కాబట్టి - దానిని గుర్తించి వ్యాఖ్యానించగలిగినవాడు మానవుడే కాబట్టి, సామాన్యునకు ఆ విషయం తేలికగా అవగతం కావాలంటే, మౌలిక ప్రాకృతిక నియమాలు, సృష్టి కథలు, ఖగోళ విజ్ఞానము, భౌతిక విద్యావిశేషాలన్నీ కూడా పురాణాలలో మానవీకరణలుగా 'ప్రతీకల' రూపంలో (Symbols) చెప్పబడతాయి. అట్టి పౌరాణిక ప్రవచనాలలో నేటికి గూడ విజ్ఞాన శాస్త్రపు గీటురాయిపై వన్నె పెట్టదగిన మౌలికమైన ఒక ఉదాహరణము నిట వివరించినచో వ్యాస సాహిత్యపు సార్వకాలిక మూల్యమున కది నిదర్శనము కాగలదు.

'ధ్రువోపాఖ్యానం' భాగవతపురాణం చతుర్థములో వున్నది. అందు 'ఉత్తానపాదు' డొకరాజు. ఉత్తరోత్తర విస్తృతి కలవాటుపడ్డ సృజనాత్మకమైన ఒకానొక విశ్వచైతన్యమున కతడు ప్రతీక (ఉత్తానపాదుడు : a Peculiar creative agency in cosmos- Rigveda x-82- మోనియర్ విలియమ్స్) అతనికిద్దరు భార్యలు :- సునీతి, సురుచి. విశ్వచైతన్య చాలనా వ్యవస్థలోని రెండు పరిణామములకు ప్రతీకలు. సువ్యవస్థితమైన ఒక్క నీతిని పాటించుచూ విశ్వచైతన్య కేంద్రములై (ఉత్తానపాదులై) ఆధారపడి సంచరించునది సునీతి. ఖగోళ సంచారములో ఆయా స్థితులలో కనిపించు ఆకర్షణ వికర్షణలవంటి ప్రవృత్తుల ప్రభావములకు ప్రతీక సురుచి సునీతి కొడుకు ధృవుడు సువ్యవస్థమైన నడకలో స్థిరమైన స్థానమునకు ప్రతీక. ఒకనాడు ధృవుడు తండ్రి ఒడిలో చేరుదామనుకున్నాడు. అంటే, అప్పటికి రోదసీకుహరంలో ఒకానొక సౌరకుటుంబ కథ, స్థిరాక్షమున, ఇమడనిదని యిందు సూచితమనుకొనవచ్చును. సురుచి తాత్కాలికమైన ఏదో ఒక వికర్షణశక్తి. అట్టి ధృవస్థాన ప్రతిష్ఠకు-అంటే అక్షము (Polar axis) యొక్క స్థిరీకరణమునకు అడ్డు వచ్చినది. ధృవుని దూరముగా నెట్టివేసినది నా బిడ్డవైనచో మాత్రమే నీకిట స్థానమున్నది-అంటే ఒకానొక ఆకర్షణ పరిధిలో యిమడవలెనని శాసించినదన్నమాట. అప్పుడు ధృవుడు విష్ణువుకోసం, అంటే సర్వాంతర్యామియైన మౌలిక విశ్వచైతన్య కేంద్రం కోసం తపస్సు చేశాడు. ఉత్తానపాద కుటుంబపరిధిని దాటి పరాకేంద్రంలో ధృవుడు అనుసంధానం చేసికొన్నాడు. తపస్సు చేశాడు. అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై అతనికి వరమిచ్చాడు. ఇరువదియారువేల వత్సరముల పిదప నీవు ధృవస్థానమును

చేరుకొనగలవని విష్ణువు అనుగ్రహించాడు. నేటి ఖగోళశాస్త్ర విజ్ఞానమునకు పరిమితం చేసి, ఈ రోదసీ గాథను సమన్వయం చేసుకుందాం. ఉత్తానపాదుడైన ఒక విశ్వచైతన్య కేంద్రం సూర్యుడనుకుందాం. సూర్యునిచుట్టూ ఒక సునీతిలో-ఒక క్రమంలో-అనుసరించి తిరిగే భార్య సునీతియైన భూమియను కొందాం. సూర్యాకర్షణకు, అంటే సురుచికి లోనై, భూమి యనే భార్యయొక్క ఒక అంశ (సవతి) సూర్యునివైపు మొగ్గుతుంది కాబట్టి సురుచి భూమికి సవతి-సునీతి, సురుచీ, భార్యలుగా-అంటే సూర్యునిచే ఆకర్షితమై నిలచే ఒకానొక గోళం యొక్క (భూమియొక్క) యిరుపార్శ్వాలు (bulgings) రోదసిలోని వివిధ ఆకర్షణల, వికర్షణల కారణంగా ధృవస్థానం ఆనాటికి స్థిరం చేయబడలేదన్న మాట. అట్టి అవాంతర ఆకర్షణల నధిగమించి స్థిరాక్షమునకు చేరుటకు ఆధునిక ఖగోళశాస్త్రపు లెక్కల ప్రకారం కూడా ఇరువదియారు వేల యేండ్లు పడుతోందని తెలుస్తోంది. ఈ సర్వకాలిక ప్రాకృతిక సత్యమే ఆంధ్రదేశంలో అందరికీ అందుబాటులో వుండే పోతనగారి భాగవతంలో ఎలా వ్రాయబడిందో ఉదహరిస్తాను. ''ఎందు మేధియందు బరిభ్రామ్యమాన గోచక్రముంబోలె (గానుగ-ఎద్దు తిరుగునటుల) గ్రహ, నక్షత్ర, తారాగణ జ్యోతిశ్చక్రంబు, నక్షత్రరూపంబులైన- సప్త ఋషులునూ, తారకాసమేతులై తిరుగుచుండుదురో...అట్టి...''ధ్రువక్షితి'' అను పదంబునందు ముందట ఇరువదియారు వేలయేండ్లు సనిన్ ప్రాప్తింతువు''. ఇవి విష్ణువు ధృవునకిచ్చిన వరమును వర్ణించు పోతనగారి వాక్యములు. ఇందు ఖగోళ జ్ఞానమే ప్రకటింపబడిందని చెప్పుటను ఈ క్రింది భాగవత విషయములు సమర్థించుచున్నవి. ఆంధ్ర భాగవతము ప్రకారము ధృవుని మామ శింశుమార చక్రవర్తి (ecliptic cycle)అతని కుమార్తెయైన ధృవుని 'భ్రమి' (Principle of Rotation)-ధృవునకు భ్రమియందు కలిగిన పుత్రులిద్దరు-కల్పుడు (Time in relation to the entire circle of galaxies in the Universe) వత్సరుడు (time in relation to the individual-planets)-ధృవుని పిదప వత్సరునకు పట్టాభిషేకము చేయబడినది. ఆ వత్సరునకు (time as represented by an year) సర్వర్థి (సర్వప్రాకృతిక సంపందల నిలయం) యను భార్యయందు ఆరుగురు కొడుకులు (ఋతువులు) పుట్టారు. వారిలో ఒకడైన పుష్పార్ణునకు ప్రభా (daylight), దోషా (noctornal darkness) యను ఇద్దరు భార్యలు-వారిలో ప్రభకు ''ప్రాతర్మధ్యందిన సాయంబు''ను (Morning-Midday-evning) ముగ్గురు కొడు

కులు కలిగారుట. దోషకు ప్రదోష (Dusk), నిశీధి (midnight), వ్యుష్టులను (dawn) ముగ్గురు పుత్రులు కలిగారు. ఇంక ఈ కథలోని సార్వకాలిక వైజ్ఞానిక సత్యప్రతిపాదనము-వ్యాస సాహిత్యముయొక్క సార్వకాలిక విలువలను ప్రత్యేకముగా వివరింపనక్కరలేదుగదా!

పురాణములందట్టివే అనేక గాథలు కలవు. మహాభారతమున గూడ యిట్లే సార్వకాలికమైన సృష్టి విజ్ఞానమును గూర్చి ఆదిపర్వమున వ్యాసుడు సూచించినాడు. అనంతకాలచక్రభ్రమణమున మహాభారత గాథ జరిగిన ఒకానొక కాల ఖండమున కారంభమున సృష్టిక్రమమెట్లు జరిగినదో చెప్పి, దానిని వివరించుటకే యగునట్లు ఉపరిచరవసువు (ఆకాశముపై సంచరించు ఒకానొక ప్రాణశక్తి) కథలో ఇంద్రాది దేవతలు అతనిని భూమిపైకి పంపినట్లును 'ధర్మనిచ్ఛుడైన' అతని యొక్క వీర్యము జలమున పడగా దానినుండి సత్యవతి (ఆకృతి పొందిన 'సత్' యగు విశ్వము) జనించినదనియు చెపుటలో ఆధునిక శాస్త్రజ్ఞులు వివరించిన Oparine theory of creation అనగా రోదసి నుండి జీవతత్వములోని ఒక మెరుపు భూమిపై జలమున వచ్చిపడినది. అది సాకారమైన విశ్వపుటస్థిత్వమును క్రమముగా సంతరించుకొన్నది అను భావమును సూచించినాడా? అనిపించుచున్నది.

అట్లే ఆదిపర్వమునందలి వినతాకద్రువల గాథ కూడ 'అనుసృష్టి' అను పేరునగల జంతుజాలము యొక్క సృష్టి క్రమమును సూచించుచున్నట్లనిపించును.

వినతాకద్రువలు కశ్యపప్రజాపతి భార్యలు. వారు భర్త వరమున సంతానవతులైరి. తొలుత కద్రువ వేల సంఖ్యలో గ్రుడ్లను కనినది పిదప వినత రెండు గ్రుడ్లను మాత్రమే కనినది. వానిని వేడిగానుండు గదులలో పెట్టిరి. పిమ్మట గ్రుడ్లు పిల్లలగుటకు ఎంతో కాలము బట్టినది ముందుగా కద్రువ గ్రుడ్లనుండి ఐదు వందల యేండ్లకు, వేల సంఖ్యలో పాములు (Reptiles - సరీసృపములు) పుట్టినవి. తనకు పుత్రులు కలగలేదని బాధచే, వినత తన గ్రుడ్లలో ఒకదానిని పగులకొట్టినది. అందుండి ఒక మహాజీవి వెలికి వచ్చినది. అది సంపూర్ణముగా ఎదుగని ఒక పక్షి ఆకృతి. (Pterodactyle and Pteronodon) అది వెంటనే వినతపై కోపించి శపించి రెండవ గ్రుడ్డును మాత్రము, దానంతటది విచ్చునంత వరకు జాగ్రత్తగా సంరక్షించుమని తల్లికి చెప్పి, ఆకాశమునకెగిరి

పోయినది. పిమ్మట మరి ఐదువందల సంవత్సరములకు వినత యొక్క రెండవ గ్రుడ్డు ఎదిగి, విడివడి అందుండి ఒక పెద్ద పక్షిగా గరుడుడు జన్మించినాడు. అతడు తల్లి శాపమున తీర్చుటకు స్వర్గమున కేగుచు ఆకలికిలోనై తన్నివారణో పాయమును తన తండ్రినడిగి, ఆయన సూచన మేరకు, ఒకానొక చోట వేల యేండ్లుగా పరస్పరము కలహించుకొనుచున్న అతి విశాలాకృతులు అగు 'గజ కచ్ఛపముల' రెంటిని భక్షించెనట. ఆ పిదప గరుడుడు అమృతమును తెచ్చుట, తల్లి శాపవిమోచనము చేయుట జరిగినది. ఇందు జంతుశాస్త్ర విజ్ఞానమున ఆధునికులు సూచించు పక్షుల పాముల ఉత్పత్తి క్రమమును- వాని బంధుత్వమును తెలుపు (Sauropsida) కథ సూచితమగుచున్నదనవచ్చును. ఆధునిక జంతు శాస్త్రము ప్రకారము First glaciour period మొదటి మహా మంచు యుగమునందు సుదీర్ఘకాలము మంచుతో కప్పబడిన భూతలమున గ్రుడ్లు పిల్ల లగుటకు ఎంతో అధిక సమయము పట్టెడిదట. అట్టి దీర్ఘకాలావధిలో తొలుత ప్రత్యేకమైన ఉష్ణ వాతావరణము లభించినపిదప గ్రుడ్లు విచ్చి సంతానోత్పత్తి యైనది. వానిలో మొదట పుట్టిన సరీసృపములు-అసంఖ్యాకములు పిదప తక్కువ సంఖ్యలో పుట్టిన పక్షులు- మహోన్నతములు. ఈ రెండును ఆవిర్భవించుటకు నడుమనున్న సుదీర్ఘ కాలములో ఇటు పాములకును అటు పక్షులకును చెందనిది, ఉభయ లక్షణములు కలిగినదియైన ఒక వింతజీవి ఉద్భవించినది. అది పక్షిగా పూర్తిగా ఎదుగకముందే ఆకసమున కెగుర కల్గినశక్తి కలది. దానినే Ptero- nodon and Pterodactyla అందురు. ఈ అండజముల ఉత్పత్తికి పిదప వినతా కద్రువలు సముద్రము నుండి పుట్టి వెలికి వచ్చిన ఒక గుఱ్ఱము (ఉచ్చైశ్రవము) ను చూచినట్లు దాని స్వరూపస్వభావములను గురించి తర్కించు కొని, పందెము వేసికొనినట్లు భారతమున నున్నది. ఆధునిక జంతుశాస్త్రమున దాదాపు అదే కాలఖండమున ఉద్భవించినట్లు చెప్పబడెడి (dawn Horse- Eohippus) గుఱ్ఱము యొక్క కథ యిట్లు సూచితమైనదా? అట్లే రాక్షసాకా రముగల మహోన్నత జంతువులు (proboscida and chalonia) వంటివి. భూతలమున తమ అస్తిత్వమును నిలుపుకొనుట కొఱకు (Struggle for existence) పరస్పరం అనేక ఏండ్లు కలహించుకొని నశించినట్లు. ఆధునిక శాస్త్రీయ విజ్ఞానము సూచించు విశేషములు- గజకచ్ఛపముల పోరాటము, గరుత్మంతుడు వానిని ఎగురు తన్నుకొనిపోయిన భక్షించెనని చెప్పుటలో సూచిత మైనదని ఎంచవచ్చును. (?)

అట్లే - మహాభారతమున అర్జునుడు సుభద్రతో పద్మవ్యూహ ప్రవేశ పద్ధతిని గూర్చి ముచ్చటించుచుండగా ఆమె గర్భస్థ శిశువైన అభిమన్యుడు దానిని విని గ్రహించినట్లు వ్యాసుడు వ్రాసినాడు ! ఇది శాస్త్ర సమ్మతముకాని అభూత కల్పనయని నిన్న మొన్నటి వరకు నిరాకరించుట జరిగినది. కాని 1984 జనవరి నెలలో అమెరికా దేశపు Science Magazine నందు ప్రకటితమైన వార్త వ్యాసుని వ్రాతను శాస్త్రీయ మొనర్చుటకు దోహదము చేయుచున్నది! అ. సం. రా. లోని Natural Institute of Child Health and Human Development సంస్థలో ఉత్తర కెరొలినా విశ్వవిద్యాలయమునకు చెందిన ఆంటోనీ డీ, కాస్పర్ అను శాస్త్రజ్ఞుడు ''గర్భస్థ శిశువు తల్లి హృదయ స్పందనమును కంఠధ్వనిని వివిధములుగా తల్లి గ్రహించిన సువాసన లన్నింటిని తాను గ్రహించి జ్ఞప్తియందుంచుకొను''నని నిరూపించినాడు! ఆ పరిశోధనలో గర్భస్థ శిశువునకు సూది ద్వారా ఆపిల్ పండు రసము, నిమ్మరసము అందచేయగా, పుట్టిన తరువాత ఆ బిడ్డ తల్లి పాలకన్నా ఆపిల్, నిమ్మరసములనే ఎక్కువ అభిమానముతో స్వీకరించినట్లు ప్రకటించినాడు! ఈ వార్త హిందూ పత్రిక ప్రకటించు FRONT LINE అను వారపత్రికలో 4-12-84 న ప్రకటితమైనది! ఇది వ్యాసుని వైజ్ఞానిక సందర్శనమును సత్యమని నిరూపించుటకు ఒక సోపానమును వైచినదనవచ్చును. అదే కెరొలినా విశ్వవిద్యాలయమునకు చెందిన పీటర్ హార్ట్‌లైన్ అను శాస్త్రవేత్త పాములలో ఊపిరితిత్తుల స్పందన ద్వారా బాహ్యశబ్దములు గ్రహింపబడి ప్రక్కటెముకల ద్వారా అంతఃశ్రవణేంద్రియములకు చేరునని కనుగొనినాడు! నాగస్వరమును పాములు గ్రహించునని పురాణ సాహిత్యమున వ్యాసోక్త విశేషము సశాస్త్రీయమని, నేటికి విజ్ఞాన శాస్త్రము అందుకొన గల్గినదన్నమాట!

ఈ విధముగ సృష్టి విజ్ఞానమునందలి సార్వకాలిక ప్రాకృతిక పరిణామముల కథలు వ్యాస సాహిత్యమున ఎన్నియో కలవు. ఇవి అన్నియు ఆతడు యోగ సందర్శనమున అంతర్ముఖుడై యున్నపుడు కనుగొనిన సత్యములు. ఒకానొక పరమ సత్యమును సందర్శించినపుడు అందలి మౌలికాంశములను వ్యక్తము చేయుదశలో వైదిక ఋషికి, ఆధునిక వైజ్ఞానికిని సామ్యముండుట, వారి వారి సాధనా విజయమునకు నిదర్శనములు. అవి పరాసత్యము యొక్క మౌలిక ఏకతను సూచించు సహజ పరిణామములు. అట్టి వారిరువురి సందర్శన

ముల నడుమ వ్యత్యాసము లగుపించుచున్నంతవరకూ, పరమ సత్యాన్వేషణము సాగుచునే యుండును ఒక్కొక్కసారి అట్టి సందర్శనముల రెంటికిని ఏకత యున్నచోట కూడ, వానిని జీవితమున వినియోగించుకొన్నప్పటి దశలలో, వైవిధ్యము గోచరించుట, ప్రాముఖ్యము వ్యత్యస్థమగుట కూడ సహజమే. విశ్వ చైతన్య రహస్యములను అంతర్ముఖుడై యెరింగిన వైదిక ఋషి ఈ విశ్వమున సర్వమును పరిణత బుద్ధియైన మానవుని ప్రమేయముగనే ఎంచి, అతడు సహజ ముగ ఆశించు ప్రాపంచిక సుఖానుభవము యొక్క స్వరూప స్వభావములు పరిమితులను నిర్ధారించి, అంతటితో తృప్తి చెందక ఆధ్యాత్మికతాన్వేషణమున మొగ్గుచూపి, తుదకు మానవునకు శాశ్వతానందము నందించగల విస్తృత ఆధ్యాత్మిక విద్యా ప్రపంచమును విశ్వమున ప్రవర్తిల్లచేసినాడు. భౌతికవాదియగుచునే పరమ సత్యాన్వేషణపరుడైన ఆధునిక శాస్త్రజ్ఞుడు భౌతిక ప్రమేయము నధిగమించి క్రమముగా మనస్సు నాశ్రయించి యిప్పుడిప్పుడే ఆధ్యాత్మికత యొక్క అంచులను అందుకొనబోవుచున్నాడు. అట్టి వైజ్ఞానికులనదగిన ఐన్‌స్టెయిన్, హైజన్‌బర్గ్, డెరాక్, ష్రోడింజర్, డీబ్రోగ్లీ వంటి ఆధునిక శాస్త్రజ్ఞులందరూ భౌతిక తత్వాన్వేషణపరులైన తపస్సంపన్నులు, ఋషులు. వీరికిని ఒకనాటి వ్యాస, కపిల, కణాదాది ఋషులకును సాధనా మార్గమున సారూప్యమున్నది. పరిణతిలో, ఫల ప్రాప్తిలో దర్శనములలో, ఎవరి స్థాయి వారిది. సత్యనిష్టయందు మాత్రము అందరునూ సమానులే యనవచ్చును.

ఆధునిక భారతీయ సమాజము నేడు ఆత్మవిస్మృతికి లోనై, స్వావలంబనమును కోల్పోయి, అన్ని రంగములలోవలెనే విద్యా విజ్ఞానములలోకూడ, అన్యుల కూడిగము చేయ చూచుచున్నది గాన, దానిలో విజ్ఞానపరమైన ఆత్మవిశ్వాసమును కల్పించుట నేడత్యవసరము. కాన మనవైన ఆర్ష విద్యా విజ్ఞానములు, మౌలికముగా ఎంతటి పరిపూర్ణములో, తర్క శుద్ధములో, సత్య నిష్టములో చూపుటకే ఈ వ్యాసమున యిట్టి వైజ్ఞానిక శాస్త్ర ప్రసంగములను కొన్నిటిని స్పృశించవలసి వచ్చినది. వేయి యేండ్ల బానిసత్వ ఫలితముగ తనలో స్వతంత్రమైన, సృజనాత్మకమైన ప్రతిభా వ్యుత్పత్తులకు, ప్రవృత్తులకు దూరమైన భారత జాతికి, నీరసమును పోగొట్టి, వారసత్వమై వచ్చిన వైజ్ఞానిక దృష్టిని మరల కలిగించినచో మన భవిష్యత్తు బంగారు బాట కాగలదు.

అంతర్దర్శనమున అత్యున్నత ఫలితాంశములను విద్యార్థిగనే కనుగొని ప్రకటించిన ఆధునిక భారతీయ గణితశాస్త్రవేత్త శ్రీ రామానుజం చెప్పినవానికి సశాస్త్రీయమైన ఉపపత్తులను అంచెలంచెలుగా వివరించి, ఫలితమును సాధించి, విజ్ఞానవంతులగుచున్న నేటి మనీషులవలెనే, ద్రష్టలైన ప్రాచీన ఋషు లందించిన మౌలిక సత్య ప్రకటనములలోని శాస్త్రీయత గూడ తర్క బద్ధముగా, నవీనులైన భారతీయ మనీషులచే అధ్యయనము చేయబడవలెనను-అట్లు పాత కొత్తల మేలు కలయికను కోరుట-విజ్ఞుల లక్షణము కదా! కావుననే, ఆధునిక విజ్ఞాన శాస్త్ర ములపట్ల ఆదరణముతో బాటు, ప్రాచీన భారతీయ విద్యల పట్ల ప్రత్యేకమైన శ్రద్ధను చూపి అధ్యయనము చేయుట అవసరము, ప్రయోజన ప్రదము అని సూచించుటకే, వ్యాససాహిత్యమునందలి మౌలికమైన శాస్త్రీయ విజ్ఞాన విశేషము లను యిచ్చట యింతగా స్పృశింప వలసి వచ్చినది. ఇటుపైన వ్యాస సాహిత్య మున మానవతా స్వభావమును గురించి ప్రకటితమైన సార్వకాలిక సందర్శన మెట్టిదో వివరింప ప్రయత్నము జరుగును. ఈ దిశలో వ్యాస విరచిత మహాభార తము మనకు సమగ్రమైన విజ్ఞానము నందించగలదు.

**మహా భారతము :**

వ్యాస సాహిత్యమున నాల్గవ భాగముగా పరిశీలింపదగినది పంచమ వేద మనబడిన మహాభారతము. దీనికి యితిహాసమని పేరు. ఇతిహాసమనగా 'యిట్లు జరిగిన'దని ఒక యదార్థ విషయమును గూర్చి చెప్పు కథ. ఈ భూమిపై ఒక నాడు జరిగిన కురు పాండవ వంశ చరితమిది. రాజ్యము కొరకై దాయాదులు జరిపిన దారుణ యుద్ధము. దానియందు సమకాలీన సమాజమంతయు భాగ స్వామియై, రాజులు తలకొక పక్షమున చేరి, ఒకరినొకరు చంపుకొనిన విషాద గాథ. దానిలో బ్రతికి బట్టగట్టినది ఒక పక్షమున ముగ్గురు, మరియొక పక్షమున ఆరుగురు మాత్రమే. అయిననూ చివరకు మంచియే జయించినది. ధర్మము వ్యవస్థితమైనది. ఎచట ధర్మమున్నదో అచట జయమున్నదని నిరూపించు సంఘ టన యిది. దానిలో తానొక పాత్రధారియైనవాడుగా వేదవ్యాసుడు, ఆ గాథను 'జయ' మను పేరున గ్రథనముచేసి తన శిష్యులకు చెప్పినాడు. ఒకడు తనకు తెలిపిన ఒక సంఘటనమును, ఒక వార్తను, ఇతరులకు చెప్పుట కారంభించినపుడు, శ్రోతల ప్రశ్నలు, వానికి సమాధానములు, కొనసాగినపుడు కథాకథనము అంచె లంచెలుగా విస్తృతినందుట సహజ పరిణామము అట్లే 'జయ'మను పేర విరచిత

మైన యుగాంతకారకమగు ఒక యుద్ధగాథ క్రమముగా వక్తల, వ్యాఖ్యాతల ముఖమున 'భారతము'గా, 'మహాభారతము'గా విస్తృతినందినది. భారతము ఒక మహా భయంకరమైన అడవి వంటిదనియు, దానియందంతయూ గందరగోళమే ననియూ అది పరస్పర విరుద్ధాంశముల పాకమనియూ, కట్టుకథల పుట్ట యనియూ, ఊహాల ఉచ్ఛృంఖలమనియూ, ఇంకను అనేక విధములగనూ "చదువుకొన్నవారు" అని చెప్పబడుచున్న ఆధునికులనేకులు విమర్శించుట జరిగినది. వీరికి అక్షరాభ్యాసము నొనర్చిన కొందరు పాశ్చాత్య పండితులు పలికిన పలుకులను, బాసిసలుగా పంజరముల పెంచబడిన భారతీయ "చిలుకలు" కొసరి కొసరి వల్లించుట, నేటికినీ కొనసాగుచునే యున్నది. పరిమితమైన లౌకిక దృష్టి కలిగినవారికి శాశ్వతము, సర్వాంతర్యామియైన సత్యము పాక్షికముగనే లభించును. తమ దృష్టిని, సహృదయతతో విస్తరింపచేసికొని, సత్యాన్వేషణ చేయువానికి పూర్వాపర కార్యకారణ, సంబంధానుబంధ రూపము అపరిమితమూ అలౌకికమూనైన నిత్య సత్యసందర్శనము కలుగును అట్టి సందర్శనము కలిగిన ఋషి జగద్ధితమును కోరి దానిని ప్రవచించి వ్యాఖ్యానించినచో అందు విశ్వవిజ్ఞాన మంతయు కరతలామలకముపలె కన్పించుచుండును. దాని నర్థము చేసికొనుటకు మనకు ఒక ప్రత్యేకమైన దృష్టి, ప్రయత్నము కావలెను

మహాభారత పరమార్థము ఏమిటో, దాని రచనాప్రణాళిక ఎట్టిదో, దాని నెట్లర్థము చేసికొనవలెనో అవతారికయందే సూచింపబడినది. రాజర్షియైన జనమేజయుని యజ్ఞమున-తొలుత కృష్ణద్వైపాయన ప్రోక్తములై, 'విచిత్రార్థములు, విచిత్ర పదపర్వములు,' 'సూక్ష్మార్థయుక్తములు' 'వేదార్థభూషితములు'నై మరల వైశంపాయనునిచే చెప్పబడిన కథలను, సూతుడు శ్రోతలకు మరల వివరించుట జరిగినది. ఆ సందర్భమున అసలు మహాభారతావిష్కరణ మెట్లు జరిగెనను కథ చెప్పబడినది. సర్వనాశకమైన కురుక్షేత్ర సంగ్రామానంతరము చిరంజీవియైన వ్యాసునకు తనచే నిలుపబడిన కురువంశగాథ తుదకు పొందిన పరిణామమును గురించి తీవ్రముగా నాలోచించుచు యోగావిష్టుడైనాడు.

"భారతస్యేతిహాసస్య ధర్మేణాన్వీక్ష్య తాం గతిమ్ ।
ప్రవిశ్యయోగం జ్ఞానేన సో ఽ పశ్యత్ సర్వమంతతః ॥"

తన కనుల ఎదుటనే జరిగిన ఒక విషాద కథకునూ, దానికి భూమికయైన విశ్వగాథకునూ గల సంబంధ మెట్టిది ? సమన్వయ మెట్టిది ? అని యోగనిష్ఠుడై

ఆలోచించినపుడు తొలుత ఈ విశ్వమెట్లు సృష్టింపబడినదో ఆ క్రమమంతయూ ఆయన మనోనేత్రమునకు అగుపడినది- "తొలుత ఎట్టి వెలుగు లేదు. ప్రభ లేదు, చూపులేదు అంతటా అనంతమైన చీకటి ఆవరించి వున్నది. యుగారంభం అవుతున్నది. అపుడు 'అవ్యయము', 'సనాతనము,' 'సదసదాత్మకమునైన' 'దివ్య కారణము' తొలుత సృష్టికర్తయైన బ్రహ్మగా యావిర్భవించినది. ఆయన నుండి క్రమముగా యిరువది ఒక్కరుగా ప్రజాపతులు జన్మించిరి. పిదప దేవతాగణములన్నియు జన్మించినవి. ఆపైన పంచభూతాత్మకమైన ప్రపంచము నక్షత్ర గ్రహ కుటుంబములతో పాటు ఆవిర్భవించినది. క్రమముగా దృశ్యమానమగు ఈ సర్వ చరాచర విశ్వము విస్తృతిని గాంచినది. ఇదియంతయును యుగాంతమున మరల క్షయమైనట్లును- అట్లే యుగయుగమునను ఈ క్రమమే మరల మరల ప్రవర్తించి లయించినట్లును కూడ వ్యాసుని కగుపించినది దానితో మహా భారత గాథకు గల పౌర్వాపర్యము అంతయు ఆయనకు అవగతమయినట్లైనది. దానిని ఆతడు తన శిష్యులకు వివరించి చెప్పుట జరిగినది. అట్టి సమయమున బ్రహ్మ అచట ప్రత్యక్షము కాగా "నేను సందర్శించిన ఈ కథా విశేషమును వ్రాసి పెట్టెడివాడు దొరకలేదు. కర్తవ్యమే"మని వ్యాసుడడిగినాడు. అపుడు బ్రహ్మ "తపస్సంపన్నులందరికంటే విశ్వ రహస్య సందర్శనము చేసిన నీవు శ్రేష్ఠుడవు సత్యవ్రతుడవు. 'గృహస్థాశ్రమము'ను ఇతర ఆశ్రమములు ప్రాధాన్యమున మించలేనట్లు ఈ నీ కావ్యమును యితర కవులు మించలేరు. దీనికి లేఖకునిగా గణపతిని స్మరింపు" మని వ్యాసునితో చెప్పెను. బ్రహ్మ యిచట 'గృహస్థాశ్రమము'ను ఉపమానముగా గొనివచ్చుటచే కుటుంబ జీవన వ్యవస్థ (కురు కుటుంబము) భూమికగా విశ్వ రహస్య వ్యాఖ్యానము భారతమున జరుగవలెనని ఆయన సూచించినట్లు మనము భావించవలెను. అటు పిమ్మట వ్యాసుడు గణపతిని స్మరించినాడు. ఆయన రాగానే తాను చెప్పెడి భారత రచనమునకు లేఖకునిగా వుండమని వ్యాసుడు కోరినాడు. "వ్రాయునపుడు నా కలమాగకుండెడి రీతిని మీరు చెప్పినచో వ్రాయుట కొప్పుకొందునని" గణపతి పల్కినాడు. "నేను చెప్పిన దానిని అర్థము చేసికొననిదే వ్రాయకుండుటకు నీ వంగీకరించినచో నేను భారతమును ప్రవచింతునని" వ్యాసుడు పల్కినాడు. ఇరువురకు ఒప్పందము కుదిరినది. భారత రచనము ఆరంభమైనది. వ్యాసుడు తన ప్రవచనమున కుతూహలము కొద్దీ మధ్య మధ్య

అనేక 'గ్రంథగ్రంథులను' యిమిడ్చి చెప్పినాడు- అంటే సామాన్యంగా అర్థం తెల్సికొనుటకు తేలికగా అందనివీ, మొదలు దొరికితే మడివిడిపోయి విజ్ఞానపు వెలుగులను వెదజల్లేవీయైన 'చిక్కుముళ్ళు' వేశాడన్నమాట. ''వ్యాసుడు అట్లు చెప్పిన వానిలో ఎనిమిదివేల ఎనిమిది వందల శ్లోకములు నాకు తెలుసు. శుకునికి తెల్సు. సంజయునికి తెలుసునో తెలియదో నాకు తెలియదు'' అని సూతుడు చెప్పాడు. అట్టి గ్రంథగ్రంథులను అర్థము చేసికొని వ్రాయుటకు విద్యాధిదేవత యైన గణపతి కూడా ఆగియాగి వ్రాయవలసి వచ్చినది. అంతటి గూఢార్థాలతో వ్యాసుడు అనేక వేల శ్లోకములు చెప్పినట్లు అవతారికనుబట్టి తెలియుచున్నది.

ఆ విధంగా సామాన్యముగు 'జయ'మను యుద్ధ గాథ యిద్దరు దివ్యపురుషుల పంతమున ఎదిగి ఎదిగి మహాభారతమైనది. ఇందు వ్యాసుని పలుకులు కట్టుకథలు కావని, వాని నడుమ ఎట్టి విరోధము లేదనీ, దాని యర్థ సమన్వయములను అవగతము చేసికొననిదే గణపతి వ్రాయలేదనీ, కాబట్టి మనం కూడ వ్యాస భారతమును సగౌరవంగా సహృదయతతో అర్థం చేసికొనే ప్రయత్నం చేయాలని, చదివినా తెలియకపోతే అందలి అంతరార్థమును తెలిసినవారినడిగి తెల్సుకోవాలనీ అవతారిక సూచించుచున్నది. అట్లే వ్యాస భారతము వైశంపాయనాదుల ప్రవచనమున మరింత విస్తృతమైననూ, ఈ విస్తృతి వ్యాఖ్యానాత్మకమే కాబట్టి విత్తునుండి చెట్టు ఎదిగినట్లే జయము నుండి మహాభారత మావిష్కృతమైనదని మనము తలంచుట సమంజసము.

మహాభారతమున వ్యాసుడు నిబంధించిన గ్రంథ గ్రంథుల స్వరూపమేమి? వాని యంతరార్థ మెరుంగుటెట్లు? అన్న ప్రశ్నలకు వ్యాస భారతముననే ఉదాహరణము కలదు. ఆదిపర్వమున గల ఉదంకోపాఖ్యానమున ఉదంకుడను ఒక శిష్యుడు తన గురుపత్నికొరకై పౌష్యుని కుండలములను తెచ్చుటకు వెడలినపుడు పాతాళమున ఒక దృశ్యము చూచెను. అందు యిద్దరు స్త్రీలు తెల్లని నల్లని దారపు పోగులతో ఎడతెగని ఒక వస్త్రమును నేయుచుండుట; అచటనే పన్నెండారములు కలిగిన ఒక చక్రముండుట, దానిని ఆరుగురు త్రిప్పుచుండుటను చూచినాడు. అతని మార్గమున ఒక ఉన్నతమైన గుఱ్ఱము, మహోన్నతుడగు పురుషుడు కూడ నగుపడిరి. ఆ దృశ్యమును చూచినంతనే ఉదంకుడు వేద మంత్రములవంటి శ్లోకములతో ఈ క్రింది విధముగ స్తోత్రము చేసినట్లు భారతమున కలదు. (తుష్టావ యేభిర్ మంత్రవదేవశ్లోకైః) ''త్రీన్యర్పితాన్యత్ర

శతాని మధ్యే షష్టిశ్చ నిత్యం చరతి ధృవేస్మిన్" (మూడు వందల అరవై రోజులుగా పరిభ్రమించు సంవత్సర చక్రము యిందు సూచితము) "చక్రే చతుర్వింశతి పర్వయోగే షడ్వైకుమారాః పరివర్తయంతి" (ఇరువది నాల్గు పర్వములు కల్గిన అనగా పన్నెండు మాసములు కల- ఈ సంవత్సర చక్రమును ఆరుగురు ఋతువులను కుమారులు త్రిప్పుచున్నారు" అని దీని భావము) "తంత్రం చేదం విశ్వరూపే" (ఇదియే విశ్వరూప నిర్మాణ తంత్రము అని దీని యర్థము) "యువతౌవయ్యతస్తంతూన్ సతతం వర్తయంతే। కృష్ణాన్ శితాంశ్చైవ వివర్తయంత్యౌ భూతాన్యజస్రం భువనానిచైవ" (పగలు రాత్రులను చీకటి వెలుగులను- పడుగుపేకగా కాలము ప్రవాహమున ఇల్లల్లుచు పంచభూతములను లోకముల నన్నింటినికూడ నిర్మాణము చేయుచున్న ఆ స్త్రీ లిరువురు 'ధాత', 'విధాత'లను వారలు అని యర్థము. "యోవాజినం గర్భమపాం పురాణం వైశ్వానరం వాహస మభ్యుపేతి (ఎవరైతే నీటిలో అంతర్నిహితంగా వున్న అగ్నిని- విద్యుత్తును- అశ్వశక్తి (Horsepower) గా వెలికితీసి తన వాహనముగా చేసికొని విశ్వమున సంచరిస్తుంటాడో అట్టి "వజ్రస్యభర్తా" (మెరపుతీవెలోని శక్తికి ప్రభువు- Electro dynamic force?) "భువనస్య గోప్తా" (విశ్వమునంతను సంరక్షించువాడు) అగు యింద్రునకు నమస్కరింతును." అంటూ ఉదంకుడు స్తోత్రం చేసినట్లుగా చెప్పబడింది. దీనిని బట్టి ఉదంకునకు తాను చూచిన దృశ్యములోని వివిధ అంశములయొక్క అంతరార్థములు తెలియునని మనకు తెలియుచున్నది. అయినను మహా భారతమున ఉదంకుడు తన గురు గృహమును చేరిన పిదప పాతాళమున తాను చూచిన ఆ దృశ్యమునందలి వివిధ అంశముల అంతరార్థమేమిటి యని గురువును ప్రశ్నించును. అపుడాతని గురువు వాటినన్నిటిని వివరించి చెప్పును. అనగా తనకు తెలిసిన దానినే ఉదంకు డడిగినను అట్టి విశేషమును మనకు తెలియ చెప్పుటకును, తన రచనా ప్రణాళికలోని గ్రంథ గ్రంథుల పద్ధతి ఎట్టిదో, దానిని మనమెట్లర్థము చేసికొనవలెనో సూచించుటకును వ్యాసుడు ఉదంకుని గురు ముఖమున వానిని వివరించెను.

మహా భారతము కేవలము రాజ్యము కొరకు పోరాడుకొని, అయిన వారందరిని చంపుకొనిన అన్నదమ్ముల బిడ్డల కథ. అందునను ఆటయందు నేర్పులేనివాడు, తన యాలిని యాజూదమున పందెముగా నొడ్డిన, అవివేకపు

వృత్తాంతము. వీరుల శౌర్యసాహసములతోబాటు దుష్టుల కుచ్చితములను, కుతంత్రములను కూడ కలబోసి చెప్పిన కథ. ఇట్టిది ఇన్నివేల ఏండ్లు ఈ దేశమున ఎట్లు నిలబడగలిగినది? నేటికిని గ్రామ గ్రామమున, నగర నగరమున పండిత పామరులచే సమముగ ఏల అధ్యయనము చేయబడుచూ ఆదరింపబడుచున్నది?

లోకములోని మానవులందరి యొక్క సర్వసామాన్య మనః ప్రవృత్తులన్నిటి యొక్క ప్రతిబింబములు, వివరణములు యిందు నేర్పుగా నిక్షిప్తములై యున్నవి. మహాభారతమను అద్దమున మానవ ప్రపంచము మనకు నేటికిని ప్రత్యక్షము అగుచుండును. అందుచేతనే నేటికినీ దానికంత ఆకర్షణము. దానిపై యంతటి గౌరవము.

సర్వసాధారణముగ మానవ మనః ప్రవృత్తి కొన్ని కోరికల పుట్ట. వానికే 'కామ'మని గూడ పేరు. కేవలజిజ్ఞాసారూపమైన 'కామము,' విజ్ఞాన పరిధులను విస్తృతపరుస్తూ మనిషిని, గ్రహాంతరాలలోని విజ్ఞానమునూ, అగాధమైన సముద్రములలోని అద్భుత రహస్యములను కనుగొనుటకు పురిగొల్పుచున్నది. సుఖానుభవపరమైన కామము ''ఒకపుడు ఈర్ష్యాద్వేషములవంటి సంకుచిత భావములకు లోనై, దుఃఖప్రదమగుచు, వేరొకపుడు దయా, దానములవంటి విశాల గుణములకు తావిచ్చి ఆనందానుభూతులను కల్పించుచున్నది. ఇట్టి 'కామ' ప్రపంచమున కాలంబము ఈ విశ్వమునందలి సమస్త వస్తుజాతము. దీనికే ''అర్థ''మని పేరు. ఇట్టి 'అర్థ' 'కామము' లందలి ఆసక్తి సర్వజీవ సహజమే అయిననూ విశృంఖలముగా కాక నిగ్రహముతో వానిని సేవించుట సర్వథా సర్వదా లోకహిత ప్రదమనునది నిర్వివాదము. ఇట్టి నిగ్రహమునకు ప్రాతి పదికయు, గీటురాయియు, ఏది? ధర్మము, అని వ్యాస సాహిత్యమున ప్రతి పాదితము అనగా ధర్మబద్ధమునూ, ధర్మవిరోధియూనై నపుడే సర్వజీవ సామాన్యమైన కామము. కామపురుషార్థముగా, అనగా మానవుడు ప్రయత్నపూర్వకముగా ఉపాసించి తీరవలసినదిగా యగును. అట్లే ధర్మబద్ధముగా సమీకృతమైనపుడే అర్థసంచయము, అనగా కోర్కెలను తీర్చగలిగిన సాధన సామాగ్రిని సమకూర్చు కొనుట, అర్థపురుషార్థమను పరిధిలోనికి చేరును. అపుడే ఆట్టి వస్తువుల అనుభవము ప్రయత్నపూర్వకముగా పురుషుడు పొందదగినదిగా యగును. అయినచో ఇట్లర్థకామములను ఉదాత్తమొనర్చు ధర్మమనగానేమి? దాని స్వరూపమేమి? కామ

మునకు కామపురుషార్థమునకు కల తేడా ఎట్టిది? అర్థమునకు అర్థపురుషార్థమునకు కల వ్యత్యాసమెట్టిది? వానిని మనము గుర్తించి యనుష్ఠించుటెట్లు? యను సార్వకాలిక ప్రశ్నలకు మహాభారతము సోదాహరణములైన సమాధానము నిచ్చును. అసలు ధర్మమనగానేమి? ఆర్షసాహిత్యమున ధర్మము అనేక విధములుగా నిర్వచించ బడినది. "ధారణాత్ ధర్మమిత్యాహుః," "ధర్మో ధారయతి ప్రజాః"- అని యొక నిర్వచనము. అనగా దేనినైనను ధరించి వుంచునది. అనగా, ఒక వస్తువును దానిగా నిలబెట్టివుంచునది, దానియొక్క సహజమైన గుణగణమును, స్వభావమును యథాతథముగ నిల్పకల్గునది-యని. అట్టి ధర్మమే ఈ సమాజమును ఈ విశ్వమునంతను సమాజముగ, ప్రజగ నిలబెట్టియుంచుచున్నది. ఇది ధర్మము యొక్క తాత్త్విక నిర్వచనము. అట్లే 'యత్ర అభ్యుదయ నిశ్శ్రేయసస్సిద్ధిః సధర్మః' అని మరొక నిర్వచనము అనగా ఏ వ్యవస్థయందు భౌతికమైన అభ్యుదయము, పారలౌకికమైన మోక్షము కూడ అనుష్ఠాతలకు లభించునో అట్టి వ్యవస్థయే ధర్మమని యర్థము ఇది ధర్మ వ్యవస్థయొక్క ప్రయోజనాంశమును సూచించు విషయము.

అట్లే 'ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా' అను వేదవాక్యము ధర్మమునకు మరియొక నిర్వచనము. అనగా ప్రగతి శీలమైన ఈ విశ్వమునకంతకు సుస్థితిని గూర్చునదే ధర్మము అని అర్థము. మొదటి రెండు నిర్వచనములును మానవుని ప్రత్యేకముగా స్పృశించుచూ చెప్పబడినవి. మూడవది విశ్వమునంతను అదే ధర్మపరిధిలోనికి తెచ్చుచు చెప్పిన నిర్వచనము. 'ధర్మయేవహతోహంతి, ధర్మో రక్షతి రక్షితః' అని ధర్మాచరణము యొక్క అవసరమునూ, తద్భ్రంశమున వచ్చు యిబ్బందినీ సూచించుచూ, వ్యాసుడు చెప్పిన మాట. అనగా ధర్మవ్యవస్థ కనుగుణముగా మన జీవితములను గడుపుకొనినచో అట్టి ధర్మ వ్యవస్థయే మానవుని సంరక్షించును. దానిని భంగపరిచినచో అదియే మానవుని హత మార్చును యని యర్థము.

మామూలుగా అర్థమయే మాటలలో చెప్పుకోవాలంటే- 'ధర్మము' అనగా శాస్త్రీయ విజ్ఞానపు పరిధిలో ఒక వస్తువును, ఆ వస్తువుగా, దాని విశిష్ట లక్షణములతో నిలబెట్టి వుంచేవ్యవస్థ. సామాజిక నైతిక పరిధిలో మానవునకు సుఖశాంతుల నిచ్చేవిధమైన నిగ్రహంతోగూడిన 'సదాచార వ్యవస్థ'- ఆధ్యాత్మిక పరిధిలో ఆత్మజ్ఞానమును సమకూర్చి శాశ్వతానందాన్నందించే, యమ నియమాదుల

ద్వారా, భక్తి దైవవిశ్వాసములనలవరచే సాధనాక్రమమంతయును- ఈ విధమైన అన్ని పరిధులలోనూ, నిగ్రహంతో నిర్వహించవలసిన విధి నిర్వహణమే- 'ధర్మము'. ఈ ధర్మస్వరూపాన్ని వేదం ప్రకటించింది, స్మృతి వివరించింది. సామాన్యునకు వానిని అధ్యయనం చేసి ధర్మస్వరూపం తెలుసుకునే యోగ్యత లేదు. అందుకొరకే వ్యాసుడు భారతం రచించి, ధర్మ స్వరూపమును కరతలామలకం చేశాడు. కానీ ఆధునికులకు, సంస్కృత భాషాపరిచయం లేకపోవటం చేత, భారతంలోని విషయము తెలియుట లేదు. కొబట్టి భారత ప్రతిపాదిత ధర్మ నిర్ణయమును గురించి, నవీనులకర్థమయే మాటలలో రుచి చూపించుటకిది యొక యత్నము.

ఒక కారు (Car) ఉన్నదనుకుందాం. అట్టి 'కారు'ను, 'కారు'గా నిలబెట్టేది, అంటే దాని పరమ ప్రయోజనము, విశిష్ట లక్షణము అయిన, 'శీఘ్రప్రయాణ సాధనాలు' లక్షణమును చక్కగా నిలపివుంచే వ్యవస్థ శాస్త్రీయంగా దాని ధర్మమన్న మాట, అలా 'కారు' నడవటానికిగాను: దానిలాగే అనేక చిన్నచిన్న వ్యవస్థలు వుంటాయి. దానిలోని 'స్టీరింగ్' మొదలు, 'బాల్ బేరింగు' వరకూ ఒక నిర్ణీత వ్యవస్థలో దేనికది నడవకపోతే, 'కారు' 'కారు' కాదు. అది మనమాశించిన ప్రయోజనమునందీయలేదు. అదే విధంగా, ఒక కారులో ఎట్టి విస్తృతమైన వ్యవస్థ, 'ధర్మముగా' వున్నదో, మన శరీరంలో గూడా, అట్టిదే ఒక వ్యవస్థ వున్నది ఆయితే 'కారు' ఒకయంత్రం. దానికి మనసులేదు నడిపేవాడి మనసునే అది అనుసరిస్తుంది. మనిషిలో మాత్రం వికసించిన 'మనస్సు'ంది అంతేగాదు. ఆ మనస్సు వెనుక అనిర్వచనీయమైన 'ఆత్మ' వుంది అస్తిత్వంగా శరీరంలో, ప్రతి అవయవంలోనూ, ఎక్కడికక్కడే చిన్న వ్యవస్థలు అనేకం, నియమ పూర్వకంగా పని చేస్తున్నాయి. అప్పుడే శరీరం శరీరంగా రూపొందుతోంది. లేకపోతే మృత ప్రాయం అవుతుంది. ఈ శరీరములోని ఈ వ్యవస్థ దేనికి? అన్న ప్రశ్నకు, శరీరంలోని మనస్సే సమాధానం చెప్పుకోగలదు. అలా సమాధానం చెప్పేది వివేచనాశక్తితో ఎదిగిన మనసులోని 'బుద్ధి'- ఆత్మయనే - శరీరపుయజమాని, అజ్ఞప్రకారం, శరీరమనే కారును, చక్కగా, నిలుపుకొని, నడుపుకోవటమే, పరమప్రయోజనం-అని 'బుద్ధి' గుర్తిస్తుంది. ఇది సవ్యంగా సాగినంతవరకూ శరీరానికి, ఆత్మకు సుఖశాంతులుంటాయి. మనస్సు అట్టి వివేచనతోగాక, విశృంఖలంగా ప్రవర్తిస్తే- అంటే మంచి 'కారైనా' ఇష్టం వచ్చినట్లు నడపడం ఆరంభిస్తే అన్నీ అనర్థాలే గదా! ఇది ధర్మవ్యవస్థను గురించి ఆధునిక ఉదా

హరణగా మనం భావించనక్కరలేదు. కఠోపనిషత్తుల్లో గూడ, ఇదే ఉదాహరణ కనిపిస్తుంది. దానిప్రకారం - ఆత్మ రథికుడు, శరీరం రథము, బుద్ధి సారథి మనస్సు కళ్లెము, ఇంద్రియములు గుఱ్ఱములు అని చెప్పబడింది. అది ఉపనిషద్విజ్ఞానమును గ్రహించగలిగిన స్థాయిలోని ఆత్మ జ్ఞాననిష్ఠుడైన వానికి చెప్పబడినది. అదే ఉదాహరణమును సామాన్య మానవునకు అర్థమయేలా వ్యాసుడు కొద్దిమార్పుతో భారతంలో బోధించాడు. 'పార్థ సారథియైన పరమాత్మ కథ' సామాన్యమానవజీవనానికి వ్యాసుడు సార్వకాలికంగా సమకూర్చిన సాధనం. భారతంలోని రథం నీ శరీరమే రథమనుకో. నీ కోరికలనే స్వచ్ఛమైన గుఱ్ఱములే, దానిని నిరంతరం లాక్కుపోతున్నాయనుకో, వానిని అవసరమైన రీతిగా, అదుపు చేయగల కళ్లెంగా నీ మనసు నువు, తయారుచేసుకో. నీ మనస్సును నీలోని ఆత్మవైపు సారించుకో, అప్పుడు ఆత్మవైన నీవు నీ శరీరాన్ని సాధనంగా చేసుకొని నీ గమ్యాన్ని చేరుకోగలవు - అప్పుడు నీవు భారతంలోని 'ధర్మరాజు' లాంటివాడివౌతావు. నీ రథగమనానికి, నీ జీవనయాత్రకు, లక్ష్యం గురించి, నీ ప్రయాణం గురించిన విజ్ఞానమునంతనూ. వేదము (కృష్ణుడు) స్మృతి (వ్యాసుడు) సదాచారము (విదురుడు) సమకూరుస్తారు, ఆ విధంగా నడుచుకుంటే (ఆత్మతృప్తి) లభిస్తుంది. అంతకన్న జీవితానికి, ప్రయోజనం, ఆనందం వేరుగా లేవు-ఇది ధర్మనిత్యునికథ-ఆత్మజ్ఞాని సాధనా కథ లోకంలో అందరికీ అది ఆదర్శమే.అయితే అందరూ, ధర్మజునివలె దృఢవ్రతులు కారుకదా-సర్వసామాన్య'నరులు' ఎందరెందరో. వారిలో అధికులకు ధర్మంగా వుండాలనే కోరికగలవారే అధర్మంగా. అంటే నియమభంగం చేసేవారు ఏ స్థాయిలోనైనా, మందుకొద్దిమందే వుంటారు. ధర్మాసక్తివుండి, అజ్ఞానంలో వుండే అధిక సంఖ్యాకులకు వ్యాసుడు చెప్పిన సందేశమేమంటే-భారతంలోని, నరుడగు, అర్జునునిలా నడుచుకోమని నీ శరీరమనే 'కారు'ను ప్రయత్నపూర్వకంగా సరైన వ్యవస్థలో, ఎప్పుడూ నిలబెట్టుకో. యమ, నియమాలను అనుష్ఠించు. మనస్సును అంతర్ముఖం చేయి, ఆత్మ సాక్షాత్కారం పొందకపోయినా ఇబ్బంది లేదు-నీ బుద్ధిని, 'దైవంపై' విశ్వాసపూర్వకంగా ముడివేసికొని, యజమానివైన, నీవు దర్జాగా వెనుక 'సీటు'లో కూర్చో. ఆ 'దైవం' నీకు 'డ్రైవరు'గా దిగివచ్చి, చేర్చవలసినచోటుకే నిన్ను చేరుస్తాడు.-ఇది సామాన్యునికి వ్యాసుని సందేశం. అయితే, ఒక్కకారేకాదు గదా లోకంలో వున్నది. ఉన్న 'కార్ల'న్నీ సవ్యంగా వుండకపోతే, రహదారిలో రద్దీ, స్పర్థ, తగాదాలు తప్పవు గదా! అప్పుడు

మొత్తం వ్యవస్థే అస్తవ్యస్తమవుతుంది గదా. దీనిలో సాధక, బాధకాలు, తాత్కాలిక అవసరాలు, యివన్నీ-ఆపద్ధర్మాలుగా, మొత్తం ధర్మకవద్ధదను, నరుడు అర్థం చేసుకోవాలి గదా! అట్టి చిత్రవిచిత్రములైన జీవననౌక వ్యవస్థలోని, ధర్మ సూక్ష్మములు, విశేషములూ, సోదాహరణంగా మహాభారతంలో వ్యాస భగవాను డందించాడు. దాని అవగాహన నేటికినీ అవసరమే గదా!

మానవునకు ఎంతకాలమీ కారు ప్రయాణం ? లక్ష్యం చేరేటంతవరకూ-ఏమిటా లక్ష్యం? మోక్ష పురుషార్థమని మనీషుల నిర్దేశం-అంటే ప్రశాంతమైన, శాశ్వతానందం పొందటమన్న మాట! ఎంత దూరమునన్నదది? నీ ఆత్మ యొక్క పరిపక్వతఎంతో అంత దూరమునన్నది. అట్టి స్థితిగల ధర్మజునకు, భారతాంతమున నది లభించినది. అంతటి ఆత్మజ్ఞానములేని వారి కథ ఏమి? ఎన్నో జన్మల సాధనము. అంతవరకూ, సుఖశాంతులు లభింపవా? లభిస్తాయి. శరీరమనే కారుని సుస్థితిలో నుంచుకొని, దైవమనే డ్రైవరుపై విశ్వాసముంచి యాదృచ్ఛా లాభమున సంతుష్టిపడుతూ, ఒక కారు విడప, మరొక 'కారును' అధిష్ఠించి, జన్మలెత్తుతూ లక్ష్యం మరువక ప్రయాణంచేస్తే - ఎప్పుడో ఒకప్పుడు, గమ్యం చేరుతావు-అవసరాలు మాత్రమే సమకూర్చుకుంటుంటే, కోరికల ఆరాటాన్ని విడిచిపెడితే, అంటే - ధర్మాన్ని ఆలంబనం చేసికొంటే, ప్రయాణం ఎంతో సుఖం ఇస్తుంది. తనకు మోక్షపురుషార్థము ద్వారములు తెరచి నిలచి ననూ, ధర్మమునందలి విశ్వాసమును, దాని సాహచర్యమును, విడచిపోవుట నా కిష్టముండదని, స్వర్గారోహణపర్వమున, ధర్మజుడు చెప్పిన మాటలలో, మోక్షపురుషార్థము యొక్క పరమార్థము. చతర్విధ పురుషార్థములలో ధర్మము యొక్క ప్రాధాన్యము వ్యక్తము చేయబడినది.

ఇట్టి పురుషార్థ వ్యవస్థ యొక్క స్వరూప నిరూపణముతోబాటు భారతమున, యావత్ప్రపంచము ప్రదర్శితమైనది. అది ఏ విధముగా వ్యాసుడు సంగ్రధనము చేసినాడో పరిశీలింతము, ముందుగా కామపురుషార్థపుగాధ గూర్చి ఆలోచింతము.

**కామ పురుషార్థము :**

లైంగికమయిన కామము-బీజము, క్షేత్రము, వాని సంయోగ ఫలితమైన సంతానములు ముఖ్య బిందువులుగా వృత్తి మేర్పరుచుకొని, విశ్వ సృష్టి క్రమమున సాలుపంచుకొనుచున్నది. ఇది సర్వజీవసామాన్యము. ఇట్టి కామ సంబంధ

ములు, లోకమున నెన్ని రకములుగా నుండునో, వానిలో ఏవి ధర్మబద్ధములూ, లోక సుస్థితికి హేతువులూ కాగలవో, ఏవి క్లేశమునకు, వినాశమునకు త్రోవ దీయగలవో, వాటన్నిటి యొక్క ఉదాహరణములు భారతమునందు వ్యాసుడు సూచించినాడు. విషయ వాంఛగాకాక, జీవోత్పత్తికి వీర్య వినియోగమే అవసర కర్తవ్యంగా భావించబడుట పరాశర, ఉపరిచరవసువుల కథలలో ప్రతిపాదితము. విషయవాంఛాతృప్తియే ప్రధానముగా, వావి వరుసలు, విధి నిషేధములు లేని ఒకానొక కామచారము, జంతువుల యందువలె. మానవులలో గూడ నొకప్పుడుండెడిది. దీనిని మమతా, ఉతథ్యుల (ఉత-అధి-యని) కథలో వ్యాసుడు చెప్పాడు. ఉతథ్యునివలన మమత గర్భవతియైనది. తన గర్భ ఫలదీకరణమున మమత ఉతథ్యునికై 'మమత'గా మారినది. తన బీజమునకు అలంబమగుటచే అతనికి ఆమె 'మమత' యైనది. ఆమె గర్భస్థ శిశువు వారిద్దరి 'మమతలకు' ముడియై గర్భమున నెదుగుచున్నది ఇంతలో బృహస్పతి ఆమెతో సంగమము కోరాడు. గర్భస్థ శిశువు అడ్డు తగిలాడు. బృహస్పతి వానికి శాపం ఇచ్చాడు. గర్భోత్పత్తి కాగానే స్త్రీ పురుష సంబంధమునకు ఒక నియతి సహజముగనే వచ్చినదని యిందు సూచితము. అష్టే-ఉద్దాలకుని కథలో, అతని భార్యను వేరొక వృద్ధుడు కోరగా, ఆమె కొడుకైన శ్వేతకేతువు లోకమున ఇకనుంచీ ఏకపత్నీ వ్రతముండవలెననీ, తద్విరుద్ధము అధర్మమని కట్టడిచేసినట్లు వ్యాసుడు చెప్పాడు. స్మృతి సమ్మతములైన వివిధ వివాహపు తీరుల కథలు భారతమున వర్ణితములు. అగ్నిసాక్షిగా స్త్రీ పురుషులు వివాహ మాడుట, యజ్ఞముగా గార్హస్థ్యమును నిర్వహించుట. అదృశ్యప్రాయమైనదనీ-భృగుపులోమ కథ - ప్రతిపాదించుచునే, దానికన్న విభిన్నములు, విపర్యయములునైన అనేక వివాహముల కథలు వ్యాసుడు వర్ణించాడు. తండ్రి చెప్పిన మాట విని తన జీవన భాగస్వామిని స్వీకరించుట-గంగాశంతనుల కథలో మొదట సూచితము. పెండ్లి కామవాంఛా ప్రధానముగా సాగినప్పుడు, పుట్టిన బిడ్డల మమతలు చంపుకొనుట-చివరకు చంపుకొనుట దంపతుల కిరువురకూ నంగీకారమగుచుండుట, కొండొకచో జరుగుటనూ సత్సంతానమును సంరక్షించుకొను దృష్టి కలిగినంతనే వివాహము-విలువలు-ఫలితములు మారునా విషయమునూ గూడ - గంగాశంతనుల పెండ్లిలో భీష్మజన్మము దనుక సూచితము. భీష్మునివంటి శ్రేష్ఠుడగు పుత్రుని పొందీ, వయస్సువచ్చిననూ విషయవాంఛ తీరక శంతనుడు మరల పెండ్లి యాడుట-ఎంతటి అనర్థదాయకమో, దానివలన కౌటుంబికముగ గూడ ఎట్టి సంకటము లేర్పడునో, సత్యవతీ శంతనుల పెండ్లి

లోనూ, భీష్మప్రతిజ్ఞలోనూ, విషయ వాంఛాలంపటులకు, విషయలోలురే జన్మింతు రనుటను, చిత్రరథ, విచిత్రవీర్యుల జనన, మరణ వృత్తాంతములలోనూ, సూచితము. అట్లే, ప్రేమవివాహములు, స్వయంవరములు, బలవంతపు పెళ్ళిళ్ళవంటి వన్నీ యిందు చూపబడినవి. సంతతికొరకు అనుసరింపబడు వివిధ మార్గములు, దేశకాలముల పాత్రములను బట్టి, వాని వినియోగ ఫలితములు, పరశురామునిచే క్షత్రియ వంశనాశనమైన పిదప జరిగిన చరిత్ర చెప్పుటలోనూ, వ్యాసనియోగము నందును, కుంతికి పంచపాండవుల జననము జరిగిన తీరునందును సూచితము, అట్లే పెద్దలకు తెలియకుండ బిడ్డలను కనుట (కర్ణుడు), పెద్దలే మోసగించి పెళ్ళి చేయుట (లింగముల మార్పిడి), (శిఖండి కథ) గర్భవిచ్ఛేదము - దానిని మరల కాపాడుకొనుట (గాంధారి) అన్న చెల్లెలిని కలియగోరుట (సైంధవుడు) వంటి అక్రమములు, తీరులు, పర్యవసానముల గార్హస్థ్యమున సవతుల కథలలో వివిధ రకముల ప్రవృత్తులు, వివాదములు, వాని ఫలితములు వంటివి, వినతాకద్రువలు, దేవయాని శర్మిష్ఠలు, కుంతీమాద్రుల కథలలో చర్చించబడ్డాయి. పాతివ్రత్యము యొక్క స్వరూప నిరూపణము, వివిధ దశలుగా, గాంధార, కుంతి, ద్రౌపది, దమయంతి, శర్మిష్ఠల కథలలో వర్ణితము. మహామునియై యుండియూ, విషయ వాంఛ బలిసినప్పుడు, పశురూపమున సంగమించవలెనను కోర్కె గలవారి కథను కిందముని వృత్తమున సూచితము. భీముని, అర్జునుని వివాహములు, ఇంక ననేకవిషయ ప్రతిపాదకముగా కనుపించును. ద్రౌపదీస్వయంవరము అన్నిటికన్న ఒక విచిత్రగాధ. బలవంతముగా కామనిగ్రహము (నారాయని కథ) కల్పించిన పరిణామము, పంచ భర్తృకనుగా ద్రౌపదని తీర్చినది. అయిననూ, ఆమె ధర్మ బద్ధముగా, వారితో సంసారమును చేసి, పతివ్రతాతిలకముగా పరిగణించబడినది. కావుననే ఆమె చేత, వ్యాసుడు, దాంపత్యమున నీతిధర్మములను గూర్చి-సత్య భామకు మహాభారతమున అనేక సూత్రముల నుపదేశము చేయించినాడు. స్త్రీ-పురుష సంబంధములను గురించిన వివిధ దశలు, మహాభారతమునందు చర్చింప బడినంతగా, మరి యే ఇతర గ్రంథమునందునూ జరుగలేదని చెప్పవచ్చును. కామచరితము నింతగా చెప్పుచునే కామము, పురుషార్థముగా నెట్లుపాస్యమో చెప్పుట వ్యాసుని మహాభారతమున నొక విశిష్టతను సంతరించుకొనినది.

**అర్థపురుషార్థము:-**

ఈ ప్రపంచమున యిందలి వస్తు సముదాయమంతయు మానవుని విని యోగమునకు ఉద్దిష్టమైన అర్థ సంపత్తిగా చెప్పబడుచున్నది. మానవునకు భౌతిక

మైన ప్రాథమిక అవసరములు తీరనిదే జీవితమే లేదు. ఆహారము, గృహము, భద్రత, సుఖము వంటివి యిట్టి ప్రాథమిక అవసరములు. దీనన్నిటికి రాజు, రాజకీయ వ్యవస్థవంటివి సుస్థితిని కల్పింపగలవు. కాబట్టి రాజు, రాజ్యము, అధికారము, ఆస్తి, ఆహారము, వసతి, వైభవము- వీనికొరకై ఆరాట పోరాటములు, గెలుపోటముల కథయే మానవ జీవితమున కన్పించుచుండును. వీనన్నింటిని వివిధ దృక్కోణములలో విశ్లేషణచేసి, ఏది ఎంతవరకు స్వీకరింపదగిన ? ఎంత వరకు నిగ్రహించుకొనదగినది? విశృంఖలముగ వీనిని సమీకరించుకొను యత్నమున వచ్చు సాధకబాధకములు, సుఖదుఃఖములు ఎట్టివి? వివరించి విశ్వవ్యవస్థను నిలుపు శాశ్వత ధర్మమునకు ఏవిధమైన అర్థసముపార్జనము విరుద్ధము కాదో అట్టిదే అర్థపురుషార్థము అని సోదాహరణముగ మహాభారతమున నిరూపితము.

మహాభారతము మౌలికముగ ఆస్తికొరకు అన్నదమ్ముల బిడ్డల మధ్య తగవు కదా! భీష్మ వృత్తాంతము మొదలుకొని పరీక్షిత్తువరకు సాగిన కురు వంశస్థుల కథలో వారసత్వమగు ఆస్తిపాస్తుల కథ తత్సంబంధితమైన న్యాయాన్యాయములు చిత్రవిచిత్రమైన వ్యాఖ్యానములు వివరణములతో వ్యాసుడు ప్రతిపాదించినాడని ఎల్లరెరింగినదే. కాబట్టి దానిని యిచట వివరింపక యితర అంశములను స్థూలముగ ప్రస్తావించిన చాలును. భారతమున ఆపోదమైన ధౌమ్యుని శిష్యుల కథలో ఆహారం పండించుటకై కేదారమునకు (పొలమునకు) నీరు పెట్టుటతో నారంభమైన ఆహారపు కథ ఉపమన్యువు గాథలో ఎట్టి ఆహారమును ఏ రీతిగా స్వీకరింపవలెను వంటి విషయములను సూచించుచూ ఉదంకుని కథలో పితృదేవతలకాహారము నర్పించెడి శ్రాద్ధవిధి సందర్భమున దూషితమగుట యనగానేమి? మంచి ఆహారమేమి? వంటి వానిని గూర్చి వివరించుచూ కొనసాగుట గమనింపదగినది. ఇంతటితో నాగక భారతమున పౌదభునమూ ఆకలి కథ (గరుడుడు, గజకచ్ఛపములు) సూచింపబడుచూ కురుపాండవ గాథలో కూడ వ్యాఖ్యాతమైనది. వేదవిదుడైన ద్రోణుడు ఆపోదుని శిష్యుడగు ఉపమన్యువువలె వేదునివలె ఆహారమును సముపార్జించి జీవనవృత్తిని చేయుటకు బదులు దారిద్ర్య వశమున స్వధర్మమును విడచి క్షత్రియధర్మమును స్వీకరించుట, అట్టి పనియొక్క పర్యవసానములు వివరించబడినవి. బిడ్డకు పాలు దొరకక పిండిని నీళ్లలో కలిపి పాలుగా పట్టిన దుర్భర పరిస్థితి ద్రోణుని జీవితమునే ఎట్లు మార్చినదో భారతమున చర్చింపబడినది. భారతమున భీముడు ఆహార ప్రియుడు. దీనిని సాకుగా

చేసికొని దుర్యోధనుడాతనికి ఆహారమున విషము పెట్టించినాడు అట్లే లక్కా గృహమున ఆహారమున విషప్రయోగ ప్రయత్నము జరిగినది భీముని ఆహార ప్రియత్వమే అతనిని వలలునిగా రూపొందించి స్వర్గారోహణ పర్వమునాటికి అతని పతనమునకు అమితమైన ఆహార ప్రియత్వమే కారణముగ చెప్పబడినది. హిడింబ బకాసురుల గాథలలో ఆహారమును సముపార్జించుకొనుటలో రాక్షసమైన ప్రవృత్తు లెట్టివో సూచించబడినవి పాండవుల ఆహార సముపార్జనము భిక్షుక వృత్తితో ఆరంభమై, వనవాసమున అతిథి సత్కారమునకై ఆదిత్యుని అను గ్రహమున అక్షయ పాత్రను సంపాదించుకొని దూర్వాసుని పరీక్షకు తట్టుకొని నిలచుటలో పరిణితను గాంచినది. "అన్నం బహుకుర్వీత", "అన్నం పర బ్రహ్మేతి వ్యజానాత్" వంటి ఉపనిష్యముల సారమూ అన్నమయ కోశముల యొక్క విస్తృతి అంతయూ, మహాభారతమున వర్ణితమైనది. ఆహారము పిదప మనిషికి వలసినది నాడు నేడుకూడ ఆశ్రయము (నిలువనీడ) భారతమున ఈ ఆశ్రయపు గాథ అంతయూ చెట్టు నీడలతో ఆరంభమై పర్ణశాలలు గృహములు భవంతులు, ప్రాసాదములు, మయసభల వరకు వర్ణింపబడినది. అన్నివిధములైన సౌకర్యములు గలిగిన దుర్యోధనునకు హర్మ్యములలో నున్నప్పటికినీ, మయసభకు ప్రతిగా మరొకసభ నిర్మించుకొన్నను తృప్తిలేదు. ధర్మరాజుకు పుణ్యాశ్రమమైనను, ఏకచక్రపురమున అద్దెకొంపైననూ, లాక్షా గృహమైననూ. మయసభయైనను కొండచరియైననూ, యజ్ఞశాలయైనను సమాన మైన ఆనందమునే కలిగించినవి. మానవునకు ఆహారము, ఆశ్రయముతో బాటు విద్యావిజ్ఞానములు భౌతికసుస్థితికి అవసరములు. విద్య అనగానేది? గురువు అనగా నెట్టివాడు? విద్యార్థికుండవలసిన లక్షణములేవి? ఉండకూడని గుణములేవి? ఆయా మంచి చెడు గుణములు ఎట్టి పర్యవసానమునకు దోవతీయును? గురువు వాత్సల్యమెట్టిది? గురువు పట్ల శిష్యుని భక్తి ఎట్టిది? ఇత్యాది విషయములన్నియు భారతమున కూలంకషముగ చర్చించబడినవి ఆహారము, ఆశ్రయము, విజ్ఞాన ముల పిదప మానవునకు మౌలికావసరము భద్రత. ఇందుకు బాధ్యత వహింప వలసినది రాజ్యవ్యవస్థ ఇట్టి రాజ్యాధికార ప్రాప్తికి అర్హతలెట్టివి? రాజు కర్తవ్యము లెట్టివి? రాజధర్మమేమి? వంటి విషయములు భారతము పొడవునను చర్చించ బడినను శాంతి పర్వమున ధర్మరాజునకు భీష్ముడు చేసిన ఉపదేశమున క్రోడీక రింపబడినవి. వంశ పారంపర్యముగ మాత్రమే రాజ్యాధికారము లభించుట గాక అనేక ఇతర కారణముల చేతకూడ లభించవచ్చును. ఒక ఒప్పందము

ప్రకారము రాజ్యము భీష్మునినుండి అతని సోదరులకు సంక్రమించినది. మిత్ర లాభమున కర్ణునికి రాజ్యము లభించినది. మిత్రభేదము ద్రోణునకు ద్రుపదుని అర్ధ రాజ్యమును సంపాదించిపెట్టినది. రాజుకాకపోయిననూ రాజ్యాధికారము నంతయు కీచకునివలె అనుభవించుట కూడ యిందు సూచితమైనది. ఇంక యుద్ధమున రాజ్యమున సంక్రమింపచేసికొనుటవంటి అధికార సాధనామార్గములన్నియు మహాభారతమున తడిమిచూపబడినవి. మానవునకు మౌలికమైన కౌటుంబిక జీవన గాథ యంతయూ ఎట్లు భారతమున సూచితమైనదో ముందే వివరింపబడినది. ఇట్టి అర్థకామముల విజ్ఞాన వైచిత్రి నంతనూ విశ్లేషించి. ఈ రెండునూ ఎట్లు ఉపాసింపలెనో అనగా ఎట్లు ఈ రెండును పురుషార్థములగునో సోదాహరణముగ నిరూపించుట భారతము అందించిన శాశ్వత సందేశము.

**మహాభారతము - అంతరార్థము :-**

ఒకానొకనాడు కేవలము చిన్న రాజ్యము కొరకై అన్నదమ్ముల నడుమ జరిగిన ఒక పోరాటము మాత్రమే భారతగాథ ఐనచో అది యొక విషాదపు స్మృతిగా మాత్రమే మానవ చరిత్రలో మిగిలిపోయి వుండెడిది. అట్లుగాక కురు క్షేత్ర సంగ్రామము విశ్వతాత్త్విక వివేచనమున విస్తృత పరిధిలో ధర్మాధర్మము లకు, మంచిచెడులకు, పుణ్యపాపములకు నడుమ నిరంతరము కొనసాగుచుండు పోరాటమునకు ప్రతీకగా వ్యాసునిచే రూపొందింపబడుటచే సార్వకాలీనతను సంత రించుకొనినది. కాబట్టి నేటికి కూడా మన కండ్ల యెదుట జరుగుచున్న ధర్మాధర్మ ములనడుమ జరుగుచున్న పోరాటములకు మహాభారతము ఉత్తమమైన పరిష్కా రమును సూచించవలసియున్నది, సూచింపగలుగుచున్నదికూడా!

ఆదిపర్వమునందలి సంభవపర్వమున భూభారమును తొలగించుటకై దైవీశక్తులు వివిధ రూపములలో భూమిపైనవతరించెనని చెప్పుటయే భారత యుద్ధమును విస్తృత పరిధిలోనికి తెచ్చినది. సాక్షాత్తు విష్ణువే కృష్ణుడిగా పుట్టెనని, పాండవులందరూ దైవాంశసంభూతులని చెప్పబడినట్లే ఘోషయాత్రా ఘట్టమున అవమానము పొందిన దుర్యోధనుడు ప్రాయోపవేశముచేసి మరణించ నెంచినపుడు కృత్యయను రాక్షసశక్తి దుర్యోధనునితో 'నీవే రాక్షస శక్తులకు ఆలంబమని' చెప్పుట జరిగినది. ఆ విధముగా పాండవులు లోకమునందలి ధర్మపక్షమునకు ప్రతీకలు కౌరవులు అధర్మమునకు పాపమునకు ప్రతీకలు అని మనము గుర్తించ

వలెను ఇట్టి ధర్మాధర్మములమధ్య నిరంతరమైన, నిత్యమైన పోరాటమున తుదకు ధర్మమే జయించునని వ్యాసుని సార్వకాలిక సందేశము.

దీనినిబట్టి మనకు మరియొక ప్రశ్న ఎదురగును. ఈ సృష్టిలో, దైవీ అసురశక్తులనడుమ, ధర్మా ధర్మముల నడుమ పోరాటము శాశ్వత సత్యమా? అయినచో, ఈ విశ్వము యిట్టి పరస్పర విరుద్ధములైన రెండు శక్తులతో ఏర్పడినదా? దీనికిగూడ వ్యాస భారతమున ఆధ్యాత్మికమైన సమాధానము లభించును. దానినిగూడ తెలిసికొనుట యవసరము గదా!

అవ్యయము, అనంతము, శుద్ధమునైన పరాతత్త్వము త్రిగుణాత్మమైన విశ్వముగా ఏర్పాటడు తొలిగా జరిగినది. ఈ ఏర్పాటు అనగా వ్యవస్థ, ధర్మ సూత్రమున జరిగినది. కావుననే ధర్మమే విశ్వమును నిలబెట్టుచున్నదని చెప్ప బడినది. అప్పటినుండి విశ్వపు కథయంతయు ఒకే ధర్మ వ్యవస్థపై కొనసాగు చున్నది. పరాతత్త్వము ఈ విశ్వమునంతటను అంతర్లీనముగా నున్నది. కాని విశ్వస్థితిలో ఇమిడిన జీవాత్మ తన ఉపాధిగతమైన త్రిగుణముల ప్రభావమునకు లోనగుచున్నది. తత్ఫలితముగా విశ్వవ్యవస్థలో వికృతులు పుట్టుటకు అస్కారము కలుగుచున్నది. ధర్మ వ్యవస్థ అట్టి వికృతులను అదుపుచేయనిచో విశ్వపు అస్తిత్వమే భంగము కావచ్చును. ఆ విధముగ విశ్వనీతికిని తద్విరుద్ధమైన వికృతులకును పోరాటము అనివార్యమగుచున్నది. స్వేచ్ఛా ప్రవృత్తులను అదుపు చేయుటయే గదా నియమము. అట్టి ఏ నియమము అయినను అందలి విశృంఖల ప్రవృత్తులను అదుపుచేయ యత్నించుటలో విజయమునందిననే వ్యవస్థ నిలుప గలదు. కావున విశ్వవ్యవస్థ యందుకూడ నియమమునకు తద్భంగకరమైన స్వేచ్ఛా ప్రవృత్తులకు పోరాటము నిరంతరము సాగును. నియమ భంగమయిన క్షణముననే అధర్మము నాశనమగు బీజము నాటబడును. కాని పైకి కనిపించదు. కాని నడుమ పోరాటము నిత్యమగును. అదియే విశ్వ ఇతివృత్తమగును. క్రమముగ స్వేచ్ఛ ఎదిగి మౌలిక వ్యవస్థనే తారుమారుచేయు పతాక సన్ని వేశమున ధర్మము బలవత్తరమై అధర్మమును నాశనము చేయక తప్పదు. ఆ దశలో అధర్మము తానెన్నియో నియమములు పాటించుచున్నట్లు నటించుచునే మూలచ్ఛేదము నెంచును. ఇట్టి కుతంత్రమును గుర్తింపగలుగుట ధర్మ సూక్ష్మముల నెరింగిన వానికే సాధ్యము. విశ్వవ్యవస్థలో నిమిడి పరిమితమైన ఆత్మ గుణావిష్కారముచే పరిమితమైన దివ్యగుణముల భాసించుచుండు 'ఆత్మ'

భ్రమలకు లోనగుట, వింతగా వికృతులనే ధర్మ వ్యవస్థగా భావించుట జరుగుచుండును. అపుడు అట్టి జీవాత్మను మేల్కొను పరమాత్మగా ఎరిగించినగాని విశ్వసృష్టికి అవసరమైన ధర్మసూత్రముల తత్వము, నిత్యత్వములు దానికి అవగతము కావు

మహాభారతమున పాండవుల పక్షమున ధర్మము, కౌరవుల పక్షమున యధర్మము అంతిమ పోరాటము యారంభించు సమయమున ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున కర్మ వీరుడగు నరునకు వ్యామోహ మావరించినది. అతడు ఒక మహాయంత్ర వ్యవస్థలోని చిన్న యంత్రవ్యవస్థ. తన వ్యవస్థ తాను నిలుపుకొనిన చాలు అని అనుకొనునట్లు బంధుధర్మములు, గురుశిష్య ధర్మములును జ్ఞప్తికి తెచ్చుకొని అస్త్రసన్యాసము చేసినాడు. అనగా అవాంతర ధర్మములు విశ్వధర్మ వ్యవస్థ ప్రధానముగా భావించినాడన్నమాట. ఇపుడు పరమాత్మ అయిన కృష్ణుడు తన యంశమైన జీవాత్మ అగు నరుని ఆత్మతత్వమును మేల్కొల్పి వానిచే అధర్మమును నశింపచేసి ధర్మమును ప్రతిష్ఠించినాడు. ఇట్టి ఆత్మ జ్ఞాన ప్రబోధములేనిదే వ్యక్తి వ్యామోహము నశించదు. కావుననే నైతిక స్థాయిలో ధర్మవ్యవస్థను నిలుపుటకు శ్రీకృష్ణుడు చెప్పిన మాటలకు పరాతత్వమును అర్జునుడిలో మేల్కొల్పుటకు చెప్పిన మాటలకు వ్యత్యాసమున్నట్లు అగుపించును. మొదటిది నైతిక భూమిక. రెండవది ఆధ్యాత్మిక భూమిక. అధ్యాత్మిక భూమికయందు 'అహమాత్మా గుడాకేశ సర్వభూతమయ స్థితః' (సర్వ జీవులలోను అనగా నీ వెంచెడి బంధుమిత్రులు అందరిలోను నేనే ఆత్మరూపమున నున్నాను అని చెప్పుట 'వృష్ణీనాం వాసుదేవోస్మి పాండవానాం ధనంజయః' (యాదవులలో కృష్ణుడను, పాండవులతో అర్జునుడను నేనే అని చెప్పుట), 'అనన్యః పార్థమత్తస్త్వం' (నీవు నాకన్న వేరు కాదు) అని చెప్పుట 'సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ,' 'అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ' ప్రాకృతికమైన ఈ విశ్వవ్యవస్థకు సంబంధించిన ధర్మములనన్నిటిని విడచి విశ్వ వ్యవస్థ ప్రభవించుటకు మూలకారణమైన పరాతత్వమున నను చేరుము. నిత్యశుద్ధము, బుద్ధమునగు పరమాత్మయగు నేను నిన్ను విశ్వభూమికకు చెందిన పాపములనుండి విముక్తుని చేతును. అని చెప్పుట భారత గాథను అధ్యాత్మిక ప్రపంచమున నిలబెట్టినది.

ఇట్టి ఆధ్యాత్మిక స్థాయిలో పాప పుణ్యములు, ధర్మాధర్మములు కేవలము ప్రవృత్తి నివృత్తులు మాత్రమే. ఇందు మానవ శరీరమే రంగస్థలము. ప్రతి స్పర్థులు రెండును ఆత్మ భావములే. ఒక పర్గము అజ్ఞానావృతము. రెండవది జ్ఞాన నిష్ఠము చంపువారు లేరు. చచ్చువారు లేరు. వివేచనము నిగ్రహము తప్ప వినాశనము లేదు. చివరకు ఆత్మ తనలోతానే పరమాత్మతత్త్వమును సాక్షాత్కరించుకొనును. ఆ దశలో ఈ విశ్వమంతయు లీలామాత్రముగ తోచును. అట్టి స్థితిలో ఆత్మకు విధిలేదు. నియమములేదు. కర్తృత్వములేదు. అట్లు ముక్తమైన ఆత్మ శాశ్వతానందస్వరూపమై వెలుగును. ఇది అధ్యాత్మికస్థాయిలో భారతసందేశము.

ఈ వ్యాసారంభమున ముద్రింపబడిన చిత్రపటము ఆధ్యాత్మిక పరిధిలో విచిత్రముగా ఈశ్వరహస్య మంత్రమును కనులకుకట్టినట్లు చూపుటకు తగియున్నదనిపించును. ఈ బొమ్మను మొత్తముగా చూచినపుడు చేపవేరుగా నగుపించినది. భౌతికముగా వీనిరెంటికిని ఎంతో తేడాతో బాటు విరోధము కూడా నుండుట సత్యమనిపించును. ఈ బొమ్మలో నల్లనిదంతయు సముద్రము తెల్లనిదంతయు ఆకాశము. వీనిరెంటికి విరోధమున్నట్లనిపించును. ఇందు చేప జలచరము. జలమనగా జీవముకదా కాబట్టి జీవ భవసాగరమున మునిగి తేలుచుండునన్న మాట. ఇది మాయాగ్రస్తమగు జీవాత్మ తత్త్వమునకు ప్రతీక. పక్షి ఆకాశసంచారి. అది యొక జీవాత్మ. విశాల విజ్ఞానాకాశ సంచారి. ఉపాధియే ఈ రెంటికి తేడాచూపుచున్నది. దేని ప్రతాపం దానిది. కాని విరోధమున్నట్లు కన్పించుచున్నది. కాని ఎదుట బెట్టి పోల్చినప్పుడు చివరకు పక్షి గెలుపు ఖాయము. లోకంలో అది వేరు ప్రతీకలుగా చూపబడదు. కానీ తేడాను చూపుచున్నది బాహ్య దృష్టికి ఈ రెండు భిన్నములు. ఉపాధియగు జలమున నున్నంత వరకూ అనగా జీవగతమైనంత వరకు పరమ సత్యము అగు ఆత్మ చేపయాకృతిలోనే భవసాగరమున పరిభ్రమించును. ఈ చిత్రమున తొలుత మనకన్ను చేపయాకారమును చూచుటకలవాటు పడినది. అనగా దానినావరించియున్న యాకాశము, అనగా శూన్యము చేపకు చేపయాకారమును మన కంటికి తోపింపచేయుచున్నది. అదియే సత్యముగా మన కంటికలవాటు పడినది. అట్టి దృష్టితోనే తెల్లని కాగితంపై చిత్రించబడిన ఈ బొమ్మలో చేపనే వెదుకుచూ పైపై శూన్యస్థల పరిధులను చూచుచు ముందుకు సాగిన మన దృష్టికి జీవతలము వరకే (Water level) చేప యాకృతి సత్యముగాతోచును. ఆయావరణభంగమైన వెంటనే (అనగా మాయ విడినంతనే) చేప యస్థిత్వపు భ్రాంతియు తొలగి

పోయినది అపుడా చిత్రపటముననేమున్నది ఏవియో అవ్యక్తము చిత్రవిచిత్రమైన అవకాశములు (Empty Spaces) మాత్రమే మన దృష్టికితోచును. ఆ పైన ఏ రూపములేని పరిశుద్ధమైన వెలుగు అంతట వ్యాప్తమై కనిపించును. ఆ చూపులో పక్షిభావన కూడా లేదు అట్టి శుద్ధచైతన్యస్థితి సుధామయమై తోచును. అపుడు మనదృష్టి అకస్మాత్తుగా మారి మన లోకాను భవమునుబట్టి ఒకానొకస్థాయిలో ఆకాశమునందలి అవకాశములలో పక్షి యాకృతిగా నాపరింపబడిన మరియొక శూన్యమును చూచును. అదేదృష్టి మరల మనసున స్థిరబడి దిగువకు విస్తరించిన కొలది శూన్యమునందంతట పక్షుల యాకృతులే కనుపించ మొదలిడును. మరల కథ యంతయు మామూలే. అపుడు పక్షియే సత్యమనిపించును. ఇది ఒక అవగాహనా స్థాయి. వాని రెంటికిని ఒక గీతగా ఆరంభించిన ఒక మహా చిత్రము అలలు అలలుగా రూపొందుచూ వింతగా ఒక నిర్దిష్ట ఆకృతులుగా వివిధ దశలలో రూపొంది మన కంటికి భ్రమను కాని అవి కల్పించినవి. గీతయొక్క ప్రతి రూపములే ఇవి యన్నియు మన దృష్టిని బట్టియే సత్యములు కాని వాస్తవముగా అచట చేపలూ లేవు. పక్షులూ లేవు. కేవలము వానిని మనమూహించు కొనుచున్నాము. ప్రపంచ కథ యిట్టిది.

ఈ సత్యము నెరిగిన యాత్మ జ్ఞాని, మాయా పరికల్పితమగు విశ్వచిత్ర రచనమున తానేస్థితిలో, ఏ యాకృతిలో రచింపబడెనో, దానినే నిలుపుకొనుచూ. తన అస్తిత్వము విశ్వ వ్యవస్థతో సమన్వయపరుచుకొని, విశ్వ నాటకమున తానై ఒడిదుడుకులను సృష్టించక యాదృచ్ఛ లాభమున వ్యక్తినందుచూ నాటకాంతము వరకూ జీవించుటయే ఉత్తమము, అట్టిచో మాత్రమే మాయాజాలము నుండి త్వరగా వెలివడుట సాధ్యము. మహాభారతము చిత్రించిన భారత చరిత్రలో ధర్మజుని పాత్ర యట్టిది. దానినే వ్యాసుని శాశ్వత జీవన సందేశముగా స్వీకరించ వచ్చును.

ఇట్లు ఈ వ్యాసమున, వ్యాస సాహిత్యపు వెన్నెలలనుండి కొన్ని వెలుగు జిలుగులు భూమికి దింపి, కరదీపికగా నందించి, నవీన భౌతికలు వాద నాగరికతా నగరములో చీకటి, ఇరుకు వీధులలో త్రోవ తెలియక కొట్టుమిట్టాడు సామాన్య మానవులను ప్రగతి పథమున పయనింపచేయు యత్నమును విజ్ఞులు

దర్శించి, ఈ కృషి నభినందించి ఆశింతురని ఆశతో ఈ వ్యాసమును ముగింతును.

వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాస రూపాయ విష్ణవే।
నమో వై బ్రహ్మ నిధయే, వాసిష్ఠాయ నమోనమః ॥

మంగళం మహత్

(కృతజ్ఞతలు:- ఈ వ్యాస రచనకుపకరించిన (On The Meaning of Mahabharata) వ్రాసిన శ్రీ వి. ఎస్. సుక్తాంకర్‌గారికి, 'భారతం - ధర్మాద్వైతం' వ్రాసిన డాక్టర్ ఎం. కృష్ణస్వామిగారికి, శాస్త్రీయ విజ్ఞాన వివేచనమున సహకరించిన శ్రీమతి కందా భాస్కరమ్మ M. A. గారికి, శ్రీ అయ్యగారి శేషగిరిరావు M.Sc; గారికి, శ్రీ మంధా సాంబశివశాస్త్రి M.A; శ్రీ బంధకవి రామకోటేశ్వరరావు M.Sc; వంటి మిత్రులకునూ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు).

# మహా భారతం - మహా కావ్యం

—డా॥ దివాకర్ల వేంకటావధాని

కవివృషభులు మహాకావ్యమనియు

వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్

నన్నయభట్టు వేదవ్యాసుడు మహాభారతము రచించిన విధము,

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు. ఆది-౧-32

అను పద్యమున సౌతియైన ఉగ్రశ్రవునిచే శౌనకాది మహర్షులకు చెప్పించెను. దీనిని బట్టి వ్యాస భారతము ధర్మ శాస్త్రమనియు, వేదాంత శాస్త్రమనియు, నీతి శాస్త్రమనియు, మహాకావ్యమనియు, సర్వ లక్ష్య సంగ్రహమనియు, ఇతిహాస మనియు, బహుపురాణ సముచ్చయమనియు, విశ్వజనీనమనియు తెలియుచున్నది. ఇన్ని లక్షణములు కల మహాగ్రంథము మరే సారస్వతమందును ఉండదు. ఇది యొక విశ్వ విజ్ఞానకోశము, అందుచేతనే వ్యాసుడు ''యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచి'' త్తని చెప్పుకొని యుండెను దీనినే నన్నయపై సీసము

నందు విపరించియుండెను. ప్రకృతము మహాభారతము యొక్క మహాకావ్యత్వ మును గూర్చియు పరిశీలింపవలసి యున్నది.

జాతే జగతి వాల్మీకౌ కవిత్వభిధాఽభవత్
కవీ ఇతితతో వ్యాసే కవయస్త్వయి దండిని

అను నొకశ్లోకమున్నది. జగమున వాల్మీకి జనింపగనే కవిః అను ఏకవచన మందలి రూపము కలిగెను. అంతకు పూర్వము కవి శబ్ద వాచ్యు లెవ్వరును లేకుండిరను భావము. వ్యాసుడు పుట్టగనే కవీ అను ద్వివచనరూపమును, దండి పుట్టగనే కవయః అను బహువచనరూపమును వాడుట కవకాశము కల్గెను. దండియందభిమానము కలవారెవ్వరో పై శ్లోకమును చెప్పియుందురు. దండి కూడ మహాకవియే కాని అతనికి పూర్వ మతనికంటెను గొప్పవారైన మహా కవులు పలువురు కలరు, అందుచే వాల్మీకి వ్యాసుల తరువాత దండిని పేర్కొనుట కొంతఆక్షేపణీయము కావచ్చును. కాని వాల్మీకి విషయమెవ్వరును కాదన జాలరు. లౌకిక సంస్కృత వాఙ్మయమున వాల్మీకి ఆదికవి. తరువాత చెప్పదగినవాడు వ్యాసుడు.

లాక్షణికులు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కావ్యహేతువులుగా తెల్పి యుండిరి. ఇందు ప్రతిభ కవి గతమైన ప్రజ్ఞ. అది భగవదనుగ్రహలభ్యము. అది లేనివారు మహా పండితులు కావచ్చును. పెక్కు గ్రంథములు రచింప వచ్చును. కాని మహాకవులు కాలేరు. వ్యాసుడట్టి ప్రతిభకు విధానమగుటచేతనే తిక్కన అతని విద్వత్సంస్తవనీయ భవ్య కవితావేశుడనియు, విజ్ఞాన సంపద్వి ఖ్యాతుడనియు, సంయమిప్రకరసంభావ్యానుభావుడనియు వర్ణించియుండెడు. బమ్మెర పోతరాజు వ్యాసునికి భారతీవంశవివర్ధనుడను విశేషణము వాడెను. దీనికి మూడర్థములు చెప్పవచ్చును, భరత వంశము విచ్ఛిన్నము కాకుండ వృద్ధి నొందించిన వాడతడే. సన్న్యాసాశ్రమము స్వీకరించినవారు తమ సన్న్యాసనామముల చివర భారతి, సరస్వతి మున్నగు పదములు చేర్చుకొనుచుందురు. అద్వైత సంప్రదాయమునకు చెందిన నారాయణ సమారంభమైన గురు పరంపరలో వ్యాసుడు కూడ నున్నాడు. ఆ పరంపరను వృద్ధి నొందించినవాడను నది రెండవ అర్థము. భారతీ వంశమనగా కవి కుటుంబము దానిని వృద్ధి నొందించిన వాడని మూడవ అర్థము. కవుల వంశమున కాద్యుడు వాల్మీకి; రెండవ వాడు వ్యాసుడు.

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం చైవ తతో జయము దీరయేత్.

అనునది భారతమందలి మొదటి శ్లోకము. సంస్కృతమున జ '8' కిని, య '1'కిని సంకేతములు. 'అంకానాంవామతోగతిః' అను విధానమునుబట్టి జయమనగా 18 అని అర్థమగును. భారతమునకును 18 సంఖ్యకును సన్నిహిత సంబంధ మున్నది. భారతమందలి ప్రధాన పర్వముల సంఖ్య 18. కురుక్షేత్ర సంగ్రామము 18 దినములు జరిగెను. అందు పాల్గొనిన అక్షౌహిణులు 11+7=18 భారత హృదయమైన భగవద్గీతలో 18 అధ్యాయములు కలవు. భారతమున అష్టాదశ విద్యలసారము కలదని పెద్దలు చెప్పుదురు. (అంగాని, వేదాశ్చత్వారో, మీమాంసా, న్యాయవిస్తరః ధర్మశాస్త్రం పురాణంచ విద్యాహేతుశ్చతుర్దశ. ఆయుర్వేదో, ధనుర్వేదో, గాంధర్వశ్చేతితేత్రయః అర్థశాస్త్రం చతుర్థంతు విద్యాహ్యష్టాదశైతు) వ్యాసుడు మొదలు వ్రాసినది జయమనియు, వైశంపాయనుడు జనమేజయునికి తెల్పినది భారతమనియు, సౌతిశౌనకాదులకు చెప్పినది. మహా భారతమనియు, జయమీవిధముగా పెరిగి మహాభారతమయ్యెననియు కొందఱు చెప్పుదురు.

మన్వాది భారతంకేచి దాస్తీకాది తథాపరే
తథోపరిచరాద్యన్యే విప్రాస్సమ్యగధీయతే

అని ఆది పర్వ ప్రథమాధ్యాయమున సూతుడు భారతమును కొందఱు మన్వాదిగను, కొందఱాస్తీకాదిగను కొందఱుపరిచరాదిగను పఠించుచున్నారని భారతమునకు మూడారంభములను సూచించెను. అవైదికములైన గ్రంథముల సందర్భమున వస్తు సమానత్వముండునెడల ఆరంభభేదమున్నను అంత విప్రతిపత్తి యుండదు. ఇచ్చట మన్వాది అనగా నీలకంఠుడు ద్వివిధములైన అర్థములను సూచించియున్నాడు. "మన్వాదీతి-మనుర్మంత్రః-నారాయణం నమస్కృత్యేతి - ఓం నమో వాసుదేవాయేతివా-తదాదీతి ప్రాఞ్చః దివఃపుత్రో వైవస్వత మహ్యా (సహ్యా అని పాఠాంతరము) సంజ్ఞోమనుః - తదాదీతి తత్త్వమ్" మహ్యాదే మనువు. ఇతని వృత్తాంతముతో భారత మారంభించుచున్నదని కొందఱిమతము. ఆస్తీక పర్వముతో భారతమారంభమగునని కొందఱి అభిప్రాయము. 57వ అధ్యాయమున సత్యవతీ జన్మహేతుభూతుడైన ఉపరిచర వసువు వృత్తాంత మున్నది. భారతమున ప్రధాన పాత్రలైన కౌరవ పాండవుల చరిత్రకు బీజ

మిచ్చట కనబడుచున్నది. అంతకుముందున్నది దానికుపోద్ఘాత రూపమైనది. అందుచే ఉపరిచర వృత్తాంతముతో భారత మారంభమగుట యుక్తమని కొందఱి మతము. సత్యవతి ఉపరిచరవసు వీర్యసంభవ. ఆమె కుమారుడు వ్యాసుడు. అతడంబికాంబాలికలకు ధృతరాష్ట్రపాండురాజులు జన్మించుటకు కారణ మయ్యెను. వారి కుమారులు కౌరవ పాండవులు.

లాక్షణికులు కావ్యలక్ష్మికి శబ్దార్థములు తనువని ధ్వని జీవమనియు, అలంకారములు నగలనియు, గుణములు గుణములనియు, వృత్తులు వృత్తు లనియు చెప్పియుండిరి. కావ్యమున ధీరోదాత్తుడు నాయకుడుగా నుండవలయును. శృంగార వీరములలో నొకటి అంగిరసముగను, మిగిలిన వంగ రసములుగను ఉండవలయును. కొందరు ఆశ్చర్య శాంతకరుణాదులు కూడ ప్రధాన రసములు నుండ వచ్చునని అంగీకరించిరి. కావ్యములయందష్టాదశ వర్ణనము లుండవలయునని మరియొక నియమము. పురము, సముద్రము, శైలము, ఋతువులు, సూర్యోదయము, చంద్రోదయము, జలక్రీడ, వనక్రీడ, రతి, విర హము, పరిణయము, పుత్రోదయము, సంధి విగ్రహాది నయ విరచనము, దండ యాత్ర, యుద్ధము, ప్రభువు, మధుపానము, ద్యూతము మున్నగునవి కావ్య మున వర్ణింపదగిన పదునెనిమిది విషయములు. కొందరు ఈ పదునెనిమిది సంఖ్యను హెచ్చించియుండిరి. అష్టాదశ వర్ణనములుండవలయునన్నది సాధారణ నియమము. వీనిలో కొన్ని తగ్గినను మహా కావ్యత్వమునకు లోపము రాదు. విభావాను భావ భావ సంచారుల ఔచిత్యము కలిగి రమణీయముగానున్న కథా శరీరమును కవి గ్రహింపవలయును. కథ ప్రఖ్యాతముగాని, ఉత్పాద్యము కాని, మిశ్రము కాని అయియుండవచ్చును. ఇతివృత్తమునందు అనౌచిత్యములున్నచో వానిని తొలగించి దానిని రసోచితముగా మార్చవలయును. రసానుగుణముగ సంధులను, తదంగములను ఏర్పరుపవలయును. కావ్యమునకు వస్తువు ప్రధా నము కావున కవి దానినెన్నుకొనుటలో అధికమైన శ్రద్ధ వహింపవలయును.

మహాభారత మితిహాసము. ఇందు కురు పాండవ సంగ్రామ కథ ప్రధానముగా యున్నది. ఉపాఖ్యానములును, ఉప కథలును ప్రసక్తాను ప్రసక్తముగనిందు చేర్పబడినవి. వ్యాసుడు మహాభారతమును ధర్మ నీతితత్త్వ బోధ కొరకై రచిం చినను, ప్రతిభాశాలియగు మహర్షి యగుటచే అతని రచనలో అప్రయత్నముగనే మహాకావ్య లక్షణములన్నియు చోటు చేసికొన్నవి. ప్రధాన కథ మాట అటుంచి

ఉపాఖ్యానములందు కూడ చిన్న కావ్యము అని చెప్పదగినవి అనేకము లున్నవి. శకుంతలోపాఖ్యానము, యయాతి చరిత్ర, గరుడోపాఖ్యానము, రామోపాఖ్యానము నలోపాఖ్యానము, సావిత్రి సత్యవంతుల కథ మున్నగునవి యిట్టివి. ప్రధాన కథను కూర్చుటలో వ్యాసుడు చూపిన నేర్పు అప్రతిమానమైనది. ఆ కథా సంబంధమును బట్టి అతడు నూరు పర్వములకును (లేక పదునెనిమిది పర్వములకును) నామములు పెట్టి యుండెను. ఆది పర్వము కౌరవ పాండవులాయా యంశములతో పుట్టుటతో నారంభించి ద్రౌపదీ వివాహ, ఖాండవ వన దహనాదులతో ముగియును. రామాయణమున అరణ్య కాండమునకువలె, భారతమున సభాపర్వమునకు మిక్కిలి ప్రాధాన్యమున్నది. రామాయణమునందు అరణ్య కాండమున జరిగిన సీతాపహరణ వృత్తాంతమే రామ రావణయుద్ధమునకు కారణమైనది. అట్లే సభాపర్వమున జరిగిన ద్యూత, ద్రౌపదీ వస్త్రాపహరణాదులే కురుక్షేత్ర సంగ్రామమునకు కారణములయినవి సభాపర్వమునందు మయుడు నిర్మించిన అపూర్వ సభావృత్తాంతము, నారదుడు ధర్మరాజునకు వర్ణించి చెప్పిన లోక పాలాదుల సభల వృత్తాంతము, ధృతరాష్ట్రుడు, దుర్యోధనునికై కట్టించిన నూత్న సభా వృత్తాంతము అను పెక్కు సభల వృత్తాంతము కలదు. అందు ధృతరాష్ట్రుడు నిర్మింప చేసిన సభలోనే ద్యూతము జరిగినది. ఈ విధముగా సభా పర్వమునకు పేరు సార్థకమైయున్నది.

అరణ్యపర్వమున పాండవులు పంద్రెండేండ్లు వనవాసము జరిపిన వృత్తాంతము కలదు. దీనిని నిజమునకు సంక్షేపముగా ముగించి వేయవచ్చును. లేక పాండవులు చేసిన తీర్థయాత్రాదుల వర్ణనములతో నింపవచ్చును. అట్లు చేయుట వలన పాఠకులకు విసుగు కలుగునేమో అను నుద్దేశముతో వ్యాసుడందు పెక్కుపాఖ్యానములను, కథలను చేర్చియుండెను.

విరాట పర్వము పాండవులు అజ్ఞాతవాసమును, కీచక వధను, ఉత్తర గోగ్రహణమును ఉత్తరాభిమన్యుల వివాహమును వర్ణించును. ఉద్యోగమనగా ప్రయత్నము ఇందు సంధికై ప్రయత్నములు జరిగినవి. అవి విఫలము కాగా యుద్ధమునకు ప్రయత్నము చేయబడినది.

కౌరవ సేనకు పదునెనిమిది దినములలో భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, దుర్యోధనాదులు సేనానాయకులుగా నుండిరి. ఆ సేనా నాయకుల పేర్లను బట్టియే పర్వములకు కూడ నామములు నిశ్చయింపబడినవి. చివరి రాత్రి అశ్వత్థామ

నిద్రించుచున్న ఉపపాండవులను, పాంచాలురను సంహరించిన వృత్తాంతముండు టచే దానికి సౌప్తిక పర్వమును పేరు కల్గెను. స్త్రీ పర్వము, చనిపోయిన యోధుల స్త్రీలు తమ తమ భర్తల శరీరములను అవయవములను వెదకి కొని దుఃఖించుట వర్ణించును. శాంత్యనుశాసన పర్వములు నీతి ధర్మ వివరణములతో కూడినవి. భీష్మాదులిందు సర్వమానవులకును అవశ్యకరణీయములైన ధర్మములను బోధించిరి. ధర్మదృష్టితో చూచినచో ఈ రెండు పర్వములు మిక్కిలి ఉత్కృష్ట ములైనవి.

ఆశ్రమవాసపర్వమున గాంధారీ ధృతరాష్ట్రులు, విదుర సంజయుల తోడను, కుంతితోడను ఆశ్రమ వాసమున కరుగుట వర్ణింపబడినది. ముసల మనగా రోకలి. మదిరాపానపరవశులయి యాదవులు సముద్ర తీరమున ముసల రజము వలన ఏర్పడిన తుంగలచే ఒండురులం కొట్టుకొని మరణించుటచే పంచ పాండవులు మౌసల పర్వమను పేరొసంగబడినది. పంచపాండవులు రాజ్య పరిత్యాగ మొనరించి ద్రౌపదీ సహితులై పరమసిద్ధికై చనుట మహాప్రస్థాన పర్వమునందలి ఇతివృత్తము. స్వర్గారోహణ పర్వము. స్వర్గమున భారత వీరులు కలసికొనుటయు, కర్మ పరిపాకము ననుభవించుటయు వర్ణించును ఈ విధముగా పదునెనిమిది పర్వములందును వ్యాసుడు కథను సుందరంగా తీర్చిదిద్ది మహా భారతమును సర్వజన మనోహరము కావించియుండెను. ఉపాఖ్యానాదులు నడుమ నడుమ వచ్చుచుండుట చేతను, భగవద్గీత, సనత్సు జాతీయము, ధర్మ వివర ణము అనునవి విస్తృతములుగా నుండుట చేతను, వస్త్వైమునకు కొంత భంగము జరిగిన మాట వాస్తవమే అయిననూ ఇతిహాసము నందది లోపముగా భావింప రాదు. ప్రధాన కథను వర్ణించుటలో వ్యాసుడు చూసిన నేర్పు మిక్కిలి ప్రశంసింప దగినది.

భారతమునందలి కొన్ని ఉపాఖ్యానములలో యయాతి చరిత్రయు, శకుంతల లోపాఖ్యానమును కురుపాండవుల పూర్వులకు సంబంధించినట్టివే. అట్లే సౌగంధికాపహరణము, ఘోషయాత్ర మన్నగు వానికి కౌరవ పాండవుల కథతో సంబంధము కలదు గృధ్రజంబుకోపాఖ్యానము, లుబ్ధకపోతోపాఖ్యానము నీతిని బోధించుటకై చెప్పబడినవి. అరణ్యపర్వమున రామోపాఖ్యానము విస్తృతముగా వర్ణింపబడినది. బహుశః భారతములోని ఉపాఖ్యానములతో కెల్ల నిదియే పెద్దదియై యుండును. నలచరిత్రము, ద్యూతమువలనె దోషమును పాతివ్రత్యము యొక్క ఫలితమును సూచించుచు నత్యంత మనోహరముగ నుండును.

ఒకానొక విమర్శకుడు చెప్పినట్లు "To think of the Mahabharata without its upakhyanas is to rob epic, of all its value as an epic." ఈఉపాఖ్యానము లందలి కథలనే గ్రహించి సంస్కృత మహాకవులు నాటకములను, మహా కావ్యములను రచించియుండిరి వారు తమ రచనలలో కొన్ని మార్పు చేర్పులు చేసియుండవచ్చును కాని వానికి మూలము మహాభారతమగుటలో సందేహము లేదు. అభిజ్ఞాన శకుంతలము, వేణీ సంహారము, మున్నగు నాటకములును, నైషధము, కిరాతార్జునీయము, శిశుపాల వధ మున్నగు కావ్యములును మహాభారతము నందలి కథలను బట్టి రచింపబడినట్టివే.

మహాభారతమున లేని వర్ణనము లేదనియే చెప్పవచ్చును. మహా కావ్యము నందుండవలసిన పదునెనిమిది వర్ణనములులే కాకనిందింకను ఎన్నో వర్ణనములు కలవు. వ్యాసుడు క్రాంతదృష్టియైన మహాముని అతని దృష్టికి అతీతమైనది ఉండనే ఉండదు. స్త్రీ పురుషులను, బాలురను, వీరులను, తిర్యగ్జా తులను, నీతి ధర్మములను వర్ణించుటలో అతడు ప్రదర్శించిన నేర్పు అనన్య సామాన్యమైనది. యుద్ధ పర్వములయందు పలు రకములైన యుద్ధములు వర్ణింపబడినవి. తిక్కనసోమయాజి వ్యాసుని యుద్ధ వర్ణనములకు స్వానుభవమును చేర్చి తెలుగున వానిని విశదతరముగా వర్ణించి యుండెను. అష్టాదశ వర్ణనముల విపరించు సందర్భములలో ద్యూతమూ, దౌత్యమూ అను విషయమున పండితులలో కొంత వివాదము కలదు. మహాభారతమున ఆ రెండును కలవు. కృష్ణుని రాయబారమును, సంజయుని రాయబారమును వర్ణించుటలో తిక్కన ఉపజ్ఞ చూపిన మాట వాస్తవమే అయిననూ అందు బీజములు సంస్కృత భారతముననే ఉన్నవి.

మహా భారత మొక ప్రపంచమువంటిది. అందుచేతనే నన్నయ అనేక విధ పదార్థ ప్రపంచ సంచితంబు నుపపర్వ, మహోపపర్వ శోభితంబు, నుపద్వీప, మహాద్వీప పరివృతంబయిన భువనంబు న జుండు నిర్మించినట్లు కృష్ణ ద్వైపాయనుడు లోకహితార్థము దత్తావధనుండై సంవత్సర త్రయంబు నిర్మించెనని తెల్పియుండెను. మహా భారతము నందలి పాత్రల సంఖ్య భువనము నందలి మానవుల సంఖ్యవలెనే అపరిమితమయినట్టిది. వ్యాసుడా పాత్రల మహా వృత్తులను, గుణగణములను, స్వభావములను చక్కగా చిత్రించియుండెను. గాంభీర్య

మును, ఉదాత్తతయు అతని పాత్రలయందలి సామాన్య లక్షణములు. పుత్రాధీనుడై ధృతరాష్ట్రుడు పాండవులయందు వాత్సల్యము నభినయించుటయు, దుర్యోధనుని దౌష్ట్యమును, దురభిమానమును, కర్ణుని రాజభక్తిని, శకుని కైతవమును, విదురుని ధర్మజ్ఞతను, ధర్మజుని ధర్మ తత్పరతను, భీష్ముని నిష్పక్షపాతమును, కృపద్రోణుల ధర్మ పరాయణత్వమును, అశ్వత్థామ ఆవేశమును, భీమార్జునుల భ్రాతృ భక్తిని, సహదేవుని రాజనీతిజ్ఞతను, కృష్ణుని సాధుజన పరిత్రాణ తత్పరతను అతడు చక్కగా చిత్రించియుండెను. స్త్రీ పాత్రలను సృష్టించుటలో నాతడు కృతహస్తుడు. అతని స్త్రీలు పాతివ్రత్యమునకు బట్టు కొమ్మలు. గరువతనమున కిరవులు. భారత నారీత్వము రూపుకొన్న బంధుర మూర్తులు. గాంధారి పాతివ్రత్యమును, ద్రౌపది ధర్మజ్ఞతా గృహిణీత్వములను, కుంతీ పుత్రప్రేమను అతడు వర్ణించిన తీరు ప్రశంసనీయమైయున్నది. యముడు ధర్మరాజును మూడుసార్లు పరీక్షించియుండెను. ఆ పరీక్షలలో ధర్మజుడు జయించి తన నామమును సార్థకమొనరించుకొనెను. అందుచేతనే అతడు సశరీరముగా స్వర్గలోకమున కేగ జాలెను. అతడు నరక ప్రాంతమున కేగినపుడు నరక వాసులు అపూర్వమైన సౌఖ్యము ననుభవించి అతని నింకనూ కొంత సేపచట నుండుమని కోరిరి. అభిమన్యు డల్పాయుష్కుడైననూ అతడు చూపిన పరాక్రమము అనన్య సాధ్యమైనట్టిది. ప్రధాన కథలోనే గాక ఉపాఖ్యానములలోనున్న పాత్రల చిత్రణము నందుకూడ వ్యాసుడెంతో నైపుణ్యము ప్రదర్శించియుండెను. దుష్యంతుడు, రాముడు, నలుడు, సత్యవంతుడు, గరుడుడు మున్నగు పురుషులును, శకుంతల, శర్మిష్ఠ, దేవయాని, సీత, దమయంతి, సావిత్రి మున్నగు స్త్రీలును ఇందుకు నిదర్శనములు. ఒక్కొక్క ఉపాఖ్యానము ఒక్కొక్క నీతిని, ధర్మమును వ్యక్తము చేయుచుండును. యయాతి చరిత్రము గర్వము పతనహేతువనియు, నల చరిత్రము ద్యూతము పరమాపదలకు మూలమనియు, సావిత్రి చరిత్రము పాతివ్రత్యమున బడయరానిదేదియు నుండదనియు, లుబ్ధ కపోతోపాఖ్యానము గృహస్థులు అతిథుల యెడ వర్తింపవలసిన విధమును, ఋశ్యశృంగుని కథ స్త్రీలతోడి సహవాసము బంధకారణమనియు సూచించును.

వ్యాసుడు సుతులు వంద మందియు మరణించిన తరువాత కూడ ధృతరాష్ట్రుడు పాండవుల యొద్ద నివసించియున్నట్లు కథను సృష్టించెను. నిజమునకు

భారతమునందలి దుర్యోధనాదుల దుష్ప్రవర్తనకు ధృతరాష్ట్రుడే కారణము. అతడు రాజు. శాసింపవలసినవాడు. ఆయా సమయములయందాతడు సధర్మ మముగా ప్రవర్తించి, పుత్రులను శాసింపక తటస్థుడై యూరకుండెను. అతడు పుత్రాధీనుడు. ఈ పుత్రాధీనత్వమే భారతమునందలి అనుచితకృత్యములకు కారణము. అతడు వలదని నిషేధించినచో ద్యూతము కాని, ద్రౌపతీ వస్త్రాప హరణము కాని జరిగియుండెడివి కావు. అతడు పట్టుపట్టి సంధి కంగీకరించి యుండినచో యుద్ధమే జరిగియుండెడిది కాదు. కాని అతడు రాజై యుండియు, తన కర్తవ్యమును, ధర్మ పరిపాలనమును చేయలేకపోవుటయేకాక, సుత పక్ష పాతము ప్రదర్శించియుండెను. అందుచేతనే అతడు పుత్ర మరణ శోకము ననుభవించుచూ, పాండవుల ఇంట నున్నప్పుడు భీము డప్పుడప్పుడు చేయు అధిక్షేపములను వినుచు ఆశ్రమవాసమున కేగువరకును చాల వేదనలనుభవింప వలసివచ్చెను. ఇది కావ్య న్యాయమునకు అనుగుణముగా నున్నది.

వ్యాసుడు కృష్ణుని రాజనీతివేత్తగనేకాక యోగీశ్వరేశ్వరునిగను, పరమ పురుషునిగను వర్ణించియుండెను. భగవద్గీతలో అతని యోగీశ్వరేశ్వరత్వము గోచరించును. అతడు భారతమున మొత్తము మూడుసార్లు విశ్వరూపమును ప్రదర్శించెను. కౌరవ సభలో చూపిన విశ్వరూపము మొదటిది. గీతాబోధన సమయమున అర్జునునకు చూపినది రెండవది. ఉదంకునికి చూపినది మూడవది. ఈ మూడును అతడు విశ్వమునంతను తనలో నిముడ్చుకొన్న సర్వవ్యాపకుడని తెలియచేయును. ఉద్యోగ పర్వము అతని రాజనీతికి నిధానము. అతడు భూ భారమును తొలగించుటకే అవతరించియుండెను అందుచే అతడు కొన్నిచోట్ల కాపట్యమును ప్రదర్శింపవలసివచ్చెను. ఒక్కొక్కప్పుడు మాయను నివారించు విషయమున మహాత్ములకు కూడ మాయను, వంచనను అవలంబింపవలసి వచ్చును. అట్టి పరమ పురుషుకు కూడ ఒక వ్యాధుని బాణముచే మరణింపవలసి వచ్చెను. ఋషుల శాప మన్నట్లున్నది. కృష్ణుడు తలంచినచో చేయలేని దేమి యును ఉండదు. అతడు యాదవుల నాశమును, తన మరణమును నివారించు టకు తగిన శక్తి కలవాడే. అయినను అతడు విధికి లోబడి వర్తించెను. తానవత రించిన ప్రయోజనము నెరవేరిన పిమ్మట అతడు తనువు చాలించెను. ఈవిధముగ మౌసల పర్వము విధి ప్రభావమును సూచించును.

స్థూలముగ చూచినచో మహాభారతమున నయిదు పర్వములు యుద్ధము నకు సంబంధించినవే అగుటవలననూ, విరాటాద్యన్య పర్వములలో కూడ యుద్ధ

ప్రసక్తి యుండుటచేతను అందలి ప్రధాన రసము వీరమో, రౌద్రమో అయి యుండునని తోచును. కాని, ఆనందవర్ధనాదులగు మహనీయులు అందలి ప్రధాన రసము శాంతమని వక్కాణించిరి. శాంతమునకు శమములేక వైరాగ్యము స్థాయి భావము. మహాభారతయుద్ధమున మహావీరులెందరోమరణించిరి. భీష్ముడంపశయ్య చేరవలసి వచ్చెను అభిమన్యుడు దుష్టులచే అన్యాయముగా చంపబడెను. శివుని వలన వరము పొందిన సైంధవుడు సైతము చావక తప్పినది కాదు. అశ్వత్థామ ద్రౌపదీయులను అనుచిత రీతిని చంపి యుండెను. మహాభిమానియు, రాజరాజు నైన దుర్యోధనుడు భగ్నోరువై మరణించెను, శాపగ్రస్తులైన యాదవులు నిధనము నొందిరి పరమ పురుషుడైన కృష్ణుడు కూడ మృత్యువువాత పడవలసి వచ్చెను. చివరికి ధర్మాత్ములయిన పాండవులు కూడ పరమగతిని పొందిరి. ఇక మిగిలిస వారెవ్వరును లేకపోయిరి. ఇది యంతయు చదివిన పాఠకులకు జీవితమునందు వైరాగ్యము కలుగక మానదు. అందుచేతనే ఆనంద వర్ధనుడు భారతమున ప్రధాన రసము శాంతమని చెప్పియుండెను. ఇది నిజమనియే తోచును. తిక్కన విరాటపర్వమును వర్ణించుచు "హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి" అని తెల్పియుండెను. ఆ వర్ణన యొక్క విరాట పర్వమునకే కాక భారతమున కంతకును అన్వయించును. ఆనంద వర్ధనుడు చెప్పినట్లు ప్రధాన రసము శాంతమైనను, ఆయా సందర్భముల యందితర రసములు కూడ చక్కగా పోషింపబడినవి. యుద్ధ పర్వములయందు వీర, రౌద్ర, భీభత్సాదులు గోచరించును. ద్రౌపదీ వివాహ సందర్భమునను ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భమునను, శృంగారము పోషింపబడినది. కీచక వధ సందర్భమున శృంగార రసాభాసము గోచరించును. స్త్రీ పర్వము ఆద్యంత కరుణరస మయము. విశ్వరూప సందర్శన సందర్భమున అద్భుతము స్ఫురించును. ఉత్తర గోగ్రహణ కథలో వీర రౌద్రములతోపాటు హాస్యము కూడ కన్పించును ఉత్తరుడు రథమునుండి ఉరికి పారిపోవుచుండ అర్జునుడు మరల రథము నెక్కించుట ఇందుకు నిదర్శనము. శాంత్యనుశాసనపర్వము లలో సర్వత్ర శాంతరసము గోచరించును.

ఉపాఖ్యానములలో సైతము ఆయా రసములను మెకువతో పోషించెను. నలచరిత్ర కరుణ విప్రలంభములకును శకుంతలోపాఖ్యానము శృంగార కరుణములకు, లుబ్ధకపోతోపాఖ్యానము కరుణ భయానకములకు సావిత్ర్యు పాఖ్యానము కరుణ విప్రలంభములకు, గరుడోపాఖ్యానము వీరమునకును నియమములు. యయాతిచరిత్ర యందును, తపతీ సమరణోపాఖ్యానము నందును, అరణ్య పర్వమునందలి ఇతర కథలయందును, వ్యాసుడుచితరీతిని విభావానుభావాదులను వర్ణించి ఆయా రసములను పోషించియుండెను.

కావ్యమునకు ధ్వని జీవనమని లాక్షణికుల అభిప్రాయము. పెద్దలు గృధ్ర జంబుకోపాఖ్యానమును ప్రబంధ ధ్వనికి తార్కాణముగా చెప్పుచుందురు. వ్యాసు డాయాచోట్ల వ్యంగ్యమును మనోహరముగా ప్రదర్శించి యుండెను. ఒక్క ఉదాహరణమును మాత్ర మొసంగెదను. ఉత్తర గోగ్రహణ సమయమున ఉత్తర బృహన్నల సారథియై యేగునపుడు కురు వీరుల ఉష్ణీషాంచలనములను బొమ్మ పొత్తికలకై తెమ్మని కోరెను. అపుడు బృహన్నల

"యద్యుత్తరోఽయం సంగ్రామే విజేష్యతి మహారథాన్
అథా హరిష్యే వాసాంసి విన్యాని రుచిరాణి చ"

అని చెప్పియుండెను. ఉత్తరుడు యుద్ధము చేయజాలడనియు, కురు వీరులముందు నిలువజాలడనియు అర్జునునకు తెలియును యది, ఉత్తరః, అయం, సంగ్రామే, విశేష్యతి, మహారథాన్ అను వాక్యమున 'యది' అను పదమున ఆ వ్యంగ్యము నిక్షిప్తమై యున్నది. "ఉత్తరుడు ఆ మహారథులకు ఎట్లును జయింపజాలడు, నేను యుద్ధము చేయవలసి వచ్చును అప్పుడు కౌరవులను జయించి తప్పక బొమ్మ పొత్తికలకు కౌరవవీరుల తలగుడ్డలు తెచ్చెదనని అర్జునుడు చెప్పెను. వ్యంగ్య సహితములయిన సందర్భములు భారతమున కొల్లలుగా కన్పించును. ముని యయ్యు మహాకవియైన వ్యాసుని రచనలో ఇట్టి వ్యంగ్యము గోచరించుటలో నాశ్చర్యము లేదు. పై శ్లోకమును తిక్కన

"అనుడు బృహన్నల యిట్లను
జననాయక నందనుండు జయలక్ష్మినిచే
కొనునటె, చీరలు తెచ్చుట
పనియే యిటు చూడుడెల్ల భంగులు తెత్తున్"

అని అనువదించి యుండెను. సంస్కృతము నందలి వ్యంగ్యము నతడు తెలుగున చక్కగా వ్యక్తము చేసెను. వ్యాసుడు పెక్కుచోట్ల అద్భుతములయిన ఉపమానములను వాడియుండెను అజ్ఞాతవాసానంతరము, ధర్మరాజు విరాటుని యెడ కృతజ్ఞత ప్రదర్శించు నపుడు "అజ్ఞాతవాస ముషితాః గర్భవాస ఇవ ప్రజాః" అనగా గర్భవాసమున బిడ్డ లత్యంత సుఖముగా నున్నట్లు తామజ్ఞాత వాసమును విరాటుని కొలువునందు సుఖముగ గడిపితిమని అతని భావము. ఈ ఉపమానము నందలి సౌందర్యమును విడువలేక తిక్కన—

"చాల దుస్తరమయిన అజ్ఞాత వాసవత్సరంబు భవద్గర్భ వాసగుప్తి వలన"

అని అనువదించి యుండెను. దుర్యోధనుడు విదురుని "మార్జారవతే పోషకం గోవహంసి" అని మార్జాలముతో పోల్చి యుండెను. ఇది దుర్యోధనుని ధౌర్త్య మును సూచించును. ఇది అనుచితముగా నుండుటచే నన్నయ వదలి వైచెను. కీచకుడు ద్రౌపదిని "నేత్రే సువిపులే సుభ్రు! పద్మ పత్ర విభే శుభే

వాక్యంతే చారుసర్వాంగి! పరపుష్టరుతోపమమ్'' అని పల్కియుండెను. మోహమున మతి తప్పినవాడైనను కీచకుడు ద్రౌపది నేత్రవచనములకు ఉచితోపమానములనే వాడి యుండెను.

వసన్తే వాసి తాపేతుః బలవద్గజయోరివ
కీచకానాంతు ముఖ్యస్య నరాణాముత్తమస్య చ''

ఇచ్చటి వాసితా, గజ పదములు ద్రౌపదీ భీమ కీచకులను సూచించుచు మిక్కిలి ఉచితములుగా నున్నవి.

ఇమే చతే సూర్య సమాన వర్చసః
సమాసతే వృత్రహణః క్రతుం యథా

ఇది ఆస్తీక పర్వములోనిది. ఋత్విక్కులు సూర్య సమాన తేజులుగను, జనమేజయుని యాగము ఇంద్రయాగ సదృశముగను చెప్పబడినవి.

భారతమున వ్యాసుడు రెండు మూడు చోట్ల వచనమును, వృత్త భేదములను కూడ వాడినను మొత్తము మీద ఎక్కువ అనుష్టుప్పులనే వాడి యుండెను. అతని శైలి సరళమై సర్వ సంబోధముగా నుండును.

''కింస్విద్గురుతరం భూమేః
కింస్విదుచ్చ తరంచ ఖాత్
కిం స్విద్ద్రీఘ్రతరం వాయోః
కిం స్విద్ బహు తరం తృణాత్''
''మాతా గురు తరా భూమేః
ఖాతే పితో చ్చతర స్తథా
మనశ్శీఘ్రతరం వాతాత్
చిన్తా బహుతరీ తృణాత్''

ఈ రెండు శ్లోకములు యక్ష ప్రశ్నలలోనివి.

''సమం పుత్రేణ మే షణ్ఢం
బ్రహ్మబన్ధో ! ప్రశంససి
వాచ్యాక వాచ్యం న జానీషే
నూనం మా మవ మన్యసే''

ఇది విరాటుడు కంక భట్టుతో నన్న మాట ''బృహన్నల సారధిగా నుండుటచే ఉత్తరుడు తప్పక జయించునని''ధర్మరాజు పల్కినపుడు క్రుద్ధుడైన విరాటుడును. ధర్మరాజును గూర్చి యిట్లని యుండెను.

"తతో నివృత్త హృదయః
పునరాగమ్య తాం సభాం
దమయంతీం తదాదృష్ట్వా
రురోవ స నరాధిపః"

ఇది దమయంతిని విడిచిపోవు నలుని హృదయస్థితికి ఉదాహరణము.

"ఆలోకయసి కిం వృక్షం
సూద ! దారు కృతేన వై
యదితే దారుభిః కృత్యం
బహిర్వృక్షో నిగృహ్యతామ్"

ఇది కంకభట్టు కీచకుని సంహరించుటకై భీముడు వృక్షమును లాగునపుడు నిషేధించుచు చెప్పిన శ్లోకము.

"న సాసభా యత్ర న సన్తి వృద్ధాః
న తే వృద్ధా యేన వదన్తి ధర్మం
నా సౌ ధర్మో యత్ర న సత్యమస్తి
న తత్ సత్యం యచ్ఛలేనా భ్యుపేతమ్"

ఇది ఉద్యోగ పర్వములోని విదుర నీతిలోనిది,

విఘ్నేశ్వరుని వేగమును నివారించుటకై వ్యాసుడచ్చటచ్చట క్లిష్టార్థముల యిన శ్లోకములు చెప్పెనని సంప్రదాయజ్ఞులు తెల్పుదురు. వీనిని గ్రంథ గ్రంథులందురు. వ్యాసుడు చెప్పుచుండగా విఘ్నేశ్వరుడు వ్రాసెనను మాట సత్యమో, అసత్యమో చెప్పజాలము గాని, ఆ శ్లోకములు గ్రంథగ్రంథులను మాట సత్యము. అట్టి వానిని రెండింటి మాత్రము సూచించెదను.

"నదీజ లంకేశవ నారికేతుః
నగాహ్వయోనామ నగారి సూనుః
ఏ షోఽంగనా వేషధరః కిరీటీ
జిత్వా వయం నేష్యతి చాద్య గానం"

ఉత్తర గోగ్రహణమున ద్రోణుడు భీష్మునితో చెప్పిన శ్లోకమిది. ఇందలి అంతరార్థమిది. నదీజ=ఓ భీష్మ ! లంకా + ఈశ, వన + అరి, కేతుః రావణుని వనమును నాశనము చేసిన ఆంజనేయుడు ధ్వజముగా కల నగాహ్వయో నామ=చెట్టు అను పేరు గల=అర్జునుడు (అర్జున వృక్షము=మద్ది వృక్షము) నగ + అరి సూనుః ఇంద్రుని యొక్క కుమారుడు; అర్జునుడు; అంగనా వేషము ను ధరించి వచ్చినాడు. జి=త్వా + అవ=జయించి రక్షింపుమా.

"ప్రాజ్ఞరి ప్రాజ్ఞ ప్రలాపజ్ఞః
ప్రలాపజ్ఞ మిదం వచః
ప్రాజ్ఞః ప్రాజ్ఞం ప్రలాపజ్ఞః
ప్రలాపజ్ఞతం వచోఽబ్రవీత్"

వారణావతము నందలి లక్క యింటికి పోవునపుడు విదురుడు ధర్మ రాజుతో చెప్పిన శ్లోకములు.

అలోహం నిశితం శస్త్రం
శరీర పరి కర్తనం
యో వేత్తి నతుతం ఘ్నన్తి
ప్రతిఘాత విదం ద్విషః",
"గృహా దగ్నిశ్చ బోద్ధవ్య
ఇతి మాం విదుర్యోఽబ్రవీత్
పన్థాశ్చ వా విదితః
కశ్చితే స్యాదితి ధర్మ ధీః."

వీనిలో కూడ విదురుడు అగ్నిభయమును సూచించి ధర్మరాజును మెలకువతో నుండుమని హెచ్చరించెను. కుంతి విదురుడేమి చెప్పెనని అడుగగా ధర్మరాజు విదురుడు చెప్పిన ఉపదేశమును తెలియపరిచెను.

లాక్షణికుల కావ్య ప్రయోజనములను తెలుపుచు కావ్యము కీర్తినిచ్చును, అర్థమునిచ్చును, వ్యవహార వేతృత్వమును కల్గించును, అమంగళమును పరి హరించును. అప్పటికప్పుడు పరనివృత్తిని చేకూర్చును. కాంతాసమ్మిత త్వముచే ఉపదేశము నొసంగును అని చెప్పిరి. ఈ ప్రయోజనములలో కొన్నిటిని మాత్రమే నిర్వహించు కావ్యములు పెక్కున్నవి. అన్నింటినీ నిర్వహించునవి మూడే అని రామాయణ, భారత భాగవతములు. వానిని రచించిన వారు భగవత్సదృశు లైన మహామునులగుటయే దానికి కారణము.

అచతుర్వదనో బ్రహ్మ
ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభుః
భగవాన్ బాదరాయణః

"నమస్తస్మై"



